ఓమ్



# అమృత తులసి

రచన, సంకలనము, వ్యాఖ్యాత

Dr. T. K. Giridharan, A.M.I.H., H.M.D.S.,
*Registered Medical Practitioner,*
*Ayurveda & Homeopathy,*
24-115, Sainagar Colony, CHITTOOR-517 001.

# SRI AMRUTHA TULASI: by DR.T.K GIRIDHARAN.

Cover Designing & Illustrations } Dr. T.K. Giridharan.

First Editon 2000.

Copies 1200



Price Rs. Postage Extra

Copies can be had From:

Dr. T.K. Giridharan
20-115 Sainagar Colony
Chittoor - 517 001 A.P.
☎ 31210

D.T.P.,
By
I.DHANASEKHAR
(Ananda Offset Printers)
&
Printed at
Ananda Offset Printers
10-847 Seshapeeran Street
Chittoor - 517 001 A.P.
✆ 27962

# ఓమ్



శ్రీ చక్రము

ఓం కఏ ఈలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం

ఓం శ్రీ శ్రీ శ్రీ మహాత్రిపురసుందర్యై నమః

శ్రీ తులసీదేవీ చరణకమలములందు భక్తిపూర్వకముగ సమర్పితము.

*This Book is Published with the Financial assistance of*
*Tirumala Tirupathi Devasthanam's*
*under their scheme*
***"Aid to Publish Religious Books"***
and
*My Humble Thanks to the Tirumala Tirupathi Devasthanam's*

## ఓమ్ గంగణపతయేనమః



శ్లో॥ ఓం నమోవిఘ్నరాజాయ సర్వసౌఖ్యప్రదాయినే।
దుష్టారిష్ట వినాశాయ పరాయ పరమాత్మనే॥
లంబోదరం మహావీర్యం నాగయజ్ఞోపశోభితం।
అర్ధచంద్రధరం దేవం విఘ్నవ్యూహ వినాశనం॥



ఓమ్ శ్రీగణపతయేనమః

# కృతజ్ఞతాభివందనములు

శ్రీ తిరుమల తిరుపతి శ్రీ వెంకటేశ్వరుని కరుణాకటాక్షములకున్నూ, శ్రీ జ్ఞానప్రసూనాంభికా సమేత శ్రీకాళహస్తీశ్వరస్వామివారి దివ్య అనుగ్రహ వీక్షణములకున్నూ, మాకృతజ్ఞతాభివందనములు సమర్పితము.

శ్రీ మహాగురుదేవులు, శ్రీశ్రీశ్రీ అగస్త్యమహామునీంద్రులవారి ఆశీర్వాదబలంతోను, మాకుగురువులైన మాతాతగారు కీర్తిశేషులు॥ తంజావూరు వేంకటసుబ్బరాయులుగారు (తండ్రికి తండ్రి). ఈయన చెన్నపట్టణము ఇంపీరియల్ బ్యాంకు అఫ్ ఇండియాలో Head Clerk గ పదవీరమణ పొందినారు). మఱియూ చిత్తూరు జిల్లా Revenue Tahasildar గ పదవీవిరమణ చేసినకీర్తిశేషులు॥ మలిశెట్టి గోవిందస్వామిగారు (తల్లికి తండ్రి) – వీరిచే మాచిన్నవయస్సునందే వేదాంత సిద్ధాంతములను, అష్టాంగయోగములను అనుభవపూర్వకముగ, విశదముగ నేర్పించినందున ఈ నాడు మీా ముందు 'శ్రీ అమృత తులసిని' ప్రసాదించు మహాభాగ్యమును పొందినందులకు వారికి మాహృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములను సమర్పించుచున్నాను.

మేము శ్రీకాళహస్తిలో యుండునపుడు( 1984-87) శ్రీకాళహస్తీశ్వరాలయము నందు, వేదాంత, భక్తి, జ్ఞానమార్గ గ్రంథములను విక్రయించుచూ 'శ్రీ కాళహస్తి ప్రచురణాలయము' ద్వారా అనేక గ్రంథములను ప్రచురించి అధ్యాత్మిక సేవ చేయుచుండిన, విద్యావాచస్పతి, విద్వాన్, వీ.రా. ఆచార్య, బి.ఎ., బి.ఒ.ల్., గారితో పరిచయమై వారికి మాచే వ్రాయబడిన 'శ్రీ అమృతతులసి' అను లిఖితపుర్వమైన వైద్యయోగముల ప్రతిని చూపగా ఆయన వారము దినములు దానిని చదివి, పరీక్షించి మాకుమంచి సలహా నిచ్చిరి. అదేమననగా తులసిని గుఱించి అధ్యాత్మికంగా, వేదాంతపరముగకూడా అందు వివరించివ్రాయమని హితోపదేశముచేసి, తనవద్దయుండిన అసంఖ్యాకము లైనవేదాంత గ్రంథములు, పురాణములు, ఉపనిషత్తులను మాకుచూపించి ఆందు శ్రీ తులసిని గూర్చి తెలియచేసిన విషయములను వివరించి మాచేవ్రాయించి, పైతులసిని గురించి వ్రాసిన వైద్యయోగభాగముతో చేర్పించమని హితోపదేశము చేసినారు. ఆచార్యులవారిహితోపదేశమే, ఈ నాడు ఈ 'శ్రీ అమృతతులసి' అనుగ్రంథమును భారతదేశ ప్రజానీకమునకు, ముద్రించి, అందించు మహాభాగ్యమును పొందగలుగు చున్నాను.

శ్రీ తులసిని గుఱించిన విశేష వివరణములను, కొన్ని అపూర్వవిషయములను, మాకందించి తోడ్పడిన ఆచార్యులు, ఆదర్శజీవి, స్నేహశీలి, 'శ్రీ శివకవచము'నకు వ్యాఖ్యానమువ్రాసిన ఉద్దండపండితుడు, 'ఆచార్యశ్రీ' బిరుదాంకితులైన విద్యావాచస్పతి, విద్వాన్. వీరా. ఆచార్య, బి.ఎ., బి.ఒ.యల్., గారికి మాకృతజ్ఞతాభి వందనములు.

AUM

MAJOR. A.M. RATHNAKARAN.
(RETIRED)

Vaikuntapuram
TIRUPATHI

## PREFACE

## INTRODUCTION

This Book " Sri Amrutha Thulasi" describes the sacred uses of the Plant 'Thulasi' both in the way of philosophy and in the way of Medicine.

The author *Dr. T.K. Giridharan* in this work had much strain to collect the sanskrit slokams relating to Thulasi's usages from vedas and puranas. To lead a philosophical life Holy Basil is very useful and also the Medicinal prescriptions are of most importance in day today life of every human on earth.

As seen from this book the value of Ayurvedha, the Indian system of Medicine has its own traditions and ancient cultural heritage. This fine work contains more than 500 items of prescriptions in each of which the "Holy Thulasi" finds place. A single plant with so much of importance will itself speak about the divine power possessed by it.

I am sure that this publication will go a longway in further propagating and enhancing the use of sacred Thulasi as a reference in the day to day life.

Hope that this book will receive more enthusiasm and encouragement among the public, scholars and Ayurvedic Practitioners, who engaged in Medicare Programme.

Tirupathi:
DATE: 27-11-1999

(Sd). A.M. RATHNAKARAN

Sri S. Ramanarayana Reddy, B.Tech., Date:...........
COMMISSIONER,
MUNICIPAL OFFICE,
CHITTOOR.

# PREFACE

I have carefully studied the book called "SRI AMRUTHA THULASI" and have no hesitation in stating that it is the best work of the kind I have seen.

It contains most vluable information relating to the puranic History of the Holy Plant **"SRI THULASI"** as well as the Divinely aspects for the acheievement of Goodness and GOD's service. Besides this the uses and effects of the plant "Thulasi" in different diseases are the most valuable prescriptions that have been compiled by the author from various sources of Ayurvedhic and Siddha systems of Medicine.

I am exceedinly glad to say that this is the best book amidst the Telugu Library of the Ayurvedhic branch.

As far as I am able to Judge it, It desrves to be kept as a book of reference in every house hold and it will be a protector of life of the members of that family and can be said as "Health & Life giving family friend".

Since the global attention now turns towards alternative systems of Medicine this book " Sri Amrutha Thulasi" Will be very much appreciated by the Scientists, Doctors, belonging to different systems of Medicines as well as general public.

I appreciate this valuable work rendered by the Author **Dr. Sri. T.K. Giridharan,** in compiling sacred slokams and more than 500 prescriptions, using the divine plant *"SRI THULASI"*

*A Book to be in every house as* "VIVE, VALEQUE".

**S. Ramanarayana Reddy,**
MUNICIPAL COMMISSIONER
CHITTOOR (A.P.)

ఓమ్ గణేశాయనమః అవిఘ్నమస్తు

# శ్రీ అమృత తులసీ

## విన్నపము

శ్రీ అనగా లక్ష్మీదేవి. అమృతము అనగా ముదిమినిపోగొట్టియౌవనమును ప్రసాదించు దివ్యౌషధము. తులసి అనగా సాటి, సాదృశ్యము, పోలిక లేనిది యనియర్థము. కావున 'శ్రీ అమృత తులసి' యనగా సాక్షాత్తు లక్ష్మీదేవి కంటేవేరుపోలిక లేనిదియుయ్యైన మఱియూ అమృత తుల్యమైన తులసి. అమృతతుల్యమైన తులసితోసమానమైనది వేరేదియూ లేదనియర్థము. శ్రీలక్ష్మీదేవి అంశమైన, దైవాంశ సంభూతమైన తులసి యొక్క అమృతమయమైన శక్తిప్రభావములను తెలియచేయునదియే ఈ 'శ్రీ అమృత తులసి' అను చిన్న గ్రంథము.

సమస్త సృష్టిలో విశిష్టజీవియైన మానవుడు, జన్మజన్మాంతరములందు ఆర్జించిన పుణ్యఫలితమే మానవజన్మ. అట్టిమానవజన్మను సద్వినియోగము చేసుకొనకల్గినపుడే మానవుడు-మాధవుడే యగుచున్నాడు. ఇందులకు ప్రయత్నము, సాధన, అవశ్యములు. సాధనకు ప్రయత్నము అవశ్యము, సాధనకు ముముక్షుత్వము ముఖ్యము, ముముక్షుత్వమునకు మార్గములనేకములు. ఈ మార్గములనే తరుణోపాయములందురు. ఈ తరుణోపాయములు -కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానయోగములనునవి. ఇందు సులభమైనది భక్తిమార్గము.

శ్లో॥ అన్యాభిలాషితా శూన్యం జ్ఞాన కర్మాద్యనావృతమ్।
అనుకూల్యేన కృష్ణాను శీలనం భక్తిరుత్తమం॥ (భ.ర.సిందువు)

అనగా కోరికలనువదిలిశుమంతయూలేక జ్ఞానకర్మాదులయందు మనస్సును పోనీయక శ్రీ కృష్ణుని (పరమాత్మను) సేవించి సంతృప్తిపరచుటయే ఉత్తమమైన సాధన. దీనినే భక్తియని విశదీకరించబడిన దానిని, ఆధారముగ గైకొని శ్రీ తులసిని భక్తితో ఆరాధించుటకై మనపురాణములందు వివరించబడియున్నది. పరమాత్మలో ఐక్యము చెందుటయే మానవుని ముఖ్య కర్తవ్యము. దీనిని సాధించు మార్గములే భక్తి కోనకు చెందినస్తోత్ర, కవచ, మంత్ర, యంత్రములు.

శ్లో॥ నమస్కార స్తథా శీశ్చ సిద్ధాంతోక్తిః పరాక్రమః।
విభూతిః ప్రార్థనా చేతి షడ్విధం స్తోత్రలక్షణమ్॥ (శీ. అ.శ.)

అనగా నమస్కారము,ఆశీర్వాదము, సిద్ధాంతవ్యక్తీకరణము, పరాక్రమనిరూపణము, దివ్యభాగవదైశ్వర్యవివరణము, ప్రార్థన-అను ఈ ఆరులక్షణములతోకూడి విలక్షణమైనదే స్తోత్రమనబడును.

శ్లో॥ హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్।
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవగతిరన్యథా॥ (బృ.నా.పు)

అనగా కలియుగమునందు నామ, స్తోత్ర, జప, సంకీర్తనముల కంటే మానవులక బ్రహ్మసాయుజ్యము పొందుటకు వేరు సులభ మార్గములు లేవు, యని స్పష్టముగ తెలియ చున్నది.

అందు వలననే ఇందు శ్రీతులసినిగురించిన స్తోత్ర, కవచ, పారాయణ పూజాక్రమములను, ప్రతిఒక్కరు తెలుసు కోవలయునను సత్సంకల్పముతోను అందరు పఠించి పాటించవలయుననియూ, సాధకులకు పరమార్థ మార్గదర్శకము కావలయుననీ భావించి ఈ గ్రంథమునందు సంకలనము, వ్యాఖ్యానము చేయుబడియున్నది.

అనంతమయ ప్రపంచసృష్టిలో 'తులసి' ఒక దివ్యమైన, విశిష్టమైన ఓషధి శ్రీమహాలక్ష్మీదేవి అంశముగ పరిగణించబడు ఓషధులలో శ్రేష్ఠమైనది. చతుర్వేదములందును, సకలశాస్త్రములందును, అష్టాదశపురాణములందును ప్రస్తావించబడిన దివ్యౌషధులలో ఉన్నత మైనది. అందువలనే అన్నియుగములందును తులసి యొక్క ప్రస్తావన చేయబడి యున్నది. కృతయుగమున శ్రీలక్ష్మీదేవి అంశముగ జన్మించినందువలన 'లక్ష్మి తులసి' యనియు, త్రేతాయుగమున శ్రీరాముల వారిచే పూజింప బడిన దియగుటచే 'రామతులసి' యనియూ, ద్వాపరయుగమున శ్రీకృష్ణునిచే ఉపయోగించ బడినందువలన 'శ్రీకృష్ణతులసి' యనియూ ప్రఖ్యాతిగాంచినదని చెప్పుటలో అతిశయోక్తిలేదనియే మాభావము. ఈ మూడువిధములైనతులసి చెట్లు మనకిప్పుడు లభించుచుండుటయే యిందులకు సాక్షి.

మహత్తరశుక్తులను కల్గిన శ్రీతులసి శ్రీతిరుమలేశుని కత్యంతప్రియమైనదికావున ఆయన తులసీ మాలాంకృతుడగు చున్నాడు. అంతేగాక ఆతిరుమలేశుని షోడశోపచార పూజలందుపయోగించబడు ఓషధులలో తులసి ముఖ్యమైనది.

శ్లో॥ అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణమ్।
సర్వపాపక్షయకరం విష్ణు పాదోదకం శుభమ్॥

అందువలననే ఓషధులలో శ్రేష్ఠమైనది శ్రీ తులసి.

శ్లో॥ చతుర్ణామపి వర్ణానాం ఆశ్రమాణాం విశేషతః।
స్త్రీణాంచ పురుషాణాంచ పూజితేష్టం దదాతి వి॥

అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనబడు వర్ణములవారు, బ్రహ్మచారి,

గృహస్థులు, వానప్రస్థులు, యతు-లనబడు వారు, స్త్రీలు, పురుషులు అనువారందరూ శ్రీ తులసిని పూజించుటకు అర్హులగు చున్నారు.

ఇంతటి మహనీయమైన గుణములు కల్గిన 'శ్రీ తులసి' యందలి 'అమృత' తత్త్వమును ప్రజల ముందుచవలయుననను సత్సంకల్పముతో ఈ గ్రంథమునందు శ్రీ తులసి యొక్క శ్రేష్ఠతను, ప్రాశస్త్యమును, మహాత్మ్యములను, పూజావిధానములను మఱియూ వైద్యోపయోగ్యమైన అనేక ఔషధ యోగములను ఆయుర్వేద, సిద్ధ, వైద్యగ్రంథములనుండియూ, అనుభవయోగములన బడు వాటిని సుమారు 540యోగములను మీముందుంచడమైనది. పైచెప్పబడిన శ్లోకరిత్యా అందరూ ఈ వైద్యయోగములను ప్రయోగించి సత్ఫలితములను పొందవలయుననునదియే మాఆకాంక్ష. పాదరసమును కట్టు ఓషధులలో శ్రేష్ఠమైనది 'శ్రీ తులసి' అందు వలనే 'శ్రీ తులసి' ఓషధులలో మిక్కలి శ్రేష్ఠమైనది.

శ్లో॥ సర్వేచ సుఖినస్సంతు। సర్వేసంతు నిరామయాః॥
సర్వే భద్రాణి పశ్యంతు। మాకశ్చిద్దుఃఖభాగ్భవేత్॥

ఎందరో అనారోగ్యులు- అందరికీ ఆరోగ్యము చేకూర్చవలయునని ఆ శ్రీతులసీదేవికి, పరమేశ్వరీ, పరమేశ్వరులకు మా హృదయపూర్వక శతకోటి నమస్సుమాంజలులను సమర్పించు చున్నాము.

(సం) T.K. గిరిధరన్,
Dr.T.K.Giridharan, A.M.I.H., H.M.D.S.,
*Registered Medical Practitioner,*
*Ayurveda & Homeopathy,*
**24-115, Sainagar Colony, CHITTOOR-517 001.**





# Dr. T.K. Giridharan గారి జీవిత సంగ్రహము

**జననము:-** 1931. ఇ.సంఖ్య, 38, నాట్టు పిళ్ళైయూరుగుడివీధి, చెన్నపట్టణము (చెన్నై)

**విద్యాభ్యాసము:-** చెన్నపట్టణము (Madras) నాట్టు పిళ్ళైయారుగుడివీదిలోయుండు తొండైమండల తుళువవెళ్ళాలరు ప్రాథమిక మఱియూ ఉన్నత పాఠశాలలో (T.T.V.High School) 10వ. తరగతి వరకు చదివి పిదప, చిత్తూరుబోర్డుహైస్కూలునందు ఎస్.ఎస్.ఎల్.సి (S.S.L.C.) నందు 1946-47సం॥లో ఉతీర్ణులైనారు. ఇతను,నేనుసహవిద్యార్థులము. 1947-48లో మద్రాసు వెటరినరీకాలేజిలో చేరి అనివార్యకారణాలచే ఆదిలోనే కళాశాల విద్యస్తంభించి పోయి ఇంటివద్దనే పెద్దలచే ఆయుర్వేదవైద్య విద్యాభ్యాసము, యోగవిద్యాభ్యాసము అభ్యసించిరి. 1953లో, చిత్తూరు పురపాలికలో వుద్యోగమునందు చేరిరి. ఉద్యోగముచేస్తూ 1966లో, హోమియోపతివైద్య విధానమునందును, 1968లో, ఆయుర్వేద వైద్య విధానమునందును ఆంధ్రప్రదేశప్రభుత్వ ఆయుర్వేద మఱియూ హోమియోపతి బోర్డువారిచే నిర్వహించబడిన పరీక్షలందు వుత్తీర్ణులైనారు. ఇంటివద్దనే ఉచితవైద్యసహకారము చేయు చుండిరి. ఇతను నా సహోద్యోగి కూడా!

**ఉద్యోగము:-** చిత్తూరు పురపాలిక కార్యాలయములో 1953 నుండి 1984 వఱకు, శ్రీ కాళహస్తిపురపాలిక కార్యాలయములో 1987 వఱకు, గుంతకల్లు పురపాలిక కార్యాలయములో 1989 వఱకు అకౌంటెంటుగ పనిచేసి 30-4-1989 తేదీన పదవీవిరమణ చెంది 1998 వఱకు 'శ్రీ అగస్త్యవైద్య కేంద్రము'ను స్థాపించి వైద్యసేవ చేసి 1999నుండి అధ్యాత్మిక జీవనము గడుపుచూ అధ్యాత్మిక, వైద్య గ్రంథరచనలు చేయుచున్నారు.

**వ్యాసంగము:-** రంగస్థలనాటకములను ప్రోత్సహించుట. తమిళంలోమల్లిక, రక్త పాశం, ముడింద ముడివు, కొలైక్కారి మఱియూ తెలుగులో స్వర్గంలోస్ట్రైక్, రక్తకన్నీరు- మున్నగు నాటకములలో కథానాయకునిపాత్రలను పోషించి "శ్రీ భారతినాటక మండలి", చిత్తూరు, వారి అధ్వర్యమున పలుచోట్ల నాటకములు వేసి మంచి పేరు, ప్రఖ్యాతులు గడించిరి. వీరినాటక రంగ గురువులు శ్రీ వి.యం. కుప్పుస్వామి గారు, మాజీమునిసిపల్ కౌన్సిలర్, చిత్తూరు.

ఆయుర్వేదము గురించి, వనమూలికల గురించి, రచనలువ్రాసి శ్రీ ధన్వంతరి, నాగార్జున, ఆచరిత ఆయుర్వేద, అందరికీ ఆయుర్వేదం, సిద్ధమరుత్తువం (తమిళం) మున్నగుమాసపత్రికలలో ప్రచురింట జరిగినది, జరుగుచున్నది.

1994సం॥లో " శ్రీ చరణము" అను ఆరోగ్య, యోగ, వైద్య విధానములపై తెలుగులో ఒక మంచి గ్రంథమును ప్రచురించి భారతదేశ ప్రజలచే ప్రశంసలు, మన్ననలను అందుకొనియున్నారు.

**పీవారంగం:-** చిత్తూరు పురపాలిక ఉద్యోగుల సంఘమును, శ్రీ ధీనదయాళు, శ్రీ జె.గోపాలకృష్ణ, శ్రీ మహమ్మద్ జలాలుద్దీన్ అయిన నేను, శ్రీ టి.కె. గిరిధరన్ గారు- అందరము కలిసి స్థాపించి 1955లో, ప్రభుత్వ ఆమోదమునకై కృషిచేసి 1956లో జి.ఒ.యం.ఎస్. నెం. 116 ఎల్.ఎ. తేది

12-12-1956 నందు ఆమోదము పొందిన ప్రథమ పురపాలికోద్యోగ సంఘముగ ప్రసిద్ధిచెంది సుమారు 25 సం॥లు వీరు సంఘ అధ్యక్షులుగా యుండి అనేక సందర్భాలలో, సమ్మెకాలంలో అరెస్టు చేయబడి, విడుదలై, అమోఘమైన సంఘ సేవ చేసిరి. ఆంధ్రప్రదేశ్‌లోని పురపాలికలలో పనిచేయు ప్రతి జూనియర్ అసిస్టెంట్, సీనియర్ అసిస్టెంట్లకు సీనియారిటి ప్రకారము పదవోన్నతి వచ్చుటకు సుప్రీమ్ కోర్టువరకు వెళ్ళి వాదాడి గెలిచిన ఘనత ఈయనకే చెందుతుంది. ఇప్పుడుకూడ చిత్తూరు పురపాలిక పెన్షనర్ల సంఘమునకు అధ్యక్షులుగా యున్నారు.

**ప్రస్తుతము:-** అధ్యాత్మిక జీవనము. అధ్యాత్మిక, ఆయుర్వేదవైద్యగ్రంథ రచనలు. ఇప్పుడు వీరి రచనలు ముద్రణకు సిద్ధముగ యుండునవి:-

1. పాండు, కామిల. (నిదాన, నివారణ, చికిత్సలు)
2. శ్విత్రము (బొల్లి). (నిదాన, నివారణ, చికిత్సలు)
3. భారత దేశపు వనౌషదులు. ***(Medicinal Plants of Bharath)*.**

ఇందు సుమారు 550 వనౌషధులు, వృక్షముల - చిత్రపటములు, వాటిగుణ పాఠములతో, సంస్కృతశ్లోకములతో, వైద్యయోగములతో సహా తెలుగున రచించియున్నారు. ముద్రించి ప్రచురించినచో ఆంధ్రప్రదేశమునందు ఇంతవరకు ఇట్టి గ్రంథము వెలువడలేదనియే మా దృఢనమ్మకము.

4. వాతవ్యాధులు (నిదాన, నివారణ, చికిత్సలు)
5. శ్రీ రసేశ్వర చూడామణి (ఒక్కపాదరసము గూర్చియే వ్రాయబడినది)
6. ఆత్మజ్ఞానము (అధ్యాత్మిక గ్రంథము)

వీరి జీవిత సంగ్రహము ప్రచురించబడు ఈ గ్రంథమును అనగా "శ్రీ అమృత తులసి" అను తెలుగు గ్రంథమును, ప్రతి మానవుడు, ప్రతి ఇంట వుంచుకోవలసిన అమూల్యగ్రంథమని మనవిచేయుచున్నాను.

(సం). సి. మహమ్మద్ జలాలుద్దీన్
Municipal Senior Assistant (Retd).
Vice-President
The Chittoor Municipal Pensioner's Association
Chittoor. A.P.



# శ్రీ అమృత తులసి

## విషయసూచిక

### ప్రథమభాగము



### ద్వితీయ భాగము:(శ్రీతులసి వైద్య విజ్ఞానము)



### తృతీయ భాగము (వైద్యయోగములు)

తులసితో చేయు అనుభవసిద్ధయోగములు చికిత్స సుమారు540 యోగములు శిరస్సు నుండిపాదపర్యంతము గల ప్రతిఅవయవమునందు కలుగు అనేక వ్యాధులకు తులసితో చేయబడు వైద్యయోగములు కలవు.

ఓమ్ విఘ్నేశ్వరాయనమః
ఓమ్ శ్రీ భువనేశ్వరీ దేవ్యైనమః

# శ్రీ అమృత తులసి



ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే॥



ఓం సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతుమేసదా॥



ఓం మహాలక్ష్మి నమస్తుభ్యం నమస్తుభ్యం మహేశ్వరీ।
హరిప్రియే నమస్తుభ్యం నమస్తుభ్యం దయానిధే॥



ఓం సర్వమంగళ మాంగల్యే। శివే। సర్వార్థసాదికే।
శరణ్యే। త్ర్యంబకే। గౌరీ। నారాయణీ। నమోస్తుతే॥



ఓం సృష్టి స్థితి వినాశానాం। శక్తి భూతే। సనాతని।
గుణాశ్రయే। గుణమయే। నారాయణీ। నమోస్తుతే॥



ఓం పద్మహస్తం పద్మముఖీం పద్మస్థాం పద్మలోచనామ్।
లక్ష్మీరూపా మహం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥

గురుప్రార్థన



ఓం గుశబ్దస్త్వంధకార స్స్యాత్ రు శబ్దస్తన్నిరోధకః।
అంధకార నిరోధత్వాత్ గురురిత్య భిధీయతే॥



ఓం గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః॥



ఓం అక్షరం పరమం బ్రహ్మ జ్యోతీ రూపం సనాతనమ్।
గుణాతీతం నిరాకారం స్వేచ్ఛా మయ మనంతకమ్॥



ఓం కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంత వేదినే॥



# శ్రీ అమృతతులసి

శ్రీ తులసి భారతదేశమునందు అందునా దక్షిణ భారత దేశ భక్తశేఖరులకు ఆరాధ్యదైవమై, అట్టి భక్తాగ్రేశ్వరుల మోక్షేచ్ఛకై తులసి కోటను తమ తమ గృహములందు నిర్మించుకుని ప్రతి దినము శ్రీతులసికి పూజలు, వ్రతములు చేయుటను మనము చూచుచునేయున్నాము.

తులసిని తెలియని వారు లేరనియే మానమ్మకము. ఒక వేళ ఎవరైన యుండిన యదివారి ప్రారబ్ధకర్మయేయగును.

## శ్రీతులసి - విశిష్ఠత

శ్రీ తులసి వేదప్రసిద్ధిచెందిన దివ్యౌషధి. ఆయుర్వేదము, సిద్ధవైద్యములందు యియ్యది అతిపవిత్రమైన ఓషధి, దేవతాప్రీతికరమైనది. మన పూర్వీకులు పరమేశ్వరుని సాన్నిధ్యమున పూజార్చనలకు ఇట్టి దివ్యౌషధులను వుపయోగించి మానవాళికి రహస్యసేవచేయుచుండిరి. వైష్ణవ ఆలయములందు శ్రీ తులసిని ప్రసాదముగ యిచ్చుట ఈ నాటికి కూడ ఆచారముగ కొనసాగుచునే యున్నది. అర్చనద్రవ్యముగా వుపయోగించబడుచున్నది. అమృతతుల్యమైనది గాన అమృతతులసియైనది.

ఆలయమునకు విచ్చేయుభక్తులకు యిచ్చుతీర్థము నందుండునవి తులసీదళములు. దీనిమహిమ సాధారణ మానవులకు తెలియనివిషయము. అనాదిగా శ్రీవైష్ణవ ఆలయములందు తీర్థముంచు పాత్ర రాగి (తామ్రము) తో చేయబడినది. కానీ నవనాగరికతా (Fashion) వ్యామోహము విజృంభించి తామ్రపాత్రలకు బదులు తెల్ల ఉక్కుపాత్రలను (Stainless Steel Vessels) వాడు చున్నారు. ఇది మంచి పద్ధతి కాదు. తామ్రపాత్రలలో తీర్థము (నీళ్ళు) పోసి అందు తులసీదళములను వేసి రాత్రియంతయూ భావనచేయబడిన తీర్థమును మరు దినము ప్రసాదతీర్థముగా యిచ్చెదరు. ఈ తీర్థము అనేక వ్యాధులను హరింపచేయును. ఇందు వలన మనకు తెలియునదేమనగా తామ్రపాత్రకు తులసీదళములకు జల (తీర్థము) సంబంధముచే కొన్ని రసాయన విద్యుదయస్కాంత ప్రసార పరివర్తనలు చెంది వైద్యోపయోగ్యమై సర్వవ్యాధులను పోగొట్టు శక్తిని పొందుచున్నది. అందువలననే తులసి తీర్థమును ఆలయములందు యిచ్చుసాంప్రదాయము యుగయుగములుగ వచ్చుచునేయున్నది. మన పూర్వీకులు తులసీ వనమున శవము ఎంతకాలమున్ననూ చెడిపోదని చెప్పియున్నారు. ఆధునిక రసాయన శాస్త్రజ్ఞులీ విషయమును ఇప్పుడిప్పుడే నిజమని ధృవీకరించియున్నారు.

శ్రీ తులసి చెట్టు నందు విద్యుదయస్కాంత శక్తి విశేషముగ కలదు. అయస్కాంత శక్తియొక్క సహజ గుణమైన ఆకర్షణ శక్తిచే తులసి సేవన వలన శరీరములోని అనారోగ్యభాగములకు జీవశక్తినిచ్చి ఆరోగ్యమును చేకూర్చును. ఎట్లనగా మానవ శరీరము నందలి రక్తమునందు అయః శక్తి ( ఇనుము) కలదు. అయమును ఆకర్షించు శక్తి అయః స్కాంతమునకే కలదు, కావున, తులసి యందలి అయస్కాంతశక్తిచే రక్తమునందలి అయమును శుభ్రపరచి రక్తము ప్రవహించు రక్తనాళములైన నరములకు శక్తిని పటుత్వమును కలిగించి రక్తము నందలి ఎర్రకణములను వృద్ధిచేసి క్రొత్త రక్తమును పుట్టించి వ్యాధులను నిర్మూలించుటయందు వుత్తమోత్తముగ పనిచేయుచున్నది. తులసి మాలను మెడయందు ధరించుటవలన తులసి పూసలయందుండు అయస్కాంత శక్తి శరీరములో ప్రవేశించి రక్తము ప్రవహించు రక్తనాళములు, శ్వాసకోశములు, హృదయము, చర్మము, మున్నగు అవయవములకు ఆరోగ్యమును, పుష్టిని కల్గించి తేజస్సును ఆయుర్వృద్ధిని కల్గించును.

శ్రీమహావిష్ణువు యొక్క ప్రియమైన మాలిక శ్రీతులసి. తులసివనమును హిందువులు ప్రేమగ,గౌరవముగ పెట్టిన పేరు బృందావనము. కానీ ఈ నాటిసంతతి వారు బృందావనమని చెప్పిన అది బెంగుళూరు వెళ్లురైలనియూ మైసూరు నందలి వుద్యానవనమని చెప్పుదురు.

ప్రాణశక్తినిచ్చు ఓషధులను శల్యకరణి అందురు. అట్టిశల్యకరణి ఓషధులలో శ్రీతులసి శ్రేష్ఠమైనది. శల్యకరణి ఔషధులనుసేవించుటవలన ఎముకలు, కండరములు, నరములు మున్నగు వాటితోకూడిన శరీరమునకు "శల్యకరణి" అను జీవశక్తి ప్రాణవాయువుతో కలిసి శరీరముయొక్క జీవితకాలమును వృద్ధిచేయును. శ్రీ కృష్ణుడుకూడా ఎక్కువ కాలము బృందావనమున విహరించుచుండెడివాడని చెప్పబడియున్నది. వేద, పురాణములందు ఈ దివ్య ఓషధుల గురించి రహస్యము గనేయుంచినారు గాని వాటి గురించి విశదముగ వివరించ లేదు, కావున వాటి ప్రయోగ విధానములు రహస్యముగానేయున్నవి. వైష్ణవ ఆలయములందు తులసికి ఎంత ప్రాధాన్యత కలదో అంతప్రాధాన్యత శివాలయములందు బిల్వపత్రములకు కలదు. శివాలయములలో బిల్వతీర్థము ముఖ్యమైన ప్రసాద తీర్థము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వరుసగ సృష్టి, స్థితి, లయకారకులైయున్నారు. ఇందు సృష్టి, లయములకు కాలపరిమితి అతి తక్కువ. ఎట్లనగా పుట్టుట, మరణించుట అనుకార్యములు అతి తక్కువ ( వ్యవధి) కాలములోనే జరిగి పోవుచున్నవి.

కానీ స్థితికాలము సుదీర్ఘమైనది. ఎట్లనగా పుట్టిననాటినుండి మరణించువరకు గల జీవితకాలమే ఎక్కువ. అనగా సక్రమమైన జీవితకాలము 125సం॥ అనగా పంచీకరణ విధానముగ పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఒకదానిలో ఒకటి కలిసి ఒక్కొక్కయోగమునకు 5 సం॥ కాలముగ నిర్ణయించి ఇందు ఆకాశములో ఆకాశము, ఆకాశములో గాలి, ఆకాశములో అగ్ని, ఆకాశములో నీరు, ఆకాశములో భూమి ఇట్లే ఇతరభూతములు కలిసి 5 x 5 =25 యోగములు (కూడిక,) ఒక్కొక్క యోగమునకు 5 సం॥ వంతున 25 యోగములకు 25 x 5= 125 సం॥ జీవితకాలముగ నిర్ణయించబడియున్నది. కావున సృష్టిస్థితి, లయములలో స్థితికాలమే ఎక్కువ. ఎక్కువకాలమైన స్థితి కాలమునందు మంచి స్థితితో యుండుటకే స్థితికారకుడైన శ్రీమహా విష్ణువు నందు ఎక్కువ నమ్మకము, గౌరవము, భక్తికలిగియున్నారు. శ్రీ మహావిష్ణువునకు ప్రియాతి ప్రియమైన శ్రీ తులసి ఒక దివ్యౌషధిగ వేద శాస్త్రములు ప్రశంసించు చున్నవి.

భారతదేశమునందు స్థావరవర్గములకు పెట్టిన పేర్లను, విదేశీయులు వాటికి పెట్టిన పేర్లను పోల్చిచూచినచో మనకు ఒకనిజము తెలియవచ్చుచున్నది. అదేమనగా స్థావరముల యొక్క వ్యాధి నిర్మూలన శక్తి, ఓషధీగుణములు, మంత్రయంత్ర శక్తి, మరియూ అవిచేయు ప్రత్యేక కార్యములను మన భారత దేశపు ఋషులు, సిద్ధపురుషులు తమ దివ్యజ్ఞానముతో పరిశీలించి చక్కగ అవగాహనచేసుకుని వాటికి తగువైన, సార్థకమైన పేర్లను పెట్టియున్నారు. ( ఉదా:- బృంద , (తులసి) బృంద జలంధరుని భార్య మహాపతివ్రత. ఈమెయే తులసి చెట్టుగ పుట్టినట్లు పురాణములుచెప్పుచున్నవి.) కానీ విదేశీయులు ఓషధులను కంటితో చుచినపుడుండు ఆకారము, వాటి విభాగములను అనుసరించి స్వార్థముతో తమ పేర్లతో చేర్చి వాటికి పేర్లను పెట్టియున్నారు. (Botanical Name). ఉదా :- Ocymum Basilium (LINN) Natural order: labiatae. Ocymum అను పేరు గ్రీకు పదముగా చెప్పబడియున్నది. అది *"To Smell"* అను అర్థము అనగా వాసనచూచుట. తులసి యొక్క సుగంధ మైన వాసన, తీక్ష్ణగుణమునకు అనుగుణముగ ఈ పేరు పెట్టినట్లు చెప్పబడి యున్నది (By Methiolus). మరియూ **Parkinson** అనునతనిచే చెప్పబడినదేమనగా గ్రీకు పదమైన *"Basileus"* అను పదమునుండి వచ్చినట్లుగను, బాసిలియస్ అనగా 'రాజు'అనియూ రాజుల యింటియందుండవలసిన చెట్టు కావున *"Basil"* అని పిలువబడినది. " The Smell Thereof is so excellant that it is fit for a King's house" (Parkinson.)

తులసి అనగా తుల + సి = తుల అనగా సాదృశ్యము, పోలిక, త్రాసు మొదలగునవి. తులసి అనగా పోలికలేనిది, సాటిలేనిది అని అర్థము. మరియూ తులసి అనగా స్త్రీ, లక్ష్మీదేవి అంశమని చెప్పబడియున్నది. తులసికి యుండు అద్భుత శక్తులను దైవీక శక్తితో పోల్చి దానిని దైవ సన్నిధియందుంచి ప్రసాదముగ ఇచ్చుటను మనము చూచుచూనే యున్నాము. విదేశీయులు స్థావరవర్గములకు, దైవీక శక్తికి సంబంధముకలదని యింతవరకు నిర్ణయించలేదు. అందువలననే వారి ప్రార్థనా మందిరములందు ఓషధులకు ప్రాధాన్యత లేదు. భారత దేశమునందు స్థావరవర్గములకుండు దైవీకశక్తికి ప్రాధాన్యతనిచ్చి దేవాలయములన్నింటి యందును ఓషధులను వుపయోగించుచున్నారు.

భారతదేశమునందలిదేవాలయములందు దైవీక శక్తిగల చెట్లకు, వృక్షములకు ప్రాధాన్యతగలదు. ఈశ్వర ఆలయములలో బిల్వము, దశపత్ర బిల్వము, దేవకాంచనము, జమ్మి, గన్నేరు స్వర్ణరేల, పొన్న, పాదిరి, పనస, మామిడి, తుమ్మి, చంపకము, నందివర్ధనము మున్నగునవి. వైష్ణవ ఆలయములందు, తులసి, రావి, పొన్న, పనస, మామిడి, మజ్జి, అరటి, కలిగొట్టు, పారిజాతము, మల్లి, ఉసిరిక, శ్రీగంధము, వావిలి, మున్నగునవి. అట్లే విఘ్నేశ్వరునికి తెల్లజిల్లేడు, గరిక, నేరేడు, మున్నగునవి. దేవీపూజకు వేపపువ్వు , వేపాకులు, శ్లేష్మములు. సూర్యునికి - జిల్లేడు, చంద్రునికి - తెల్లగన్నేరు, కుజునకు-నల్లేరు, గురువునకు - ముల్లెలు, బుధునికి- తులసి, శనికి- జమ్మి, గోరింట, దర్భ, బ్రహ్మకు - అత్తి, మోదుగ సకల దేవతలకు - తమలపాకులు మున్నగునవి పూజాద్రవ్యములు.

ఈ తులసికి మనపురాణములందు ఎంత విలువయున్నదో పరీక్షించిన తెలియును. మహాభారతమునందు శ్రీకృష్ణుని నారదమహర్షి వేలమువేసిన పాట అదే "బలే మంచి చౌక బేరము ఇది సమయముమించిన దొరకదు". ఈ సినిమా పాటవినినంతనే మనకు జ్ఞప్తికి వచ్చునది "శ్రీ కృష్ణతులాభారము". ఇందు శ్రీకృష్ణుని విడిపించుటకై సత్యభామ తన వద్దయుండు స్వర్ణాభరణములు, రత్నాభరణములు, రజితము మున్నగువిలువైన వస్తువులను తులాభారములో ఒకవైపు పెట్టి, శ్రీ కృష్ణుని మరొకవైపు పెట్టినపుడు శ్రీ కృష్ణుడే బరువైయుండెను. శ్రీ కృష్ణునికి సమానమైన తూకము ఆ విలువైన బంగారు, వెండి వస్తువులకు లేక పోయెను. శ్రీకృష్ణుని విడిపించలేక పోయెను అప్పుడు ఆమె రుక్మిణీ దేవిని వేడు కొనగ రుక్మిణీదేవి వచ్చి తులాభారమునందలి స్వర్ణ, రజితాభరణములను తీసివైచి ఒకే ఒక్క తులసి దళమును అందు పెట్టి తూచినపుడు శ్రీ కృష్ణుడు తేలికై తులసి దళము బరువై దానిని

నారదమహర్షికిచ్చి శ్రీ కృష్ణుని విడిపించినట్లు పురాణ చరిత్ర. కావున తులసికి ఎంత విలువ కలదో తెలియుచున్నది. మనపురాణములందు తులసీ జననముగురించి అనేక విధములుగా చెప్పబడియున్నది.

## శ్రీతులసీ-జననము

### శ్రీమద్దేవీభాగవతము నందలి కథ ఏమనగా!

తులసి పూర్వజన్మమున గోలోకవాసినియై శ్రీ కృష్ణుని ప్రేమకు పాత్రురాలైన గోపిక. ఆమె శ్రీ కృష్ణాంశ స్వరూపుడైన గోపాలునితో సరస సల్లాపములాడుచుండ రాధాదేవి యాదృశ్యమును చూచి కోపముతో వారిని భూలోకమునపుట్టునట్లు శాపమిచ్చెను. అప్పుడా గోపికశాపవిమోచనము కొరకు వేడగా గోవిందుడు కరుణించి "ఓ! గోపికా నీవు భూలోకమున జన్మించి, తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి అతనిచే వరముపొంది నాయంశమున నీవు చేరి పోదువు". అని అభయమిచ్చి అంతర్ధానము చెందెను.

రాధికాశాపఫలమున భారతదేశమున ధర్మధ్వజుడను రాజునకు అతని భార్యయైన మాధవి గర్భమున కార్తిక, పూర్ణిమ, శుక్ర వారము నాడు వారికి కుమార్తెగ జన్మించెను. అందచందాలలో సాటిలేనిదగుటచే పెద్దలు అమెకు 'తులసి'యని నామకరణము చేసిరి. తులసి జన్మించిన పిదప బుద్ధితెలిసిన దాని వలె బదరి కాశ్రమమునకు పోయి శ్రీ విష్ణుమూర్తియే తనకు భర్తకావలెనని మనస్సున సంకల్పించి తపస్సు చేయసాగెను, ఇంతటి ఘోరతపస్సునకు బ్రహ్మ చలించి ప్రత్యక్షమై ఆమెను వరము వేడుకోమనగా ఆమె తాను గోలోకవాసి యనియూ శ్రీ రాధికాంశమున భారతదేశమున ఆడ జన్మనెత్తిన విషయము తెలిసిన మీరు నాకు శ్రీమన్నారాయణుని భర్తయగునట్లు వరమీయమని కోరెను. అప్పుడు బ్రహ్మ తులసితో "అమ్మా తులసి! శ్రీ కృష్ణ అంశ స్వరూపుడు, సంభూతుడు నయిన సుదాముడను గోపకుడు నిన్నుజూచి ప్రేమించిన విషయము తెలిసిన రాధిక శాపమున భూలోకమున రాక్షసుడుగ జన్మించి శంఖచూడుడను పేరుతో వెలయుచున్నాడు. మొదట నీవు అతనికి పత్నివికమ్మ, పిదప శ్రీమన్నారాయణుని భర్తగ పొంది అతని కృపచే వృక్షరూపమును పొంది సకల మానవ, దానవ, దేవతలచే పూజింపబడుదువు". అని వరమునిచ్చెను.

శ్రీ కృష్ణాంశ స్వరూపుడైన శంఖచూడుడు జైగీషవ్యముని యొద్ద కృష్ణ మంత్రోపదేశమును పొంది, పుష్కరతీర్థమునకు పోయి మంత్ర జపముచేసి సిద్ధిపొంది సర్వమంగళకవచమును ధరించి బ్రహ్మానుగ్రహం వలన వరము పొంది బదరి కాశ్రమము

నకు పోయి అచ్చట తులసిని చూచెను. వీరిరువురును పూర్వజన్మజ్ఞానము కలవారు కావున గోలోకమున పూర్వజన్మయందు వారిరువురికి గల ప్రేమానురాగాలను ఒకరినొకరు తెలిసికొనిరి. అప్పుడు బ్రహ్మయాదేశముననుసరించి గాంధర్వవివాహ విధానముగా తులసిని పరిణయమాడెను. శంఖచూడుడు తులసితో తనయాశ్రమమునకు పోయి ధర్మాన్ని నిరాటంకముగ పాలించుచుండెను. తన బాహుబలమున అజేయత్వాన్ని సాధించవలయునన్న కోరికతో దేవ, దానవ, గంధర్వులను ఓడించి రాజాధిరాజుగ రాజ్యమేలుచుండెను. శంఖచూడునిచేపరాజితులైన దేవతలు బ్రహ్మను శరణుపొందిరి. బ్రహ్మచేయునదేమిలేక శివునితోను, విష్ణువుతోను మొరపెట్టుకొనిరి. బ్రహ్మాదిదేవతలు తమ దీనగాధను వినిపింప శ్రీవిష్ణువు తన త్రిశూలాన్ని పరమశివునికిచ్చి శంఖచూడునిపై యుద్ధము చేసి అతనిని సంహరించమని చెప్పి మరియూ శివునితో శంఖచూడుని కంఠమున సర్వమంగళకవచమున్నంత వరకు, వాని ధర్మపత్ని పతివ్రతగా నున్నంతవరకు, అతనిని సంహరించుట ఎవరి తరము కాదు. కావుననేను బ్రాహ్మణరూపమున శంఖచూడుని యొద్దకు పోయి కవచమును తీసుకొని శంఖచూడుని రూపముతో తులసి యొక్క పాతివ్రత్యమును పాడుచేసెదెను. అప్పుడు శంఖచూడుని నీవు సంహరింపుమని చెప్పి పంపెను. దేవతలు పరమశివునితో కలిసి త్రిశూలముతో శంఖచూడునిపై యుద్ధమునకు పోయిరి. శ్రీమహావిష్ణువు వృద్ధబ్రాహ్మణ శరీరమును పొంది శంఖచూడుని యాచించి సర్వమంగళకవచమును అతనివద్దనుండి పొంది, తన మాయచే శంఖచూడుని రూపము దాల్చి, సర్వమంగళ కవచమును ధరించి తులసి గృహమునకు వచ్చినాడు. అప్పుడామె తన భర్తయైన శంఖచూడుడు యుద్ధమున గెలిచివచ్చినాడని భ్రమపడి సుశ్రూషలు చేసి పల్యంకము చేరి మోహింప ఆమె పాతివ్రత్యమునకు భంగము కల్గెను. తక్షణమే తులసి తాను వంచింపబడినట్లుగ్రహించి అతడు శంఖ చూడుడుకాడని తెలిసికొని లేచి తన దుఃఖ కోపాగ్నితో "నీవు మాయచే నా పాతివ్రత్యమును నాశమొనరించుటయేగాక నాపతిని సంహరించితివి. నీవు రాయివంటి కఠిన హృదయుడై కపటముగ ధర్మమును జెఱచినావు కావున నీవీ లోకమున శిలారూపమును చెందుదువని" శపించెను.

శ్రీ విష్ణువు ఆమె శాపమునకు భయపడి తక్షణమే తన నిజరూపమును దాల్చి ప్రత్యక్షమయ్యెను. అప్పుడు తులసి విష్ణువు పాదములపై బడి క్షమాభిక్ష కోరినది. అప్పుడు శ్రీ విష్ణువు ఆమెను ఓదార్చి "ఓ! సాధ్వీమణీ నీవు నన్ను భర్తగా పొందుటకు తపస్సుచేసితివి. అదేవిధముగా శంఖచూడుడు నిన్ను భార్యగా పొందగోరి తపస్సుచేసి, ఆ తపః ఫలముగ నిన్ను భార్యగ పొందెను . ఇప్పుడు నీవు చేసిన తపః ఫలముగ

ఈ శరీరమును వదలి దివ్య శరీరమును ధరించి నాతో శాశ్వతముగ నివసింపుము. యీ శరీరము భారతదేశమున గండకియను ప్రసిద్ధిచెందు పుణ్యనదిగను, నీ కేశము శ్రీతులసి యను పేరపవిత్ర ఓషధీరూపమును ధరించెదవు. సకల స్థావర పత్రములు పువ్వులకంటే నీ తులసి పత్రములు, పువ్వులు శ్రేష్ఠమైనవగును. పవిత్ర తుల ఓషధిగ సకల లోకములందును, సమస్తపుణ్యభూముల యందును పుణ్యభూమియై భారతదేశమందును ఉద్భవించును. శ్రీ తులసిని ఎవరైతే ప్రతి నిత్యము ఏద ఒకవిధమున, స్నాన, పాన, దాన, ధారణాదులందుపయోగించిన శ్రీహరికరుణ కటాక్షములకు పాత్రులగుదురు. నీ శాపఫలము వలన భారతదేశము నందు నీ ధరించిన గండికీ నదీతీరమున శిలారూపినై యుండెదను, (సాలగ్రామము). అచ్చట తీక్ష్ణదంతవిశిష్టకీటకములు నాయందు చేరి చక్రముల రచించును.

అట్టి చక్రములు, ఆకృతులు, చిహ్నభేదములచే నేను లక్ష్మీనారాయణ లక్ష్మీజనార్దన, రఘునాధ, వామన, శ్రీధర, దామోదర, రణరామ, రాజరాజేశ్వర వాసుదేవ, ప్రధ్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధ, అనంత, మధుసూదన, సుదర్శన, గదాధర హయగ్రీవ, నరసింహ- మున్నగునామములతో వెలయుచూ బహునాముడనయ్యెదను ఎచ్చట సాలగ్రామ శిలయుండునో అచ్చటనేను లక్ష్మీదేవితో సహా వాసముచేయుదును సాలగ్రామ పూజ చేయువారు జీవన్ముక్తులగుదురు. సాలగ్రామ శిలయుండి పూ చేయుటకు తులసి లేనిచో జన్మ జన్మలకు భార్యా విచ్చేదము కల్గును. శంఖము వుం పూజకు తులసిలేనిచో ఏడు జన్మములకు భార్యావిహీనుడును, రోగియునగును సాలగ్రామము, శంఖము, తులసి - ఈ మూడు నొక చోట యుంచి పూజించున యతడు నాకు ప్రియుడై మహాజ్ఞానియుగును". అని చెప్పి శ్రీమహా విష్ణువ అంతర్థానమయ్యెను. మరియూ తులసిని గూర్చి పద్మపురాణముత్తర ఖండమునంద చెప్పబడినదానిని చూడుము :

## శ్రీతులసీ-గాథ

పరమ శివుని దర్శనము చేసుకొనుటకై మనస్సుకలిగి శివలోకమునకు ఇంద్రుడు పోయెను. మార్గమధ్యమున ఒక భయంకర పురుషుడు ఎదురుగా కనిపించెను. ఇంద్రుడతనిని సమీపించి పరమశివుడెచ్చటయున్నాడని యడిగెను. అందులకాతడు ఎంతకూ సమాధానమివ్వనందువలన ఇంద్రుడు కోపావేశపరుడై తన వజ్రాయుధముతో ఆ భయంకర పురుషుని గొట్టెను. అప్పుడాదెబ్బకు రుద్రతేజముప్రజ్వరిల్లి మంటలు బయలువెడలెను. ఇంద్రుడామంటలను జూచి భయపడి రుద్రునికి ప్రణామము లొనరించి ప్రార్థించెను.

అతని ప్రార్ధనకు రుద్రుడు సంతోషించి, శాంతిచెంది తన ఫాలనేత్రమునుండి ఇంద్రుని మాడ్చి వేయుటకు వెలువడిన కోపాగ్నిని గంగాసాగరమునందుంచెను. సాగరసంగమము చెందిన ఆయగ్ని బాలరూపమును పొంది (ఏడ్వసాగెను), రోదన మొనరింపసాగెను. అతని రోదనశబ్దమునకు సప్తలోకములు బధిరప్రాయము (చెవుడు) లాయెను. ఆ శబ్దము విని బ్రహ్మ ఆశ్చర్యముతో అదిరిపడి ఆ బాలుని వద్దకు పోయి సముద్రుని యొడియందున్న బాలుని చూచి యీ బాలు డెవరని యడుగగా సముద్రరాజు ఎదురుపడి వీడు నాబిడ్డడు వీనికి జాతకర్మాదులు చేయుమని యాశిశువును బ్రహ్మచేతికందించెను.

బ్రహ్మచేతియందుండు ఆ బాలకుడు తన చిట్టి చేతులతో బ్రహ్మ గడ్డము పట్టుకొని యాడింపగా బ్రహ్మకు తన నేత్రద్వయమునుండి నీరు వెడలెను. అప్పుడు బ్రహ్మ "ఏ కారణమున ఈ బాలునిచే నాకనుల వెంట నీరు గలిగెనో ఆ కారణ నామమునే ఈ బాలుని పేరుగ **జలంధరుడు** యని నామ కరణము చేసి తక్షణమే యితడు సర్వశాస్త్రవేత్తయగును. రుద్రుడు తప్ప ఏ యితరభూతగణములు యితనిని సంహరింపజాలవు" యని చెప్పి రాక్షసగురువైన శుక్రుని పిలిచి అసుర రాజ్యమునకు రాజుగ జలంధరుని పట్టాభిషిక్తుని చేయించెను. జలంధరుడు రాజ్యభారమును వహించి కాలనేమి కూతురు బృందను వివాహమాడెను. జలంధరుడు ఘోరతపస్సుచేసి శివునివద్ద వరముపొందిన అహంకారముతోను బ్రహ్మచేమరణము చెందని వరమును ఒకషరతుపై పొందిన దురహంకారముతోనూ ముల్లోకములను జయించి దేవతలను పీడింప వారు శ్రీ విష్ణువును శరణు వేడగా వారికభయమిచ్చి పంపించెను. పిదప కొంతకాలమునకు జలంధరుడు శివుని పై యుద్ధము చేయసాగెను.కానీ జలంధరుని భార్య బృంద మహాపతివ్రతయగుట వలన అతనిని శివుడు సంహరించ లేక పోయినపుడు శ్రీ విష్ణువు పార్వతీదేవి కోరికననుసరించి జలంధరుని రూపమును దాల్చి బృందను మోసగించి పాతివ్రత్యభంగము చేసెను. పాతివ్రత్యభంగముచే జలంధరుడు శివునిచే వధించబడి అతనితల (తులసి) బృంద యొడిలో పడునట్లుచేసెను (జలంధరుని తల నేలపై బడిన ఆ తలనుండి మరల జలంధరుడు జన్మించునని చెప్పబడియున్నది) అప్పుడు బృంద తాను మోసగించబడినట్లు తెలిసికొని విష్ణువును శపించి భర్తతో బాటు సహగమనము చేసెను. వారి మరణమునకు పశ్చాత్తాపము చెందిన విష్ణువు బృందను తులసిగను, జలంధరుని అత్తపత్తి (ముడుపుతామర) గను మొలచునట్లు అనుగ్రహించెను. అందు వలననే ఈ రెండు చెట్లకు శక్తి ఎక్కువ. తులసి, అత్తపత్తి ఒకే చోట యుండుటను చూచి లేక ఒకే చోట పెంచి వాటిని ప్రతి నిత్యము పూజించిన మంచిఫలితమునిచ్చునని చెప్పబడియున్నది.

అత్తపత్తిశరీరము, తులసి ప్రాణము. ఈ రెండిటికి కోరికలను తీర్పు శక్తికలదందురు. మనస్సు, వాక్కు దృఢములేనివారు, జీవితములో మన శ్శాంతిలేని వారు, భోగభాగ్యములున్ననూ మంచి కార్యములు చేయలేనివారు, దుష్టశక్తులనుండి తప్పించుకోలేనివారు, వివాహమునకు అడ్డుకల్గి వివాహముకానివారు - వీరందరూ తమ కోరికలు నెరవేరుటకై ఈ క్రింది విధముగా చేయవలెను.

పరిశుభ్రమైన మనస్సుతో, పరిశుభ్రమైన శరీరముతో అనగా శుభ్రముగా స్నానము చేసి సోమవారము సూర్యోదయమునకు ముందే తులసి- అత్తపత్తి ఒకేచోట పెంచియుంచిన స్థలమును పరిశుభ్రముచేసి ధూప, దీప, నైవేద్యములు పుష్పాలంకరణములు చేసి తన కోరికను నెరవేర్చువలయునని ప్రార్థించుచూ 21 సార్లు ప్రదక్షిణ చేయవలయును. ఇట్లు ప్రతి సోమవారము చేయుచుండిన తమ కోరిక తప్పక నెరవేరునని పెద్దల వాక్కు, అనుభవసిద్ధమైనదని చెప్పబడియున్నది. ఇందులకు నమ్మకము అత్యావశ్యము. ఈ విధముగ ఆదివారమున ఉద్యోగ ప్రాప్తికి; గురువారమున - శత్రువు మిత్రుడగుటకు, మంగళ - శని వారములందు - తీరని వ్యాధులు తీరుటకు, శుక్రవారమున - లక్ష్మీ కటాక్షమునకు, కుటుంబ శాంతికి - పైవిధముగ పూజించిన తప్పక ఫలితము కల్గునని మహనీయులచే నమ్మకముగ చెప్పబడియున్నది. ఇట్లు చేయలేనివారు అనగా ఈ రెండు చెట్లను పెంచలేనివారు ఉదయము లేచినదే ముఖప్రక్షాళనముచేసుకొని పడకయందే కూర్చొని తన భావనా శక్తితో ఈ రెండు చెట్లను ఒకే చోటయుండునట్లు భావించి, షోడ షోప చారములు చేయునట్లు భావించి తన కోరికను నెరవేర్చువలసినదిగా ప్రార్థించి ఏకాగ్రచిత్తముతో ధ్యానించవలెను. ఆత్మప్రదక్షిణము చేసి నమస్కరించి తన దిన కృత్యములను చేసుకొనవలెను ఇట్లు చేసిననూ తన కోరిక సిద్ధించునని పెద్దలవాక్కు. చేసిచూచి ఫలితము పొందండని చెప్పబడియున్నది.

మాఘపురాణమునందు :- క్షీరసాగరమధనము చేసినప్పుడు అందుండి పుద్భవించిన అమృత కళశమునుండి రెండు బిందువులు అమృతము తొనికి బయటపడినది. ఆ బిందువులు పడిన ప్రదేశమున తులసి, పారిజాతము అను రెండు చెట్లు మొలచినట్లు ఏకాదశవ్రతమహాత్మ్యములో చెప్పబడియున్నది. ఈ చెట్లను సత్యజిత్తు నీరు పోసి పెంచినట్లు కూడా చెప్పబడియున్నది. అందువలననే 'శ్రీ అమృత తులసి' యనబడినది.

# శ్రీ తులసి - వృత్తాంతము

తులసి జనన వృత్తాంతమును బృహన్నారదీయము నందు చెప్పబడినదానిని చూడుడు:-

ఈ కథను కైలాసమందున్న మహేశ్వరి తనచెలికత్తెలకు చెపినట్లు చెప్పబడియున్నది.

శ్లో ॥ మాతా దుర్గే మహేశాని తులసీ బిల్వవృక్షయోః
జన్మమహాత్మ్య తత్వాని కథయస్వ కృపామయి ॥

**అర్థం:-** ఓ కృపామయి, మహేశ్వరీ, తల్లీ, దుర్గా - తులసీ, బిల్వ వృక్షముల జన్మమహాత్మ్యము, తత్వము మాకు తెలియజేయమని చెలికత్తె ప్రార్థించగా అందులకు దేవి ఈ విధముగా చెప్పెను.

దేవ్యువాచ :-

శ్లో ॥ పురాకైలాస శిఖరే బ్రహ్మణః కశ్చిదాసహ ।
ధర్మదేవ ఇతి ఖ్యాత : సాధుర్విష్ణు పరాయణః ॥
బృందానామతస్యపత్నీ బ్రహ్మణీ ధర్మచారిణీ ।
సదాపత్యనుగా సాధ్వీ పతి శ్రేష్ఠానుఖాన్వితా ॥

**అర్థము :-** దేవి చెప్పు చున్నది:-కైలాస శిఖరము నందు పూర్వము ధర్మదేవుడను సద్బ్రాహ్మణుడు సదా శ్రీవిష్ణు పారాయణము చేయుచు నివసించు చుండెను. ఆయనకు భార్యగ బృందయను పేరుగల సహధర్మచారిణియు, సాధ్వియు, సదా పతినే దైవముగ పూజించుచు, పతియాజ్ఞానుసారము దేవకార్యములు చేయుచు తానుకూడ స్వయముగ దేవపూజ, పతి పూజ చేయుచుండెడిది. ధర్మదేవుడు శివ, విష్ణునామములగానము చేయుచు ఋషి మండలములందు పర్యటించు చుండెను. ఓ సఖీ! ఒకనాడు ఆ బ్రాహ్మణోత్తముడు సభయందు గానము చేయుచునే యుండ మధ్యాహ్నభోజన కాలముదాటి పోయెను. ఇంటియందు బృంద యింటికి వచ్చిన అతిధులను పూజించి దేవపూజ చేసి తన పతిదేవునికి-మనస్సునందే-నమస్కరించి-జలపానము-చేసెను.-గానసభముగిసిన పిదప ధర్మదేవుడు తనయింటికివచ్చి తనసతి తన కన్న ముందుగా జలపానము చేసియుండుటను చూచి దైవవశమున అనుకోని విధముగ"రాక్షసివి"కమ్మని శపించెను. పతిశాపవశమున బృంద రాక్షసియై కైలాసశిఖరమును వదలి తిరుగుచూ తనమార్గమున వచ్చు మనుష్యులను, జంతువులను ఆకలికి భక్షించుచుపోయెను. పూర్వజన్మజ్ఞానము వలన గోవులను, బ్రాహ్మణులను, హరిభక్తులను విడిచిపెట్టి ఇతర ప్రాణులను భక్షించుచు కాలము గడుపుచుండెను. కొంతకాలమునకు కైలాసశిఖరము జ్ఞప్తికివచ్చికైలాస శిఖరమునకు వచ్చి చేరెను.

అచ్చట ఆమె ఆకలికి భరించలేక ఆహారమునకై వెదుకగా అచ్చట యుండ ప్రాణులన్నియూ శైవస్వభావము కలవి, శివలోకమున చెట్లన్నియీ శివమయముతే కావున అవిదినదగినవి కావని తలచుచూచింతాక్రాంతయై యున్న బృందపై జాలిపడి పూర్వము చేసిన పుణ్య, ధర్మ బలము వలన కృష్ణనామము ఆమెకు మోక్షమునివ్వగలదని నిర్ణయించి సర్వపాపనాశనకరమైన శ్రీ కృష్ణ నామమును శివపర్వతమందుండు సద్బ్రాహ్మణులు గానము చేయ ప్రారంభించిరి. బృంద శ్రీ కృష్ణనామగానమును కైలాస శిఖరమునందంతయూ వినవచ్చుచుండ, ఆ హరినామ శ్రవణముచేయుచు వారముదినములు బృంద యుపవాసమొనరించి కైలాసమునందే తన దేహమును త్యజించెను. ఒక సంవత్సరముగడచినపిదప పరమశివుడు దేవితో వనవిహారమునకు వచ్చి బృందమరణించిన స్థలమునందు రాక్షస శరీరముతో బృంద అత్యంత శోభాయమానముగయుండుటను చూచి మహేశ్వరుడు దేవితో "చూచితివా ఈమె విష్ణు భక్తుడగు ధర్మదేవుని భార్యపరమవైష్ణవి, దైవవశమున రాక్షసియై హరినామప్రభావముచే యిచట దేహత్యాగము చేసి ఒక వత్సరమైననూ ఏవిధముగ ప్రకాశించుచున్నదో చూడుము". అని విన్నవించెను. అందులకామె "దేవదేవ! యీయమ శరీరావయవము లందంతట హరినామము కానవచ్చుచున్నది మఱియు నీ బృంద శరీరమునందెల్ల ద్వాదశాక్షరమంత్రము కనుపించుచున్నది. శివగణము యంతయూ యీ నామమునే పఠించు చున్నారు. అప్పుడు శివగణము యాతేజోమయశరీరమును దాకగానే అదికోటాను కోట్లఖండములైనది, ఒక్కొక్క ఖండమునందు 'ఓం నమో భగవతే వాసుదేవాయ', యను మహాఫలప్రదమగు మంత్రముయొక్క ప్రతి యక్షరగర్భమున విష్ణుసహస్రనామములు వినవచ్చుచున్నవి, యని చెప్పెను. అప్పుడు సాక్షాల్లోకశంకరుడగు శంకరుడు దయాహృదయుడై యానందనృత్యము చేయుచున్న,యాశివగణములను చూచి, 'ఈ బృంద ధర్మదేవుని పత్ని, వైష్ణవి, భర్తశాపవశమున రాక్షసియయ్యెను, బ్రహ్మహత్యచేయలేదు, విష్ణుభక్తురాలు వృథాయగుటతగదు. కావున బృంద భూలోకమున వృక్షరూపమును ధరించి శ్రీ విష్ణువునకు ప్రియమును గలిగించుగాక'. ఓ! శివ గణములారా! ఈ శరీరమును దీసికొనిపోయి భూమియందు పూడ్చిరండు, అచ్చట ఈమె తులసి వృక్షముగ ఉత్పన్నమగును. ఈ తులసీదళముల వలన శ్రీ హరి పూజితుడగును. ఈ బృందకు 'తులసి' యను సుపావననామము సార్థకమగును. మరణించియూ కాంతి సంపన్నయై, సాటిలేనిదియై యున్నందున ఈమె పేరు 'తులసి' యని లోక ప్రసిద్ధి చెందునుగాక. ఈమె ప్రతి పత్రమునందు ద్వాదశాక్షరమంత్రమున్నది. ఉమామహేశ్వరులకీమె యధిష్ఠాన దేవత.

ఈమె కుపాస్యదైవము నారాయణుడు, ఈమె విష్ణుప్రియ" యని శంకరుడు శివగణములకు చెప్పెను. బృందవియోగమును భరించలేక ధర్మదేవుడు అప్పుడచ్చటికి వచ్చి " బృందా! ఓ ప్రియా ! నీవెక్కడ ? నేను నిర్దయుడను, నిష్కారణముగ విచక్షణాజ్ఞానము లేక నిన్ను రాక్షసివి కమ్మని శాపమిచ్చితిని" యని తనను నిందించు కొనుచు విలపించుచుండ మహాదేవుడ తనినోదార్చ గొంత సమయమునకు మనస్సు కుదుట పడినవాడై శివునికి నమస్కరించి బృంద వృత్తాంతమును తెలిసికొని పరమేశ్వరునితో 'మహేశ్వరా! నారాయణునకై బృంద తులసి చెట్టుగ విష్ణుప్రియయైనపుడు నాకు ప్రియమైన (బృంద) తులసి చెట్టునకు మూలమయ్యెదనని' ప్రార్థించగా పరమేశ్వరుడు తథాస్తు అనెను. అప్పుడు ధర్మదేవుడు తులసికి మూలమయ్యెను.

అనంతరము శివుని ఆజ్ఞానుసారము శివగణములు బృంద దేహమును కాళిందీ (యమునా) తటమున నాటిరి. భూలోకము నందతయూ విస్తరించునట్లు చేసిరి.

అనంతరము దామోదరునకు ప్రియమైన కార్తికమాసమున అమావాస్య తిథియందు ప్రాతః కాలమున తులసి శివ విష్ణువులకు ప్రీతిగానావిర్భవించెను. శ్రీ తులసి యావిర్భవింపగనే శ్రీ మన్నారాయణుడు శివునితో కలిసి భూలోకమునకు వచ్చి తులసిని జూచెను. (తులసి వర్ణన ఈ విధముగ చెప్పబడి యున్నది)

శ్లో॥ మహామేఘప్రభాంశ్యామాంస్కంధపల్లవ శోభితా ।
దళైరసంఖ్యైః సంపూర్ణాంమహామంత్రమయీాం స్థిరామ్।
జ్వలంతీ స్వేన మహసా గంధామోదిత దిఙ్ముఖామ్ ॥

**అర్థము :-** శ్యామ వర్ణము కలిగిన మహామేఘమువలె, చిగురించిన కొమ్మలతో శోభిల్లుచు, అసంఖ్యాకములైన పత్రములు సంపూర్ణముగ కలిగి స్వీయతేజస్సుచే దేదీప్యమానయై, మహామంత్రమయియై తనసుగంధముచే అష్టదిక్కులా బరిమళింపజేయుచున్న శ్రీ తులసి నిచూచెను. అప్పుడు మంగళప్రదయైన తులసీదేవి విష్ణుమూర్తిని పరిగ్రహించెను. నానాలంకార భూషాదులచేత సుశోభితమైన తులసి శ్రీ మన్నారాయణుని ఈ క్రింది విధముగ స్తోత్రము చేసెను.

ఓం। నమోభగవతే తుభ్యం నారాయణజగత్పతే ।
కేవలానుభవానంద స్వరూప పరమేశ్వర ॥
కంసారయే మహేశాయ కేశవాయ నమోస్తుతే ।
హరయే నరసింహాయ శ్రీ కాంతాయ నమోనమః॥
నమో భక్తైకలభ్యాయ తర్కాదూరాయతేనమః ।
నమోవేదాంతవేద్యాయ విద్యావేద్యాయతేనమః॥

నమో నీలఘనశ్యామ తనవే ధృతమూర్తయే ।
బహురూపోరు రూపాయ నిరూపాయః నమోనమః ॥
పూజకాయ చ పూజ్యాయ పత్రపుష్పైః ఫలైః ప్రభ ।
అభవాయభవచ్ఛేత్రే సుఖదుఃఖ ప్రదాయచ ॥
తవైవాహం సుఖకరాత్వంచమే ప్రభురీశ్వరి ।
నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమోహరేః ॥

ఈ విధముగ స్తోత్రము చేసిన పిదప శివునికి ప్రణామముచేసి ఇట్లు శివుని స్తోత్రము చేసెను.

ఓంకారాయనమస్తేఽస్తు శంకరాయనమోనమః ।
శివాయహరయే దక్షబలిక్రతు హరాయతే ॥
ఏకత్రిపుర హంత్రే తేకైటభాంధక ఘాతినే ।
శ్రీ గౌరీపతయే కృష్ణ మహాదేవ నమో ఽస్తుతే ॥

ఇట్లు స్తోత్రము చేసిన తులసిని జూచి శ్రీ హరి :-

శ్లో॥ తులసి శ్రీమతి శ్రేష్ఠే బృందే బృందావనే ప్రియే ।
స్థిరీభవ మమప్రీత్యైయాదవాచంద్ర తారకమ్ ॥

అర్థము:- "ఓ తులసి ! శ్రీమతీ ! స్త్రీలలో శ్రేష్ఠమైన దానివి, బృందావనము నందు ప్రియమైనదానివి, బృందా! నీవు సూర్యచంద్రులున్నంతకాలము నా ప్రీతికై స్థిరముగ యుందువు. నాపూజకు నీ పత్రముల కంటే శ్రేష్ఠమైనది వేరేదియును లేదు.

శ్లో॥ ఏకతః సర్వనైవేద్య నానాపుష్పవిభూషణమ్ ।
ఏకతః పత్రమేకం తేద్వాదశాక్షర మంత్రవతే ॥ (అనగా)

నానా విధపుష్పాలంకారములతో చేయబడిన నైవేద్యము లొకటి, ద్వాదశాక్షరమంత్రయుక్తమై విశేషగుణములు కల్గిన నీ (తులసి) పత్రమొకటి సమానము, కావున వృక్షరూపము చెందిన నీకు ప్రదక్షిణముగావించి ప్రణామములర్పించి పూజించెడివాడు ఈ భూమండలమునకు ప్రదక్షిణము చేసిన వాడగును. కార్తికమాసమున ఎవరైతే నాకు నీ (తులసి) పత్రమొకదానిని సమర్పించునో యతడు సహస్ర గోదానము చేసిన ఫలమును బొందును.

శ్లో॥ మాఘేమాసి చతేపత్రమాలాంయచ్ఛతి యోజనః ।
తస్మాదహంప్రయచ్ఛామి వాజిమేధక్రతోఫలమ్ ॥

(అనగా) మాఘమాసమున నీ (తులసి) పత్రములతో గూర్చిన మాలను నాకు

సమర్పించువానికి నేను, అశ్వమేధయాగముచేసినంత ఫలమును అతనికిచ్చుచున్నాను. వైశాఖమాసమున నీ పత్రములతో శయ్యను (పడకను) కల్పించి నాకిచ్చు వానికి నన్నేయిచ్చుకొనుచున్నాను. మరియూ వైశాఖ మాసమున నీ పత్రముల జలముతో నన్నభిషేకించు వానికి సర్వదా అమృతవిధియందు స్థానమిచ్చుచున్నాను. ఆషాఢ మాసమున నీ పత్రములరసముతో భావనచేయబడిన జలము నాకర్పించిన వ్యక్తికి నేను మోక్షమిచ్చుచున్నాను. నీ పత్రములు ఈ భూలోకమున ఎచ్చోట పడినను శివుని యాజ్ఞచే వానిని (ఆపత్రములను) నా శిరస్సుతో గ్రహించెదను.

శ్లో॥ త్వత్పత్ర జలసిక్తాన్నంయో భుంక్తేమానవః క్వచిత్।
తదేవామృత మిత్యుక్తః భుక్తం భాగ్యవతాశుభే॥
త్వత్పత్ర రసభోజీచ గంగాజలసమన్వితమ్।
సోఽహ మిత్యేవ విజ్ఞేయంసత్యం సత్యం శపేశపే॥

(అనగా) ఏ మానవుడు నీ (తులసి) పత్రజలముతోదడిసినయన్నమును భుజించునో అయ్యది దేవామృతమని చెప్పబడును, భాగ్యవంతుడే దానిని భుజించును, నీ పత్రరసమును, గంగాజలముతో జేర్చి సేవించువాడు నేనే (విష్ణువు) యని విశేషముగ దెలియదగును. ఓ శోభనా! నేను శపథము చేసి సత్యమును చెప్పుచున్నాను యేవ్యక్తి నీ పత్రమును దాకి యబద్ధములాడునో వాడు కోటి కల్పములకయినను నుగ్రనరకము నుండి విముక్తిని పొందలేడు.

శ్లో॥ త్వత్కాష్ఠమాలాంత్వత్కాష్ఠపృష్టేపంకంచయో దధాత్।
అహంతస్యానుగః శుద్ధేభవామి సుతవత్పితుః॥

(అనగా) ఓ తులసీ! నీ కఱ్ఱతో జేసిన మాలను, నీ కఱ్ఱతో, దీసిన గంధమును నేవ్యక్తి ధరించునో వానివెంట, "తండ్రి తనయుని వెంట బోవునట్లు", నేను బోయెదను.

ఈ విధముగ శ్రీ హరి తులసీ దేవిని యభిషేకించి పిదప ఇంద్రాది గణములు, ప్రమథగణములతోను మహేశ్వరునితోను నంతర్ధానము చెందిరి". అని దేవి తులసి జన్మకథను వివరించి చెప్పి కథను ముగించెను, కథలు వేరు, వేరుగయున్నను సారాంశము 1. భక్తి 2.పతి భక్తి 3. పాతివ్రత్యము 4. పూర్వజన్మసుకృతము 5. మోక్షప్రాప్తి 6. లోకప్రసిద్ధి చెందుట అనునవి.



# తులసీ ప్రాశస్త్యము

ప్రపంచమునందలి అన్నిదేశములందును తులసి కానవచ్చు చున్నది. ఆయా దేశములందు వారి వారి భాషలకనుగుణముగ పేర్లను, అచ్చటిమట్టియందలి సార సత్వములననుసరించియూ శీతోష్ణ పరిస్థితులననుసరించి ఆకార,గుణములంద మార్పుకలిగి పెరుగు చున్నది.

మానవుని నిత్యజీవితములో పుట్టిన నాటినుండి మరణించు వరకు తులసి ప్రయోజనపడుచున్నది. పుట్టిన పసిపాపలకు కలుగు కఫరోగములకు తులసి రసమ పెట్టినది పేరు అదేవిధముగ మరణశయ్యపై ప్రాణము యూగిసలాడునపుడు తులసి తీర్థమును పోసిన సుఖముగ ప్రాణమునువిడిచివైకుంఠపధమును చేరుదురని పెద్ద వాక్కు.

## శ్రీపాద తీర్థము

ఆంధ్రదేశమునందుకలియుగ అవతార మూర్తియై తిరుమలలో వేంచేసియుండు శ్రీ వేంకటేశ్వరుని ఆలయములో లక్షలాది ప్రజలు తమకు తెలియక శ్రీతులసి తీర్థమును సేవించి కృతార్థులగుచున్నారు. తులసి తీర్థము పచ్చకర్పూరమ కలిపిన దానికి గుణము అధికమగుచున్నది. అందువలననే తిరుమలలో తులసి, పచ్చ కర్పూరము మఱియూ యితరమూలికలను కలిపిచేయబడు 'శ్రీ పాదరేణు'అన ప్రసాదము, అనే కవ్యాధులను పోగొట్టును. శ్రీపాదతీర్థము అనునది అనే దివ్యమైనవనమూలికలచే తయారు చేయబడు చున్నది. అదెట్లనగా శ్రీ వేంకటేశ్వ స్వామికి షోడశోపచార పూజలో పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, స్నానము అన వుపచారములందు శుభ్రమైననీటి యందు శక్తిసంపన్నములైన ఓషధులను కలి సాంప్రదాయసిద్ధముగా సమర్పించ బడుచున్నది. ఇందు:-

**పాద్యద్రవ్యములు :-**

1. గరిక 2. నేల ఉసిరిక 3. శ్యామక (చామలు) 4. తామర అను ఓషధులన కలిపిచేయుదురు. వైద్యశాస్త్రప్రకారము వీటి గుణములు చూతము.

**1.గరిక( దూర్వా):**-దూర్వా హిమవిసర్పాస్రతృట్పిత్తకఫ దాహనుత్ ।।

**అర్థం :**- గరిక శీతలముగనుండును. విసర్పము, రక్తదోషము, దప్పి, పిత్తము, కఫము తాపము- అనువాటిని నశింపచేయును.

శ్లో॥ దూర్వాత్రయంభవేతిక్తం రక్తపైత్యకఫాపహం ।
దాహతృష్ణా విసర్పాది కండూకుష్ఠ వినాశనః ॥

***అర్థం :***- గరిక మూడు విధములు. అవి తెలుపు, నలుపు, పోతు ( తీగ) గరిక అనునవి

ఈ మూడు విధములైన గరికలు చేదుగనుండును. రక్తపైత్యము, కఫము, తాపము, దప్పి, విసర్పి, దురద, కుష్ఠ -మున్నగు వ్యాధులను పోగొట్టును.

**2)** నేల ఉసిరిక (విశ్వపర్ణీ, తమాలిక)

శ్లో॥ తమాలికారసేతిక్తా వీర్యేచ శిశిరామతా।
పిత్తంహంతి కఫాస్రఘ్నీ వస్తిదాహవినాశినీ॥

*అర్థం :-* నేల ఉసిరిక చేదురుచి శీతవీర్యము కలది. పిత్తము, కఫము, రక్తదోషము, వస్తి, తాపము, శ్లేష్మదోషము వీటిని నశింప చేయును. ఇది రుచిగను, నిర్మలముగను, పరిమళముగను లఘువుగయుండును.

**3)** చామలు (శ్యామాక)

శ్లో॥ శ్యామాక శ్శోషణ శ్శీతోరూక్ష పిత్తకఫాపహః॥

*అర్థం :-* చామలు (శరీరమును) శోషింపచేయును, చలువచేయును, రూక్షగుణముకలది పిత్తకఫములను హరించును.

**4)** తామర (పద్మ) (దుంప)

శ్లో॥ పద్మకంద ః కటుశ్శీతః ప్రదరాస్పృగ్దరాపహః।
కృచ్ఛ్రవిణ్మూత్ర రుధిరంనిహన్యాద్గర్భ శీతలం॥

*అర్థం :-* తామరదుంప కారముగను, శితవీర్యము కలిగియుండును. ప్రదరము, అస్పృగ్దరము, మూత్రకృచ్ఛ్రము, మలబంధము, అతిమూత్రము, రక్తదోషము, గర్భశీతలము - అనువానిని నశింపచేయును.

పై చెప్పబడిన నాలుగు ద్రవ్యముల చూర్ణమును పాద్యపాత్రయందుంచి పాద్యోదకమున సరస్వతీదేవిని ఆవాహనము చేసి, సరస్వతీ మూలమంత్రముతో అభిమంత్రించి ఉపయోగించెదరు.

**అర్ఘ్యద్రవ్యములు**

శ్లో॥ సిద్ధార్థ మక్షతంచైవ కుశాగ్రం తిలమేవచ।
యవం గంధం ఫలంపుష్పం అర్ఘ్యే సమ్యగ్వినిక్షిపేత్॥

*అర్థం :-* తెల్లావాలు, బియ్యము, దర్భకొనలు, నువ్వులు, యవలు చందనము, ఫలములు, పుష్పములు అనునవి. వీటిగుణములు ఆయుర్వేద శాస్త్రమందు పేర్కొనిన దానిని పరిశీలింతము.

**1)** తెల్లావాలు (సిద్ధార్థం) :

శ్లో॥ సిద్ధార్థః కటుకస్తిక్తోరుచ్యోష్ణోవాతరక్తకృత్।

గ్రహపీడార్శత్వగ్దోష శోఫవ్రణవిషాపహాః ॥

*అర్థం :-* తెల్లావాలు కారముగను చేదుగను, ఉష్ణముగ నుండుటయే గాక రుచి, వాత రక్తము వీటిని కలిగించును. మఱియునిది గ్రహపీడ, అర్శస్సు, త్వగ్దోషము, వాపు, వ్రణము, విషము వీటిని శమింపచేయును.

**2) బియ్యము (అక్షతం) :-**

శ్లో॥ శాలయోమధురాఃస్నిగ్ధా బల్యాబద్ధాల్పవర్చసః।

పిత్తఘ్నాల్పానిలకఫా మూత్రలాలఘవోహిమాః ॥

*అర్థం :-* (సంబాధాన్యము) బియ్యము మధురముగను, జిగటగలది. బలము నిచ్చును. కొంచెము మలమును బంధించును. పిత్తమును పోగొట్టును. స్వల్పముగ వాతమును, కఫమును చేయును. మూత్రమును వృద్ధి చేయును. తేలికగయుండును. శీతలకారి.

శ్లో॥ తండులోమేహజంతుఘ్న ః

*అర్థం :-* బియ్యము ప్రమేహవ్యాధిని, క్రిములను హరించును.

**3) దర్భకొనలు (కుశాగ్రం)**

శ్లో॥ దర్భః కృచ్ఛ్రాశ్మరీతృట్పిత్తవస్తిరుక్కఫరక్తజిత్ ॥

*అర్థం :-* కుశదర్భమూత్రకృచ్ఛ్రము, అశ్మరి, దప్పి, పిత్తము, వస్తిరోగము కఫము, రక్తదోషము వీటిని పోగొట్టును.

**4) నువ్వులు (తిల)**

శ్లో ॥ తిలః కషాయోమధురస్తిక్తకః కటుకోరసే ।

తిలోగ్రాహీగురు స్వాదు స్నిగ్ధోస్రకఫపిత్తల ః ॥

బల్య ః కేశ్యోహిమస్పర్శస్త్వచ్యోవ్రణహితపరం ।

*అర్థం :-* నువ్వులు వగరు, తీపు, చేదు రుచులను కల్గియుండును. కటువైనరసముగలది. మలబద్ధముచేయును. గురుత్వము చేయును. రుచికరముగను, జిగటగను యుండును. రక్తదోషము, కఫపిత్తములను వృద్ధి చేయును. బలమును కల్గించును. వెంట్రుకలను వృద్ధిచేయును. శీతలమైనది, చర్మమునకు హితకరమైనది, వ్రణముల నార్చును.

**5) యవలు (యవ) (బార్లీబియ్యము)**

శ్లో॥ రూక్షశీతోగురు స్వాదుస్సరోవిడ్వా తకృద్యవః।

వృష్యస్థైర్యకరోమూత్రమేదః పిత్తకఫాన్‌జయేత్ ॥

పీనసశ్వాసకాసోరుస్తంభకంఠత్వగామయాన్ ।

"న్యూనోయావాదన్యయవో ...."

*అర్థం :-* యవల బియ్యము రూక్షగుణము, శీతవీర్యము, గురుగుణము, స్వాదుగుణము

కల్గియుండును. శరీరమునందు శీఘ్రముగ వ్యాపించును. మలమును, వాతమును ఎక్కువగ వృద్ధిచేయును. వీర్యవృద్ధి చేయును. మనోస్థైర్యమును కల్గించును. మూత్రరోగము, మేదస్సు, పిత్తము, కఫము, పీనసము, శ్వాసకాస, ఊరుఃస్తంభము, కంఠ రోగము, చర్మరోగము - వీటిని పోగొట్టును. ఇతర రకములైన యవలః స్వల్పగుణము కల్గియుండును.

**6)** చందనము (గంధం)

శ్లో॥ చందనం శీతలం రూక్షం తిక్తమాహ్లాదనంలఘు।
హృద్యం వర్ణ్యం విషశ్లేష్మతృష్ణాపిత్తాస్రదాహజిత్॥

*అర్థం:-* చందనము చలువ చేయును. తాపమునిచ్చును. చేదుగ నుండును. ఆహ్లాదకరమైనది. తేలికనిచ్చును. హృదయమునకు మేలుచేయును. వర్ణమునిచ్చును. విషము, శ్లేష్మము, దప్పి, పిత్తము, రక్తదోషము, తాపము వీటిని పోగొట్టును.

**7) ఫలములు (పండ్లు)**

శ్లో॥ బీజపూరక జంబీర నారంగం చామ్లవేతసం।
తింత్రిణీక సమాయుక్తం ఫల పంచామ్లముచ్యతే ॥
తద్గుణోఽరుచి దాహఘ్నం పిత్తరక్తానిలాపహం ।
చర్దిరోగప్రశమనం దీపనం లఘుశీతలం ॥

*అర్థం :-* మాదీఫలము, నిమ్మ, నారదబ్బ, పుల్లప్రబ్బలి, చింత - వీటిని ఫలపంచామ్లక మనబడును. ఇవి అరుచి, దాహము, పిత్తము, రక్తదోషము, వాతము, వాంతి వీటిని పోగొట్టుటయేగాక అగ్నిదీపనము సహా గలుగంజేయును.

**8) పువ్వులు (పుష్పం)**

శ్లో॥ పుష్పస్యధారణం కాంతి వర్ధనం కామకారకం।
వోజశ్రీవర్ధకం చైవ పాపగ్ర హవినాశనం ॥

*అర్థం :-* పుష్పదారణము కాంతి,కామము, ఓజస్సు, సంపద వీటిని వృద్ధి పొందించుటయేగాక, పాపగ్రహములను నశింపజేయును.

పై చెప్పిన ఎనిమిది ద్రవ్యములను చూర్ణించి అర్ఘ్యపాత్ర యుందుంచి అర్ఘ్యోదకమున శ్రీదేవిని ఆవాహనముచేసి శ్రీదేవిమూల మంత్రముచే అభిమంత్రించెదరు.

**ఆచమనీయ ద్రవ్యములు :**

" ఏలాలవంగతక్కోల జాజీరాచమనీయకే "

**1) ఏలక్కాయలు (ఏలా)**

శ్లో॥ ఏలాసూక్ష్మ కఫశ్వాసకాసార్శోమూత్రకృచ్ఛ్రనుత్ ॥

*అర్థం* :- ఏలకులు (చిన్నవి) కఫము, శ్వాసము, కాస, అర్శస్సు, మూత్రకృచ్ఛ్రము వీటిని పోగొట్టును.

**2)** లవంగములు (లవంగ)

శ్లో ॥ లవంగం లఘు చక్షుష్యం హృద్యం దీపన పాచనమ్ ।
శూలానాహ కఫశ్వాసకాస చర్దిక్షయాపహం ॥

*అర్థం*:-లవంగము లఘువుగనుండును. నేత్రములకు, హృదయమునకు మేలుచేయును, అగ్ని దీపనము, పాచనము చేయును. శూల, అనాహవాతము, కఫము, శ్వాసము, కాసము, వాంతి, క్షయ వీటిని హరించును.

**3) తక్కోలములు (తక్కోల)**

శ్లో ॥ కంకోలముష్ణం హృద్రోగకఫవాతాగ్ని మాంద్యజిత్ ॥

*అర్థం*:-తక్కోలపుట్లుకాకచేయును. హృద్రోగము, కఫము ,వాతము, అగ్ని మాంద్యము - వీటిని పోగొట్టును.

**4)** జాజికాయ, జాతిపత్రి (జాజీ)

శ్లో॥ జాతీఫలం లఘుస్వర్యం హృద్యందీపనపాచనమ్ ।
ఉష్ణం కఫానిలచ్ఛర్ది క్రిమి పీనసకాసజిత్ ॥

*అర్థం*:-జాజికాయ లఘువుగనుండును. కంఠస్వరమును వృద్ధిచేయును. మనోహరముగనుండును. అగ్నిదీపనము, పాచనము చేయును. కాకచేయును. కఫము, వాతము, వాంతి, క్రిములు, పీనసము, కాసము, వీనిని హరించును.

శ్లో॥ జాతీపత్రీ లఘూష్ణాస్వాత్కఫ క్రిమివిషాపహా ॥

జాపత్రి కొంచెము కాక చేయును. కఫము, క్రిములు, విషము వీటిని హరించును.

పై చెప్పిన ఆచమనద్రవ్యములను చూర్ణించి ఆచమన పాత్రయందుంచి దానియందు శాంతిదేవిని ఆవాహనముచేసి శాంతిదేవి మూలమంత్రముచే అభిమంత్రణము చేయుదురు.

**స్నానద్రవ్యములు :**

"కోష్ఠమాంసీ హరిద్రేద్వే ముస్తాచైవతు చంపకాః
వచాకచోర లామజ్జాః స్నానీ యే ఓషదీః క్షిపేత్॥"

1) చెంగల్వకోష్ఠ (కోష్ఠ)

శ్లో॥ కుష్ఠ ముష్ణం కటుస్వాదుతిక్తం శుక్రప్రదం లఘు।
హంతివాతాసవీ సర్పకుష కాసమరుత్ పాన్ ॥

అర్థం :- చెంగల్వకోష్ఠ కాకజేయును, కారముగ, రుచిగ, చేదుగ నుండును. శుక్రమును వృద్ధిచేయును, చలకననిచ్చును, వాతరక్తము, విసర్పము, కుష్ఠవు, కాసము, వాతము, కఫము - వీటిని పోగొట్టును.

**2) జటామాంసి (మాంసి)**

శ్లో॥ మాంసీ తిక్తాకషాయస్యాద్వీర్యేదోష్ణా ప్రమేహజిత్।
తృడ్దోష విషవేగామదాహకుష్ఠ విసర్పజిత్॥

అర్థం :- జటామాంసికషాయతిక్తరసములు కల్గియుండును. ఉష్ణవీర్యము కలది, ప్రమేహము, చర్మవ్యాధులు, విషవేగము, ఆమదోషము, తాపము, కుష్ఠ, విసర్పి - వీటిని పోగొట్టును.

**3) పసుపు – కస్తూరి పసుపు (హరిద్రేద్వే)**

శ్లో॥ హరిద్రా కటుకా తిక్తారూక్షోష్ణా శ్లేష్మపిత్తనుత్।
వర్ణ్యా త్వగ్దాహ మేహాస్ర శోఫపాండు వ్రణాపహా॥

అర్థం :- పసుపు కారముగ చేదుగ యుండును. తాపమునిచ్చును. ఉష్ణముగనుండును. శ్లేష్మము, పిత్తము, త్వగ్దాహము, మేహము, రక్తదోషము, వాపు, పాండువు, వ్రణములు - వీటిని హరించును. శరీరమునకు కాంతినిచ్చును.

అగస్త్యముని :- కస్తూరిపసుపు-పెద్దపుండ్లు, పామ, నులిపురుగులు, అగ్ని మాంద్యము - వీటిని పోగొట్టును. పురుషత్వమును, బుద్ధినివృద్ధిచేయును.

**4) తుంగముస్తలు :- (ముస్తా)**

శ్లో॥ ముస్తాతిక్త కషాయస్యాత్ శిశిరాశ్లేష్మ రక్తజిత్।
పిత్త జ్వరాతిసారఘ్నీ తృష్ణాకృమి నాశినీ॥

అర్థం :- తుంగముస్తలు చేదు, వగరురుచి కల్గియుండును. చలువ జేయును. శ్లేష్మము, రక్త దోషము, పిత్తజ్వరము, అతిసారము, దప్పిక, క్రిములు వీటిని పోగొట్టును.

**5) సంపెంగ (చంపక)**

శ్లో॥ చంపకః కథితశ్శీతోవృష్య స్సర్పవిషాపహః॥
సౌరభో మేహశమనోలోచన స్వామయం జయేత్॥

అర్థం :- సంపెంగ మిగుల శీతలముగ, వీర్యవృద్ధి కరముగ, పరిమళము గల్గియుండును. సర్పవిషము, మేహము, నేత్రరోగము వీటిని పోగొట్టును.

**6) వస (వచా)**

శ్లో॥ వచోష్ణా కటుకాతిక్తా వామనీస్వర వహ్నికృత్।
అపస్మార కఫోన్మాదభూత శూలానిలాన్ జయేత్॥

*అర్థం :-* వస కాకచేయును. కారముగ, చేదుగ యుండును. వాంతిని కల్గించును, కంఠస్వరమును, అగ్ని దీపనమును వృద్ధి చేయును. అపస్మారము, కఫము, ఉన్మాదము, భూతములు సోకుట, శూల, వాతము వీటిని పోగొట్టును.

**7) కచ్చూరములు ( కచోర)**

శ్లో॥ శటీప్యాత్ కటుతిక్తోష్ణా సన్నిపాతజ్వరాపహా।
కఫోగ్రవ్రణకాసఘ్నీ వస్త్రశుద్ధి విశోధిని॥

*అర్థం :-* కచోరము చేదుగ కారముగ నుండును. సన్నిపాత జ్వరము, కఫము, ఉగ్రమైన వ్రణము, కాసము వీటిని పోగొట్టును. వస్త్రములను శుభ్రముగ వుంచి పరిమళము కలిగించును.

**8) వట్టి వేర్లు (లామాజ్జా)**

శ్లో॥ ఉశీరం శీతలం తిక్తం దాహక్లాంతి హరంచతత్ ।
వాతఘ్నం జ్వరతృణ్మేహనద్రక్తం హంతి యోగత ॥
ఉశీరం స్వేదదౌర్గంధ్య పిత్తఘ్నం స్నిగ్ధతిక్తకమ్ ॥

*అర్థం:-* వట్టివేర్లు శీతవీర్యము, చేదురుచి, స్నిగ్ధగుణములు కల్గియుండును (శరీర) మంటలు, బడలిక, వాతము, జ్వరము, దప్పి, ప్రమేహము, రక్తదోషము, రక్త పిత్తము - వీటిని పోగొట్టును. మఱియు నిది చెమటవలన కలుగు దుర్గంధములను హరించును.

పై చెప్పిన 8 ద్రవ్యములను చూర్ణించి స్నానపాత్రయందు వుంచి స్నానోదకమున రతీదేవిని ఆవాహనము చేసి రతీదేవి మూలమంత్రముచే అభిమంత్రణము చేయుదురు.

పిదప "ఏతేషామలాభౌ తులసీ దళాని నిక్షిపేత్"

**తులసీ (బృంద)**

శ్లో॥ తులసీ కటుకాతిక్తా హృద్యోష్ణా దాహపిత్తకృత్ ।
దీపనీ కుష్ఠ కృచ్ఛ్రాస్ర పార్శ్వరుక్కఫ వాతజిత్ ॥

*అర్థం :-* తులసి కారముగ చేదుగ మనోహరముగ నుండును. ఉష్ణకారి, తాపము, పిత్తము వీనిని జేయును. అగ్నిదీపనము కల్గించును. కుష్ఠువు, మూత్రకృచ్ఛ్రము, రక్తదోషము, పార్శ్వపీడ, కఫము, వాతము - వీనిని పోగొట్టును.

పై చెప్పబడిన పాద్య, అర్ఘ్య, ఆచమన, స్నానద్రవ్యముల గుణములన్నియు మిశ్రితమొందిన వాటిని, భగవంతుని ఆరాధించు సమయమునందు, ఆయాకార్యములందు స్వామివారికి ఆయా వేద మంత్రములను పఠించుచు సమర్పింతురు. శ్రీవారి అవయవ సంబంధము, ద్రవ్యగుణసంబంధము, శ్రీతులసీ సంబంధము గల్గిన శ్రీపాద తీర్థము యొక్క మహిమ చెప్పుటకు అలవికాదు. ఇంతటి మహత్తర శక్తి గల తులసితో మిశ్రితమైన ద్రవ్యములను సేవించిన భక్తులకు సర్వరోగనివారణ మగుచున్నది.

ఈ శ్రీ పాద తీర్థమును ప్రతిదినము అర్చనానంతరమున అర్చకులు ముందు గ్రహించ వలెను. (అట్లు గ్రహింపనిచో ఆ ఆరాధనము నిష్ఫలమగునని చెప్పుదురు) పిదప ఈ తీర్థమును భక్తుడు ముమ్మారు గ్రహించవలెను. పిదప శిరస్సు కన్నులు మున్నగువాటిపై చల్లుకొనవలయునని చెప్పబడియున్నది.

శో॥ ప్రాశనం విష్ణుపాద్యస్యత్రి : ఖల్వాక్తం చతుర్ముఖ।
ఆద్యస్తయో: ప్రోక్షణం స్యాద్గంధపుష్పాణి ధారయేత్ ॥

శ్రీ పాద తీర్థమును గూర్చి శ్రీ వారిచే ఇట్లు చెప్పబడియున్నది.

శ్లో॥ భగవత్పాదతీర్థంతు నిత్యం యః పిబతేనరః।
ఆరోగ్యవాన్ సదాభూత్వాసాయుజ్యం లభతేమమః॥

శ్లో॥ సాలగ్రామ శిలావారి తులసీదళసంయుతమ్ ।
సర్వరోగాదిశమనం సర్వపాపహరం భవేత్ ॥

శ్లో॥ అకాల మృత్యుహరణం సర్వవ్యాధినివారణమ్ ।
సర్వపాపక్షయకరం విష్ణు పాదోదకం శుభమ్ ॥(ప.పు.సంహిత)

*అర్థం:-* శ్రీ పాదతీర్థమును పరమ భక్తితో సేవించిన భక్తుడు సంపూర్ణ ఆరోగ్యము కలిగి ఇహలోకసుఖములననుభవించి (మరణించినవాడు గాని, జీవన్ముక్తి పొందిన వాడు గాని) చివరకు తన సన్నిధిని చేరుదురు.

తులసీదళ మిశ్రితమైన సాలగ్రామ అభిషేకతీర్థమును సేవించిన సర్వరోగములను, సర్వపాపములను పోగొట్టును.

శ్రీపాదతీర్థము అకాల మృత్యువును హరించును. సర్వవ్యాధులను పోగొట్టును. సర్వ పాపములను ఉపశమింపజేయును.

శ్రీమన్నారాయణునికి నివేదించుటచే కల్గిన దివ్యమైన స్పర్శవలన, పై చెప్పబడిన గుణములు కల్గిన ఓషధీ ద్రవ్యసంయోగము వలన, భగవదనుగ్రహము వలన ఈ శ్రీపాదతీర్థమును భక్తితో, నిష్కల్మషమైన మనస్సుతో పరిగ్రహించిన మానవుడు ఈ భూలోకము నందు సుఖ శాంతులతో నుండుటయేగాక, పాపకర్మక్షయమై భగవత్సాయుజ్యము కూడా పొందును.

శ్రీ హరికి, శ్రీ కృష్ణునికి - సమర్పించుపుష్పములన్నింటిలో ఎక్కువ ప్రీతికరమైనది తులసి పువ్వు. తులసిపువ్వు దొరకని యెడల తులసీదళములతోను, అవియూ లభించనిచో కొమ్మల ముక్కల చేతను పూజించిన శ్రీ హరి, శ్రీ కృష్ణులకు సంతోషమందురు. తులసి పువ్వు, దళములు, వేర్లు, కొమ్మలు ఇవి ఏవియూలభించని యెడల తులసి చెట్టు యుండు స్థలము నందలి మట్టిని గ్రహించి దానితో భక్తి పూర్వకముగ పూజించిన శ్రీ కృష్ణుని అనుగ్రహమునకు పాత్రులగుదురు.

శ్రీతులసిచెట్టు చుట్టూ యోజన దూరము వరకు గాలి పరిశుభ్రమై యుండును. పరిసరప్రాంతమంతయూ పరమపావనమైన స్థలముగ చెప్పబడి యున్నది. యమకింకరులు అచ్చోటికి రారని యందురు. తులసి వనమున శవమెంతకాలమున్నను చెడిపోదని మన శాస్త్రము ఘోషించు చున్నది. ఆధునిక రసాయన శాస్త్రజ్ఞులు కూడా నిజమని ధృవీకరించి యున్నారు. తులసి సత్త్వగుణ స్వరూపమైనది. దీనిని సేవించుట వలన మానవులకు సత్త్వగుణము కల్గుచున్నది.

ఒక గృహము నందు వాసము చేయువారు శైవులా, వైష్ణవులా యని తెలుసుకోవలయుననిన ఈ తులసి వలన తెలుసుకోగలుగుచున్నాము. వైష్ణవుల గృహము నందుండు బృందావనమే దీనికి తార్కాణము. తులసి కోటలేని వైష్ణవులు మన దేశమున లేరనియే చెప్పవచ్చును. కానీ ఈ కాలమున నవనాగరికతా వ్యామోహమునకు లోనై మంచి వైష్ణవులు కూడా తులసి కోటను పెట్టుట మరిచినారు. మన పూర్వీకులు బంధువులను, పెద్దలను, గురువులను, గొప్పవారిని దర్శించుటకు పోవునప్పుడు తులసిని తీసుకొని పోయి వారికిచ్చు ఆచారము కలదు. ఇందు వలన వారు తమపై గౌరవము, ప్రేమతో యుందురనియూ, మనఃక్లేశమును పోగొట్టి సంతోషమును, ఉత్సాహమును కల్గించును. సూక్ష్మ క్రిములచే వ్యాప్తిచెందు రోగములు తులసి వాసనచే ధ్వంసము చేయబడును. అంటు రోగములను రాకుండా కాపాడును.

దక్షిణ భారత దేశమున వడలూరు శ్రీ జ్యోతిరామలింగస్వాముల వారిచే రచింపబడిన 'తిరుఅరుట్పా' అను గ్రంథము నందు తులసి సకల దోషములను పోగొట్టు ననియూ, సత్తును (జసదమను) సున్నము చేయునని చెప్పియున్నారు. నాగుపాము కాటునందు ప్రయోగించ బడుచున్నది. లోహములను సున్నము చేయుశక్తిగల ఓషధులు మహా ప్రశస్తమైనదని నిశ్చయముగ, నిస్సందేహముగ చెప్పవచ్చును. ఉత్తర భారత దేశము నందు తులసీరామాయణము శ్రేష్ఠమైనదిగ పరిగణించబడినది. తులసీ రామాయాణ పారాయణము సుప్రసిద్ధమైనది.

భారత దేశమునందనేకగ్రంథములందు తులసిని గురించి విశేషముగ వివరించ బడియున్నవి. అందు ముఖ్యమైన గ్రంథములు 1. మహాభారతము 2. దేవిభాగవతము, 3. తులసీగీత 4. రామరహస్యోపనిషత్తు, 5. మత్స్యసూక్తము 6. స్కాంధపురాణము 7. గరుడ పురాణము 8. పద్మపురాణము 9. బ్రహ్మవైవర్తపురాణము 10. హరిభక్తివిలాసము 11. అగస్త్యసంహిత 12. మహాభాగవతము మున్నగునవి. తులసిని గూర్చి పై గ్రంథములలో చెప్పబడిన విషయములను సమకూర్చినచో అదే ఒక

శ్రీ తులసి చెట్టును నాటుట, నీరుపోయుట, పోషించుట, స్పర్శించుట మరియు ఇతర విషయములపై వివిధగ్రంథములలో చెప్పబడినవాటిని చూడుడు.

ఆయుర్వేదశాస్త్రము, మంత్ర శాస్త్రములందు 'అష్ట బిల్వము'లని పిలువబడు ఎనిమిది మహౌషధులలో తులసికి ప్రథమ స్థానము ఇవ్వబడినందువలన తులసి యొక్క ప్రాధాన్యతను తెలియచేయుచున్నది.

శ్లో ॥ తులసీ బిల్వనిర్గుండీ అపామార్గకపిత్థకా ।
శమీచామలకం దూర్వాఅష్టబిల్వప్రకీర్తితా ॥

*అర్థం:-* తులసీ, మారేడు, వావిలి, ఉత్తరేణి,వెలగ, జమ్మి, ఉసిరిక, గరిక, ఈ ఎనిమిది అష్టబిల్వములనబడును. వీటినే మంత్రశాస్త్రమందు అష్ట కర్మమూలికలుగ చెప్పబడియున్నది.

తులసీదళములందు శ్రీ లక్ష్మి, శ్రీగాయత్రి, శ్రీ సరస్వతి వాసము చేయుదురని పెద్దల వాక్కు. తులసి స్పర్శన, దర్శన, సేవన అనువాటివలన మానవులకు సత్వగుణము సిద్ధించును. తులసి చెట్టు యొక్క శాఖలయందు అష్టదిక్పాలకులు, పత్రకాండమునందు శివుడు, మధ్యభాగమున కేశవుడు, కొనలయందు బ్రహ్మ వాసము చేయుదురని ఋషి ప్రోక్తము. తులసి చెట్టు కొనలయందు సర్వ వేదములు, మధ్యన సర్వ దేవతలు, వేళ్ళయందు సర్వ తీర్థములు కలవందురు.

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యేసర్వ దేవతాః ।
యదగ్రే సర్వవేదాశ్చ తులసీంతాంనమామ్యహమ్ (అర్థం పై చెప్పినదే)

శ్లో ॥ తులసీ రోపితాసిక్తా దృష్టాస్పృష్టాచ పావయేత్ ।
ఆరాధితాప్రయత్నేన సర్వ కామ ఫలప్రదా ॥ (తులసీగీత)

*అర్థం:-* శ్రీతులసిని భక్తితో నాటినను, నీటితో తడిపినను, భక్తితో చూచినను, వినయముతో తాకినను, పవిత్రముగ ఆరాధించినచో సర్వకామములను ప్రసాదించును.

శ్లో॥ తులసీస్పర్శనం స్నానం తులసీస్పర్శనం తపః।
తులసీ స్పర్శనం ముక్తిః తులసీస్పర్శనంవ్రతమ్॥ (మహాభాగవతము)

అర్థం :- శ్రీతులసిని తాకిననే స్నానము చేసినంత పరిశుభ్రతకల్గును. తులసిని తాకుటవలన తపస్సు చేసినంత ఫలము కల్గును. తులసిని తాకుట వలన ముక్తి కలుగును. తులసిని తాకుటవలన వ్రతము చేసినంత ఫలము లభించును.

శ్లో॥ ప్రదక్షిణంకృతం యేన తులసీమునిసత్తమ।
కృత ప్రదక్షిణస్తేన విష్ణు ప్రాప్తాన్న సంశయః ॥

అర్థం:- ఓమునిశ్రేష్ఠా ! శ్రీ తులసి చెట్టుకు షోడశోపచార పూజలు చేసి ఎవడు ప్రదక్షిణము చేయునో అతడు ప్రత్యక్షముగ, స్వయముగ శ్రీ విష్ణువునకే ప్రదక్షిణ చేసినంత ఫలమును పొందుచున్నాడు.

శ్లో॥ తులసీ కాననం యత్రయత్ర పద్మవనానిచ।
పురాణపఠనం యత్ర తత్ర సన్నిహితోహరి ః ॥

అర్థం :- ఏ ప్రదేశమునందు తులసీవనము యుండునో, మరియూ తామర తటాకము (పద్మవనము) లుండునో, యెచట తులసిని గురించిన పురాణ పఠనము జరుగునో ఆప్రదేశము నందు శ్రీహరి స్థిరముగ, స్థిమితముగ వాసము చేయును.

శ్లో॥ తులసీ సన్నిధౌప్రాణాన్యేత్యజంతి మునీశ్వరః।
నతేషాం నిరయక్లేశః ప్రయాంతి పరమంపదమ్ ॥

అర్థం :- శ్రీ తులసి చెట్టు సమీపమున ఎవరైతే ప్రాణమును వదులుదురో వారికి నిశ్చయముగ నరక ప్రాప్తికలుగదు. వారికి వైకుంఠప్రాప్తి తప్పక ప్రాప్తించుననుటలో సందేహము లేదు.

శ్లో॥ శ్రీ రామసన్నిధౌ మౌనీమంత్రార్థమను చింతయన్।
వ్యాఘ్రచర్మాసనే స్థిత్వా స్వస్తికాద్యాసనం క్రమాత్ ॥
తులసీ పారిజాత శ్రీ వృక్ష మూలాదిక స్థలే।
పద్మాక్షతులసీ కాష్ఠ రుద్రాక్షకృత మాలయా॥
మాతృకామాలయామంత్రీమనసైవ మనుంజపేత్।
తతః సిద్ధమను ర్జ్ఞాత్వా జీవన్ముక్తోభవేన్మునిః ॥

అర్థం :- శ్రీరామసన్నిధి, మౌనవ్రతము, మంత్రార్థమును చింతించువాడు, పులితోలు ఆసనముగ కల్గిస్వస్తికాసనము నందు జపము చేయువాడు, తులసీ, పారిజాతము బిల్వము - వీటి వేళ్ళుయుండు స్థలము, తామర పూసలు, తులసీ కాష్ఠము, రుద్రాక్షల - వీటితో చేసిన మాలలు మున్నగునవి మంత్ర సిద్ధికి అనుకూలములని చెప్పబడినది వీటితో చేయు పురశ్చరాదుల వలన మానవుడు మంత్రసిద్ధుడై జీవన్ముక్తుడగును.

శ్లో॥ నదీతీరే శ్మశానేచ ఊషరే మ్లేచ్ఛసన్నిధౌ।
ఏషువైరోపణం కృత్వాయాతికర్తా యమాలయమ్ ॥

అర్థం:- శ్రీ తులసిని నదీతీరమునందు, శ్మశానములందు, చవుడు భూములందు మ్లేచ్ఛుల సన్నిధి యందు (తులసిచెట్లను) నాటి పెంచరాదు. ఈ నిబంధనకు మారు తులసిని నాటి పెంచిన వారు తప్పక యమలోకమునకు బోవుదురు.

శ్లో॥ గృహాస్యే శాన్యపురతః ఖనిత్వాతాల మాత్రకమ్।
పంచగవ్యమయూరాండం క్షిప్త్వా తత్రదినాగమే ॥

రోపయిత్వానిశా భాగే సూత్రే నావేష్ట్య సప్తధా।
తున్మూలే పిండికాంకృత్వా హస్తమాత్ర సువర్తులామ్ ॥

అర్థం :- శ్రీ తులసిని తన గృహమునందు నాటి పెంచవలయుననినచో గృహమునకు ఈశాన్యమూల స్థలమునందునొక తాలప్రమాణము అనగా ఒక జానెడు లేక 9 అంగుళముల ప్రమాణము చదురముగ త్రవ్వి పంచగవ్యమును అనగా గోమూత్రము, గోమయము, ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి - వీటిని కలిపి అందు మయూరాండమును జల్లి, ( ఇచ్చట కొందరు గ్రంధ కర్తలు మయూరాండమును నెమలి గుడ్లు అని చెప్పియున్నారు. యిది సరికాదని మామనవి ! ఏలనగా మయూర అండములను జల్లిన తులసి ఎట్లుపుట్టును కావున అది తప్పు మయూరాండము అనగా శ్రీ తులసి గింజలు ) అనగా తులసీ గింజలను వెదజల్లిచెట్టునైనా పిలక గాని చెట్టును నాటినగాని (ఈ కార్యమును మంచి శుభ దిన శుభముహూర్తమున, ఉదయమునసే చేయవలయునని పెద్దలు చెప్పియున్నారు.) నాటిన రాత్రి పూట, మంచి దారముతో ఏడు చుట్లు చుట్టి దాని మొదటి యందు నొక హస్తప్రమాణము ( ఒక మూర లేక 1/2 అడుగు) గుండ్రముగ పాదుచేసి దానిపై జతుపెష్ట్రణ వేదికను నిర్మించవలెను. పరమభక్తుడైన వాడు ఆపాదులో మంచి నీరును ధారగ పోసి, పిదప షోడశోపచార పూజ చేసి, మరియూ 'శ్రీ తులస్యైనమః' అను మంత్రముతో అర్ఘ్యప్రదానము చేయవలయును. శంఖతీర్థము, గరిక, అక్షతలు, చందనము, దర్భకొనలు, పుష్పములు మున్నగువానితో అర్ఘ్యమీయవలయును.

శ్లో॥ దేవీ విష్ణుప్రియేమాతాస్తులసి ప్రియదర్శనే।
హరిదర్శన దీపార్చిః ప్రసీద ద్విజవల్లభే॥

ఈ మంత్రమును పఠించుచు తులసిని దర్శించవలయును.

శ్లో॥ విష్ణుప్రీతికరే మాతుర్నమస్తే తులసీశ్వరి।
పవిత్రీ కురుమే ఉంగాని విష్ణ్వంగ హర్షకారిణి ॥

ఈ మంత్రమును పఠించుచు సాష్టాంగప్రమాణము చేసి ప్రదక్షిణము చేయునప్పుడు తులసి చెట్టు నీడను దాటరాదందురు.

శ్లో॥ వైకుంఠ పాదబ్జవాసినీ ప్రియదర్శినే।
స్పృశామిత్వాం మహాపాప సంచయాన్మే ప్రణాశయ॥

ఈ మంత్రమును పఠించుచూ స్పృశించిన భక్తుల మహాపాపములను పోగొట్టి ముక్తికల్గించును.

పిదప :-

శ్లో॥ మాతస్తులసికల్యాణి స్థలంతే సమనోహరమ్ ।
క్రీడంత్యాగతా విబుధామార్జయేతత్ ప్రసీదమే॥

పిదప తులసీ మాడము చుట్టూ నాలుగు దిక్కులందు నాలుగు చేతుల వరకు బాగుగ చిమ్మి గోమయముతో అలికి, ముగ్గు పసుపు కుంకుమలు పెట్టి మనోహరముగా యుండునట్లు, అలంకరించవలయును. అలంకరించిన పిదప 'ఓం శ్రీ తులస్యైనమః' అను మంత్రమును అష్టోత్తరశతము జపము చేయవలయును.

శ్లో॥ తులస్యమృత జన్మాసి సదాత్వం కేశవప్రియే।
కేశవార్థంలునామిత్వాం వరదా భవశోభినీ॥
త్వదంగ సంభవై పత్రైః పూజయామి యథాహరిమ్।
తథాకురు పవిత్రాంగం కలౌమలవినాశినీ॥

ఈ స్తోత్రమును పఠించుచూ "తల్లీ! తులసీ! శ్రీ హరి పూజకై నిన్ను పరిగ్రహించు చున్నాను, నీ పవిత్రమైన అంగములచే ఈ కలియుగ మలమును వినాశనము గావింపుము" అని ప్రార్థించవలెను.

శ్లో॥ మోక్షైక హేతోర్ధరణి ప్రసూతే విష్ణోస్తమస్తస్య గురోః ప్రియతే ।
ఆరాధనార్థ పురుషోత్తమస్యలునామి పత్రం తులసీక్షమస్య॥
ప్రసీదమమ దేవేశిప్రసీద హరివల్లభేక్షీరోదమదనోద్భూతే తులసీ త్వమ్
-ప్రసీదమ్ ।

ఈ మంత్రమును పఠించుచూ తులసీదళములను గ్రహించవలయును ఓతులసీ! నీవే మోక్షమునకు కారణభూతవు. విష్ణువునకు, పరమగురువులకు ప్రియమైనదానివి. నిన్ను ఆపురుషోత్తముల నారాధనకై పరిగ్రహించుచున్నాను. నీవు క్షీరసాగరమునను మథించినపుడు జన్మించిన దానివి, శ్రీ హరికి ప్రియమైన దానివి నన్ను అనుగ్రహింపుము, యని పత్రములను గ్రహించవలయును.

మరియొక తులసీ చయన మంత్రము: -

శ్లో॥ మాతాస్తులసీ గోవిందహృదయానందకారిణీ।
నారాయణస్యపూజార్థంచినోమిత్వాం నమోస్తుతే॥
కుసుమైః పారిజాతాద్యైః సుగంధైరపి కేశవః।
త్వయావినానైవ తృప్తిః చినోమిత్వామతః శుభే ॥
త్వయావినామహాభాగే సమస్తం కర్మనిష్ఫలమ్।
అతుస్తులసీదేవిత్వాం చినోమి వరదాభవ ॥
చయనోద్భవ దుఃఖం యద్దేవితేహృది వర్తతే ।
తత్క్షమస్యజగన్మాతస్తులసిత్వాం నమామ్యహమ్॥

అర్థం :- ఓ తల్లీ! తులసీ! శ్రీ మన్నారాయణుని పూజకై నిన్ను గ్రహించుచున్నాను. పారిజాతాదిపుష్పములతోను, సుగంధ పరిమళములతోను ఆకేశవుని పూజించుటకై నిన్ను

పరిగ్రహించుచున్నాను. సకల క్షయములను, దుఃఖములను రానీయకుండుటకై, నిన్ను పరిగ్రహించు చున్నాను. ఓ జగన్మాతా ! నన్ను క్షమింపుము. అను యర్థము కల్గిన పై శ్లోకమును పఠించుచు తులసీదళములను గ్రహించవలెను.

తులసిని స్నానము చేయక తాకారాదు.

తులసిని పాదుకలుదరించి యున్నవారు తాకరాదు.

తులసిని పశ్చిమ ముఖముగ యుండి గ్రహించరాదు.

తులసిని దక్షిణముఖముగ యుండి గ్రహించరాదు.

తులసిని అమావాస్య, పూర్ణిమతిధులందు తాకరాదు.

తులసిని ద్వాదశి తిధియందుతాకరాదు.

తులసిని సాయంకాలమున, రాత్రిపూట తాకరాదు.

తులసిని ఆది, మంగళ, గురు, శుక్రవారములందు కోయరాదు.

తులసిని శ్రవణానక్షత్రమునాడు కోయరాదు.

తులసిదళములను గోటితో కోయరాదు.

శ్లో॥ అకాలే తులసీపత్రం ఛేదయేద్యస్సవై పుమాన్।
పత్రాదేకాబ్రహ్మత్యాసో ఉవశ్యం నరకం వ్రజేత్ ॥

అర్థం:- కాలముకాని కాలములందు తులసి దళములను గ్రహించినచో బ్రహ్మహత్యాపాపమును పొంది నరకప్రాప్తి కల్గును. కావున పై చెప్పిననియుమములను పాటించవలెను.

శ్లో॥ తులసీదళ లక్షేనయోఽర్చయేత్ ద్వారకా ప్రియమ్।
జన్మాయుత సహస్రాణాం పాపస్య కురుతేక్షయమ్॥ (స్కాందపురాణం)

అర్థం:- శ్రీ ద్వారకా నాధుడైన శ్రీ కృష్ణుని లక్షతులసీదళములతో నర్చించిన పదివేల సహస్రజన్మములందు చేసిన పాపమునశించును.

శ్లో॥ తులసీదళలక్షేనకార్తికే యోఽర్చయోద్ధరిమ్।
పత్రే పత్రేమునిశ్రేష్ఠ మౌక్తికం లభతే ఫలమ్॥(పద్మపురాణము)

అర్థం:- శ్రీ హరిని కార్తిక మాసమున లక్ష తులసీదళములతో అర్చన చేసిన పత్రపత్రమునకు ముక్తి ఫలము లభించును.

శ్లో॥ తథాచ తులసీ పత్ర భక్షణాద్భావవర్జితః।
పాపోఽపి సద్గతిం ప్రాప్త ఇత్యేతదపి విశ్రుతమ్ ॥(స్కాంద.పు.)

అర్థం :- మహాపాపములు చేసిన వాడు, భక్తియనునది కొంచెమైనను లేనివాడు, తులసీ పత్రములను దానిప్రభావము తెలియక భక్షించినను సద్గతి చెందును.

శ్లో॥ చంద్రాయణ సహస్రస్య పరాకాణాం శతస్యచ ।
నతుల్యం జాయతే పుణ్యం తులసీ పత్రభక్షణాత్ ॥( స్కాం. పు.)

అర్థం:-వేయి చంద్రాయణ వ్రతములు, నూరుపరాక్రత్యములు చేసిన కల్గు పుణ్యము తులసీ పత్రమును భక్షించినంత పుణ్యమునకు సమానము కాదు.

శ్లో॥ కృత్వాపాపసహస్రాణి పూర్వేవయసిమానవః।
తులసీభక్షణాన్ముచ్యేత్ శ్రుత మేతం పురాహరేః॥ (స్కాం.పు.)

అర్థం:- మానవుడు యుక్తవయస్సులో ఖండకావరమున చేసిన వేయిపాపములను పిదప భక్తితో తులసీ భక్షణము చేసినచో పాపవిముక్తుడగును.

శ్లో॥ అస్నాత్వాతులసీం ఛిత్వాయః పూజాంకురుతే నరః।
సోఽపరాధీభవేత్ సత్యం తత్సర్వం నిష్ఫలం భవేత్॥

అర్థం:- మానవుడు శుభ్రముగ స్నానము చేయక తులసిని గ్రహించి పూజచేసిన అత అపరాధి యగును. అతనుచేసిన పూజ యంతయూ నిష్ఫలమై బూడిదలోపో పన్నీరగును.

శ్లో॥ గయాశ్రాద్ధఫలం దాతుః పితౄణాం పరితోషదమ్।
తత్ఫలంస్యాచ్ఛతగుణం తులసీ పత్రదానతః॥(శ్రీ బృ.బ్ర.పు)

అర్థం:-గయలో శ్రాద్ధము చేసినచో పితృదేవతలు మిక్కిలి సంతోషించుదురు. క తులసీదళమును దానముచేసిన, అంతకంటే నూరింతలు అధిక ఫలము కల్గును.

శ్లో॥ యోధృత్వాతులసీ పత్రం శిరసావిష్ణుతత్పరః।
కరోతి సర్వకార్యాణి ఫలమాప్నోతి చాక్షయమ్॥

అర్థం:- శ్రీ విష్ణుభక్తుడు భక్తితో తులసిని శిరస్సున ధరించి సర్వకార్యము చేయుచుండునో యతడు అక్షయఫలమును పొందును.

శ్లో॥ తులసీ మంజరీభిర్యః కుర్యాద్ధరి హరార్చనమ్।
నసగ్గర్భగృహం యాతి ముక్తిభాగీభవేన్నరః॥ (శ్రీ.బృ.బ్ర.పు.)
(హ.భ.

అర్థం:- తులసీ లేత దళములతో గాని, పుష్పగుచ్ఛముతో గాని హరి హరాదు అర్చించిన మరల గర్భమను గృహమున ప్రవేశించడు. ఈ భూప్రపంచమున జన్మనెత్త జీవన్ముక్తిని పొందును.

శ్లో॥ గంగాద్యాః సరితః సర్వాబ్రహ్మవిష్ణుమహేశ్వరాః।
దేవైస్తీర్థైః పుష్కరాద్యైస్తిష్ఠంతి తులసీదళే॥

అర్థం:- గంగ, యమున, సరస్వతి మున్నగు సర్వనదులు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు సకల దేవతలు, సకల పుష్కరాదితీర్థములు తులసీదళము నందు యున్నవి. తు దళము నాశ్రయించియే యుండును.

శ్లో॥ పుష్కరాద్యాని తీర్థాని గంగాద్యాః సరితస్తథా।
వాసుదేవాదయోదేవాః వసంతీ తులసీదళే॥

అర్థం:- పుష్కరాది సర్వతీర్థములు, గంగ, యమున, సరస్వతీ మున్నగు సర్వపుణ్యానదులు, వాసుదేవాది దేవతలు తులసీ దళమునందు వాసము చేయుదురు.

శ్లో॥ యత్రైవ తులసీ వృక్షస్తిష్ఠతి ద్విజసత్తమ।
తత్రైవ త్రిదశాః సర్వే(ర్బ్ర)హ్మ విష్ణు శివాదయః॥

అర్థం :- (ఓ! ద్విజసత్తమా) ఓ! బ్రహ్మణ శ్రేష్ఠుడా! ఏ స్థలమునందు తులసీ వృక్షము యుండునో ఆ స్థలము నందు సర్వదేవతాగణములు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నివసించుదురు.

శ్లో ;- హిత్వాతీర్థసహస్రాణి సర్వానపిశిలోచ్చయాన్।
తులసీకాననే నిత్యం కలౌతిష్ఠతి కేశవః ॥

అర్థం:- ఈ భూలోకమునందలి వేల కొలది పుణ్యతీర్థములను, సకల పర్వతములనువిడిచి కలియుగమున శ్రీహరి తులసీవనమునందు స్థిరముగ ప్రతినిత్యము నివాసము చేయుచుండును.

కావున బృందావనము శ్రీ హరివాసముచే దర్శించిన వారి సర్వపాపములను నశింపచేయును. తులసీవనమును నాటి, పెంచిన వారితో యమునికి పనిలేదు, బృందావనముపైనుండి వీచుగాలి ఎంతదూరము పయనిమంచునో అంతదూరము వరకు ఆప్రదేశము పవిత్రమగును. ఉదయముననే దేనిని చూడక తులసిని దర్శించిన పూర్వదినము తెలియక చేసిన పాపము నశించును.

శ్లో॥ కృతం యేన మహాభాగతులసీ వనరోపణమ్ ।
ముక్తిస్తేన భవేద్దత్వా ప్రాణినాం వినతాసుత ॥(గరుడపురాణం)

అర్థం:- ఓ! మహాభాగా! గరుత్మంతుడా! తులసీవనమును వేసి, పెంచిన వాడు సకల ప్రాణులకు ముక్తి దాతయగును.

శ్లో॥ తులసీకాననే యస్తు ముహూర్త మపివిశ్రమేత్ ।
జన్మకోటికృతాత్ పాపాన్ముచ్యతే నాత్రసంశయః॥ (గ.పు)

అర్థం:- తులసీ వనమునందు ఒక ముహూర్త కాలము విశ్రమించినచో కోటి జన్మముల నుండి చేయుచువచ్చిన పాపమునశించును. ఇచ్చట మనము చింతించ వలసిన దేమనగా తులసీ వనమునందు విశ్రమించిన వానికి తులసిమీదనుండి వీచు గాలిని పీల్చుచున్నాడు. అప్పుడతనిశ్వాస కోశము, హృదయములలో పరిశుభ్రమైన ప్రాణవాయువు చేరి, అతని మనస్సును పరిశుభ్రము చేయును. అప్పుడతనికి తాను చేసిన పాపములు, తప్పులు గుర్తించి పశ్చాత్తాపము జెందును. పశ్చాత్తాపము చెందిన వాడు పరివర్తనకులోనై పాపములను చేయుటను విడచిపెట్టును. పశ్చాత్తాపమునకు మించిన ప్రాయశ్చిత్తము వేరేదియూ లేదందురు. అందు వలననే దైవాంశ సంభూతుడైన శ్రీ కృష్ణుడు ప్రతిదినము బృందావనములో విహార, విశ్రమములు చేయుచుండెడివాడు.

శ్లో॥ తులసీ కాష్ఠసంభూతం శిరసోయస్యభూషణమ్ ।
బాహ్వోః కరేచ మర్త్యస్య దేహేతస్య సదాహరిః॥

అర్థము:- తులసీ కాష్ఠము అనగా కఱ్ఱతో చేసిన పూసలమాల ఎవరి శిరస్సున, భుజమున, చేతికి ఆభరణ భూషణముగ నుండునో వారి శరీరము నందేగాక హృదయమునందు శ్రీ హరి ఎల్లప్పుడు వాసము చేయును.

శ్లో॥ తులసీ కాష్ఠమాలాంచ కంఠస్థాంవహతే తుయః॥
అప్యశౌచో౽ప్యనాచారో మామేవైతి నసంశయః॥(వి.ధ)

అర్థము:- తులసీ కాష్ఠము ( కఱ్ఱతో) తో చేసిన పూసల మాలను ఎవరైతే తన కంఠమున ధరించునో వారు అశుచియయినను, అనాచారియైనను, ముక్తి పొందు చున్నాడు. అనగా పరమేశ్వరుని చేరుచున్నాడు.

శ్లో॥ శయనే భోజనే చైవ మలమూత్రవిసర్జనే।
నత్యజేత్ తులసీ మాలాం త్యాగేచ బ్రహ్మహాభవేత్॥

అర్థము:-భోజనము చేయునపుడు, శయనించునపుడు, మలమూత్రములు విడుచునపుడు. తులసీ కాష్ఠమాలను తీసివేయరాదు. ధరించియే యుండవలయును. అట్లు తీసివేసిన బ్రాహ్మహత్యాపాపము కలుగును.

శ్లో॥ స్నానే, మూత్రపురీషేచ మైధునే పాపకర్మసు।
నత్యజేత్ తులసీ మాలాం త్యాగేచ బ్రహ్మహాభవేత్॥ (స్కం.స)

అర్థము:- స్నానము చేయునపుడు, మల మూత్రములు విసర్జించునపుడు, మైధునము చేయునపుడు - యిట్టి సమయములందు కూడా తులసీ మాలను విడువరాదు. విడిచినచో బ్రహ్మహత్యాపాపము చేసినంతటివాడగును.

శ్లో॥ యద్యేకంతులసీ కాష్ఠం మధ్యేకాష్ఠంచయస్యహి।
దాహకాలే భవేన్ముక్తిః పాపకోటి యుతస్యచ ॥

అర్థము :-మరణించిన వానిని కఱ్ఱల మధ్య యుంచి అందు ఒక తులసీ కాష్ఠమునుంచి దహనము చేసినచో అతడు చేసిన కోటి పాపములను తులసీ కాష్ఠ దహనముతో పోగొట్టి ముక్తిని ప్రసాదించును.

శ్లో॥ యజ్ఞోపవీత వద్ధార్యాకంఠే తులసి మాలికా।
క్షణ మాత్రే పరిత్యాగాద్విష్ణుద్రోహీభవేన్నరః॥

అర్థము:- సద్బ్రాహ్మణుడు ఎట్లు యజ్ఞోపవీతమును సదాధరించి యున్నాడో ఆవిధముగ తులసీ మాలను కంఠమునందు ధరించవలెను. అట్టివాడు సద్బ్రాహ్మణుడగును. క్షణమాత్రము విడిచిననూ విష్ణుద్రోహియగును.

శ్లో॥ తులసీ గంధ మాదాయ యత్ర గచ్ఛతి మారుతః॥
దిశోదశసు నాత్యాశు భూతగ్రామాంశ్చతుర్విధాన్ ॥

అర్థం :- శ్రీ తులసి యొక్క సువాసనను వాయువు ఎంత దూరము తీసుకొని పోవునో అంత దూరము దశదిక్కులయందుండు నాల్గువిదములైన భూతసముదాయములు పవిత్రములై పోనికల్గించవు.

శ్లో॥ తులసీకాననంచైవ గృహేయస్యావతిష్ఠతే।
తద్గృహంతీర్థభూతం హినాయాంతి యమకింకారా॥

అర్థము:- ఎవరి గృహము నందు తులసీ వనముండునో ఆ గృహము సర్వతీర్థస్వరుపమే యగును. యమకింకరులు అచ్చోటికి రారు.

శ్లో॥ యస్యస్యాత్ తులసీ పత్రం ముఖేశిరసికర్ణయో:॥
మృత్యుకాలే ద్విజశ్రేష్ఠతస్య స్వామీనభాస్కర:॥

అర్థం:- తులసీ పత్రములు మృత్యుకాలమున నెవని ముఖమున, శిరస్సున, కర్ణములయందుండునో అతనిపై యమునికి అధికారము లేదు, అతను ముక్తిపొంది వైకుంఠమునకు పోవును.

శ్లో॥ సాత్వత్తై స్తులసీ కాష్ఠమాలకుంజసముద్భవా।
ధార్యానిత్యం ప్రయత్నేనత్వే తద్భక్తస్యలక్షణమ్॥

అర్థము:- తులసీకట్టెలతో చేసిన పూసల మాలను నిత్యము సర్వకాల సర్వావస్థల యందును ధరించుట పరమ భక్తుల లక్షణము.

శ్లో॥ హరిభక్తస్య తులసీ కుంజ కాష్ఠోద్భవా।
చిహ్నార్థ మాత్మనో మాలాపురాకృష్ణే నదర్శితా ॥ (బ్ర.వై)

అర్థము :- శ్రీ హరి భక్తునికి తులసీ కాష్ఠమణి మాలా ధారణము, అతడు శ్రీ హరి భక్తుడనుటకు చిహ్నార్థమని శ్రీ కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ సన్నివేద్యైవ హరయేతులసీ కాష్ఠ సంభవామ్।
మాలాం పశ్చాత్ స్వయం ధత్తేసవై భాగవతోత్తమః॥ (స్కా.పు)

అర్థము :- తులసీ కట్టె పూసలతో చేయబడిన మాలను శ్రీ హరికి సమర్పించి పూజించి పిదప ఆమాలను ఎవడు ధరించునో యతడు భాగవతోత్తముడు అగును.

శ్లో॥ యఃపునస్తులసీమాలాం కృత్వాకంఠేజనార్దనమ్।
పూజయేత్ పుణ్యమాప్నోతి ప్రతిపుష్పం గవాయుతమ్॥

అర్థం :- తులసీ పూసల మాలను ఎవడైతే కంఠమున ధరించి, పుష్పములతో జనార్దనుని పూజించునో అతడు సమర్పించిన ప్రతి పుష్పమునకు బదివేల గోదానములు చేసినంత పుణ్యము వచ్చి చేరును.

శ్లో॥ తులసీ కాష్ఠమాలాభి భూషితో భ్రమతో యది।
దుస్స్వప్నం దుర్నిమిత్తంచ నభయం శస్త్రజం క్వచిత్ ॥ (స్కా.గు.పు)

అర్థము:- సదాతులసీ కాష్ఠమాలను కంఠమున భూషణముగ ధరించి తిరుగు వానికి దుస్వప్నములచే, దుశ్శకునములచే, ఆయుధములచే భయము ఎల్లవేళలా కలుగదు.

శ్లో॥ తులసీ మృత్తికాపుండ్రం యోమృత్యు సమయేవహేత్।
సముక్తస్సకలైః పాపైః పురంగచ్ఛతి చక్రిణః ॥

అర్థము :- తులసీ వనమునందు తులసీ మూల మందుండు మట్టిని (మృత్తికను) గ్రహించి ఎవడైతే ముఖమునందు విభూది వలె లేక బొట్టుగ పెట్టు కొనిన, వాడు సమస్త పాపవిముక్తుడై శ్రీ హరిని చేరుచున్నాడు.

# తులసీ మహాత్మ్యము

శ్రీ తులసీ దేవియొక్క మహిమను తెలియజేయు గ్రంథములలో పద్మపురాణము, స్కాంధపురాణము, గరుడపురాణము, బ్రహ్మవైవర్త పురాణము, శ్రీ బృహద్బ్రహ్మపురాణము, కాలికా పురాణము, బ్రహ్మ నారదీయము, బృహన్నారదీయము, మత్స్యసూక్తము, తులసీగీత, శ్రీ మహాభాగవతము, దేవీ భాగవతము, వాసుదేవోపనిషత్తు, రామరహస్యోపనిషత్తు, అగస్త్యసంహిత, విష్ణు ధర్మోత్తరము మరియూ యింకయూ అనేక పురాణములు, గ్రంథములు ముఖ్యములైనవి గలవు.

ఇందు కొన్ని గ్రంధములందు తులసీమహాత్మ్యమును గురించి చెప్పబడిన వాటిని తెలియజేయుచున్న దానిని చూడుము.

**శ్రీ మహాభాగవతమున తులసీ మహాత్మ్యము:-**

శ్రీ తులసీ మహాత్మ్యమును చెప్పమని నారదమహర్షి ప్రార్థించగా శ్రీ మహాదేవుడు చెప్పినట్లు వివరించబడియున్నది.

**నారద ఉవాచ:-** (నారదమహర్షి అడుగుచున్నాడు)

శ్లో॥ సాంప్రతం శ్రోతుమిచ్ఛామి తులస్యాపరమాద్భుతమ్।
మహాత్మ్యమపి సంక్షేపాద్రుద్రాక్షస్యశివస్యవై ॥
పూజాయశ్చమహాదేవం సంక్షేపాదను శాధిమే।

అర్థము:- శ్రీ మహాదేవా! పరమాద్భుతమైన శ్రీ తులసీ మహాత్మ్యమును, సంక్షిప్తముగ రుద్రాక్షమహిమను, హరిహరుల పూజామహిమను వివరించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

**శ్రీ మహాదేవ ఉవాచ:-** (శ్రీ మహాదేవుడు నారదునితో ఈ విధముగ చెప్పుచున్నాడు.)

శ్లో॥ తులస్యాః శ్రుణుమాహాత్మ్యం సంక్షేపణమహామతే।
యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యోనరోముక్తి మావాప్నుయాత్ ॥
తులసీద్రుమరూపస్తు భగవాన్ పురుషోత్తమః।
సర్వలోక పరిత్రాతా విశ్వాత్మా విశ్వపాలకః॥

అర్థము:- శ్రీ మహాదేవుడు చెప్పుచున్నాడు. ఓ మహామతీనారదా ! తులసీ మహాత్మ్యమును సంక్షేపముగ చెప్పుచున్నాను వినుము. తులసీ మహాత్మ్యమును వినిన మానవుడు సర్వపాపములనుండి విముక్తుడగుచున్నాడు. భగవంతుడు, పురుషోత్తముడు, సర్వలోక పరిత్రాత, విశ్వాత్మ, విశ్వపాలకుడు యగు శ్రీ హరియే తులసీ వృక్షరూపమును ధరించి యున్నాడు.

శ్లో॥ దర్శనాత్ స్పర్శనాన్నామ కీర్తనాద్ధారణాదపి।
ప్రదానాత్ పాపసంహర్త్రీ నరాణాంతులసీసదా॥

అర్థం:- శ్రీ తులసీ యొక్క దర్శనము, స్పర్శనము, నామకీర్తనము, ధారణము శ్రీ హరిపాదములకు అర్పణము చేసినచో మానవులు చేసిన పాపములను సదా నశింపచేయును.

శ్లో॥ ప్రాతరుత్థాయసుస్నాతోయః పశ్యేత్ తులసీ ద్రుమం।
ససర్వతీర్థసందృష్టిఫలమాప్నోత్యసంశయమ్॥

అర్థం:- సూర్యోదయమునకు ముందేప్రాతః కాలమున లేచి, పరిశుభ్రముగ స్నానము చేసి తులసి చెట్టును దర్శించినచో నిశ్చయముగ మానవులకు సర్వతీర్థములను దర్శించినంత పుణ్యఫలము కల్గును.

శ్లో॥ దృష్ట్వాగదాధరం దేవం క్షేత్రే శ్రీ పురుషోత్తమే।
యత్పుణ్యం సమవాప్నోతి తులసీ దర్శనాచ్చతత్ ॥

అర్థం:- శ్రీ పురుషోత్తముని పరమ పవిత్రమైన క్షేత్రమునందు గదాధరుని, దేవదేవుని దర్శనము చేసిన కలుగుపుణ్యము, ఒక్క తులసీదర్శన మాత్రమున యంతఫలము యాభక్తునకు కల్గును.

శ్లో॥ దినం తచ్ఛుభం ప్రోక్తంతులసీ యత్రదృశ్యతే।
నతత్రజాయతే తస్యవిపత్తిః కుత్ర చిన్మనే ॥

శ్లో॥ అపిజన్మాంతరేకృతం పాపమత్యంతగర్హితమ్।
వినశ్యతి మునిశ్రేష్ఠ తులసీ వృక్షదర్శనాత్ ॥

అర్థం:- తులసీ వృక్షము ఏ దినము దర్శనమగునో ఆ దినము శుభదినమగును. తులసీ వృక్షదర్శనము వలన జన్మాంతరమున జేసిన యతిగర్హితములగు పాపములు నశించును.

శ్లో॥ అశుచిర్వాశుచిర్వాపియః స్ప్రుశేత్ తులసీ దళమ్ ।
సర్వపాపవినిర్ముక్త స్తత్క్షణాత్ శుద్ధతామియాత్ ॥
ప్రయాతిచపదం విష్ణోరంతే దేవ సుదుర్లభమ్ ॥

అర్థం:- శుభ్రముగాని, అపరిశుభ్రముగ గాని తులసీదళమును ఎవ్వరైనను స్పర్శించినచ వారి సర్వపాపములు హరించి తక్షణమే పరిశుభ్రుడగుచున్నాడు. జీవితాంతమున అతిదుర్లభమైన శ్రీ విష్ణుపదమునకు పోవును.

శ్లో॥ తులసీస్పర్శనంస్నానం తులసీస్పర్శనంతపః।
తులసీ స్పర్శనం ముక్తిః తులసీస్పర్శనంవ్రతమ్॥

అర్థం:- స్నానము, తపస్సు, ముక్తి, వ్రతము అన్నియూ తులసి స్పర్శన మాత్రమున కల్గును.

శ్లో॥ ప్రదక్షిణీకృతాయేనతులసీ మునిసత్తమ।
కృతప్రదక్షిణస్తేన విష్ణుః సాక్షాన్నసంశయః॥

అర్థం:- ఓ మునిసత్తమా ! శ్రీ తులసికి ప్రదక్షిణము చేసిన వాడు సాక్షాత్ శ్రీ విష్ణువునకు ప్రదక్షిణము చేసినంత పుణ్యఫలమును పొందును.

శ్లో॥ తులసీ ప్రణమేద్యస్తు భక్త్యా మానవసత్తమః।
సయాతి విష్ణోసాయుజ్యంనపునః ప్రపతేత్క్షితౌ ॥

అర్థం:- ఏమానవోత్తముడు పరమభక్తితో తులసికి వందనము చేయునో యతడు మరల ఈ భూమిపై జన్మించక విష్ణుసాయుజ్యమును పొందును.

శ్లో॥ తులసీకాననం యత్ర, తత్ర, సాక్షాజ్జనార్దనః।
లక్ష్మీసరస్వతీ యుక్తా, మోదతే మునిసత్తమ॥

అర్థం:- ఓమునిశ్రేష్ఠుడా ! ఎచ్చోట, తులసి వనముండునో అచ్చోట సాక్షాత్ శ్రీ మన్నారాయణుడు, లక్ష్మి, సరస్వతులతో గూడి పరమానంద విహారమున చేయుచుండును.

శ్లో॥ యత్రవిష్ణుజగన్నాధః సర్వదేవమయః ప్రభుః।
తత్రాహం సహరుద్రాణ్యా, సావిత్ర్యాచప్రజాపతిః ॥

అర్థం:- ఏ ప్రదేశమున శ్రీ విష్ణువు, జగన్నాధుడు, సర్వదేవమయుడు, ప్రభువు, విహరించుచుందురో అచ్చట రుద్రాణితో నేను, సావిత్రితో బ్రహ్మ యుందుము.

శ్లో॥ తస్మాత్తత్పరమంస్థానం దేవానామపిదుర్లభమ్।
యోగచ్ఛేత్ సవ్రజేద్విష్ణో ర్వైకుంఠనగరంమునే ॥

అర్థం:- శ్రీ విష్ణువు, మహాదేవుడు, బ్రహ్మ, లక్ష్మి, పార్వతీ, సరస్వతులతో కూడి యుండు స్థలదర్శనము దేవగణములకును దుర్లభము. కావున ఓ మునీశ్వరా! అట్టి స్థలమున కెవరు పోయెదరో వారు వైకుంఠమునకు బోయెదరు.

శ్లో॥ స్నాత్వాప్రమార్జయేద్యస్తు తత్క్షేత్రం పాపనాశనమ్।
సోఽపి పాపవినిర్ముక్తః, స్వర్గలోకమవాప్నుయాత్ ॥

అర్థం:- పాపనాశనముగు ఆ తులసీక్షేత్రమును ఎవరైతే స్నానము చేసి బాగుగ చిమ్మి పరిశుభ్రము చేసి పూజించుదురో వారు స్వర్గమును చేరుదురు.

శ్లో॥ యః కుర్యాత్తులసీమూల, మృదాతిలకముత్తమమ్।
కపోలేకంఠదేశే చకర్ణయోః కవచద్వయే ॥
బ్రహ్మరంధ్రే హృది, పృష్ఠే, పార్శ్వయోర్నాభిదేశకే।
సపుణ్యాత్మమునిశ్రేష్ఠ, విజ్ఞేయోవైష్ణవోత్తమః॥

అర్థం:- తులసీ మూలమందలిమన్నుతో ఎవడైతే కపోలము, కంఠప్రదేశము, చెవులు, భుజములు, బ్రహ్మరంధ్రము, హృదయము, పృష్ఠము, పార్శ్వము, నాభి - మున్నగు స్థలములందు పవిత్రముగ తిలకము ధరించుదురో అట్టి పుణ్యాత్ముడు వైష్ణవోత్తముడు, మునిశ్రేష్ఠుడు యగును.

శ్లో॥ తులసీ పుష్పబృందేన, పూజయేత్ యోజనార్ధనమ్।
సోఽప్యుక్తో వైష్ణవశ్రేష్ఠః సర్వపాపవివర్జితః॥
వైశాఖే కార్తికే మాఘే ప్రాతస్స్నాత్వావిధానతః।
యోదదాతి సురేశాయ, విష్ణవేపరమాత్మనే ॥

అర్థం:- తులసీ పుష్ప మాలికతో జనార్ధనుని ఎవడు పూజించునో యతడు సర్వపాపముల నుండి విముక్తుడై వైష్ణవశ్రేష్ఠుడగును. వైశాఖమాసము, కార్తీకమాసము, మాఘమాసములయందు యథా విధిగా ప్రాతః కాలముననే స్నానముచేసి సర్వేశ్వరుడు, పరమాత్మయునగు శ్రీ విష్ణువునకు తులసీదళములర్పించుదురో వారు అనంతమైన పుణ్యమును పొందుదురు.

శ్లో॥ గవామయుత దానస్య వాజపేయశతస్యచ।
యత్ఫలం తత్సమాప్నోతి, కార్తికేపూజయన్ హరిమ్ ॥
తులసీ పత్రకై స్తద్వ, తులసీ పుష్పకైరపి।
తులసీకాననేయస్తు, జగన్నాథం సమర్చయేత్ ॥
మహాక్షేత్రకృతాయశ్చ, పూజయాః ఫలమాప్నుయాత్।

అర్థం:- పదివేల ఆవులను దానము చేసినచో ఎంతపుణ్యఫలము వచ్చునో, నూఱువాజపేయ యజ్ఞములు చేసిన ఎంత పుణ్యఫలము వచ్చునో అంత పుణ్యఫలము కార్తీకమాసమున తులసీవనమునందు శ్రీ హరిని పూజించిన వచ్చును. తులసీవనమునందు తులసీపత్రములతో, తులసీ పుష్పగుచ్ఛములతో జనార్ధనుని పూజించిన మహాక్షేత్రములందు జేసినంత పూజాఫలములభించును.

శ్లో॥ తులసీ రహితంనైవ కర్మకుర్వాద్విచక్షణః।
కుర్వన్నకర్మణస్తస్య సమ్యక్ఫలమవాప్నుయాత్॥
తులసీ రహితసంధ్యా కాలాతీతేవ నిష్ఫలా।

అర్థము:-విచక్షణా జ్ఞానము కల్గియున్నవారు తులసీ లేని కర్మముచేయరు. విచక్షణారహితముగ చేసిన నాకర్మముఫలించదు. తులసీలేకుండా చేయబడు సంధ్య కాలతీతమైనప్పుడు చేసిన దానివలె నిష్ప్రయోజనమగును.

శ్లో॥ తులసీ బృందమధ్యేతు నిర్మాయహరిమందిరమ్।
తృణైర్నేష్టక బృందైర్వాతత్రయః స్థాపయేద్ధరిమ్॥
నియతం సేవనాసక్తః సహరేః సామ్యతామియాత్।
యస్తుతులసీ వృక్షం విష్ణురూపం విభావ్యచ॥
త్రిధైవం ప్రణమేన్మర్త్యః సతస్య సనుతాంప్రజేత్।

అర్థము:- తులసీ చెట్ల సమూహము మధ్య గడ్డితో లేక యిటుకలతో గాని శ్రీ హరిమందిరము నిర్మించి శ్రీ హరిని స్థాపితము చేసి నియమముగ హరిసేవా పారాయణుడగు మానవుడు శ్రీ హరిసామ్యమును బొందును. తులసీ వృక్షమును, విష్ణురూపముగ మనస్సున భావించి త్రికరణశుద్ధిగా అనగా మనోవాక్కాయములతో ఎవడు ప్రణామముచేయునో యతడు హరి సమానుడగును.

శ్లో॥ నమస్తే దేవదేవేశ సురాసుర జగద్గురో।
త్రాహిమాం ఘోరసంసారాన్నమస్తే ఽ స్తు సదామమః॥
యస్తుశ్రీతులసీం మర్త్యః ప్రణమేత్తారిణీధియా।
త్రిధాప్రదక్షిణీకృత్వా సప్తధారామహామతే॥
మంత్రేణానేన సద్భక్త్యాసతరేద్ఘోర సంసారాత్॥

అర్థము:- ఓ దేవదేవా! సురాసురో! జగద్గురో! నీకు నమస్కరించు చున్నాను. ఘోరమైన సంసార సాగరమునుండి నన్ను కడతేర్పుము. నీకు నేను సదా నమస్కారము చేయుదును. శ్రీ తులసి వుద్ధరించునది, యను జ్ఞానము పొంది మూడు లేక యేడుసార్లు మంత్ర యుక్తముగ భక్తితో ప్రదక్షిణము చేయుదురో అట్టివారు ఘోరమైన సంసార సాగరమునుండి విముక్తు లగుదురు.

శ్లో॥ త్రైలోక్యనిస్తార పరాయణో శివేయద్వైవ గంగా సరితాం వరాస్వయమ్।
తద్వైవలోకత్రయపావనార్థంద్రుమేషుసాక్షాత్తులసీ స్వరూపిణీ॥
త్వంబ్రహ్మవిష్ణుప్రముఖైరురోత్తమైః పురార్చితా విశ్వపవిత్రహేతవే।
జాతాధరణ్యాం జగదేకవంద్యేనమామిభక్త్యాతులసీం ప్రసీద॥
ఏవంయేప్రణమన్త్యేనాం ప్రత్యహంమునిసత్తమ।
తస్యసర్వార్థదాదేవి యత్ర కుత్రాపితిష్ఠతః॥

అర్థము:- ముల్లోకములను తరింపజేయు మోక్షాభీష్టము గల శుభస్వరూపా! త్రిలోకములను పవిత్రము చేయు నదులలో గంగ ప్రధానమైనట్లు, మూడు లోకములను పావనము చేయుటకు గల వృక్షములలో సాక్షాత్తులసీ స్వరూపిణివి, బ్రహ్మ, విష్ణువు మున్నగు దేవ ప్రముఖశ్రేష్ఠులచే పూర్వమర్చింపబడితివి. విశ్వమును పవిత్రము చేయుటకై క్షీరాబ్ధిలో నుండి యుద్భవించితివి. జగత్తులో నీవే పూజనీయురాలవు. నీకు భక్తితో ప్రణామము చేయుచున్నాను. నీవు ప్రసన్నవుకమ్ము. ఓ మునిశ్రేష్ఠా! ఈ విధముగా తులసికి ఎవరు ప్రణామము చేయుదురో వారు ఎచ్చోట యుండినను వారికి శ్రీ తులసి సర్వార్థములిచ్చుచుండును.

శ్లో॥ తులసీ సర్వదేవానా పరమప్రీతి వర్ధనీ ।
సర్వదేవాధి సంస్థానం యత్రాస్తేతులసీవనమ్॥
పితరోఽపి పరం ప్రీత్యావసంతే తులసీ వనే ।
అవశ్యం తులసీదేయా పితృదేవార్చనాదిషు॥
అదత్వామనుజైః సమ్యజ్ నకర్మఫలమాత్యతే।
విష్ణోస్త్రైలోక్యనాధస్య పితౄణాంచవిశేషతః ॥
సర్వేషామేవ దేవానాం దేవీనాంచ మహామతే ।
పరమప్రీతిదాజ్ఞేయాతులసీలోకముక్తిదా ॥
తస్మాద్ధితులసీదేయాద్దైవే ప్రైత్యేచకర్మణీ ।
యత్రాస్తితులసీ వృక్షస్తత్ర భాగీరథీస్వయమ్॥
తీర్థైః సమస్తైః సహితా వసతింకురుతే సదా ॥
తస్మాత్తత్రమునిశ్రేష్ఠదేహం సంత్యజతాంనృణామ్।
గంగాయాం మరణేయాద్వృక్ఫలం స్యాత్తాదృగేవహి ॥

అర్థము:- తులసి సర్వదేవతలకు పరమప్రీతికరమైనది. కావున తులసీ వనము ఎచ్చట యుండునో అచ్చట సర్వ దేవతలుందురు. తులసీ వనమునరిదు అవశ్యము తులసితో దేవతలకు, పితృదేవతలకు సమర్పించిన, వారు ప్రీతిచెందుదురు. ఓమహామతే! తులసిని సమర్పించనిచో మానవులు కర్మఫలములు పూర్తిగ బడయలేరు. విష్ణువునకు, త్రైలోక్యనాధునకు, విశేషించి పితృదేవతలకు మరియు సమస్తదేవ, దేవీగణములకు లోకముక్తిదాయినియైన శ్రీ తులసీ పరమప్రీతిదాయినీ యని తెలుసుకొనుము. అందువలనే మానవులు చేయు సకల దేవ, పితృ కార్యములందు తులసీ సమర్పణ అవశ్యమైనది. ఏ స్థలమున తులసీ వృక్షముండునో యాస్థలమునందు సమస్తతీర్థములతో సహా స్వయముగ భాగీరథి నిత్యము నివసించుచుండును. అందువలననే ఓ మునిశ్రేష్ఠా! మహత్తర శక్తికల్గిన తులసీవనముండుస్థలమున యీశరీరమును త్యజించిన గంగానదీ తీరమున మరణించినంత ఫలమును పొందును.

శ్లో॥ ధాత్రివృక్షశ్చచేత్తత్రవర్తతే బహు భాగ్యతః।
తదధికతరం జ్ఞేయంస్థలంతద్ బహుపుణ్యదమ్ ॥
తత్రదేహభృతాందేహపరిత్యాగాన్మహామునే ।
అజ్ఞానతో ఽపి ముక్తిః స్యాత్ సత్యం సత్యం నసంశయః॥
ఏతయోః సన్నిధౌయత్ర బిల్వవృక్షోఽపి విద్యతేః
తత్స్థానంహి మహాతీర్థం సాక్షాద్వారణాసీసమమ్॥
తత్రసంపూజయే చ్ఛంభోర్దేవ్యా విష్ణోశ్చభావతః।
బహుపుణ్యప్రదం జ్ఞేయం మహాపాతకనాశనమ్ ॥
తత్రైకం బిల్వపత్రం యోమహేశాయ నివేదయేత్ ।
తథావిష్ణుం సుసంపూజ్య తులస్యామలకదళైః ॥
ప్రయాతి విష్ణుసాయుజ్యం సత్యమేవ మహామతే।
న పునర్జన్మ చాప్నోతి తత్క్షేత్రస్య ప్రభావతః ॥
ఇత్యుక్తం తే మునిశ్రేష్ఠ మాహాత్మ్యంచ సమాసతః।
య ఇదం శ్రుణు యాన్నిత్యం సోఽపిస్వర్గ మావాప్నుయాత్ ॥

*అర్థం:–* మహత్తరమైన తులసీ వనమునందు సౌభాగ్యవశమున ఉసిరిక చెట్టు యుండిన ఆస్థలము అధిక పుణ్యప్రదమగుస్థానమగును. ఇటువంటి పుణ్యస్థలము నందు దేహులు శరీరమును అజ్ఞానముచే విడిచినను ముక్తికల్గును. ఇది సత్యము, సత్యము దీనిపై సందేహము వలదు. తులసీ, ఉసిరిక ఈ రెండు వృక్షములున్న చోట మారేడుచెట్టు కూడా యున్నచో ఆస్థలము వారణాసి ( కాశీ) క్షేత్రమువలె మహాపుణ్య తీర్థమగును. ఈ మూడు వృక్షములు యుండు ప్రదేశమున శంభు, దేవీ, విష్ణు పూజలు చేసిన మహాపాతకములు నశించును. బహుపుణ్యప్రదములగును. ఆస్థలమున ఏ మానవుడు ఒక బిల్వపత్రమును మహేశ్వరునికి నివేదన చేసిననూ, అదే విధముగ తులసీ, ఉసిరిక పత్రములతో శ్రీ విష్ణువును పూజించినను, సత్యముగ ఓ మహామతీ ! యావ్యక్తి విష్ణుసాయుజ్యమును బొందును. ఆ క్షేత్రము యొక్క ప్రభావముచే పునర్జన్మ కలుగదు. ఓమునిశ్రేష్ఠా ! తులసీ మహాత్మ్యమును సంక్షిప్తముగ జెప్పితిని. ఈ తులసీ మహాత్మ్యమును ఎవరైతే ప్రతిదినము శ్రవణము చేయునో అతనికి స్వర్గప్రాప్తి కల్గును.



తులసీ మహాత్మ్యమును గురించి శ్రీ కృష్ణుడు, సత్యభామకు వివరించినట్లు 'తులసీగీత' యందు చెప్పబడిన వాటిని చూడుము.

శ్రీ భగవానువాచ :- ( శ్రీ భగవానుడగు శ్రీ కృష్ణుడు సత్యభామతో )

శ్లో॥ ప్రాగ్దత్వార్ఘ్యం తతోభ్యర్చ్య గంధపుష్పాక్షతాదిభిః॥
స్తుత్వాభగవతీం తాంచ ప్రణమే దండవద్భువి॥

అర్థము:- సత్యభామా ! తులసీ దేవికి నీవు ప్రథమమున అర్ఘ్యమిచ్చి, గంధము, పుష్పము, అక్షతలు వీటితో పూజించి, స్తోత్రము చేసి తులసీ భగవతికి ప్రణామము చేయుము. అప్పుడు సత్యభామ ఈ విధముగ తులసిని పూజించెను.

శ్లో॥ శ్రీయఃశియే శ్రీయా వాసే నిత్యం శ్రీధర సత్కృతే।
భక్త్యాదత్తం మయాదేవి అర్ఘ్యం గృహ్ణా నమోస్తుతే ॥

అర్థము:- ఓ దేవీ! నీవు శ్రీ లక్ష్మికి శ్రీ రూపిణివి. ప్రతినిత్యము శ్రీధరునిచే పూజింపబడుచున్నదానివి. నీకు నేను భక్తితో అర్ఘ్యమిచ్చుచున్నాను. దయతో గ్రహింపుము నీకు నేను నమస్కరించు చున్నాను.

శ్లో నిర్మితాత్వం పురా దేవైరర్చితాత్వం సురాసురైః॥
తులసీ హరమేపాపం పూజాం గృహ్ణా నమోస్తుతే ॥

అర్థము:- ఓ తులసీ దేవీ ! దేవగణము పూర్వము నిన్ను నిర్మించినారు. సురాసురులచే నీవు పూజింపబడుచున్నావు. నా పాపములను హరింపచేయుము. నా పూజను దయతో గ్రహింపుము. నీకు నేను నమస్కరించెదను.

శ్లో॥ మహాప్రసాదజనని ఆధివ్యాధి వినాశిని॥
సర్వసౌభాగ్యదా దేవీతులసీత్వాం నమోస్తుతే॥

అర్థము:- ఓదేవి! శ్రీ తులసీ! నీవుమహాప్రసాదమువలన జన్మించిన దానవు. ఆధివ్యాధులను నశింపజేయుదువు. సకల సౌభాగ్యములనిచ్చు దానివి నీకు నా నమస్కారములు.

శ్లో॥ యాదృష్ట్వానిఖిలాఘ శమనీ స్పృష్ట్వా వపుః పావనీ॥
రోగాణామభివందితా నిరసనీ సిక్తాంక త్రాసినీ॥
ప్రత్యాసత్తివిరోధినీ భగవతః కృష్ణస్య సంరోపితా॥
న్యస్తాతచ్చరణే విముక్తి ఫలదా తస్యై తులస్యై నమః ॥

అర్థము-నిన్ను దర్శించిన సమస్తపాపములను బోగొట్టి పావనము చేయుదువు. స్పృశించిన దేహమును పవిత్రము చేయుదువు. అభివందనము చేసినచో రోగములను దరిచేరనీయవు. నీకు నీరు పోయుచుండిన యమభయము ఉండదు. నాటిన, శ్రీ కృష్ణునితో ఐక్యము చెందునట్లు చేయుదువు. శ్రీ కృష్ణుని పాదారవిందములకు అర్పించినచో విముక్తికల్గించును. అట్టి శ్రీ తులసికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ భగవత్యాతులస్యాస్తు మహాత్మ్యామృత సాగరే।
లోభాత్కుర్దితు మిచ్చామి క్షుద్రస్తత్ క్షమ్యతాం త్వయా॥

*అర్థం:-* భగవతీ! తులసి యొక్క మాహాత్మ్యామృత సాగరమునందాశచే క్షుద్రుడైన నేను గ్రీడింపగోరుచున్నాను. తల్లీ తులసీ! నా యీాయపరాధమును మన్నింపుము.

శ్లో॥ శ్రవణాద్వాదశీయోగే సాలగ్రామ శిలార్చనే।
యత్ఫలం సంగమేప్రోక్తం తులసీ పూజనేనతత్ ॥
ధాత్రీఫలేనయత్పుణ్యం జయంత్యాంసముపోషణే।
యత్ఫలం లభతే మర్త్యాస్తులసీ పుజనేనతత్ ॥
యత్ఫలం ప్రయాగస్నానే, కాశ్యాంప్రాణవిమోక్షణే।
యత్ఫలం విహితం దేవైస్తులసీ పూజనేనతత్ ॥

*అర్థం:-* శ్రవణానక్షత్రముతో కూడిన ద్వాదశితిథి యందు సాలగ్రమశిలకు అర్చన చేసిన యెడల నే ఫలము కలదో, త్రివేణీసంగమమున స్నానము చేసిన నే ఫలము కలదో, ఉసిరిక ఫలములతో శ్రీ హరిని బూజించుటచే నేఫలముకలదో, జయంతితోకూడిన జన్మాష్టమినాడుపవాసము చేసిననే ఫలము కలదో, ప్రయాగ లో స్నానము చేసిన నే ఫలముకలదో, కాశీ క్షేత్రములో ప్రాణములను త్యజించిన నే ఫలమును దేవతలు శాసించిరో - అట్టి మహోన్నతములైన ఫలములు శ్రీ తులసీ పూజవలన సిద్ధించును.

శ్లో॥ చతుర్ణామపి వర్ణానాం ఆశ్రమానాం విశేషతః॥
స్త్రీణాంచ పురుషాణాంచ పూజితేష్టందదాతిచ॥

*అర్థం:-* చతుర్వర్ణముల వారైన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, చతురాశ్రమములైన బ్రహ్మచర్యము, గృహస్థు, వానప్రస్థము, యతి అనబడు వారు, స్త్రీలు, పురుషులు అను వారందరును శ్రీ తులసిని పూజించిన యిష్టకామ్యములను యిచ్చును.

శ్లో॥ తులసీ రోపితా సిక్తాదృష్టా స్పృష్టా చ పావయేత్।
ఆరాధితాప్రయత్నేన సర్వకామఫలప్రదా॥
ప్రదక్షిణం భ్రమిత్వా యే నమస్కుర్వంతి నిత్యశః॥
నతేషాం దురితం కించి దక్షీణ మవశిష్యతే ॥
పూజ్యామానా చ తులసీ యస్య వేశ్మని తిష్ఠతి।
తస్య సర్వాని శ్రేయాంసి వర్ధంతేఽహరహః సదా ॥

*అర్థం:-* శ్రీ తులసీ చెట్టును నాటిన, నీరు పోసిన, చూచిన, తాకిన - వారిని పావనుల జేయును. ప్రయత్నవశమున ఆరాధించిననూ సర్వకామ్యములను, ఫలములను ప్రసాదించును, ప్రతినిత్యము ప్రదక్షిణ, నమస్కారములను సమర్పించిన కొంచెము కూడా పాపము మిగిలి యుండక క్షీణించిపోవును. ఎవరి గృహము నందు తులసి పూజింపబడునో వారికి సకలవిధములైన శ్రేయస్సులు దినదినాభివృద్ధి పొందుచుండును.

శ్లో॥ పక్షే పక్షే చ ద్వాదశ్యాం సంప్రాప్తే తుహరేర్దినే।
ౠబహ్మాదయోఽపి కుర్వంతి తులసీవన పూజనమ్ ॥

*అర్థం:-* కృష్ణ, శుక్ల పక్ష ద్వాదశీతిథియందు, హరిదినము నందు అనగా ఏకాదశి తిథియందు తులసీవనమును బ్రహ్మాదిదేవతలు పూజించుదురు.

శ్లో॥ అనన్యమనసానిత్యం తులసీం స్తౌతి యోజనః।
పితృదేవమనుష్యాణాంప్రియోభవతి సర్వదా॥
రతింబధ్నామి నాన్యత్ర తులసీ కాననం వినా।
సత్యం బ్రవీమితే సత్యే కలికాలే మమప్రియే॥
హిత్వాతీర్థసహస్రాణి సర్వానపి శిలోచ్చయాన్।
తులసీకాననే నిత్యం కలౌతిష్ఠామి భామిని ॥
నధాత్రీ సఫలా యత్రన విష్ణు స్తులసీవనమ్।
తత్ శ్మశాన సమం స్థానం సంతి యత్రన వైష్ణవాః॥

*అర్థం :-* నిశ్చలమైన మనస్సుతో శ్రీ తులసిని ప్రతినిత్యము స్తోత్రము చేయు జనులు పిత్రుదేవులకు, దేవతలకు, మానవులకు, సర్వదాప్రియుడగును. ఓప్రియా! నీకు నిజముజెప్పుచున్నాను. కలికాలమునందు తులసీవనమున కంటే వేరొక స్థలముపై ప్రీతిగల వాడను కానునేను.

హేభామినీ !వేలాదితీర్థములను, సర్వపుణ్యపర్వతములను వదిలి కలి కాలమున తులసీ వనమున నేను నిత్యము వాసము చేయుదును. ఫలవిశిష్ఠమగు వుసిరిక లేని స్థలము, శ్రీ విష్ణువు-తులసీవనము లేని స్థలము వైష్ణవులు లేని స్థలము - ఇవన్నియూ శ్మశానముతో సమానమగును.

శ్లో॥ తులసీ గంధ మాదాయ యత్ర గచ్ఛతి మారుతః।
దిశోదశ చ పూతాః స్యుర్భూత గ్రామాశ్చతుర్దశః॥
తులసీ వన సంభూతా ఛాయాపతతి యత్రవై।
తత్ర శ్రాద్ధం ప్రదాతవ్యం పితౄణాం తృప్తిహేతవే ॥

*అర్థం:-* తులసీ చెట్టు యొక్క వాసనతో గూడిన వాయువు ఎంతవరకు వీచునో అంతవరకు దశదిశలు, మరియూ చతుర్దశభూతసమూహములు పవిత్రమగును. తులసీవనము యొక్క నీడయందు పితృదేవతల తృప్తి కొరకై శ్రాద్ధమును అచ్చట బెట్టవలయును.

శ్లో॥ తులసీ పూజితానిత్యం సేవితా రోపితా శుభా।
తులసీ స్థాపితా యైస్తుతే వసంతి మమాలయే॥

*అర్థం:-* తులసిని ఎవరు నిత్యము పూజించుదురో, సేవించుదురో, స్నానము చేయించుదురో, నాటెదరో వారు నా ఆలయమున వాసము చేయుదురు.

శ్లో॥ సర్వపాపహరం సర్వ కామదం తులసీవనమ్।
నపశ్యతి యమం సత్యే తులసీవన రోపణాత్ ॥

*అర్థం:-* శ్రీ తులసీవనము సర్వపాపములను హరించును, సర్వకామములను ప్రసాదించును. తులసీవనమును వేసిన వారు నిజముగ యముని చూడరు.

శ్లో॥ తులస్యలంకృతా యేవై తులసీవన పూజకాః।
తులసీ స్నాపకాయేచ తే త్యాజ్యా యమకింకరైః॥
దర్శనం నర్మదాయాంతు గంగాస్నానం కలౌయుగే।
తులసీదళం సంస్పర్శః సమ మే తత్త్రయం స్మృతమ్॥

*అర్థం :-* తులసిని అలంకరించుట, తులసీవనమును పూజించుట, తులసికి స్నానము చేయించుట - అను కార్యములు చేయువారు యమకింకరులచే విడువబడుదురు. తులసీదళస్పర్శనము, గంగాస్నానము, నర్మదాదర్శనము అను నీ మూడు కార్యములు కలియుగమున సరిసమానమైన పుణ్యము నిచ్చును.

శ్లో॥ దారిద్ర్య దఃఖరోగార్తి పాపాని సుబహూన్యపి।
హరతే తులసీ క్షేత్రం రోగానివ హరితకీ ॥

*అర్థం :-* కరక్కాయు ఎట్లుసర్వరోగములను పోగొట్టునో ఆ విధముగనే దారిద్ర్యమును దుఃఖమును, రోగములను, బహువిధములైన పాపములను తులసీ క్షేత్రము వల్ల హరించబడును.

శ్లో॥ తులసీకాననే యస్తుముహూర్తమపి విశ్రమేత్ ।
జన్మకోటి కృతాత్పాపాత్ ముచ్యతే నాత్రసంశయః ॥

*అర్థం:-* తులసీకాననము నందు ముహూర్తకాలమయినను విశ్రమించిన వాడు కోటి జన్మములందు జేసిన పాపముల నుండి విముక్తుడగును. ఇందు సందేహమువలదు.

శ్లో॥ నిత్యం తులసీకారణ్యే తిష్ఠామి స్పృహయాయుతః।
అపి మే క్షత పత్త్రైకం కశ్చిద్ ధన్యోఽర్పయేదితి ॥

*అర్థం :-* ఎవరైననూ నాకొక చిరిగిన తులసీదళమును అర్పించకుండునా యనెడి ఆశతో తులసీవనమున సస్పృహుడనై నిత్యము వేచియున్నాను.

శ్లో॥ తులసీ నామ యో బ్రూయాత్ త్రికాలం వదనే నరః।
వివర్ణవదనో భూత్వా తల్లిపిం మార్జయేద్యమః॥

*అర్థం:-* ఎవరైతే త్రికాలములందు హృదయమున తులసీ నామమునుచ్చరించుచుండునో, వివర్ణవదనముతో యమధర్మరాజు అతను చేసిన పాపకర్మములన్నింటిని వ్రాసి యుంచిన పుస్తకమునుండి తుడిచి వేయును.

శ్లో॥ శుక్లపక్షే యదాదేవి తృతీయా బుధసంయుతా ।
శ్రవణా యాచ సంయుక్తా తులసీ పుణ్యదా తదా॥

*అర్థం:-* శుక్లపక్షమున బుధవారముతో కలిసిన లేక శ్రవణా నక్షత్రముతో కూడిన తదియనాడు శ్రీ తులసీ పూజ, యధిక పుణ్యఫలమునిచ్చును.

శ్రీ తులసీ మహాత్మ్యమును మత్స్యసూక్తము (షోడశపటలము)న, చెప్పబడిన వాటిని చూడుము. ఇది శివుడు పార్వతికి చెప్పినట్లు చెప్పబడి యున్నది.

శ్లో॥ సర్వేభ్యః పత్రపుష్పేభ్యో వరిష్ఠా తులసీప్రియే।
సర్వకామప్రదా శుద్ధా వైష్ణవీ విష్ణువల్లభా॥
భుక్తి ముక్తి ప్రదాదేవీ సర్వలోక హితాపరా।
యామాశ్రిత్యగతాః స్వర్గ మక్షయం పరమేశ్వరి ॥

*అర్థం :-* ఓ దేవీ పరమేశ్వరీ ! సమస్తమైన పత్ర పుష్పములలో శ్రీ తులసి శ్రేష్ఠమైనది. సర్వకామములనిచ్చును. పరిశుభ్రమైనది. వైష్ణవి, శ్రీ విష్ణువునకు ప్రియమైనది. భుక్తి ముక్తి ప్రదాయిని. సర్వలోకమునకు హితమైనది. తులసిని ఆశ్రయించి గతించినవారు శాశ్వతమైన స్వర్గమును చేరుదురు.

శ్లో॥ హితార్థం సర్వలోకానాం పృథివ్యాం రోపితాపురా।
యథావిష్ణుప్రియాలక్ష్మీ ర్యథాత్వం హరవల్లభా ॥
తథేయం తులసీదేవీ చతుర్థీ నోప పద్యతే ।
యధాగంగాపవిత్రా హిసర్వలోక విమోక్షదా॥

*అర్థం:-* పుర్వకాలమున సమస్తలోక హితార్థము భూమిపై తులసి నాటబడినది. లక్ష్మీదేవి శ్రీ విష్ణువునకు ప్రియ, నీవు హరప్రియవు అట్లే శ్రీ తులసీ దేవి - నాల్గవది (చతుర్థీ) మరేదియూలేదు. ఏ విధముగ పవిత్రమైన గంగ సర్వలోక ముక్తిదాయినియో ఆ విధముగ నే శ్రీ తులసి సర్వలోకముక్తిదాయిని. పుష్పగుచ్ఛముతో కూడిన తులసీ దళములతో ఎవరు శ్రీ విష్ణువును పూజించుదురో వారి పుణ్యఫలము వర్ణింపశక్యము గాదు. (తులసీకుసుమములతో గరుడధ్వజమును అర్చింపరాదు. ఏలనగా యదివీర్యయుక్తమై గఱుకు గాయుండి పీడను కలిగించును.)

శ్లో॥ త్రిషులోకేషు విఖ్యాతా సర్వపాపప్రణాశినీ।
సర్వకామప్రదా దేవి సర్వమంగళకారిణీ ॥
సంసార సాగరే ఘోరే తులసీ నౌస్వరూపిణీ ।
దేవానాం శివదుర్గాయాః పరం తుష్టి ప్రదాయినీ॥
కల్మషౌఘాతురాణాంచ సేయ మేకా మహౌషధిః ॥

*అర్థం :-* తులసిమూడులోకములయందు విఖ్యాతి చెందినది. సర్వపాపాలను నశింప చేయునది. సర్వకామములను ప్రసాదించునది. సకలమంగళములను కల్గించునది. ఘోరమైన సంసార సాగరమునకు తులసి నౌక వంటిది. దేవతలకు, శివదుర్గలకు పరమ సంతోషప్రదమైనది సకల కల్మషములను, పాపరోగ పీడితులకిది దివ్యమైన మహౌషధి.

నీకింకయూ తులసీ యొక్క మహిమను పురాతన ఇతిహాసమున మరీచి-రామసంవాదరూపమున యున్నదానిని వినుము.

పూర్వము మరీచిమునిని శ్రీ రామచంద్రమూర్తి ప్రతినిత్యము పూజించుచుండెను. కొంతకాలమునకు మరీచిముని సంతుష్టుడై, పరమ పవిత్రమైన తులసీమాలను శ్రీ రాముని కంఠమున అలంకరించ బోవగా శ్రీ రామచంద్రుడు మంజరీ పత్రములతో కూడిన యా తులసి మాలను తీసి చూచి కోపముతో నిట్లనియెను.

శ్లో॥ అహో కిమ వలేపో ఽయం బ్రాహ్మణస్య మహాత్మనః।
వనస్పతేః పత్రజాతం కథం దత్తం మమోపరి ॥
ఆశీర్వాద ద్విజాతీనాం గ్రాహ్యా మతిమాతా మితి ।
అతో ఽహం మునిశార్దూల అవలేపం వహామితే॥

*అర్థం :-* అహో ! మహాత్ముడైన యీ బ్రాహ్మణునకు యేమిగర్వము, యేమితెలివి ! ఒక చెట్టు ఆకులను నాతలపైననెట్లు వేసెను, ఈ మునీశ్వరుడు ! మతిమంతులైన బ్రాహ్మణోత్తముల యాశీర్వాదములు గ్రాహ్యములని యీ యహంకారమునకు నోర్చితిని. అని చెప్పగా యామాటలు విని శ్రీ తులసి కోపముతో ఈ విధముగ శాపమిచ్చెను.

శ్లో॥ యస్మాన్మదావలేపేన శిరసోమాంవిముక్తవాన్।
తస్మాద్రాజేంద్ర వైదేహ్యావియోగస్తేభవిష్యతి॥

*అర్థం :-* ఓ రాజేంద్రా ! మదగర్వమున నన్ను నీ శిరస్సునుండి తీసి పారవేసితివి, ఆ విధముగనే నీకు వైదేహితో వియోగము కలుగు గాక! యని శాపమిడిన తులసీ దేవిని, కోపావేశుడైన శ్రీ రామచంద్రమూర్తిని శాంతింపచేయుటకై ఇట్లనియెను.

శ్లో॥ సుప్రసీద మహారాజ వ్రజామి శరణంతవ ।
కథయామి పురావృత్తం విచిత్రం మునిభాషితమ్॥
ఏ షా హితులసీమాలా మయాదత్తా సురేశ్వరః।
తస్యా విచిత్రమాహాత్మ్యం మత్తస్సర్వం నిశామయః॥

*అర్థం :-* మహారాజా ! శ్రీ రామచంద్రప్రభో! మిమ్ములను శరణువేడు కొనుచున్నాను.

సుప్రసన్నుడవు కమ్ము, విచిత్రమునిచే చెప్పబడిన పూర్వవృత్తాంతమును చెప్పుచున్నాను వినుము. ఓ సురేశ్వరా ! యీ తులసీమాలను నేను నీకిచ్చుచున్నాను. దీని విచిత్రమగు మాహత్మ్యమును వినుము.

శ్లో॥ ఇయంహిబ్రహ్మరూపేణమహాలక్ష్మీ ప్రతిష్ఠితా।
బ్రహ్మీయం పరమాశక్తిః బ్రహ్మణోరోమసంభవా॥
ఋగ్యజుస్సామవేదాద్యాః శాఖాచరణసన్మితాః ।
యథాగంగాయథాగీతా గాయత్రీచ యథామతా॥
పద్మయోనేః సముద్భూతా తథేయం లోక పావనీ।
యత్రైషా తిష్ఠతే సమ్యక్ తత్రలక్ష్మీః ప్రతిష్ఠితా॥
ఇమాం వినా తథాలక్ష్మీ ర్వినాశాయోపజాయతే ।
ఏవం సృష్టా జగన్మాతా తులసీ బ్రహ్మణాస్వయమ్ ॥
లోకానాం పావనార్థాయ పృథివ్యామవతారితా ।
ఏనామారాధ్య దేవేశో మహాదేవో జగత్పతిః॥
అసురం ఘోర నామాన మజయ ద్రణసంకులే ॥

*అర్థం:-* శ్రీ మహాలక్ష్మియే యీతులసీవృక్షరూపమున ప్రతిష్ఠించబడినది. బ్రహ్మరోమసంభవమైన యీ యమ, శ్రేష్ఠమగు బ్రాహ్మీశక్తి. చతుర్వేదములైన ఋగ్వేదము, యజుర్వేదము, అధర్వణవేదము, సామవేదములు, శాఖా చరణ సమ్మితములు. గంగ, గీత, గాయత్రీ, పద్మయోని, బ్రహ్మ - వీరెట్లుత్పన్నమైనారో అట్లే లోకపావనియైన శ్రీ తులసి ఆ విధముగనే జన్మించినది. శ్రీ తులసి ఎచ్చట యుండునో అచ్చట శ్రీ లక్ష్మిప్రతిష్ఠితయైయుండును. తులసి లేని లక్ష్మి, వినాశమునకు దారి తీయును. ఈ విధముగా బ్రహ్మస్వయముగ తులసిని సృజించి లోకములు

పవిత్రములగుటకు యీ భూమిపై అవతరింపజేసెను. శ్రీ తులసిని ఆరాధించి జగత్పతియైన దేవేశ్వరుడు, మహాదేవుడు-ఘోరుడను రాక్షసుని యుద్ధమున జయించెను.

శ్లో॥ ఏవ మేషా మహాదేవీ తులసీ విశ్వరూపిణీ।
తమ ప్యారాధయస్వైనాం విజయం ప్రాప్స్యసి ధ్రువమ్॥
ఏతచ్ఛ్రుత్వాతువచనం మహర్షేర్మధుసూదనః॥
జయాయ శిరసా మాలాం ప్రణిపత్యచ సాదరమ్।
జగ్రాహవిటపస్తస్యాః పూజయామాస రాఘవః ॥
తత స్తస్యాః ప్రభావేన భగవాన్ రఘునందనః।
యాతుధానం మహావీర్యం జితవాన్ రావణాంగణే॥

*అర్థం:-* ఇట్టి మహత్తర శక్తిగలది, విశ్వరూపిణియగు శ్రీ తులసి మీరును ఈ యమను ఆరాధింపుము. దృఢముగ విజయము కలుగును. మధుసూదనుడు మహర్షి వచనములను విని జయముపొందుటకై సాదరమున తులసీ మాలకు శిరసావహించి ప్రణామము చేసి గ్రహించెను. పిదప తులసీ వృక్షమును తన వెంటతీసుకొని పోయి నాటి పూజించెను. తులసీ పుజాప్రభావమున భగవాన్ రఘునందనుడు మహాబలవంతుడైన రావణుని రణరంగమున జయించెను.

## శ్రీ తులసి-గణపతి

శ్రీ తులసి విఘ్నేశ్వరునకు ప్రయోజనపడదుయందురు. ఈ విషయమై బ్రహ్మవైవర్తపురాణం గణపతి ఖండమునందు శ్రీ మన్నారాయణుడు - నారదమునికి వివరించిన దానిని చూడుడు:-

పూర్వము ఒకనాడు పరశురాముడు సమస్తదేవగణములను, మునీంద్రులను, ప్రజలను ఆహ్వానించి గణపతి పూజచేస్తాడు. షోడశోపచార పూజలో శ్రీ తులసిని కానక నారదమునికి సందేహము వచ్చి శ్రీమన్నారాయణునితో ఓ హరీ! వివిధములైన నైవేద్యములు, నానావిధములైన ధూప, దీపములతో, సకల గంధపుష్పములచే చేయబడు ఈ పూజగ్రహణీయమైనది. కానీ సర్వపుష్పాలలో మహనీయమైనది, మహత్తరమైనది, మనోహరమైనది యగు తులసి గణపతి పూజయందు కానరాకున్నది. ఇందులకు కారణమేమని ప్రశ్నించగా శ్రీ మన్నారాయణుడు చెప్పుచున్నాడు. "ఓ నారదా! యీవిషయము నిగూఢమైనది. ఇది బ్రహ్మకల్పంలోని వృత్తాంతము తులసీ దేవి యౌవనంతో నిండియున్న కాలమున గంగాతీర విహారము చేయుచుండగా అచ్చట నిర్మల భక్తితో తపస్సు చేయుచున్న గణపతిని చూచి అతనిపైవ్యామోహముతో గణేశుని శిరస్సుపై జలప్రోక్షణము చేసి తనహస్తముతో శిరస్సును తాకి తపోభంగము కావిస్తుంది. తపోభంగము పొందిన గణపతి శాంతముగ తులసిని ఎవరనియడుగగా ఆమె 'నేను ధర్మధ్వజుని పుత్రికను మంచి భర్తకై తపస్సు చేసినదానను. నాకు నీవు నచ్చినావుగాన నన్ను పరిణయమాడుమని' కోరినది. అప్పుడు గణపతి ఆమెతో తల్లీ! నేను బ్రహ్మచారి, వివాహము చేసుకోను. వేరెవరినైనా ఎంచుకొనుమని చెప్పగా తులసి ఆగ్రహించి 'నీకు వివాహమునునది జరుగునా?' యనెను. అప్పుడు గణపతి తులసిని 'నీవు భూమిపై రాక్షసుని భర్తగా పొంది శ్రీ హరి అనుగ్రహంతో పవిత్రవృక్షమ యెయ్యదవని' శపించెను. అందులకామె పరితపించి గణపతిని శరణు కోరగా గణేశుడీవిధముగ చెప్పెను".

**శ్రీ గణేశ ఉవాచ :-**

శ్లో॥ పుష్పాణాం సారభూతాత్వం భవిష్యసిమనోరమే।

కలాంశేన మహాభాగే స్వయం నారాయణప్రియా॥
ప్రియాత్వం సర్వదేవానాం కృష్ణస్వచవిశేషతః।
పూజవిముక్తిదా నృాణాం మమ త్యాజ్యాచ సర్వదా॥

*అర్థం :-* శ్రీ గణపతి చెప్పుచున్నాడు.

ఓ మనోరమా! భవిష్యమున నీ పుష్పము అన్నిపుష్పములకంటే సారభూతత్వమును పొందును. కాలాంశమున స్వయముగ శ్రీ మన్నారాయణునికి ప్రియమైన దానివయ్యెదవు. సర్వదేవగణముల కున్నూ, విశేషించి శ్రీ కృష్ణభగవానునికి నీ వలన చేయబడు పూజ విముక్తిని ప్రసాదించును. కానీ నీవు సర్వదా నాకు మాత్రము పనికిరావు. అని చెప్పెను. అనగా తులసి తనకు ప్రయోజన పడదు అని అర్థము.

శ్లో॥ యాదృష్టా నిఖిలాఘ శమనీ స్పృష్టావపుః పావనీ।
గోగణామభివందితా నిరసనీ, సిక్తాంతక త్రాసినీ॥
ప్రత్యాసక్తి విధాయినీ భగవతః కృష్ణస్య సంరోపితా।
న్యస్తాతచ్చరణే విముక్తిఫల దాతస్యై తులస్యైనమః॥

*అర్థం :-* శ్రీ తులసిని దర్శనము చేసిన సర్వపాపములు హరించును. స్పృశించిన శరీరము పవిత్రమగును. అభివందనము చేసిన రోగవిముక్తుడగును. నీరు పోసిన యమభయము తొలగిపోవును. నాటినచో సాక్షాత్ శ్రీ కృష్ణ భగవానుని సన్నిధిని పొందుదురు. శ్రీ చరణము లందర్పణ చేసిన మోక్ష ఫలమును పొందును. ఇంతటిమహిమ గల తులసీ! నీకు నమస్కరించుచున్నాను. యని చెప్పెను. విఘ్నేశ్వర పూజయందు తులసితో పూజశ్రేష్ఠమనియూ చెప్పబడియున్నది. దూర్వాగణపతి వ్రత కథోద్యాపనము నందు "పత్రికాభిశ్చపంచభిః బిల్వపత్రమపామార్గ శమీదూర్వాహరిప్రియాః" అని యున్నది.

శ్రీ తులసిని గురించి దానిమహిమలను స్కాంద పురాణ సాగరఖండములో చెప్పబడియున్న దానిని పరిశీలింతము చూడుడు.

వాణ్యువాచ :

శ్లో॥ తులసీరోపితా యేన గృహస్థేనమహాఫలా।
గృహేతస్య నదారిద్ర్యం జాయతే నాత్రసంశయః॥

*అర్థం :-* గృహస్థాశ్రమధర్మమును పాటించు వారు తమ గృహము నందు తులసిని నాటి పెంచుదురో అగ్గృహమున దారిద్ర్యముండదు. ఇందు సంశయములేదు.

శ్లో॥ తులస్యాదర్శనా దేవ పాపరాశిర్నివర్తతే।
శ్రీయేఽమృతకణోత్పన్నా తులసీ హరివల్లభా॥
పిబంత్యారుచిరం పానం ప్రాణినాంపాపహారిణీ।
యస్యారూపే వసేలక్ష్మీః స్కాందే సాగర సంభవా॥

పత్రేషు సతతం శ్రీశ్చ శాఖాసు కమలాస్వయమ్।
ఇందిరా పుష్పగా నిత్యం ఫలేక్షీరాబ్ధిసంభవా॥
తులసీ శుష్కకాష్ఠేషు యారూపా విశ్వరూపిణీ।
మజ్జాయాం పద్మవాసా చ త్వచా సుచ హరిప్రియా॥

*అర్థం :-* శ్రీ తులసిని దర్శించినంత మాత్రముననే పాపరాశులన్నియూ నివర్తించును. శ్రీ తులసి శ్రీ వృద్ధి చేయును. శ్రీ తులసి అమృత బిందువు వలన పుట్టినందువలన హరివల్లభ యని పిలవబడుచున్నది. శ్రీ తులసీ వృక్షమూలమునందు మంచి నీటితో తడిపిన (త్రాగించిన) సకల ప్రాణులయొక్క పాపమును పోగొట్టును. శ్రీ తులసీ వృక్షమునందు సాక్షాత్ శ్రీ లక్ష్మి వాసము చేయును. తులసీ మ్రానుయందు వరుణ దేవుడు, పత్రములందు సర్వదా శ్రీ యుండును. శాఖలయందు స్వయముగ లక్ష్మిదేవి, పుష్పములయందు నిత్యము లక్ష్మి, ఫలములందు పాలసముద్రము, ఎండిన మానుయందు విశ్వరూపిణి, మజ్జయందు పద్మవాస(లక్ష్మిదేవి), పై పట్టయందు హరిప్రియ (విష్ణువు) వాసము చేయుదురు.

శ్లో॥ సర్వరూపాచ సర్వేశా పరమానందదాయినీ।
తులసీ ప్రాశకోమర్త్య యమలోకం నగచ్ఛతి॥
శిరస్థా తులసీ యస్యనయామైరను భూయతే।
ముఖస్థా తులసీ యస్యనిర్వాణ పదదాయినీ॥
హస్తస్థా తులసీ యస్యస తాపత్రయ వర్జితః।
తులసీ హృదయస్థాచ ప్రాణినాం సర్వకామదా॥
స్కందస్థా తులసీ యస్యస పాపై ర్నచలిప్యతే।
కంఠస్థాతులసీ యస్య జీవన్ముక్తః సదాహిసః॥
తులసీ సంభవం పత్రం సదావహతి యోనరః।
మనసా చింతితాం సిద్ధిం సంప్రాప్నోతి ర్నసంశయః॥

*అర్థం :-* సర్వరూపములు కల్గిన, సర్వేశ్వరియైన, పరమానంద దాయిని యైన శ్రీ తులసిని సేవించువాడు మరణించిన పిదప యమలోకమునకు బోడు. తులసి శిరస్సునందున్న వానికి యమదూతలు భయము లేదు. ముఖమునందున్న తులసీ నిర్వాణపదమునిచ్చును.ఎవని హస్తములందు తులసి యుండునోవాడు తాపత్రయ ములకు లోబడడు.హృదయమందు తులసియున్న ప్రాణులకు సర్వకామముల నిచ్చును. భుజస్కంథములందు తులసి యుండిన వానిని పాపములంటవు. తులసిని కంఠమునందు ధరించినవాడు జీవన్ముక్తుడగును. సదా తులసీ పత్రములను తనయందుంచు కొనిన వాని మనస్సున చింతించినదంతయూ నిస్సందేహముగ సిద్ధించును. మఱియూ

శ్లో॥ తులసీం సర్వకార్యార్యార్థ సాధినీం దుష్టచారిణీమ్।
యోనరః ప్రత్యహం సించేన్నస యాతి యమాలయమ్॥
చాతుర్మాస్యేవిశేషేణ వందితాపి విముక్తిదా।
నారాయణం జలగతం జ్ఞాత్వా వృక్షగతం తథా॥
ప్రాణినాం కృపయా లక్ష్మీ స్తులసీ వృక్ష మాశ్రితా।
చాతూర్మాస్యే సమాయాతే తులసీ సవితాయది॥
తేషాం పాపసహస్రాణి యాంతి నిత్యం సహస్రధా।
గోవిందస్మరణం నిత్యం తులసీవన సేవనమ్ ॥
తులసీ సేచనం ద్విజై శ్చాతుర్మాస్యే౽తిదుర్లభమ్ ।
తులసీ వర్ధయేత్ యస్తు మానవో యది శ్రద్ధయా॥
ఆలవాలంబు దానైశ్చ పావితం సకలం కులమ్ ।
యథా శ్రీ తులసీ సంస్థా నిత్య మేవహి వర్ధతే॥
తథా తథా గృహస్థస్య కామ వృద్ధిః ప్రజాయతే।
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతిస్తథా॥
తథా ప్రకృతియః సర్వా స్తులసీ సేవ నేరతాః।
శ్రద్ధయాయది జాయంతే నతాసాం దుఃఖదో హరిః॥

*అర్థం* :- శ్రీ తులసి సర్వకార్యముల ఫలమును యిచ్చును. దుఃఖమును పోగొట్టును ఎవ్వరైతే శ్రీ తులసికి ప్రతినిత్యము నీటితో తడుపు చుందురో వారు యమాలయ మునకు పోరు. చతుర్మాస్యమున అనగా ఆషాఢ శుద్ధము నుండి కార్తిక శుద్ధము వరక (వర్ష-శరదృతువులందు) విశేషముగ వందనములు చేయుచుండిన అనగ పూజించుచుండిన విముక్తినిచ్చును. శ్రీ లక్ష్మీనారాయణులు జల, వృక్షగ తులనియు ప్రాణులపై యుండు కృపచే తులసీ వృక్షమును ఆశ్రయించియున్నారని తెలుసు కొ ఆ తులసీ వృక్షమును చతుర్మాస్యమున ఎవరు సేవించెదరో వారి సహస్రపాపములన సహస్రతునకలుగ చేసి పాపమును పోగొట్టును. ప్రతినిత్యము గోవిందనామ స్మరణము తులసీ వనమును సేవించుట, తులసికి పాలాభిషేకము చేయుట మున్నగునవి చతుర్మాస్యములో చేయుచున్న అధిక ఫలమును పొందుదురు. ఇది అతిదుర్లభమై పని. తులసీవృక్షమును ఎవడు వృద్ధిచేయునో వాని కులము వృద్ధి చెందును తులసియందు నివసించు శ్రీ లక్ష్మిని ఎవడు నిత్యము వుపచారములు చేసి పెంచున అట్టి గృహస్తుని కోరికలు నెరవేరును. సర్వ సాధారణముగ ప్రకృతి సౌందర్యముతో నిండిన తులసిని - బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, యతి యనువార శ్రద్ధాపూర్వకముగ (తులసిని) సేవించిన శ్రీ హరి వారిదుఃఖములను పోగొట్టును

# శ్రీ తులసీ కాష్ఠమణిమాల

శ్రీ తులసి కఱ్ఱతో పూసలు చేసి మాలగ ధరించిన విద్యుచ్ఛక్తిని మనలో నింపి సకలరోగములను దరిచేరనీయదు. ఈ మణిమాల 108 పూసలు కలిగినది శ్రేష్ఠము. 54 మధ్యమము 27 అధమము. శ్రీ తులసి మణిమాల పూజకై ప్రత్యేకముగ యుంచవలయును. జపమునకుపయోగించిన మాలను కంఠమున ధరించరాదు. కంఠమున ధరించు మాలను జపమునకు వుపయోగించ రాదు. ఇవి వేరు వేరుగనే యుండవలయును. తులసీమాలను సదా మానవకంఠము నందు ధరించిన వారి శరీరమునందు సదా అయస్కాంతశక్తి, విద్యుచ్ఛక్తి స్థిరముగ నుండును. రోగక్రిములు శరీరమునందు ప్రవేశింపజాలవు. చిత్తైకాగ్రతకు దోహదము కల్గించును. సాత్త్విక గుణములు అలవడును. ఇంద్రియ శాంతి కల్గును. వర్షాకాలము నందు ఉరుములు, మెరుపులు, పిడుగులు పడునప్పుడు శ్రీ తులసిని వేరుతోసహా దానికి ప్రార్థించి తీసి చేతిలో యంచుకొనిన మెరుపులు, పిడుగుల వలన కల్గు అపాయము తొలగి పోవును. శ్రీ తులసి వేరు నందలి విద్యుదయస్కాంత శక్తిచే మెరుపులను, పిడుగులను దూరముగా త్రోసి వేయును. ఇదినిజమని తమిళగ్రంథములందు చెప్పబడి యున్నది. పిడుగు పడిన వాడు మరణించక మైకముతో పడియుండిన అతనికి తక్షణమే శ్రీ తులసియాకు రసముచే మర్దించిన మైకమును వీడి స్వస్థతకల్గును.

శ్లో॥ యఃకుర్యాత్తులసీ కాష్ఠై రక్షమాలాం సురూపిణీమ్।
కర్ణమాలాంచ యత్నేన కృతం తస్యాక్షయం భవేత్ ॥

అర్థము:-ఎవరైతే శ్రీ తులసి కఱ్ఱతో పూసలు చేసి సుందరమైన జపమాల్లను కర్ణమాలను చేయునో.వారు చేసిన కర్మ మక్షయమగును.

శ్రీ తులసిమాలతో ఈ క్రింది మంత్రమును జపించవలయును
"ఓం కృష్ణ కృష్ణ మహాకృష్ణ సర్వజ్ఞత్వప్రసీదమే।
రమారమణం విద్యేశ విద్యామాశుప్రయచ్ఛమే॥"

ఈ మంత్రమును తులసిమాలతో ఒక లక్ష జపము చేసినమంత్ర సిద్ధియగును. విద్వాంసుడు, పండితుడు అగును. మూర్ఖునికి కూడా జ్ఞానము కల్గును.

శ్లో॥ ప్రవాళముక్తా స్ఫటికై ర్జప్త్వా కోటిఫలప్రదమ్।
తులసీమణినాంచైవ పలితం చాక్షయంభవేత్ ॥
రుద్రాక్షమణినాం చైవ హ్యనంతం పలమశ్నుతే॥

అర్థము :-పగడములతో చేసిన జపమాల, మంచిముత్యములచే చేయబడిన జపమాల, శ్రేష్ఠమైన స్ఫటికమణులతో చేయబడిన జపమాల-కోటి ఫలప్రదమునిచ్చును.

అయిననూ శ్రీ తులసీ కాష్ఠముతో చేసిన మణిమాలతో, చేసిన జపము అక్షయమగును. రుద్రాక్షమాలచే, జేసిన జపము పరిమితమే లేని ఫలమునిచ్చును.

# శ్రీ తులసీ పూజ

శ్రీ తులసి వ్రతము, వివాహము, స్తవము, స్తోత్రము, పూజ, అష్టోత్తర శతనామావళి మున్నగు వాటిని వివిధ గ్రంథములు, పురాణములు మున్నగు గ్రంథములందును అనుభవపూర్వకమైన వాటిని ఇచ్చట పొందు పరచిన దానిని పఠించి, పాటించి, ఫలితములను పొందవలయునని మనవి.

## శ్రీ తులసీ పూజ

శ్రీ తులసీ పూజ స్త్రీలు చేయుపూజలలో శ్రేష్ఠమైనది. శ్రీ తులసి కోటకు ప్రతి దినము సూర్యోదయమున స్నానమాచరించిన పిదప తులసి చెట్టుకు శుద్ధజలము పోయుచూ "శుద్ధోదక స్నానం సమర్పయామి, హరిద్రాం లేపయామి" యని చెప్పి తులసి చెట్టుకు పసుపు పూయవలెను. 'కుంకుమంధారయామి' యని కుంకుమను పెట్టవలయును. 'పుష్పై పూజయామి' యని చెప్పుచూ ఈ క్రింది నామములను జపించుచు ఒక్కొక్క నామమునకు ఒక్కొక్క పుష్పమును సమర్పించవలెను.

1. ఓం తులస్యైనమః 2. ఓం బృందాయై నమః 3. ఓం బృందావన్యైనమః 4. ఓం విశ్వపావన్యైనమః 5. ఓం విశ్వపూజితాయై నమః 6. ఓం పుష్పసారాయైనమః 7. ఓం ఆనందిన్యైనమః 8. ఓం కృష్ణజీవన్యై నమః॥ పిదప 'నానావిధపరిమళ పత్రపుష్పాణిసమర్పయామి' యని మిగిలిన పుష్పములను సమర్పించవలెను. తరువాత ధూప, దీప, నైవేద్యం, తాంబూలమ్, కర్పూరనీరాజనములను వరుసగా -

1. శ్రీ తులసీ దేవ్యై ధూపమాఘ్రాపయామి, యని ధూపమును సమర్పించ వలెను.
2. శ్రీ తులసీ దేవ్యైదీపం దర్శయామి - యని దీపమును వెలిగించి సమర్పించ వలెను.
3. శ్రీ తులసీ దేవ్యై మహానైవేద్యం సమర్పయామి- ఓం ప్రాణాయనమః అపానాయనమః, వ్యానాయనమః, ఉదానాయనమః, సమానాయనమః॥ మధ్యేమధ్యేపానీయం సమర్పయామి, ఉత్తరాపోశనం సమర్పయామి, శుద్ధాచమనీయం సమర్పయామి- యని నైవేద్యమును సమర్పించవలెను.
4. శ్రీ తులసీ దేవ్యై తాంబులం సమర్పయామి- యని తాంబూలము సమర్పించవలెను.
5. శ్రీ తులసీ దేవ్యై కర్పూరనీరాజనం సమర్పయామి- యని కర్పూర హారతినీయవలెను.

6. శ్రీ తులసీ దేవ్యై (ఆత్మ) త్రి ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి-యని తులసి చెట్టు చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణము చేయవలెను.

పిదప మూలమంత్రమును 108 సార్లు జపించవలెను.

మూలమంత్రము:- ఓం శ్రీ హ్రీంక్లీం ఐం బృందావన్యైస్వాహా॥ (బృందావనీ స్వాహా)

ఈ విధముగ ప్రతినిత్యము శ్రీ తులసిని పూజించుటవలన సర్వకార్య సిద్ధి కల్గును.

ఈ తులసీ పూజను స్త్రీలు సులభముగ ప్రతినిత్యము చేయుటకు వీలుగయున్నందున తప్పక నిత్యము చేసిన మంచి ఫలితమునిచ్చును.

# శ్రీ తులసీ స్తోత్రము

శ్లో॥ ఓం జగద్ధాత్రీ నమస్తుభ్యం విష్ణోశ్చ ప్రియవల్లభే।
యతో బ్రహ్మాద యోదేవాః సృష్టిస్థిత్యంత కారిణీ॥
నమస్తులసీ కళ్యాణీ నమోవిష్ణుప్రియే శుభే।
నమో మోక్షప్రదే దేవి నమస్సం పత్ప్రదాయికే ॥
తులసీ పాతుమాం నిత్యం సర్వాపద్భ్యోఽపి సర్వదా।
కీర్తితావాపి స్మృతాపి పవిత్ర యతి మానవమ్॥
నమామి శిరసాదేవీంతులసీం విలసత్తమమ్।
యాదృష్ట్వా పాపినోమర్త్యాముచ్యంతే సర్వకిల్బిషాత్ ॥
తులస్యారక్షితం సర్వం జగదేక చ్చరాచరమ్।
యావినిర్హంతి పాపాని దృష్ట్వావాపాపి భిర్నరైః॥
నమస్తులస్యతి తరాం యస్యై బధ్యాబలిం కలౌ।
కలయంతిసుఖం సర్వంస్త్రీ యో వైశ్యాస్తథాపరే॥
తులస్యానాపరం కించిద్దైవతం జగతీతలే।
యయా పవిత్రితో లోకోవిష్ణుసంగేనవైష్ణవః॥
తులస్యాః పల్లవం విష్ణోః శిరస్యాఽరోపితం కలౌ।
ఆరోపయతి సర్వాణి శ్రేయాంసి వరమస్తకే॥
తులస్యాం సకలదేవా వసంతి సతతః యతః ।
అతస్తామర్చ్య యేల్లోకే సర్వాన్దేవా న్సమర్చయన్॥
నమస్తులసి సర్వజ్ఞే పురుషోత్తమవల్లభే।
పాహిమాం సర్వపాపేభ్య సర్వసంపత్ప్రదాయికే॥

ఫలశృతి:- ఇతిస్తోత్రం పురాగీతం పుండరీకేణధీమాతా।
విష్ణుమర్చయతాం నిత్యం శోభనైస్తులసీదళై ॥

ఇట్లుతులసీదళములతో పూజించవలయును. పిదపః-

తులసీ శ్రీ మహాలక్ష్మిర్విద్యాఽవిద్యాయశస్వినీ।
ధర్మాధమాన్ ఽననాదేవీ దేవదేవమనః ప్రియా॥
లక్ష్మీః ప్రియసఖీ దేవీ ద్యౌర్భూమిరచలాచలా।
షోడశైతాని నామాని తులస్యాః కీర్తయేన్నరః॥
లభతే సుతరాం భక్తిమంతే విష్ణుపదం భవేత్।
తులసీ భూర్మహాలక్ష్మీ పద్మినీ శ్రీ హరిప్రియా॥
తులసీ శ్రీ సఖీ శుభా పాపహారిణీ పుణ్యదే।
నమస్తే నారదమతే నారాయణమనః ప్రియే॥

## శ్రీ తులసీ స్తోత్రము (మత్స్యసూక్తే)

శ్లో॥ ఇంద్రాద్యైః సకలైర్దేవైరర్చితాం సురసందరీమ్।
భక్తానాం వరదాం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥
నాదబిందుకలాతీతాం ముండమాలాం తపస్వినీమ్।
వాసుదేవరతాం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥
సర్వదేవమయీాం దేవీం వేదగర్భాం మనోరమామ్।
యోగ గమ్యా మహాం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥
సురా సుర విశేషజ్ఞాం సర్వాలంకార భూషితామ్।
త్రిజగజ్జననీం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥
పద్మహస్తాం పద్మముఖీం పద్మస్థాం పద్మలోచనామ్।
లక్ష్మీరూపా మహం వందే తులసీం సౌమ్యరూపిణీమ్॥

ఫలశృతి :- సంక్రాంత్యాం చైవ పక్షాంతే గ్రహణే చంద్రసూర్యయోః॥
యఃపఠేత్ సంయతో భూత్వా సర్వసిద్ధి మవాప్నుయాత్॥
వినామంత్రం. వినాజప్యం వినాయంత్రం వినాక్రియామ్।
వినాధ్యానం వినాతీర్థం సర్వసిద్ధికరం భవేత్॥
ఇదం గురుకృతం స్తోత్రం యః పఠేత్ శృణుయాదపి।
ముక్తిః కరతలే తస్య భుక్తిశ్చైవ నసంశయః॥

## శ్రీహరి తులసీస్తవము

ఓం॥ బృందారూపాశ్చ కృష్ణాశ్చ యదైకత్ర భవంతిచ।
విదుర్బుధా స్తేన బృందాం మత్ప్రియాం తాం భజామ్యహమ్॥
పురా బభూవ యాదేవీ త్వాదౌ బృందావనేవనే।
తేన బృందావనాఖ్యాతం సౌభాగ్యాం తాం భజామ్యహమ్॥

అసంఖ్యేషు చ విశ్వేషు పూజితాయా నిరంతరమ్।
తేన విశ్వపూజతాఖ్యా పూజితాంచ భజామ్యహమ్॥
అసంఖ్యానిచ విశ్వాని పవిత్రాని త్వయా సదా।
తాం విశ్వపావనీం దేవీం విరహేన స్మరామ్యహమ్॥
దేవాన తుష్టాః పుష్పాణాం సమూహేన యయావినా।
తాం పుష్పసారాం శ్రద్ధాంచ ద్రష్టు మిచ్ఛామి శోకతః॥
విశ్వే యత్ ప్రాప్తి మాత్రేన భక్తానంద భవే ద్ధ్రువమ్।
నందినీ తేన విఖ్యాతా సా ప్రీతా భవతాదిహ॥
యస్యా దేవ్యా స్తులా నాస్తి విశ్వేషు నిఖిలేషుచ।
తులసీ తేన విఖ్యాతా తాం యామి శరణం ప్రియామ్॥
కృష్ణజీవనరూపా సాశశ్వత్ ప్రియతమా సతీ।
తేన కృష్ణజీవనీ సాసా మే రక్షతు జీవనమ్॥

ఈ విధముగ శ్రీ హరిస్తవాదులొనరించి తులసిని వైకుంఠమునకు తీసుకొని పోయెను. యని చెప్పబడియున్నది. (దేవీభాగవతము)

## శ్రీ తులసీ ధ్యానమ్ (మత్యసూక్తి)

శ్లో॥ ఓం. ధ్యాయేద్దేవీం నవశశిముఖీం పక్వబింబాధరోష్ఠీం।
విద్యోతయంతీం కుచయుగ భరానమ్ర కల్పాంగ యష్టిమ్॥
ఈ షద్దాస్యోల్లసిత వదనాంబం చంద్రసూర్యాగ్నినేత్రాం।
శ్వేతాంగీం తామభయవరదాం శ్వేతపద్మాసనస్థామ్॥

## శ్రీ తులసీ నామాష్టకమ్

శ్లో॥ ఓం. బృందా బృందారణీం విశ్వపూజితాం విశ్వపావనీమ్।
పుష్పసారాం నందినీంచ తులసీం కృష్ణజీవినీమ్॥

ఫలశ్రుతి:-, ఏతాన్నామాష్టకంచైవ తత్స్తోత్రం నానార్థసంయుతమ్।
యఃపఠేత్ తాంచ సంపూజ్య సోఽశ్వమేధఫలం లభేత్॥

అర్థం:- 1. బృందా 2. బృందారాణీ 3. విశ్వపూజిత 4. విశ్వపావని 5. పుష్పసార 6. నందిని 7. తులసీ 8. కృష్ణజీవని - అనుయీనానార్థములతో గూడిన తులసీ నామాష్టక స్తోత్రమును ప్రతినిత్యము పఠించుచున్నవాడు సంపూజ్యుడు. అశ్వమేధయాగము చేసినంత ఫలమునిచ్చును.



# శ్రీ కృష్ణభగవాన్ - శ్రీ తులసీ యంత్రము

శ్రీ కృష్ణభగవానుని అనుగ్రహమునకై శ్రీ తులసీ మంత్రయంత్ర జపము ద్దలచే చెప్పబడిన దానిని, యిచ్చట పొందు పరచబడిన దానిని చేసిచూచి ఫలితమును ొందుదుడు. అది,

మారేడు చెక్కతో ఒక చదరపు పీఠమును చేయించిదాని యందు యీక్రింది మంత్రమును చెక్కించవలయును. యంత్రము చెక్కించిన పిదప దానిని శుభ్రముగ డిగి పసుపు కుంకుమలు పెట్టి యంత్రమునకు క్రింద ఈ క్రింది మంత్రములో ొకదానిని లేక అన్నింటిని తులసీ కాష్టగంధముతో, తులసీ పుల్లకలముతో వ్రాసి ్రతిదినము షోడశోపచారములతో పూజించుచు ఈ క్రింది మంత్రములలో నొకదానిని ౦8 లేక 1008 సార్లు ప్రతిదినము జపించవలయును. ఇట్లు 1 మండలము జపముచేసిన శ్రీ కృష్ణుని అనుగ్రహము కల్గును. జపకాలమున బ్రహ్మచర్యము ముఖ్యము.



మూల మంత్రములు :-

1. శ్లో॥ ఓం. మాతాస్తులసీ కళ్యాణీ గోవింద చరణప్రియే।
సహతాలికులైర్భి భద్ర్దృష్టేస్తేఽతిప్రియేచ్యుతమ్ ॥

2. ఓం. క్లీం కృష్ణాయ గోవిందాయ గోపిజనవల్లబాయ స్వాహా.

3. ఓం శ్రీ కృష్ణం శరణం మమ.

4. ఓం ఐం క్లీం సౌః శ్రీ తులస్యైనమః.

## శ్రీ తులసీకవచము ( శ్రీ బ్రహ్మాండపురాణము)

ఓం అస్య శ్రీ తులసీ కవచస్తోత్రమంత్రస్య, శ్రీ మహాదేవ ఋషిః అనుష్టుప్ ఛందః, శ్రీ తులసీ దేవతా మమ ఈప్సిత కామానా సిద్ధ్యర్థే జపేవినియోగః।

శ్లో॥ ఓం తులసీ శ్రీమహాదేవీనమః పంకజధారిణీ ।
శిరోమేతులసీ పాతుఫాలంపాతుయశస్వినీ ॥
దృశామేపద్మనయనా శ్రీసఖీ శ్రవణేమమ।
ఘ్రాణంపాతు సుగంధామే ముఖంచ సుముఖీమమ॥
జిహ్వాంమేపాతు శుభదా కంఠం విద్యామయీమమ ।
స్కంధౌకల్హారిణీపాతు హృదయం విష్ణువల్లభా॥
పుణ్యదా మేపాతు మద్యం నాభీం సౌభాగ్యదాయినీ।
కటింకుండలనీ పాతు ఊరూ నారదవందితా॥
జననీజానునీపాతు జంఘే సకలవందితా।
నారాయణప్రియాపాదౌ సర్వాంగం సర్వరక్షణీ॥
సంకటేవిషమే దుర్గేభయేబాధే మహాహవే।
నిత్యంత్రిసంధ్యయోః పాతుతులసీ సర్వతః సదా॥

ఫలశ్రుతి : ఇతీదంపరమం గుహ్యం తులస్యాః కవచామృతమ్।
మర్త్యానా మమృతార్థాయ భీతానా మభయాయచ ॥
మోక్షాయ చ ముముక్షూణాం ధ్యాయినాం ధ్యానయోగకృత్।
వశ్యాయ వశ్య కామానాం విద్యాయై వేదవాదినామ్॥
ద్రవిణాయ దరిద్రాణాం పాపినాం పాపశాంతయే ।
అన్నాయాకులితానాంచ స్వర్గాయ మిచ్ఛతామ్॥
పశవ్యం పశుకామానాం పుత్రదం పుత్రకాంక్షిణామ్।
రాజ్యాయభ్రష్టరాజ్యానా మశాంతానాంచ శాంతయే॥
భక్త్యర్థం విష్ణుభక్తానాం విష్ణు స్సర్వాంతరాత్మని।

జాప్యం త్రివర్గ సిద్ధ్యర్థం గృహస్థేన విశేషతః॥
ఉద్యంతం చంద్ర కిరణ ముపాస్థాయ కృతాంజలి।
తులసీకాననే తిష్ఠన్నాసీనో వాజపేదిదమ్॥
సర్వాన్కామా నవాప్నోతి తథైవ మమసన్నిధిమ్।
మమప్రియకరం నిత్యం హరిభక్తి వివర్ధనమ్॥
యస్మాన్మృప్రజానారీ తస్యా అంగం ప్రమార్జయేత్।
సాపుత్రంలభతే దీర్ఘ జీవనం చాప్యరోగిణం॥
వంధ్యాయామార్జయే దంగం కుశైర్మంత్రేణ సాదకః।
సాపి సంవత్సరా దేవగర్భం దత్తె మనోహరమ్॥
అశ్వత్థే రాజవ శ్యార్థీ జపే దగ్రే సరూపధాత్।
పలాశమూలే విద్యార్థీ తేజోర్థ్యభి ముఖోభవేత్ ॥
కన్యార్థీచండికా గేహే శత్రు హత్యైగ్ృహేమమ।
శ్రీ కామోవిష్ణుగేహేచ ఉద్యానే స్త్రీవశాభవేత్॥
కిమత్ర బహునోక్తేన శృణుసైనే శ్యతత్త్వతః।
యం యం కామమభి ధ్యాయేత్తం తంప్రాప్నో త్యసంశయమ్॥
మమగేహే గతస్త్వంతు తారకస్యవధేచ్ఛయా।
జపన్ స్తోత్రంచకవచం తులసీ గతమానవః॥
మండలాత్తారకం హర్తా భవిష్యసి నసంశయః ॥

ఈ తులసీకవచమును ప్రతినిత్యము ప్రాతః కాలమునందు స్నానము చేసిన పిదప పారాయణచేయువారికి భీతిని, భయమును పోగొట్టును. మోక్షము ప్రసాదించును. ధ్యానయోగము సిద్ధించును. జనవశ్యము కల్గును. విద్యాభివృద్ధి అగును. దారిద్ర్యమును పోగొట్టును. పాపములను హరించును. రాజ్యభ్రష్టులకు రాజ్యలాభము, ఉపద్రవశాంతిని కల్గించును. స్త్రీలకు సంతాన ప్రాప్తి, సంతానవృద్ధి, సౌభాగ్యవృద్ధి మున్నగువాటిని కల్గించును.

**తులసీకవచ పారాయణక్రమము:–** తులసీవనమునందు గానీ, తులసి చెట్టువద్ద గాని సూర్యోదయమునకు ముందు సూర్యునికి ఎదురుగ అనగా తూర్పుముఖముగ కూర్చొని తులసి చెట్టును పూజించి వందనము లర్పించి, తులసీకవచమును ప్రతిదినము కనీసము 108 సార్లు విడువకుండా ఒకమండలము పారాయణము చేయవలయును.

**సంతానప్రాప్తి పారాయణ క్రమము :–**

(శ్లో.14) ప్రాతః కాలమునందు శుచియైస్నానమాచరించి తులసి చెట్టును పూజించి

ఆ చెట్టు వద్ద తూర్పుముఖముగ కూర్చొని, ఒక రాగి చెంబులో నీళ్ళుపోసి దానిని రాగిపళ్ళెములో పెట్టి ఆ చెంబుపై తనకుడిచేతినియుంచి సత్సంతానము కలుగవలయు నన్న కోరికతో శ్రీ తులసీ కవచమును (కనీసము 11 సార్లు) 108 సార్లు పారాయణము చేసి పిదప రాగిచెంబులోని నీళ్ళను కొంచెము త్రాగి మిగిలిన నీళ్ళను తన మర్మస్థానముపై జల్లుకొనవలెను. ఇట్లు ఒక మండలము విడువకుండా చేసిన సంతానము కల్గి, శిశువు మరణించుచున్న స్త్రీలకు గర్భము నిలచి చిరంజీవియైన సుపుత్రుని కనును.

**వంధ్యాస్త్రీకి సంతానప్రాప్తికి :-**

(శ్లో॥ .15) పై విధముగనే చేయవలెను. కానీ రాగిచెంబులో కుశదర్భలను వుంచి ఆకుశదర్భలతో తనమర్మస్థానముపైననూ, శరీరముపైననూ జల్లుకొనవలెను. ఇట్లు ఒక సంవత్సరము విడుపకుండా భక్తితో చేసిన వంధ్యాస్త్రీ గర్భవతియై మనోహరుడైన సుపుత్రుని కనును.

**జనవశ్యము, రాజవశ్యమునకు:-**(శ్లో.16) : సూర్యోదయమునకు ముందే లేచి శుచియై స్నానము చేసి రావిచెట్టుక్రింద కూర్చొని తనకు వశ్యము కావలసినవారిని తలచుకొని ప్రతిదినము 108 సార్లు తులసీ కవచమును విడువకుండా పారాయణము చేయుచున్నచో జనవశ్యము, రాజవశ్యము కల్గును.

**విద్యాభివృద్ధికి:-** (శ్లో 16) సుర్యోదయమునకుముందే లేచి శుచియై స్నానము చేసి మోదుగ చెట్టుక్రింద ఆసీనుడై ప్రతిదినము 108 సార్లు చొప్పున ఒక మండలము తులసీకవచమును విద్యావృద్ధిని కోరి పారాయణము చేయుచున్న తేజోమయమైన విద్యాభివృద్ధి కల్గును

**వివాహముకాని వారికి వివాహమగుటకు:-**(శ్లో 17) సూర్యోదయ మునకు ముందు లేచి శుచియై స్నానమాచరించి చండిక, దుర్గా, లక్ష్మి, పార్వతి మున్నగు దేవాలయమునందుగానీ, దేవతాపటములముందు గానీ కూర్చొని రోజుకు 108 సార్లు వంతున ఒక మండలము పారాయణము చేసిన శీఘ్రముగ వివాహము నిశ్చయముగ అగును.

**శత్రుజయమునకు, లక్ష్మిప్రాప్తికి :-(శ్లో 17)**

సూర్యోదయమునకు ముందే లేచి శుచియై స్నానము చేసి శ్రీ విష్ణువు ఆలయమునందుగానీ, విష్ణువిగ్రహము లేక పటము ముందుగాని తూర్పుముఖముగ కూర్చొని శ్రీ తులసీ కవచమును రోజుకు 108 సార్లు వంతున, శత్రుజయము, శ్రీ ప్రాప్తిని కోరి పారాయణము ఒక మండలము చేసిన శత్రుజయము, కీర్తి, ఐశ్వర్యప్రాప్తి కల్గును.

స్త్రీ వశ్యమునకు (శ్లో :17) :– పై విధముగనే బృందావనము నందు రోజుకు 108 సార్లు వంతున ఒక మండలము తులసి కవచ పారాయణము చేసిన స్త్రీ వశ్యమగును.

ఏ కోరికలు లేక నిస్స్వార్థము, నిష్కల్మషమైన తులసీ కవచ పారాయణము చేయు చుండినచో శ్రీ విష్ణుపదమునలంకరించును జీవన్ముక్తిని పొందును.

## శ్రీ తులసీ వివాహప్రతిష్ఠ

శ్రీ తులసీ వివాహమను పూజాక్రమమును హరిభక్తివిలాసము నందు చెప్పబడియున్నది. ఇది వసిష్ఠమహాముని చే చెప్పడినట్లు యున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచ:– శ్రీ వసిష్ఠమహాముని చెప్పుచున్నాడు. ( హరిభక్తి విలాసధృత విష్ణుయామళము)

శ్లో॥ వివాహం సంప్రవక్ష్యామి తులస్యాస్యయథావిధి ।
యధోక్తం పంచరాత్రేవై బ్రహ్మణాభాషితంపురా ॥
ఆదావేన వనేవాప్య తులసీం స్వగృహేఽపివా ।
వర్షత్రయేణ పూర్ణేన తతో యజనమార భేత్ ॥
సౌమ్యాయనే ప్రకర్తవ్యం గురు శుక్రోదయే తథా ।
అథవా కార్తికే మాసి భీష్మ పంచదినేషుచ ॥
వైవాహికేషు ఋక్షేషు పూర్ణిమాయాం విశేషతః ।
మండపం కారయేత్తత్ర కుండవేదీం తథాపునః ॥

శ్రీ వసిష్ఠమహాముని చెప్పుచున్నాడు:– పూర్వకాలమున బ్రహ్మదేవుడు పాంచరాత్రమున శ్రీ తులసీ వివాహమును ఏ విధముగ జెప్పియుండెనో ఆ తులసీ వివాహమును యథావిధిగా జెప్పుచున్నాను.

ప్రథమముగ ఏ వనమునందు గాని ( ఇతరులచే విఘ్నము, ఆభ్యంతరము మున్నగునవి కలుగని చోటుగ గాని ) లేక తన స్వగృహము నందు గాని శ్రీ తులసిని నాటి పెంచవలయును. ఇట్లు మూడేండ్లు నిండిన తరువాత యజ్ఞమును ప్రారంభింప వలెను. గురు శుక్రోదయమున సౌమ్యాయనమున, అనగా ఉత్తరాయణమునగానీ లేక కార్తీక మాసము నందు భీష్మపంచకమున శుభ వివాహ నక్షత్రము, మరియూ పూర్ణిమ తిథియందు మండపము నిర్మించి, మట్టితో గుండ్రని వేదికను నిర్మించ వలయును.

శ్లో॥ శాంతికంచప్రకర్తవ్యం మాతౄణాం స్థాపనంతథా ।
మాతృశ్రాద్ధాదిక సర్వం వివాహంచ సమాచరేత్॥
బ్రహ్మణాంశ్చ శుచి స్నాతాన్ వేదవేదాంగ పారగాన్।
బ్రాహ్మేచ దేశకైశ్చైవ చత్వారశ్చతథర్త్విజాః ॥

వైష్ణవేన విధానేన వర్థనీకలశం యజేత్ ॥
మండపం కారయే త్తత్ర లక్ష్మీనారాయణం శుభమ్ ॥

పిదప అచ్చుట శాంతిని, మాతృగణమును స్థాపించవలయును. వివాహమునందుచేయు విధముగనే మాతృశ్రాద్ధాదికము చేయవలయును. శుచిస్నాతులు అనగా శుభ్రముగ స్నానము అధ్యయనము చేసినవారు, వేద వేదాంగపారంగతులు నగు సద్బ్రాహ్మణులను, బ్రహ్మ, గురువు, నలుగురు యజ్ఞము చేయుబ్రాహ్మణులను (ఋత్విజులను) పిలిపించవలయును, అనగా ఈ కార్యమును చేయుటకు వారిని నియమించవలయును. పిదప వైష్ణవ విధానమునను సరించి వర్ధనీకలశమును పెట్టి దానికి అర్చనచేయవలయును. లక్ష్మీ నారాయణ శుభ మండపమును ఆ స్థలమునందు వేయించవలెను. పిదప:-

శ్లో॥ గ్రహయజ్ఞం పురః కృత్వా మాతౄణాం యజనాం తథా ।
కృత్వా నాందీముఖం శ్రాద్ధం సౌవర్ణం స్థాపయేద్ధరిమ్ ॥
కృత్వా రోపాచ తులసీం లగ్నే త్వస్తమితే రవౌ ।
వాసఃశ తేన మంత్రేణ వస్త్రయుగ్మేన వేష్టయేత్ ॥
యదాబధ్నేతి మంత్రేణ కంకణం పాణిపల్లవే ।
రోదాదితిచ మంత్రేణ పాణిగ్రాహో విధీయతే ॥

ఆస్థానము నందు మొదట గ్రహ యజ్ఞ పూజలు చేసి మాతృకాగణ పూజ నాందీ ముఖశ్రాద్ధము గావించిన పిదప బంగారుతో చేయబడిన హరి విగ్రహమును ఆ మండపము నందు ప్రతిష్ఠించవలెను. సూర్యుడు అస్తమించిన తర్వాత శుభలగ్నమున శ్రీ తులసిని ఆరోపణ అనగా అచ్చుట శ్రీ హరిప్రక్కన పెట్ట వలయును (నాటవలెను) "వాసః శతేన" యను మంత్రముతో వస్త్రయుగ్మమును అనగా ఒక జత గుడ్డలతో జుట్టవలయును. పిదప "యదాబధ్నేతి" యను మంత్రముతో పాణి పల్లవమున చేయి-ముంచేయిమధ్యన అనగా మణికట్టు నందు కంకణము కట్టవలయును. పిదప "కోదాదితి" యను మంత్రముచే బాణిగ్రహణము చేయింపవలెను.

పాణిగ్రహణము చేయించిన పిదప ఆచార్యుడు, బ్రాహ్మణులతో వివాహమండపవేదిక దగ్గరకు పోయి యావేదికాకుండమున తొమ్మిది ఆహుతులు వేయవలెను. వైష్ణవ సాంప్రదాయము ప్రకారము చేసిన వివాహకర్మమువలె తతిమ సమస్త కర్మములను యుత్తమ గురువనుష్ఠింపవలెను. తదనంతరము విధిపూర్వకముగ విశేష హోమము చేయవలయును. కేశవాదిహోమం కరిష్యామి నమః-

| | | |
|---|---|---|
| ఓంకేశవాయనమః॥ | ఓంనారాయణాయనమః॥ | ఓం మాధవాయనమః॥ |
| ఓం గోవిందాయనమః॥ | ఓంవిష్ణవేనమః॥ | ఓం మధుసూదనాయనమః॥ |

ఓం త్రివిక్రమాయనమః। ఓం వామనాయనమః। ఓం శ్రీధరాయనమః ।
ఓంహృషీకేశాయనమః। ఓంపద్మనాభాయనమః। ఓం దామోదరాయనమః।
ఓంసంకర్షణాయనమః। ఓంవాసుదేవాయనమః। ఓం ప్రద్యుమ్నాయనమః।
ఓం అనిరుద్ధాయనమః। ఓం పురుషోత్తమాయనమః। ఓం అధోక్షజాయనమః।
ఓం నారసింహాయనమః। ఓం అచ్యుతాయనమః। ఓం జనార్ధనాయ నమః।
ఓం ఉపేంద్రాయనమః। ఓం హరయేనమః। ఓం శ్రీ కృష్ణాయనమః ।
ఓం అగ్నయేనమః । ఓం వాయువేనమః। ఓం సూర్యాయనమః ।

పిదప సమస్త దోషనిర్హరణార్థ విశేషాజ్యాహుతిం కరిష్యామి నమః ।
అని ప్రత్యేక మాహుతి యివ్వవలెను.

ఓం అగ్నయేనమః । ఓం అగ్నీవరుణాభ్యాం నమః । ఓం ఇంద్రాయనమః । ఓం శ్రీ విష్ణవేనమః। ఓంత్ర్యంబకాయనమః। ఓం ఇంద్రాదిదేవతాభ్యోనమః । ఓం వస్వగ్నిభ్యాంనమః । ఓం ప్రజాపతయేనమః। యని ఆహుతి నివ్వవలెను. పిదప, సర్వకామార్థ సిద్ధయే అక్షతాన్ శిరసిధారయేత్॥ తతః బ్రహ్మణంపూజయామి। యథాశక్తిదక్షిణా అచార్యాయదద్యాత్। ఏ తత్ఫలం పరమేశ్వరార్పణమస్తు, యని పూజాఫలము నంతయూ ఆ పరమేశ్వరునికే అనగా శ్రీ విష్ణువునకే అర్పించవలెను. పిదప,

శ్లో॥ యజమానః సపత్నీకోహ్యస్యయే.గోత్రబాంధవాః ।
ప్రదక్షిణాశ్చ కర్తవ్యాశ్చాత్వారో విష్ణునాసహ॥
తులస్యా పాణిగ్రహణే వేదికాయాం విభావసోః।
శతకుంభం జపేత్ సూక్తం పావమానీం విశేషతః ॥
తద్వైవ శాంతి కాధ్యాయం నవసూక్తం తద్వైవచ।
జీవసూక్తం పునర్జప్త్వా తథా వైష్ణవ సంహితామ్॥
శంఖఝల్లరి నిర్ఘోషై ర్భేరీ తూర్యస్య నిస్స్వనైః।
గాయంతే మంగళా నార్యా మాంగల్యం విధిమాచరేత్॥
దాస్యాత్ పూర్ణాహుతిం పశ్చా దభిషేక విధింతతః।
బ్రహ్మణే వృషభం దద్యాదాచార్యం పరిధాప్యచ ॥
గాం పటంచ తథాశయ్యా మాచార్యాయ ప్రదాపయేత్।
ఋత్విగ్భ్యో దాపయే ద్వస్త్రాణ్యేషాం దద్యాచ్చ దక్షిణామ్॥

శ్రీ తులసీవివాహప్రతివిధిని జరిపించుయజమాని, తన భార్యతో, సగోత్రులతో తన బంధు మిత్రసమేతముగ, శ్రీ విష్ణువుతో సహా నాలుగు ప్రదక్షిణములు చేయవలయును. తులసీ పాణిగ్రహణము చేయునపుడు వేదిక మండపము వద్ద శతకుంభ సూక్తమును, పావమానీ సూక్తమును, శాంతి సంకల్పమును, నవసూక్తము, జీవసూక్తము, పిదప

వైష్ణవ సంహితను హోమగుండము వద్ద జపింపవలెను. శంఖము, ఝల్లరి, భేరీ, తూర్యధ్వనులు యనబడు మంగళవాద్యములను వాయించవలెను. మాంగల్య విధినుసరించి పుణ్యస్త్రీలందరూ మంగళములు పాడవలయును. పూర్ణాహుతియైన పిదప శ్రీ విష్ణు, శ్రీ తులసీలకు అభిషేకము చేయవలెను. బ్రాహ్మణునకు వృషభదానము, ఆచార్యునకు వస్త్ర పరివేష్టితమగు ఆవును యివ్వవలెను. ఋత్విక్కులకు వస్త్రములు, దక్షిణ - యివ్వవలెను.

శ్లో॥ ఏవం ప్రతిష్ఠితాం దేవీం విష్ణునాచసమర్చయేత్ ।
ఆజన్మోపార్జితం పాతం దర్శనేన ప్రణశ్యతి ॥
రోపయేత్ తులసీం యస్తుసేచయేచ్చప్రయత్నతః।
ప్రతిష్ఠాప్య యథోక్తేన విష్ణునా సహమానవః॥
సమోక్షం లభతే జంతుర్విష్ణులోకం తథాక్షయమ్।
ప్రాప్నోతి విపులాన్ భోగాన్, విష్ణునా సహమోదతే॥
ప్రతిష్ఠా శ్రీ తులస్యాస్తు లిఖితా విష్ణుయామళే। (హరిభక్తివిలాసము)

పై చెప్పబడిన రీతిగా శ్రీ విష్ణుప్రతిమను, శ్రీ తులసీ వృక్షమును ప్రతిష్ఠ చేసి విష్ణుసహితముగా దేవిని భక్తితో అర్చింపవలెను. అట్లు చేసిన ఆ జన్మము నందు సంపాదించిన పాపములు ఆ దృశ్య,దర్శన మాత్రముననే నశించును. ఎవరైతే శ్రీ తులసిని నాటి ప్రయత్నపూర్వకముగ నీరు పోయుచు, అచ్చట శ్రీ విష్ణువును ప్రతిష్ఠచేయునో వారు మోక్షమును పొందుదురు. శ్రీ విష్ణువుతో కూడి అక్షయసుఖముననుభవించును. ఈ తులసీ ప్రతిష్ఠావిధి విష్ణుయామళమందు లిఖించబడియున్నది ( ఓం విష్ణు ర్విష్ణుర్విష్ణు॥)

## శ్రీ తులసీ యక్షిణీ మంత్రము (దత్తాత్రేయతంత్రము)

**మూలమంత్రము :-** ఓం క్లీం క్లీం నమః.

శ్లో॥ తులసీమూల మారుడో జపే దేకాగ్రమానసః ।
అకస్మాద్రాజ్యమాప్నోతి నాన్యథాంశకరోదితం ॥

***అర్థము :-*** శ్రీ తులసి చెట్టు మొదటన బాగుగ అలికి శుభ్రముచేసి ముగ్గువేసి అలంకరించి అచ్చట కూర్చుండి ఏకాగ్రమనస్కుడై నిశీధిసమయమున ప్రతినిత్యము రోజు ఒకటికి ఐదు వేలు పై మంత్రమును 40 దినములు జపము చేసిన శ్రీ తులసీ యక్షిణీ ప్రత్యక్షమై కోరిన వరమునిచ్చును. రాజ్యప్రాప్తిని కల్గించును, యని దత్తాత్రేయతంత్రమునందు చెప్పబడియున్నది.



# శ్రీ తులసి పూజా విధానము

శ్రీ గణపతిధ్యానం : ఓం శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయే సర్వవిఘ్నోప శాన్తయే ॥
మంత్రం = ఓం శ్రీ మహాగణపతయే నమః.

శ్రీ గురుధ్యానం:- ఓం గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః ॥
మంత్రం:- ఓం గుం గురుభ్యోనమః.

శ్రీ లక్ష్మీ ధ్యానం :- ఓం మహాలక్ష్మీ నమస్తుభ్యం నమస్తుభ్యం మహేశ్వరీ।
హరిప్రియే నమస్తుభ్యం నమస్తుభ్యం దయానిధే॥
మంత్రం :- ఓం హ్రీం శ్రీం మహాలక్ష్మ్యై నమః.

శ్రీ తులసీ దేవి పూజకు కార్తీక మాసము శ్రేష్ఠమైనది.కార్తీక మాసమున ఒక తులసీ పత్రమును దానము చేసిన పదివేల ఆవులను దానము చేసినంత ఫలము లభించునని చెప్పబడియున్నది. కావున శ్రీ తులసి జన్మించిన కార్తీకమాసము పౌర్ణమీ శుక్రవారము తులసీ పూజచేయుదురు. ప్రతి సంవత్సరము కార్తీక పూర్ణిమ, శుక్రవారము రాదు, కావున కార్తీక మాసము పూర్ణిమ దినమున పూజచేయుట అనాదిగ ఆచరించ బడుచున్నది. ముఖ్యముగ శ్రీ తులసీ పూజను కార్తీక శుక్లనవమినుండి ఏకాదశి వరకు మూడు దినములు రాత్రుల యందు చేయవలయునని చెప్పబడియున్నది.

పూజకు కావలసిన, రాగిచెంబు, నీరు, రాగి ఉద్ధరిణె, రాగి పళ్ళెము, ఘంట అక్షతలు, తీర్థపాత్ర, ధూపము, దీపము, పంచామృతము, ఆవు పాలు, గంధము, పసుపు, కుంకుమ, హారతి కర్పూరము, పుష్పములు, పండ్లు, బెల్లము నెయ్యి- మున్నగు వస్తుసామగ్రి నంతయూ సిద్ధముగ యుంచుకొనవలయును.

శ్రీ తులసీ వనమునందు గానీ, తనస్వగృహము నందు గానీ తులసీవృక్ష సమక్షమున తుర్పుముఖముగ గాని, ఉత్తర ముఖముగ గాని, తాను కూర్చొని ఆరాధించవలయును. ప్రతి నిత్యము శిరస్స్నానము చేసి సంప్రదాయ ప్రకారము శ్రీ చూర్ణము లేకగోపీచందనమో తిలక ధారణము చేసుకొని పీటపై కూర్చొనవలయును.

భూతశుద్ధి :- శ్లో॥ అపసర్పంతు యే భూతాహియే భూతా భువిసంస్థితాః।
యేభూతావిఘ్నకర్తారః తే గచ్ఛన్త్వాజ్ఞయాహరేః॥

నేను చేయు దైవ కార్యములకు విఘ్నము కల్గించునవియు, ఈ అర్చనా భూమిదుందున్న సకల భూతములు శ్రీ హరియాజ్ఞచే ఈ స్థలమును వదిలి వెళ్ళి పోవును గాక! అను అర్థము గలపై భూతశుద్ధి మంత్రమును చెప్పి తన వెనుక వైపునకు అక్షతలను చల్లుకొనవలయును.

ఘంటానాదము :- శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసామ్।
కూర్యాద్ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్॥
పూజచేయుస్థలమునుండి భూతములు, రాక్షసులు వెళ్ళిపోవుటకున్నూ,
దేవతా గణములు వచ్చుట కొఱకు దేవతాహ్వానలాంఛనముగా ఘంటను వాయించి ఘంటా నాదమంత్రమును చెప్పి ఘంటానాధమును కల్గించవలెను.

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యేసర్వదేవతాః॥
యదగ్రే సర్వవేదాశ్చ తులసిత్వాం నమామ్యహం॥

అని యీ శ్లోక మంత్రమును పఠించుచు వందనములర్పించి తులసి చెట్టుయందు శుద్ధోదకమును ప్రోక్షించి "ఓం శ్రీ తులసిదేవ్యై శుద్ధోదక స్నానం సమర్పయామి" అని చెప్పవలయును. పిదప - తులసి చెట్టుకు, శాఖలకు పసుపును పూయుచూ "హరిద్రాం లేపయామి, కుంకుమంధారయామి" యని కుంకుమ బొట్టు పెట్ట వలయును. "పుష్పంపూజయామి" అని చెప్పి తులసికి పుష్పమును పెట్టవలయును. పిదప ఈ క్రింది నామములను పఠించుచు ప్రతి నామముతో పుష్పములచే తులసీ దేవిని పూజించవలెను. ఓం బృందాయైనమః। ఓం బృందావన్యైనమః । ఓం విశ్వపూజితాయైనమః। ఓం విశ్వపావన్యైనమః। ఓం పుష్పధరాయైనమః। ఓం ఆనంద్యై నమః। ఓం తులస్యై నమః। ఓం కృష్ణజీవన్యై నమః।

నానా విధపరిమళపత్రపుష్పాణి పూజయామి, యని పుష్పములను తులసిపై యుంచవలయును.

ధూపం: శ్లో॥ వనస్పతిరసోపేతోగంధాఢ్యోగంధ ఉత్తమః ।
ఆఘ్రేయః సర్వదేవానాం ధూపో ఽ యం పరిగృహ్యతామ్॥

వనస్పతుల రససారములతో కూడినదియూ, పరమోత్తమమైన సువాసనగలదియూ సర్వదేవతలూ ఆఘ్రాణించతగినదియూ యైన ఈ పరిమళధూపమును పరిగ్రహింపుము. యను యర్థముగలపై శ్లోకమును చెప్పి "ఓం శ్రీ తులసీదైవ్యై ధూపమాఘ్రాపయామి" యని ధూపమును తులసికి చూపవలయును.

దీపం: శ్లో॥ సుప్రకాశోమహాదీపః సర్వతస్తిమిరాపహః ।
సబాహ్యాభ్యన్తర జ్యోతిః దీపోయం పరిగృహ్యతామ్॥

మంచి ప్రకాశముగలదియు, మహాదీపమని ఖ్యాతి చెందినదియూ, సర్వ చీకటిని పోగొట్టునదియూ, శరీరములోపల, బయటకూడా జ్యోతిస్వరూపమైనదియూ యగు యీ దీపమును పరిగ్రహింపుము - అను అర్థమునిచ్చు పై శ్లోకమును పఠించుచు "ఓం శ్రీ తులసీ దేవ్యై దీపం సందర్శయామి" యని తులసీదేవికి దీపమును చూపవలయును.

నైవేద్యమ్: శ్లో॥ అన్నం చతుర్విధం స్వాదురసైః షడ్భిః సమన్వితమ్।
భక్ష్యభోజ్య సమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥

భక్షించుటకు భోజ్యమైన ఆహారపదార్థములతో కూడిన చతుర్విధములైన అన్నమును ఉప్పు, కారము, పులుపు, తీపి, వగరు, చేదుఅను షడ్రసములతో కూడియున్నదానిని నైవేద్యముగ గ్రహింపుము - అను అర్థము గల పైశ్లోకమును పఠించుచు "ఓం శ్రీ తులసీ దేవ్యై మహానైవేద్యం సమర్ప యామి" అని నైవేద్యమును శ్రీ తులసీ దేవికి చూపించ వలయును. పిదప ఓం ప్రాణాయనమః। అపానాయనమః వ్యానాయనమః। ఉదానాయ నమః। సమానాయనమః అనవలెను.

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. ఉత్తరా పోశనం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి. ఈవిధముగ నైవేద్యపదార్థమును శ్రీ తులసీ దేవి ముందుంచి. తులసీమూలమంత్రముతో ప్రోక్షించి, చుట్టూనీళ్ళనువదలి, పూర్వాపోశనమునిచ్చి, నైవేద్యమంత్రములతో అర్పించవలయును. నైవేద్యము సమర్పించునపుడు, "ఓం ప్రాణమునకు నమస్కారము, అపానమునకు, వ్యానమునకు, ఉదానమునకు, సమానమునకు వందనములు." మధ్యమధ్యన ఉదకపానీయమును సమర్పించవలయును. పిదప ఉత్తరాపోశనమును సమర్పించవలెను. శుద్ధాచమ నీయమును సమర్పింపవలెను.

**ప్రదక్షిణమ్:**

శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతరకృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే ॥
పాపోఽహం పాపకర్మాఽహం పాపాత్మాపాపసంభవః।
త్రాహిమాం కృపయాదేవీ శరణాగతవత్సల ॥
అన్యథాశరణం నాస్తిత్వమేవ శరణం మమ।
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన ॥

"శ్రీ తులసీ దేవ్యై ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి."

*అర్థం :-* ఈ జన్మయందును, జన్మజన్మాంతరములందును ఎన్నెన్ని పాపములను జేసితినో ఆ పాపములన్నియూ ఈ ప్రదక్షిణము చేయుట వలన ప్రతి అడుగడుగునకు నశించుచున్నది. ఓ పరమేశ్వరా! నేను పాపిని, పాపకర్మలను చేసిన పాపాత్ముడను పాపకర్మలచే జన్మించినవాడను ఈ పాపాత్ముని పై కృపకల్గిన వాడవై రక్షింపుము. ఓ శరణాగత వత్సలా! నాకునీవే శరణ్యము. నీవే నాకు దిక్కుగాన ఓ జనార్దనా! కరుణతో నన్ను రక్షింపుము.

పై శ్లోకములను పఠించుచు అక్షతలు తీసుకొని ముమ్మారు శ్రీ తులసీ వృక్షము చుట్టూ ప్రదక్షిణ చేయవలెను.

**తీర్థప్రాశనమ్ ।**

శ్లో॥ అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణమ్।
సర్వపాపక్షయకృత్ తులసీ పాదోదకం శుభమ్॥

*అర్థం :-* అకాల మరణమును పోగొట్టునది, సర్వవ్యాధులను హరించునది, సర్వ పాపములను తగ్గించునది. శుభకరమునగు శ్రీ తులసీ పాదోదకమును స్వీకరించు చున్నాను.

తీర్థ పాత్రయందలి తీర్థమును స్వచ్ఛమైనమనస్సుతో మూడు సార్లు తీర్థమంత్రముతో తీసుకొనవలెను.

తదనంతరము శ్రీ తులసీ మహామంత్రమును యథా శక్తిగ జపించవలెను.

**శ్రీతులసీమంత్రము:-**

1) ఓం శ్రీ తులసీ దైవ్యైనమః
2) ఓం ఐం క్లీం సౌం శ్రీ తులస్యైనమః
3) ఓం శ్రీం హ్రీం క్లీం ఐం బృందావనీస్వాహా.

వీటిలో దేనినైనను జపించవచ్చును. కనీసము 108 జపము శ్రేష్ఠము.

## శ్రీ తులసీ పూజావిధి

శ్రీ తులసీవనము నందుగాని తులసి చెట్టు వద్దగాని గోమయముతో అలంకరించి పసుపు కుంకుమలు బెట్టి చెట్టు మొదట శుద్ధోదకముపోసి ప్రోక్షించి, పసుపు నూరిన ముద్దతో గణపతిని చేసి ప్రతిష్ఠించి గణపతిని ధ్యానించి ఆచమనముగావించి దేవీ సాన్నిధ్యమున దీపమును వెలిగించవలెను. అగరువత్తులను వెలిగించవలయును. పిదప సంకల్పము యీ క్రిందివిధముగ చేయవలయును.

శ్లో॥ మమస్స ర్వాభీష్టసిద్ధ్యర్థం । జ్ఞాన ప్రాప్తిద్వారా మోక్షఫలావాప్త్యర్థంచ॥
భర్త్రాసహ అఖండ సుఖసౌభాగ్య సంతతాయురారోగ్యఐశ్వర్యాభి వృద్ధ్యర్థం॥
శ్రీ తులసీ దేవతా ప్రీత్యర్థంచ । బృందావనే తులసీ పూజాంకరిష్యే.

**కలశారాధనమ్ :**

శ్లో॥ కలశస్యముఖేవిష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః।
మూలేతత్రస్థితో బ్రహ్మమద్యే మాతృగణాః స్మృతాః ॥

ఈ శ్లోకమును పఠించి పిదప - తదంగ కలశారాధనం కరిష్యే. కలశం గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య.

*అర్థం:-* కలశము యొక్క ముఖమునందు విష్ణువు, కంఠమునందు రుద్రుడు, మూలమునందు బ్రహ్మ, మధ్యభాగమున మాతృగణములు ఆశ్రయించియుందురు. లోపలి జలమునందు సాగరము లన్నియూకలవు.

నేను చేయు శ్రీ తులసీ పూజాంగముగ కలశారాధన చేయుచున్నాను.

అని నీళ్ళు, అక్షతలు వదల వలెను. ఒక రాగి కలశములో శుద్ధోదకముతోనింపి వెలుపల గంధ, కుంకుమ, అక్షతలతో నలంకరించి పుష్పములను లోపలయుంచి కలశమును కుడిచేతితోపైన మూసి "కలశస్యముఖే" అను మంత్రమును పఠించవలెను.

కలశోదకమును పుష్పములతో దేవునిమీద చల్లి, తనమీద చల్లుకొనవలెను. పూజాద్రవ్యములన్నింటిమీద చల్లవలెను.

**దీపధ్యానము :**

శ్లో॥ దీపస్త్వంబ్రహ్మరూపోసి జ్యోతిషాం ప్రభురవ్యయః ।
సౌభాగ్యం దేహిపుత్రాంశ్చ సర్వాన్కామాంశ్చ దేహిమే ॥

*అర్థం:-* సుప్రకాశవంతుగల దీపవము బ్రహ్మరూపవముగలది, సాక్షాత్ ఆ పరమేశ్వరరూపమేజ్యోతి. సర్వసౌభాగ్యములను, సుపుత్రులను సర్వకామములను నాకు ప్రసాదించుము.

దీప మంత్రముతో దీపమును వెలిగించి శ్రీ తులసికి సమర్పించ వలెను.

దీపదేవతా భ్యోనమః, సకలపూజా పరిపూర్ణార్థే గన్ధాక్షత పుష్పాణి సమర్పయామి. యని చెప్పి గంధము, అక్షింతలు , పుష్పములు సమర్పించి శ్రీ తులసిన్ని ధ్యానము చేయవలెను.

**శ్రీ తులసీ ధ్యానము :**

శ్లో॥ ధ్యాయేచ్చ తులసీ దేవీం । శ్యామాం కమల లోచనామ్ ।
ప్రసన్నాం పద్మవదనాం వరాభాయచతుర్భుజామ్॥

## శ్రీ తులసీ అష్టోత్తర శత నామావళిః

ఓం శ్రీ అమృత తులసీ దేవ్యైనమః
ఓం శ్రీ సఖ్యై నమః
ఓం శ్రీ భద్రాయై నమః
ఓం శ్రీ మనోజ్ఞానవల్లభాయై నమః
ఓం పురందరసతీ పూజ్యాయై నమః
ఓం పుణ్యదాయై నమః
ఓం పుణ్యరూపిణ్యైనమః
ఓం జ్ఞానవిజ్ఞాన జనన్యైనమః
ఓం తత్త్వజ్ఞాన స్వరూపిణ్యైనమః
ఓం జానకీదుఃఖ శమన్యైనమః (10)
ఓం జనార్థనప్రియాయైనమః
ఓం సర్వకల్మష సంహార్త్యై నమః
ఓం స్మరకోటి సమప్రభాయై నమః
ఓం పాంచాలీ పూజ్యచరణాయైనమః
ఓం పాపారణ్యదవనలాయై నమః
ఓం కామితార్థప్రదాయై నమః
ఓం గౌరీశారదా సంసేవితాయై నమః
ఓం వందారుజనమందారాయై నమః
ఓం నిలింపాభరణసక్తాయై నమః
ఓం లక్ష్మీచంద్రసహోదర్యైనమః (20)
ఓం సనకాదిమునిధ్యేయాయైనమః
ఓం కృష్ణానంద జనయిత్ర్యై నమః
ఓం చిదానంద స్వరూపిణ్యైనమః
ఓం నారాయణ్యైనమః (24)

ఓం సత్వరుపాయై నమః
ఓం మాయాతీతాయై నమః
ఓం మహేశ్వర్యైనమః
ఓం శుభప్రదాయై నమః
ఓం వదనచ్ఛవిని ర్ధూతరాకాపూర్ణ -
నిశాకరాయై నమః
ఓం రోచనాపంకతిలకనన్నిటల-
భానురాయై నమః(30)
ఓం శుద్ధాయైనమః
ఓం పల్లవోష్ఠ్యైనమః
ఓం పద్మముఖ్యైనమః
ఓం ఫుల్లపద్మ దళేక్షణాయై నమః
ఓం చంపేయకలికాకారనాసా-
దండవిరాజితాయై నమః
ఓం మందస్మితాయై నమః
ఓం మంజులాంగ్యై నమః
ఓం మాధవప్రియభామిన్యైనమః
ఓం మాణిక్యకంకణకరాయైనమః
ఓం మణికుండలమందితాయై నమః 40
ఓం ఇంద్రసంపత్కర్యైనమః
ఓం శక్త్యైనమః
ఓం ఇంద్రగోపనిభాంశుకాయైనమః
ఓం క్షీరాబ్దినయాయైనమః
ఓం క్షీరసాగర సంభవాయైనమః
ఓం శాంతికాంతి గుణోపేతాయై నమః
ఓం బృందానుగుణసంపత్యైనమః
ఓం పూతాత్మికాయై నమః
ఓం పూతనాదిస్వరూపిణ్యైనమః
ఓం యోగిధ్యేయాయైనమః (50)
ఓం యొగనందవిధాయై నమః
ఓం చతుర్వర్గ ప్రదారామాయైనమః
ఓం చతుర్వర్గకపావనాయైనమః
ఓం త్రిలోకజనన్యైనమః

ఓం గృహమేధిసమారాధ్యాయై నమః
ఓం సదనాంగణపావనాయై నమః
ఓంమునీంద్రహృదయావాసాయైనమః
ఓం మూలప్రకృతిసంజ్ఞికాయైనమః
ఓం బ్రహ్మరూపిణ్యై నమః
ఓం పరంజ్యోతిషేనమః
ఓం అవజ్ఞానసగోచరాయై నమః
ఓం పంచభుతాత్మికాయై నమః
ఓం పంచకాలాత్మికాయైనమః
ఓం యోగాచ్యుతాయైనమః
ఓం యజ్ఞరూపిణ్యైనమః
ఓం సంసారదుఃఖ శమన్యైనమః
ఓం సృష్టిస్థిత్యంత కారిణ్యైనమః
ఓం సర్వప్రపంచనిర్మాత్ర్యైనమః
ఓం వైష్ణవ్యై నమః
ఓం మధురస్వరాయై నమః (70)
ఓం నిరీశ్వరాయనమః
ఓం నిర్గుణాయై నమః
ఓం నిత్యాయైనమః
ఓం నిరాటంకాయైనమః
ఓం దీనజనపాలతత్పరాయైనమః
ఓం రణత్కింకిణీ జాలరత్నకాంచీల -
సత్కట్యైనమః
ఓం చలన్మంజీర చరణాయై నమః
ఓం చతురానన సేవితాయైనమః
ఓం అహోరాత్రకారిణ్యై నమః
ఓం ముక్తాహారభరాక్రాంతాయైనమః (80)
ఓం ముద్రికారత్న భాసురాయై నమః
ఓం సిద్ధి ప్రదాయైనమః
ఓం అమలాయై నమః
ఓం కమలాయై నమః
ఓం లోకసుందర్యై నమః

ఓం హేమకుంభకుచద్వయాయైనమః
ఓం హరిద్రాకుంకుమాసక్తాయైనమః
ఓం చంచలాయైనమః
ఓం లక్ష్మ్యైనమః
ఓం శ్రీ కృష్ణప్రియాయై నమః (90)
ఓం శ్రీ రామప్రియాయైనమః
ఓం శ్రీ విష్ణుప్రియాయైనమః
ఓం శంకర్యైనమః
ఓం శివశంకర్యైనమః
ఓం శ్రీ తులస్యై నమః
ఓం కుందకుట్మలరదనాయైనమః
ఓం పక్వబింబోష్ఠైనమః
ఓం శరచ్చంద్రికాయై నమః
ఓం చాంపేయనాసికాయైనమః
ఓం కుంబుసుందరగళాయై నమః
ఓం తటిల్లతాంగ్యైనమః
ఓం మత్తబంభరకుంతలాయైనమః
ఓం నక్షత్రనిభనఖాయై నమః
ఓం రంభానిభోరుయుగ్మాయైనమః
ఓం సైకతశ్రోణ్యైనమః (105)
ఓం కంఠీరవేంద్రమధ్యాయై నమః
ఓం కిరవాణ్యై నమః

ఓం శ్రీ మహాతులస్యై నమః (108)

ఓం శ్రీ అష్టోత్తర శతనామపుజాం సమర్పయామి.

ధూపం:

శ్లో :- వనస్పతిరసోద్భూతో గంధాఢ్యోగంధ ఉత్తమః।
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోఽ యంప్రతి గృహ్యతామ్ ॥

ఓం శ్రీ తులసీ దేవ్యైనమః ధూపమాఘ్రాపయామి.

అర్థం :- ఓ తల్లీ తులసీ దేవీ! వనస్పతులసారముతో కూడినదియూ, విశిష్టోత్తమమునైన సువాసనగలదియూ, సర్వదేవతలు ఆఘ్రాణించ తగినదియూ యైన ఈ ధూపమును పరిగ్రహింపుము.

నైవేద్యం:

శ్లో : -అన్నం చతుర్విధం స్వాదురసైః షడ్భిః సమన్వితమ్ ।
భక్ష్య భోజ్యసమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్॥

ఓం శ్రీ తులసీదేవ్యైనమః । మహానైవేద్యం సమర్పయామి.

ఓం ప్రాణాయనమః, అపానాయనమః, వ్యానాయనమః, ఉదానాయనమః, సమానాయనమః. మధ్యేమధ్యే పానీయం సమర్పయామి, ఉత్తరాపోశనం సమర్పయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

అర్థం :- ఓ తల్లీ తులసీ దేవీ ! సేవించుటకు అనుకూలమైన ఆహార పదార్థములతో కూడిన చతుర్విధములైన అన్నమును, షడ్రుచులైన ఉప్పు, కారము, పులుపు, తీపి, వగరు, చేదులను ఆరురసములతో కూడిన ఆహారమును నైవేద్యముగ సమర్పించుచున్నాను. ప్రాణవాయువునకు వందనములు, అపానవాయువునకు, వ్యానవాయువునకు,

ఉదానవాయువునకు, సమానవాయువునకు వందనములు. మధ్య మధ్య ఉదక పానీయమును సమర్పించుచున్నాను. ఉత్తరాపోశనమును సమర్పించుచున్నాను. శుద్ధాచమనీయమును సమర్పించుచున్నాను.

**ఫలం :**

శ్లో॥ ఇదం ఫలం మయాదేవి! స్థాపితం పురతస్తవ।
తేన మేసఫలావాప్తిర్భవే జ్జన్మని జన్మని ॥

ఓం శ్రీ తులసీ దేవ్యైనమః, ఫలం సమర్పయామి.

*అర్థం:-* ఓ మాతా! తులసీ దేవీ! నా చేయిూఫలములు నీముందుంచ బడినది. దానిని పరిగ్రహించి అనేక జన్మల నా జీవితమును సఫలము చేయుము. ఈ అర్చనాఫలమును పరిగ్రహింపుము.

**తాంబూలం :**

శ్లో॥ పూగీఫలం మహద్దివ్యం నాగవల్లీదళైర్యుతం।
ముక్తాచూర్ణసమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥

"ఓం శ్రీ తులసీ దేవ్యైనమః తాంబూలం సమర్పయామి".

*అర్థం:-* ఓ దేవీ! తులసీమాతా! పోకచెక్కలు, పచ్చకర్పూరము, తమలపాకులు ముక్తాచూర్ణములతో మిశ్రితమైన తాంబూలమును సమర్పించుచున్నాను. పరిగ్రహింపుము.

**నీరాజనం:-**

శ్లో॥ నీరాజయామి సతతం హరివల్లభే ఒద్య।
కర్పూరవర్తి భిరలం సుఖదాయికేత్వామ్॥
పాదౌ భజామి నరతం తవదేవి మాయే।
వంశాయ సౌఖ్యమపి దేహిబలంచ పూర్ణమ్॥

"ఓం శ్రీ తులసీ దేవ్యైనమః కర్పూరనీరాజనం సమర్పయామి".

*అర్థం:-* ఓ జగన్మాతాతులసీదేవీ! సర్వసుఖములను ఇచ్చుటకు, నాయొక్క వంశసౌఖ్యమును కల్గించుటకు, నాశరీరమునకు సంపూర్ణబలమును చేకూర్చుటకు, నీ పాద పద్మములకు పూజించి కర్పూర నీరాజనమును సమర్పించుచున్నాను. పరిగ్రహింపుము

**ప్రదక్షిణం:-**

శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥
నమస్తేకళ్యాణి నమస్తులసి సర్వగే।
నమోవేదమయే దేవినమస్తే హరివల్లభే॥

"ఓం శ్రీ తులసీ దేవ్యైనమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి".

అర్థం:- ఓ దేవీ! కల్యాణీ! తులసీ! ఈ జన్మయందు, జన్మజన్మాంతరముల యందు జేసిన సమస్త పాపములను ఈ ప్రదక్షిణము చేయుటతో అడుగడుగున నశించునట్లు అనుగ్రహించుటకై నమస్కరించుచున్నాను.

పుష్పాంజలి:-

శ్లో॥ విష్ణుప్రియకరే దేవి తులసీ సుఖదాయికే।
పుష్పాంజలిం ప్రయచ్ఛామి పతే నాయుష్య వర్ధనీ॥
"ఓం శ్రీ తులసీ దేవ్యైనమః మంత్రపుష్పాంజలి సమర్పయామి".

అర్థం:- ఓ దేవీ! తులసీ! సర్వసుఖములనిచ్చు దానివి, విష్ణుప్రియవు, ఆయువును వృద్ధి చేయుటకై మంత్రపుష్పాంజలిని సమర్పించుచున్నాను. పరిగ్రహింపుము.

అర్ఘ్యం:-

శ్లో॥ గంధప్రసూన సంయుక్తం ఫలముద్రాది శోభితం।
అర్ఘ్యందదామి తులసి తవ ప్రీత్యై నమోనమః॥
"ఓం శ్రీ తులసీ దేవ్యైనమః అర్ఘ్యత్రయం సమర్పయామి".

అర్థం:-ఓమాతా తులసీ! సమస్తగంధ, ఫలపుష్ప అర్ఘ్యములను తులసీదేవీప్రీతికొరకై సమర్పించుచున్నాను. పరిగ్రహింపుము.
పిదప ఈ క్రింది శ్లోకములతో శ్రీతులసిని ఏకాగ్రచిత్తముతో ప్రార్థించుచూ నమస్కరించవలయును.

శ్లో॥ సౌభాగ్యసంతతిం దేవి ధనం ధాన్యంచమే సదా।
ఆరోగ్యం శోకశమనం కురుమే మాధవప్రియే॥
ప్రసీదమేత్వం సర్వత్ర కృపయాపరయాముదా॥
అభీష్టఫల సంసిద్ధిం కురుమేమాధవప్రియే॥
నమస్కరోమి దేవిత్వాం విష్ణువక్షఃస్థలే స్థితాం।
ప్రణతార్తి హరేనిత్యం ఆభీష్టఫలదా భవ॥
"ఓం శ్రీతులసీదేవ్యైనమః ప్రార్థనాం సమర్పయమి".

అర్థం:- ఓ కృపామయీ! దేవీ! తులసీ! సకల సౌభాగ్యములు, సత్సంతానము, ధనము, ధాన్యము, ఆరోగ్యము, దుఃఖశమనము, దయ, అభీష్ట ఫలసిద్ధిమునగువాటిని నాకుప్రసాదించుటకై ప్రతినిత్యము నిన్ను ప్రార్థించుచున్నాను.

పిదప అక్షతలను, పుష్పములను చేతియందుంచుకొని "అనయా మయాకృత పూజయా। యధాశక్త్యా శ్రీ తులసీ దేవతాప్రియతామ్" యనిపఠించి నీటితోపాటు అర్ఘ్యపాత్రలో పుష్పాక్షతలను వదలవలెను. పిదప "సర్వం శ్రీతులసీ దేవ్యైర్పణమస్తు" యని వందనప్రదక్షిణములను స్త్రీలు తమశక్తికొలది 27,54,108. సార్లు చేయవలెను.

ఇతి శ్రీ తులసీ పూజావిధిస్సమాప్తః

## భవిష్యపురాణమునందలి తులసీ లక్ష ప్రదక్షిణవిధిః

**నారదఉవాచ:**

శ్లో॥ రోప్యతేయేన విధినా తులసీ పూజ్యతే సదా।
తదాచక్ష్వ మహాదేవ మమానుగ్రహకారణాత్॥

**మహాదేవఉవాచ:**

శ్లో॥ శుభేపక్షే శుభేవారే శుభేఋక్షే శుభోదయే।
సర్వదా కేశవార్థంతు రోపయే త్తులసీంమునే॥
గృహస్యాం కణమధ్యేవా గ్రహ హేస్యో పవనే ఽపివా।
శుచౌదేశే సతులసీ మర్చయేద్బుద్ధి మాన్నరః॥
మూలేచ వేదికాం కుర్యా దాలవాల సమిన్వితాం।
ప్రాతస్సంధ్యావిధిం కృత్వా స్నానపూర్వం దినేదినే॥

**ధ్యానమ్:**

శ్లో॥ గాయత్ర్యష్టశతం జప్త్వా తులసీం పూజయేత్తతః।
ప్రాఙ్ముఖోద ఙ్ముఖోవాపి స్థిత్వా ప్రయతమానసః॥
ధ్యాయేచ్చ తులసీం దేవీం శ్యామాం కమలలోచనాం।
ప్రసన్నాం పద్మవదనాం వరాభయ చతుర్భుజాం॥
కిరీట హార కేయూర కుండలాది విభూషణాం।
దవళాం శుకసంయుక్తాం పద్మాసన నిషేవితాం॥

ధ్యానంకరిష్యే.

**ఆవాహనం:-**

శ్లో॥ దేవీ త్రైలోక్య జనని సర్వలోకైక పాలిని।
ఆగచ్ఛ భగవత్యత్ర ప్రసీద తులసీప్రియే॥

ఆవాహనం సమర్పయామి.

ఆసనం:

శ్లో॥ సర్వదేవమయేదేవి సర్వదావిష్ణువల్లభే।
దేవి స్వర్ణమయం దివ్యం గృహాణాసనమవ్యయే॥
ఆసనం సమర్పయామి.

పాద్యం:

శ్లో॥ సర్వదేవమయేదేవి సర్వదేవ నమస్కృతే।
దత్తం పాద్యం గుహాణేదం తులసీత్వం ప్రసీదమే॥
పాద్యం సమర్పయామి.

అర్ఘ్యం:

శ్లో॥ సర్వతీర్థమయాకారే సర్వాగమనిషేవితే।
ఇదమర్ఘ్యం గృహాణత్వం దేవి దైత్యాన్తకప్రియే॥
అర్ఘ్యంసమర్పయామి.

ఆచమనం:

శ్లో॥ సర్వలోకస్య రక్షార్థం సదాసన్నిధి కారిణే।
గృహాణ తులసి ప్రిత్యాఇద మాచమనీయకం॥
ఆచమనీయసంసమర్పయామి.

స్నానం:

శ్లో॥ సుగంధి సర్వతీర్థేభ్యః సమానీతం జలం శుభం।
స్నానార్థం తులసి స్వచ్ఛం ప్రీత్యా తత్రృతి గృహ్యతాం॥
స్నానం సమర్పయామి.

వస్త్రం:

శ్లో॥ క్షీరోద మధనోద్భూతే చంద్రలక్ష్మి సహోదరి।
గృహ్యతాం పరిధానార్థమిదం క్షేమాంబరంశుభే॥
వస్త్రం సమర్పయామి. కంచుకం (అవిక) సమర్పయామి.
ఆచమనం సమర్పయామి.
శ్లో॥ గంధం పుష్పం తథాదూపం దీపం నైవేద్యమేవచ।
తాంబూలం దక్షిణాంచైవ మంత్రపుష్పం తతశ్చరేత్॥

ప్రార్థన:

శ్లో॥ ప్రసీద మమదేవేశే కృపయా పరయా ముదా।
అభీష్టఫల సిద్ధించకురుమే మాధవప్రియే॥
శ్లో॥ దేవైస్త్వం నిర్మితా పూర్వమర్చితా ఒ సిమునీశ్వరైః।
నమోనమస్తే తులసి పాపం హరహరిప్రియే॥

శ్లో॥ తులస్యమృతజన్మాసి సదాత్వం కేశవప్రియే।
కేలవార్థం విచిన్వామి శరదా తవ శోభనే॥ (ఇతిప్రార్థనా)

ఫలశృతి:

శ్లో॥ ఇత్యేవ మర్చయేన్నిత్యం ప్రాతరేవ శుచిర్నరః।
మధ్యాహ్నే వాధసాయాహ్నే పూజయేత్ప్రయతోనరః॥
వైశాఖే కార్తి కే మాఘే చాతుర్మాసే విశేషతః।
పూజయే త్తులసీం దేవీ మపూపఫల పాయసైః॥
అన్యద్గుహ్యతమం కించిత్కథయామి తవాగ్రతః।
ప్రదక్షిణేఫలం చైవనమస్కారే తథైవచ॥

శ్లో॥ ఏవం కుర్యాద్బుద్ధి కామః సర్వకామః సదైవతు।
పంచాశద్భిర్భ వేలక్ష్మీః శతైశ్చవిజయః స్మృతః॥
విధ్యార్థీతు సహస్రంవై అయుతే సర్వసంపదః।
లక్ష్మీతు సర్వసిద్ధిః స్యాన్నాత్రకార్యా విచారణా॥
యంయం చింతయతే కామంతంతు ప్రాప్నోతిసర్వతః।
భుక్త్వా మథేప్సితాన్ భోగానంతే మోక్షమవాప్నుయాత్॥

శ్లో॥ ఇదం ఫలం కోటియుతం భవేదత్ర నసంశయః।
లక్ష సంఖ్యాశ్చ కర్తవ్యా స్తులస్యాశ్చ ప్రదక్షిణాః॥
తదా ఉద్యాపనం కుర్యాత్తేన సమ్యక్ఫలం లభేత్।
ఉద్యాపనం వినా విప్రఫలం నైవ భవేత్క్వచిత్॥
తస్మాత్సర్వ ప్రయత్నేన ఉద్యాపన విధిం శృణు।
సౌవర్ణీం ప్రతిమాం విష్ణోః శంఖచక్ర గదాన్వితాం॥
తులస్యాయతనంచైవ కుర్యాత్సౌవర్ణ నిర్మితం।
హేమాదినిర్మితే కుంభే పూర్ణపాత్ర సమన్వితే॥
పుణ్యోదకైః పంచరత్నైః కుశదూర్వా ప్రపూరితే।
తస్యోపరిన్యసే ద్విష్ణుం లక్ష్మ్యాతు తులసీసమః॥

శ్లో॥ పూజాం పురుషసూక్తేన కుర్యాత్సర్యం ప్రయత్నతః।
ఉపచారైః షోడశభిర్భ భావేన సమ్మితః॥
రాత్రౌ జాగరణం కుర్యాత్పురాణై ర్వేద పాఠకైః।
వైష్ణవైశ్చవ బంధైశ్చ నృత్యైర్వాద్యై స్తథైవచ॥
తతః ప్రాతః సముత్థాయ హోమంకుర్యాద్విధానతః।
వైష్ణవేనతు మంత్రేణ తిలాజ్యేన విశేషతః॥

పాయసేన మృతాక్తేన అష్టోత్తర సహస్రకం।
ఆచార్యాయ సవత్సాంగాం దక్షిణా వస్త్రసంయుతాం॥
బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చా సహస్రం వాథ శక్తితః।
శతంవా భోజయేద్ధీమా నష్టా వింశతి వాపునః॥
తేభ్యో ఒపి దక్షిణాం దద్యాద్విత్త శాఠ్యం నకారయేత్।
ఏవం యః కురుతే మర్త్యస్తస్య పుణ్యఫలం శృణు॥

శ్లో॥ అశ్వమేధసహస్రస్య వాజపేయ శతస్యచ।
తత్పుణ్యం లభతే మర్త్యో నాత్ర కార్యావిచారణా॥

శ్లో॥ ఇదం రహస్యం పరమం నవాచ్యం యస్యకస్యచిత్।
విష్ణుప్రీతికరం యస్మాత్తస్మాత్సర్వ వ్రతాధికం॥
ప్రదక్షిణం తులస్యాస్తు మాహాత్మ్యం శృణుయాన్నరః।
సకృద్వా పఠతే యోవై సగచ్ఛేద్వైష్ణవంపదం॥

**ఇతి శ్రీతులసీ వ్రతోద్యాపనం భవిష్యత్పురాణోక్తం సంపూర్ణం.**

శ్రీ తులసీ పూజా విషయమైయింకయూ అనేకగ్రంధములందు, పురాణములందు, సంహితలయందు విశేషముగ చెప్ప బడియున్నది. కానీగ్రంథ విస్తరభీతి చేతను, ఇయ్యదియూ, యొక పురాణముగునేమో యనియూ, ఎన్నిగ్రంథములు పఠించిననూ సార మొక్కటే యనుసూక్తిననుసరించి తుదిగ శ్రీభవిష్యోత్తపురాణమునందలి శ్రీ తులసీ వ్రతోద్యాపనం, మరియూ శ్రీ సనత్కుమార సంహిత యందలి తులసీ విష్ణు వివాహః కార్తికశుక్లైకాదశ వ్రతముతో ముగించుచు, శ్రీ తులసి యొక్క వైద్య గుణములను, ప్రయోజనములను, మున్నగువాటిని తెలియబరచుచున్నాము.

## శ్రీతులసీ వ్రతపూజ ( లక్షతులసీ పూజా) (శ్రీ భవిష్యోత్తరపురాణః)

**మాసపక్షాద్యుల్లిఖ్య:-**

సంకల్పం:- మమసప్తపాపక్షయార్థం శ్రీ మహావిష్ణుప్రీత్యర్థం తులసీ లక్షపుజాంకరిష్యే. (ఇతిసంకల్ప్య)

**తులసీ ప్రార్థనా:**

శ్లో॥ దేవైస్త్వం నిర్మితాపూర్వంఅర్చితాసిమునీశ్వరైః।
నమోనమస్తేతులసీ పాపంహర హరిప్రియే॥
కేశవార్థం విచిన్వానః వరదా భవశోభనే।
సంగృహ్యతులసీ పత్రం విష్ణోర్భక్త్యా సమర్పయేత్॥

కృష్ణఉవాచ:

అథరాజన్ ప్రవక్ష్యామి లక్ష శ్రీతులసీవ్రతం।
విష్ణుప్రీతికరం నృణాంవిష్ణుభక్తి ప్రవర్ధనం॥
శ్లో॥ తులసీ ప్రభవైః పత్రైః యోనరః పూజయేద్ధరిం।
నసలి ప్యేత పాపౌఘైః పద్మపత్ర మివాంభసా॥
సువర్ణ భారమేకంతు రజతంచ చతుర్గుణం।
తత్ఫలం సమవాప్నోతి తులసీదళ పూజనాత్॥
రత్నవైడూర్యముక్తాభిః ప్రవాళా దిభిరర్చిత।
నతుష్యతి తథా విష్ణుస్తులసీ పూజనాద్యథా॥
తులసీ మంజరీ భిస్తు పూజితో యేన కేశవః।
ఆజన్మకృత పాపస్య తేనసం మార్జితాలిపిః॥
యాదృష్టా నిఖిలార్తి పాపశమనీ స్పృష్టావపుః పావనీ।
రోగాణా మభివందితానిరసనీ సిక్తాంతకత్రాసినీ॥
ప్రత్యాసక్తి విదాయినీ భగవతః కృష్ణస్య సంరోపితా।
యస్యార్చాకరణే ఒపిముక్తిఫలదా తస్యై తులస్యైనమః॥
శ్లో॥ కార్తి కేమాసికుర్వన్తి మాఘేవా మధువైరిణే।
అర్పణం తులసీపత్ర సహస్రస్య దినేదినే॥
ఏవం మాసత్రయం కుర్యాత్తత ఉద్యాపనం చరేత్।
వైశాఖే మాఘఊర్జేవా కుర్యా దుద్యాపనం క్రమాత్॥
యస్మిన్ మాసే ప్రకర్తవ్యం గురుశుక్రోదయేసతీ।
హరేర్దినే శుభేమాసి కుర్యాదుద్యాపనం వ్రతీ॥
శ్లో॥ ఆచార్యం వరయేదాచౌ వేదవేదాంగ పారగం।
దాంతం శాంతం తథాసౌమ్యం నిత్యం బ్రాహ్మణవర్చసం॥
శ్లో॥ విదిజ్ఞం తత్త్వవేత్తారం శుచిష్మంతం తపస్వినం।
స్వగృహ్యోక్తేన మార్గేణ పూర్వేద్యుః స్వస్తివాచనం॥
సౌవర్ణీం ప్రతిమాం విష్ణో శ్శంఖచక్ర గదాన్వితాం।
తులస్యాయతనం చైవ కుర్యాద్ధే మవినిర్మితం॥
హేమాదినిర్మితం కుంభం పూర్ణపాత్ర సమన్వితం।
పుణ్యోదకైః పంచరత్నైః కుశదూర్వా ప్రపూరితం॥
తస్యోపరిన్యసే ద్విష్ణుం లక్ష్మ్యాచతులసీ సమం।
పూజాం పురుష సూక్తేన కుర్యాద్బ్రహ్మాదిదేవతాః॥

ఉపచారై షోడశభిః పూజ యేచ్ఛ యథాహరిం।
రాత్రౌ జాగరణం కుర్యాత్పురాణై ర్వేదపాఠకైః॥
తతః ప్రాతః సముత్థాయహోమం కుర్యాద్విధానతః!
వైష్ణవేనతు మంత్రేణ తిలాజ్యేన విశేషతః॥
పాయసేన ఘృతాక్తేన అష్టోత్తర సహస్రకం।
ఆచార్యాయ సవత్సాంగాం దక్షణా వస్త్రసంయుతాం॥
బ్రాహ్మణాన్ భోజయే త్పశ్చాత్సహస్రం వాథశక్తితః।
శతం వాష్టాం వింశతింవా భోజయేద్బ్రాహ్మణాన్ బుధః॥
తేభ్యో ఒపి దక్షిణాం దద్యాద్విత్త శాఠ్యం నకారయేత్।
ఏవం యః కురుతే మర్త్యో విష్ణుసాయుజ్యమాప్నుయాత్॥
విష్ణు ప్రీతికరం యస్మాత్తస్మా త్సర్వ వ్రతాధికం।
తులసీ లక్షపూజోక్తం మాహాత్మ్యం శృణుయాన్నరః॥
సకృద్వాపి పఠేన్నిత్యం సగచ్ఛేద్వైష్ణవం పదం।
హోమభస్మ సమాదాయ రక్షాం కృత్వా తథా ఒత్మనః॥
బ్రహ్మరాక్షస భూతానాం శాంతయే కారయేదిదం।
సర్పాది భాదకే ప్రాప్తే గర్భిణ్యా శ్శిశునిర్గమే॥
భస్మప్రోక్షణ మాత్రేణ సర్వం నశ్యేద్భయంన్నృణాం॥

**ఇతి శ్రీ భవిష్యోత్తరపురాణే లక్షతులసీ వ్రతోద్యాపనం సంపూర్ణం.**

## శ్రీ తులసీ విష్ణుః వివాహోః బోధనైకాదశీ కథా ఉద్యాపనంచ.

**వాలాఖిల్యాదూచుః**

శ్లో॥ తతః ప్రభాతసమయే తులసీంవిష్ణు సమర్చయేత్।
వహ్నిసంస్థాపనం కృత్వా ద్వాదశాక్షర విద్యయా॥
పాయసాజ్య క్షౌద్రతిలైర్హువే దష్టోత్తరం శతమ్।
రతః స్విష్టకృతం హుత్వాదద్యా త్పూర్ణాహుతిం తతః॥
ఆచార్యంచ సమభ్యర్చ్యహోమశేషం సమాపయేత్।
చతురో వార్షికాన్మాసాన్నియమం యస్యయత్కృ తమ్॥
కథయిత్వా ద్విజేభ్యస్తత్త థాన్యత్పరిపూజ యేత్।
ఇదంవ్రతం మయాదేవకృతం ప్రీత్యైతవప్రభో॥
న్యూనం సంపూర్ణతాం యాతుత్వత్ప్రసాదా జ్జనార్దన।
రెవతీతుర్యచరణేద్వాదశి సంయుతేనరః।
నకుర్యాత్పారణం కుర్వన్ వ్రతం నిష్ఫలతాం వ్రజేత్॥

తతఏషాం పదార్థానా వర్జనంతు కృతం భవేత్।
చాతుర్మాస్యే_థావా తూర్ణే బ్రాహ్మణేభ్యస్సమర్పయేత్॥
తతస్సర్వం సమశ్నీయాత్ యద్యదుక్తం వ్రతేష్టితః।
దంపతిభ్యాం సహైవాత్రభోక్తావ్యం వాద్విజైస్సహ॥
తతో భుక్తోత్తరం యాని గళితాని దళానిచ।
తులస్యాస్తాని భుక్త్వాతు సర్వపాపైః ప్రముచ్యతే॥
భోజనానంతరం విష్ణోరర్పితం తులసీదళమ్।
భక్షణాత్పాప నిర్ముక్తి శ్చాంద్రాయణ శతాధికమ్॥
ఇక్షుకంబం తథా ధాత్రీపలం, పూగీఫలం తథా।
భుక్త్వాతు భోజనస్యాంతేతస్యోచ్ఛిష్టం వినశ్యతి॥
ఏషుత్రిషున భుక్తంచే ద్దైకైక మపియేనతు।
జ్ఞేయఉచ్ఛిష్ట ఆవర్షంనరో_సౌనాత్ర సంశయః॥
తతస్స్వయం పునః పూజ్యౌ ఇక్షువంశైశ్చ మండితౌ।
తులసీవాసుదేవౌచ కృతకృత్యో భవేత్తతః॥
తతోవిసర్జనం కుర్యాద్దత్యాదేయాదికం హరేః।
వైకుతం గచ్ఛ భగవన్ తులస్యాసహిత ప్రభో॥
మత్కృతం పూజనం గృహ్య సంతుష్టోభవ సర్వదా।
గచ్ఛ గచ్ఛ సురశ్రేష్ఠ స్వస్థానం పరమేశ్వర॥
యత్రబ్రహ్మాదయో దేవాస్తత్ర గచ్ఛ జనార్ధన।
ఏవం విసర్జ్య దేవేశ మాచార్యాయ ప్రదాపయేత్॥
మూర్త్యాదికం సర్వమేవ కృతకృత్యో భవేన్నరః।
ప్రతివర్షం కరోత్యేవ తులస్యు ద్వాహానం శుభం॥
ఇహలోకే పరత్రాపి విపులం సద్యశో భవేత్।
ప్రతివర్షంతు యః కుర్యాత్తులసీ కరపీడనమ్॥
భక్తిమాన్ ధనధాన్యైశ్చ యుక్తోభవతి నిశ్చితమ్॥

ఇతి శ్రీ సనత్కుమార సంహితాయాం కార్తిక శుక్లైకాదశీ వ్రతమ్ సమాప్తమ్.







# శ్రీ తులసీ ( వైద్యవిజ్ఞానము.)

## శ్రీ తులసి అధునిక ఆయుర్వేద విజ్ఞానము

కుటుంబము: లబియటాయ్ (Labiatae) పేరు: (ఆంగ్లము) ఒసిమమ్ సాంక్టమ్ ( లిన్).(Ocimum Sanctum(Linn).

తెలుగు: శ్రీ తులసీ. ఇతరభాషలలో పేర్లు : తమిళము- శ్రీతులసి

సంస్కృతము: శ్రీ తులసీ, గౌరి, మంజరి సురస, బృంద, హరిప్రియ, సురభి.

కన్నడము: తులసి. మళయాళము: తులసి.

హిందీ: తుల్సీ: బసిల్. ఆంగ్లము: Sacred Basil, Holy Basil.

శ్రీ తులసి చెట్టు ప్రపంచమంతటా యథేచ్ఛగా పెరుగునట్టి పవిత్రమైన చెట్టు. తులసిచెట్టు తెలియని హిందువులేూక, ప్రపంచమున ఏమత, జాతి యందును లేదనియే చెప్పవచ్చును. ప్రపంచప్రఖ్యాతి గాంచిన చెట్టుయిది.

ఇది నిటారుగ పెరిగి ప్రక్కలయందు శాఖలను కల్గియుండును. 2 నుండి 4 అడుగుల ఎత్తువరకు పెరుగును. ఆకులు ఎదురెదురుగ యుండి 5 సె.మీ.పొడవు 2 సె.మీ. వెడల్పు కలిగియుండి. చుట్టూ కంగోరా కల్గియుండును. ఆకులు, కాడలూ, వీటియందంతయూ సన్ననినూగు కల్గియుండును. చెట్టు ముదిరినకొలది వెన్ను అనగ పుష్పజట పుట్టును. వెన్నునిటారుగ పైకి జడవలె పెరిగి, సుక్ష్మమైన పూగుచ్ఛములను కల్గి, యందుండి సూక్ష్మమైనపువ్వులు లేతవంగ పువ్వురంగులో యుండును. పువ్వునందు నాలుగు కంగోరాలు ఒక ప్రక్కయూ ఒక కంగోరావరుప్రక్కనయుండి ఒకకంగోరానుయంటుకొని పుప్పొడికాడలు పువ్వుకంటెపొడవుగ యుండును. పువ్వులు ముదిరిన పిదప పుష్పము యొక్కరక్షక ప్రతములలోపల సూక్ష్మమైనగింజలు నెమలిగుడ్డు ఆకారములో, నల్లనిరంగులో యుండును. ఈగింజలనునీళ్ళలోవేసిన గుజ్జువంటిపదార్థము జిగటుగ గింజలపై పుట్టును. చెట్టంతయూ ఒకవిధమైన ఘాటు వాసన కల్గియుండును.

తులసీలో అనేకరకములు కలవు. సుమారు 20కిపైబడిన రకములు కలవని ఆయుర్వేదగ్రంథములందు చెప్పబడియున్నది. తమిళవైద్యనిఘంటు కర్త శ్రీ టి.వి. సాంబశివం పిళ్ళైచే వ్రాయబడిన గ్రంథమునందు-ఈ క్రింద తెలుపబడిన 18 రకములైన తులసి చెట్లు కలవని చెప్ప బడియున్నది.

అవి:-

| వ సం. | తమిళమున పేర్లు | తెలుగు పేర్లు | వృక్షశాస్త్ర పేర్లు | ఆంగ్లమున పేర్లు |
|---|---|---|---|---|
| 1. | పెరుంతులసి | పెద్ద తులసి | Ocimum Gratissimum | Big Basil |
| 2. | కరుంతులసి | నల్లతులసి (కృష్ణ) | Ocimum Sanctum | Black Basil |
| 3. | ఇరామ తులసి | రామ తులసి | Basilicum Indicum | Hero Basil |
| 4. | వెన్ తులసి | తెల్ల తులసి (శ్వేత) | Ocimum Album | white Basil |
| 5. | శివ తులసి | శివ తులసి | Ocimum Tenuiflorum | Shiva Basil |
| 6. | నాయ్ తులసి | కుక్క తులసి | Ocimum Canum | Dog Basil |
| 7. | కాట్టురామతులసి | అడవి రామ తులసి | Basilicum Indicum wild | Rama Basil |
| 8. | ఎలుమిచ్చంతులసి | నిమ్మ తులసి | Ocimum Fruit Esence | Lemon Basil |
| 9. | కాట్టు తులసి | అడవి తులసి | Ocimum Adsendens | Wild Basil |
| 10. | ఇలక్ష్మి తులసి | లక్ష్మి తులసి | Ocimum Cristatum | Upland Tulisi |
| 11. | కుర్పూర తులసి | కర్పూర తులసి | Ocimum Camphora | Camphor Basil |
| 12. | శెం తులసి | ఎర్ర తులసి | Ocimum (Red.) | Red Basil |
| 13. | సిరు తలసి | చిన్న తులసి | Ocimum Indicum(Small) | Small Basil |
| 14. | కల్ తులసి | జాతి తులసి | Ocimum (Stone.) | Stone Basil |
| 15. | ముల్ తులసి | ముండ్ల తులసి | Ocimum Pilosum | Thorny Basil |
| 16. | సుణై తులసి | నూగు తులసి | Ocimum Villosum | Rough Basil |
| 17. | నిల తులసి | భూ తులసి | Ocimum Prostratum | Ground Basil |
| 18. | నీర్ తులసి | జల తులసి | Ocimum Aqua | Water Basil |

తులసి చెట్టులో ఎన్నిరకములున్నను దక్షిణ భారత దేశము నందు వాడుకలోనున్నవి (1) కృష్ణ తులసి (2) లక్ష్మి తులసి (3) రామ తులసి (4) కుక్క తులసి (5) శివ తులసి (6) నిమ్మ తులసి (7)కర్పూర తులసి యనునవి.

వైద్యగ్రంథములందు తులసికి గల పేర్లు:-

ధన్వంతరినిఘంటువు:- శ్లో॥ సురసా, తులసీ, గ్రామ్యా. హ్యాలసా, బహుమంజరీ। అధీతా, రాక్షసీ, గౌరీ, భూతఘ్నీ, దేవదుందుభిః। చక్రవర్ణీ, నాగమాతా, సురభి, స్వరమంజరీ॥.

**అర్థం:-** సురసా; తులసీ; గ్రామ్యా; అలసా; బహుమంజరీ; అధీలా; రాక్షసీ; గౌరీ; భూతఘ్నీ; దేవదుందుభి; చక్రపర్ణీ; నాగమాలా; సురభి; సురమంజరీ- యనునవి తలసిపేర్లు.

**సర్వౌషధిగుణకల్పకము:-** శ్లో॥ తులసీ, సురసా, గౌరీ, భూతఘ్నీ, బహుమఞ్జరీ.

అర్థం: తులసీ; సురసా; గౌరీ; భూతఘ్నీ; బహుమంజరీ- యనునవి తులసి పేర్లు.

**రాజనిఘంటువు:-** శ్లో॥ తులసీ, సుభగ, తీవ్ర, పావనీ, విష్ణువల్లభః। సురేజ్యసురసా, జ్ఞేయా, కాయస్థ, సురదుంధుభి;। సురభి, బహుపత్రీచ, మంజరీ సో హరిప్రియ;। అపేత, రాక్షసి, శ్యామా, గౌరీ, త్రిదశమంజరీ। భూతఘ్నీ, భూతపత్రిచ, జ్ఞేయాచై కోనవింశతిః॥

**అర్థం:-** తులసీ; సుభగ; తీవ్ర; పావని; విష్ణువల్లభ; సురేజ్య; సురస; జ్ఞేయా; కాయస్థ; సురదుందుభి; సురభి; బహుపత్రీ; మంజరీ; హరిప్రియ, అపేత; రాక్షసీ; శ్యామ; గౌరీ; త్రిదశమంజరీ; భూతఘ్నీ; భూతపత్రి - యివితులసి పేర్లు.

**భావప్రకాశ:-** శ్లో॥ తులసి, సురసా, గ్రామ్య, సులభా, బహుమంజరీ,। అపేత, రాక్షసీ, గౌరీశూలఘ్నీ, దేవదుందుభిః॥

**అర్థం:-** తులసీ; సురస; గ్రామ్య; సులభ; బహుమంజరీ। అపేత; రాక్షసీ; గౌరీ; శూలఘ్నీ; దేవదుందుభి- ఇవితులసి పేర్లు.

పై తెలిపిన ముఖ్యమైన వైద్య నిఘంటువులందేగాక ఇతర గ్రంథములందు, **తులసికిగల పేర్లు:-** కపేతార్జుక; సుముఖ; గరఘ్నక; బృంద; ప్రేతరక్షకీ; సురవల్లభి; మాధవీ; అలబా; దేవి; శ్రీలక్ష్మి; యశస్విని; దేవమనప్రియ; విష్ణుప్రియ; హరివల్లభి; ప్రవాసరామ ; శీతార్జక; బర్బరీ; అమృతపత్రపుష్ప; వైకుంఠక; విషగంధ; తీక్ష్ణగంధ; కృష్ణార్జక; కృష్ణపర్ణీ; కుఠేరక; అజగంధిక; మున్నగునవి.

**తులసిసహజగుణములు:-** కటుతిక్తరసములు; ఉష్ణవీర్యముగలది, ఇదికారముగ, చేదుగ, మనోహరముగ యుండును. తాపము, పిత్తమునుకల్గించును. ఉష్ణకారి; అగ్నిదీపనము చేయును. కుష్ఠ, మూత్రకృచ్ఛ్రము, రక్త దోషము, పార్శ్వపీడ, వాతము, కఫము, వీటిని హరించును. చర్మముపైవచ్చు పొడలనుపోగొట్టును. విషహారిణి, చెమటను వృద్ధిచేయును, మూత్రకారి, కఫహారి, కృమిహారిణి, హృదయమునకువేడినిచ్చును. శరిరములోపలిపుండ్లను మాన్పును. నోటియందలి వ్యాధులు, కర్ణవ్యాధులు, నేత్రవ్యాధులు, శ్వాసకోశవ్యాధులు, కార్జము నందలివ్యాధులు, చర్మవ్యాధులు, మెదడు వ్యాధులు, మున్నగువాటిని హరించును. స్ఫోటకనివారిణి, పక్కశూల, కక్కాయిదగ్గు, అరోచకము, అస్థిజ్వరము-యివి గుణమగును.

సాలెపురుగు విషమును హరించును. ప్రేగులలోని క్రిములు, నాడాపాములు- మున్నగువాటిని బహిర్గతపరచుటలో వీర్యముకలది. శరీరమునకు కాంతినిచ్చును.

ఆయుర్వేదగ్రంథములందు చెప్పబడిన శ్రీ తులసి యొక్క గుణములు:

**అష్టాంగహృదయము:-** శ్లో॥ హిధ్మా,కాస, శ్రమ, శ్వాస, పార్శ్వ, రుకక్ఫాతిగందహా; సురసః॥

**అర్థం:-** ఎక్కిళ్ళు, కాస, శ్రమ, శ్వాస, పార్శ్వశూల, దుర్గంధము వీటిని హరించును.

**వైద్యగుణపాఠము:-** శ్లో॥ తులసీ, తిక్తకా, చోష్ణా, సురభి, శ్ప్లేషణా, గుణైః। రుచ్యా, వాతకఫౌ, శోఫం, క్రిమీ, న్వర్దిం, నివారయేత్॥

**అర్థం:-** తులసి చేదుగను, ఉష్ణముగను, పరిమళముగను, రుచికరముగనుండును. మరియూ వాతము, కఫము, శోఫ, కృమి, వాంతి- వీటినిహరించును.

శ్లో॥ శ్వేతా, కృష్ణాచ, తులసీ, కటూష్ణా, చోషణా, జగుః।
దాహ, పిత్తకరీ, హృద్యాతు, వరా, వహ్నిదీపకా॥
లఘ్వీ, వాతకఫ, శ్వాసకాస, హిధ్మాక్రిమీన్, జయేత్।
వాంతి, దౌర్గంధ్య, కుష్ఠాని, పార్శ్వ, శూల, విషాపహా॥
మూత్రకృచ్ఛ్రం,రక్తదోషం, భూతబాదాంచ, నాశయేత్।
శూలంజ్వరంచ హిక్కాంచ నాశయేదితికీర్తితా॥

**అర్థం:-** తెల్ల, నల్లతులసి కారముగను, ఉష్ణముగ, తీక్ష్ణముగ, హృద్యముగ, వగరుగ, లఘువుగయుండును. దాహము, పిత్తము, అగ్నిదీప్తి- వీటినికల్గించును. వాయువు, కఫము, శ్వాశ, కాస, ఎక్కిళ్ళు, క్రిమి, వాంతి, దుర్గంధము, కుష్ఠవు, పార్శ్వశూల, విషము, మూత్రకృచ్ఛ్రము, రక్తదోషము, భూతభాద, శూల, జ్వరము- వీటిని నశింపజేయును.

**సర్వౌషధిగుణకల్పకము:-**

శ్లో॥ తులసీ, కటుకా, తిక్తా, హృద్యోష్ణా, దాహ, పిత్తకృత్।
దీపనీ, కృచ్ఛ్రాస్ర, పార్శ్వరుక్కఫ, వాతజిత్॥

**అర్థం:-** తులసి కారము, చేదురుచులను కల్గియుండును. మనోహరముగ యుండును.. ఉష్ణకారి. తాపము, పిత్తము, వీటినిచేయును, అగ్నిదీపనమును చేయును. కుష్ఠ, మూత్రకృచ్ఛ్రము, రక్తదోషము, పార్శ్వపీడ, కఫము, వాతము- వీటిని హరింపచేయును.

**ధన్వంతరినిఘంటువు:-**

శ్లో॥ తులసీ లఘు. తిక్తోష్ణా రూక్షాచ, కఫవాతనుత్।
క్రిమిదోషం,హర త్యేషారుచి కృద్వహ్ని దీపనీ॥

**అర్థం:-** తులసి లఘువుగనుండును. చేదురుచి, ఉష్ణవీర్యముగలది. రూక్షజేయును. రుచికరముగనుండును. కఫము, వాతము, క్రిమిరోగములను పోగొట్టును. అరుచిని పోగొట్టి అగ్నిదీపనమును కల్గించును.

**చరకసంహిత:-**

శ్లో॥ హిక్కా,కాస, విష శ్వాసన, పార్శ్వశూల, వినాశనః।
పిత్తకృత్ కఫవాతఘ్న, సురసః పూతీగంధనుత్॥

**అర్థం:-** తులసి-ఎక్కిళ్ళు, కాస, విషదోషము, శ్వాస, పార్శ్వశూల- వీటినినశింపజేయును. పిత్తము చేసును. కఫవాతములను హరించును. దుర్గంధమును పోగొట్టును.

**భావప్రకాశము:-**

శ్లో॥ దాహ, పిత్తకారిత్వమ్, దీపనత్వమ్, కుష్ఠకృచ్ఛాస్ర, పార్శ్వరుక్।
నాశిత్వం. శుక్లా, కృష్ణాచ, తులసీ, గుణైస్తుల్యా॥

**అర్థం:-** తులసి దాహ, పిత్తములను కల్గించును. దీపనముకల్గించును. కుష్ఠ, మూత్రకృచ్ఛ్రము, రక్తదోషము, పార్శ్వపీడ- వీటిని పోగొట్టును.

**అగస్తియర్ గుణపాఠం:-** అను తమిళగ్రంథమునందు చెప్పబడినగుణములను తమిళపద్య రూపమగను తెలుగువచనరూపముగను తెలియజేయుచున్నాము.

**(1) తులసి:-** ఐయంవయిరుట్టైచ్చులస్తిజురం దాగముంపోమ్,
పైయజురమాందమ్ పరక్కుంకాన్, మెయ్యాగవాయిన్నరోచకమ్పోమ్
వన్కారమ్ చూడుల్ల తూయతులసిదన్నైచొల్

**అర్థం:-** పవిత్రమైన తులసితో కఫదోషము, ఉదరవాతము, ధాతుగతఅస్తి జ్వరము, దప్పితీరును. మాందజ్వరము ఎగిరిపోవును. నిజముగనోటి అరోచకముపోవును. కటురసము, ఉష్ణవీర్యముకల్గియుండును.

**(2) తులసి విత్తనములు:-** నత్రులసివిత్తదన్నైనంగైయేయుట్కొల్ల పత్రునీర్
చూడుంపరక్కుమే, మత్రుముల శీదముడన్ భేది
సీరళ్యిక్కుముట్చూడు చేదముత్రేడుమెన సెప్పు.

**అర్థం:-** మంచితులసిగింజలను సేవించుట వలన మూత్రమునందు మంట, శీతబేది, అనారోగ్యమునకు కారణముగ శరీరమునందుండు కాక యివన్నియు తీరుననిచెప్పుము.

**(3) కరుంతులసి:-** (కృష్ణ తులసి) ఇరుమలోడునెంజిలిళ్యప్పు సువాసంగ్ కిరుమి జలదోషంగేవల్ మిరుమల్॥ శలిరూట్పై శూలైవిషంజన్నియివైపోక్కుం। తలిరార్ కరుంతులసి దాన్.

**అర్థం:-** నల్ల తులసి వలన కాస, గొంతులో గరగరయనియుండుట, క్రిమి, జల దోషము, దగ్గుచేవచ్చువ్యాధులు, రొమ్మునందలికఫము, రూక్ష, శూల,

విషము, సన్నిపాతము మున్నగునవితీరును. మంచితులసి కంటే కారమధికము.

**(4) శెంతులసి:-** శెయ్‌యతులసివిషంతీర్క్కుం కఫమరుక్కుం. వెయ్యకడివిషత్తై విన్నేట్రట్టం తైయలరే. ముత్తోషత్తున్‌డా మురనేట్టు మవ్వళ్ళియా మెద్దోషముమ్ పోక్కుమైన.

**అర్థం:-** ఎఱ్ఱ తులసి విషము, కఫాధిక్యము, విషకాట్లు, త్రిదోషములవలన జనించు, సకల విధములైనరోగములను, దోషములను పోగొట్టును.

**(5) నిలతులసి:** నిలతులసి మాదర్‌దరునీణ్ ములైప్పాల్‌మందం, వలత్తచురం పిత్తగణ మాట్రుమ్-అలత్తుగణమాందచురం పిత్తచురమా పెరియసీతచురం సేర్‌న్దోడ సెయ్యుంతెలి.

**అర్థం:-** (నేల తులసి) నేలతులసి చనుపాలువలన కలుగుమాంద్యము, వాతజ్వరము, పలువిధములైన పిత్తరోగములు, అత్యుష్ణము మాంద్యజ్వరము, పిత్తజ్వరము, శీతలజ్వరము మున్నగువాటిని పోగొట్టును.

**(6) కల్ తులసి:-** తాపచురముమ్ తనివిద్దరిదిగలుం, సోపచిల్ విషముం దోట్రవే-గోపిచంగ్, కుట్రట్లులసిలేష్మత్తాలూను కాసంపరక్కుం కట్రట్లులసి పెరురైక్కుంకాల్.

**అర్థం:-** రాతి తులసి : రాతితులసి వలన తాపజ్వరము, విద్రధిగడ్డలు, నీళ్ళులో వుండు వండువిషము, శ్లేష్మము అధికముగవచ్చు కఫకాసములు హరించును.

**(7) ముల్‌తులసి:-** ఎలివిడంపోమ్ వెట్టుండిరుక్కుంవిరణ క్కిలివిడుంవిడంగల్ కిలైక్కా- ఉలవివరుమట్టురచ్చి వందమలర్ మండపత్తుల్ వాళ్ళనమే। ముట్టులసి పేరైమొళ్ళి.

**అర్థం:-** ముండ్ల తులసి వలన ఎలుక విషము, నరుకుగాయవ్రణములు, స్వల్పవిషములు - మున్నగునవి హరించును.

**(8) నాయ్ తులసి:-** 1. కపత్తోడు కుత్తిరుమల్. కాణా, దోల్యియుం, చపత్తై సైముత్తోడంసాడుం, విపత్తళ్ళలై సాయ్‌త్తుడలై పోషిక్కుం, దారణీయిల్ పుల్లోర్కునాయ్ తులసి దన్నైనవిల్.

**అర్థం:-** కుక్క తులసి వలన శ్లేష్మము, పొడిదగ్గు, సన్నిపాతము, వీటిని పోగొట్టును . శరీరమును పోషించును. ఇదితులసి జాతికి చెందినదైననూ కొన్నివిశేషగుణములను కల్గియున్నది.

2. మందకళ్ళిచ్చులరుం మాందంజురగణం పోం చేర్ద మూలత్తిన్ తినవడంగుం-పూందడక్కై యన్నమే మేగమరుం గంజాంకోరైయినైయున్న యిరువమల్లిలైయోదు.

**అర్థం:-** (గంజాంకోరై అనబడు) కుక్క తులసి వలన మాంద్యభేది, మాంద్య జ్వరగణములు, అగ్నిమాంద్యము, అత్యుష్ణము. ఆసనదురద, ప్రమేహము, కాస-మున్నగునవి గుణముగును.

**(9)** రుద్రజడై: -1. తీరునీర్ట్టుపచ్చై శ్లేష్మశాంతిదన్నై పిరినీర్ట్రైపోలాక్కుమెయ్యేపెరియ సురత్తి రత్త వాంతి జురమరుచి నిల్లా వురిద్దిర జడైక్కోయుర్రై.

2. సీరుగిర్న మేహవెట్లై శీదముడన్ భేది కూరుముళైమూలంకుడీ యగల- నారుంవురిద్దిరజడైయినుయర్ విత్తదనై తిరుత్తముడ నుణ్ణ సెప్పు.

**అర్థం:**-1. రుద్రజడ, నబ్బాచెట్టు, శివతులసి: శివతులసి శ్లేష్మశాంతిని కల్గించును. కఫవాంతులు, జ్వరముచేకల్గినరక్తవాంతులు, పిత్తజ్వరము, అరోచకము వీటిని పోగొట్టును,

2. శివతులసి విత్తనములను భాగప్రకారము సేవించిన మేహతెలుపు, శీతభేది, మొలలతో కూడిన మూలము- వీటిని పోగొట్టును.

**(10) తులసి:**- తేరన్‌వెన్బా అనేగ్రంథమునందు.

.. పోలాట్టి విత్తు ధిరప్పుణ్ణీని సప్పిణీయ్యైవేంలాట్టి విత్తు విలంగువేసాల రుందుముడుర్క్కు వెప్పు వారామెలోట్టుంపిరుందమ్మైప్పుయిత్తి యత్తైపేయ్॥

**అర్థం:**- తులసిని సేవించుట వలన - పిశాచమువలె ఆడునట్టిపిచ్చి రోగమును పోగొట్టును. ముక్కునుండికారు పీనశరోగమును నశింప చేయును. శరీరవుష్టమును కలగించును.

. మన్నునుక్కు సీరలిత్తు మట్ట్రవరై తాళ్యవైత్తు ప్పిన్నమిలాతులైప్పే ణీయే- న్నునిలైపేరణీ యప్పణ్ణుంపిణిక్కు పిణియాగుం ధారణియిల్ మాలలంగ్‌కల్.

అర్థం:- తిరుమల వేంకటేశ్వరుని మాలయైనతులసి వాతదోషమును, సమష్టితికి చ్చి, కఫదోషమును తగ్గించి, దానివలన కలుగు నట్టి రోగములను పోగొట్టి శరీరమును పాడును.

. తులసి యినిలై రసంతూయ్‌త్తిడచ్చురపిణీయలవునోయినమెలామరువదుతిన్నమే.

**ర్థం:**- తులసి స్వరసము వలన జ్వరరోగ సమూహమంతయూ నశించి పోవును.

**ద్య గుణపాఠము:** అడవితులసిగుణము:

) శ్లో॥ అరణ్యతులసీ, చోష్ణా, కటుకాచ సుగంధికా।
వాతత్వగ్దోషవీసర్ప విషంచైవ వినాశయేత్॥

**థం:**- అడవితులసి ఉష్ణముగను, కారముగను, సుగంధముగ యుండును. మరియు యువు, త్వగ్దోషము, విసర్పము, విషము-వీటిని నశింపజేయును.

) క్షుద్ర అరణ్యతులసి గుణము:

॥ అరణ్యతులసి క్షుద్రా కట్వీ చోష్ణాచ తిక్తకా। రుచ్యాగ్నిదీపనీ, హృద్యా, విదాహీ ుపిత్తలా॥ రూక్షా, కండూ, విషచ్ఛర్ది, కుష్ఠజ్వర, వినాశినీ। వాతం క్రిమీం, కఫం, మం, రక్తదోషంచ, నాశయేత్ బీజంచాస్యాః, దాహశోషనాశకం, పరికీర్తితం॥

అర్థం: - అరణ్యతులసి కారము, చేదురుచిగలది. ఉష్ణవీర్యముగలది. హృదయమునకు మనోహరముగను, లఘువుగను, రూక్షముగ నుండుటయేగాక, రుచి, అగ్నిదీప్తి, విదాహము, పిత్తము-వీటినికలుగజేయును. కండు(దురద), విషము, వాంతి, కుష్ఠవు, జ్వరము, వాయువు, క్రిమి, కఫము, దద్రు, రక్తదోషము-వీటిని నశింపజేయును. దీని విత్తులు దాహము, శోష-వీటిని నశింపజేయును.

## విజ్ఞానశాస్త్రరిత్యా తులసి రకములు, వాటి ఆయుర్వేదగుణములు.

**(1) OCIMUM SANCTUM.** *N.O. Lamiaceae, Labiatae. English: Holy Basil. Telugu, Tamil,Sanskrit, Malayalam, Kannadam, Hindi- Thulasi*

**ఉపయోగపడు భాగములు:** ఆకులు, విత్తులు, సమూలము.

**రసగుణ వీర్యవిపాకములు:** కటురసము, ఉష్ణ వీర్యము, కటువిపాకము.

**ఆకులు-గుణము :**-ఉష్ణకారి –STIMULANT, కఫహరకారి -EXPECTORANT

మూత్రవర్ధని: DIURETIC: శ్వేదకారి DIAPHORETIC: జఠరాగ్నివర్ధని-STOMACHIC

విత్తనములు: అంతర్స్నిగ్ధకారి -DEMULCENT

Compendium of Indian Medicinal plants: The Leaf extract modulates humoral immune responses: Extract of leaves also Showed highly siginficiant Clinical and biochemical clearance of viral hepatitis in 14 days of treatment. Leaves and flowers contained 0.075 and 0.095% of oil respectively

**(2) OCIMUM BASILICUM:** NO. Lamiaceae: Labiatae. English: sweet Basil:

**TELUGU:** రుద్రజడ, విభూదిపత్రి. **TAMIL:** తిరునీట్రుపచ్చై), ఉరుద్దిరజడై, సబ్జా.

**SANSKRIT:** విశ్వ తులసి, శివతులసి. **MALAYALAM:** తిరునీట్రుపచ్చై,

**KANNADA:** కామకస్తూరి: **HINDI:** సబ్జా

**ఉపయోగపడు భాగములు:**-సమూలము, ఆకులు, విత్తులు.

**రసగుణవీర్య విపాకములు:**- కటురసము, ఉష్ణవీర్యము, కటువిపాకము.

**విత్తనములు:**- మధురరసము, శీతవీర్యము, మధురవిపాకము.

గుణములు: వేరు: శ్వేదకారి - Diaphoretic: ఉదరవాతహరకారి- Carminative

మూత్రవర్ధని-Diuretic: ఉష్ణకారి –Stimulant.

**విత్తనములు:**- జిగటగలది- Mucilaginous: అంతర్స్నిగ్ధకారి –Demulcent.

మూత్రవర్ధని:-Diuretic: బలకారి- Nourishing.

రసము:- కృమినాశిని –Anthelmintic.

(3) Ocimum gratissimum (Linn) N.O. Labiatae. English: shrubby Basil.



Ocimum Basilicum; Shiva Basil
బర్బరః: శివ తులసి





Ocimum Sanctum; Holy Basil
శ్రీ కృష్ణ తులసి

**TELUGU:** నిమ్మతులసి. **TAMIL:** ఎలుమిచ్చన్ తులసి.

**SANSKRIT:** వనతులసి; అజక. **MALVALAM:** కాట్టుత్తులువ.

**KANNADA:** రామ తులసి. **HINDI**(హింది): రామ్ తుల్సీ, బంజరీ.

**ARAB:** Faranjmish.

ఉపయోగపడు భాగములు: సమూలము, ఆకులు వేర్లు.

రసగుణ వీర్యవిపాకములు: కటురసము, ఉష్ణ వీర్యము, కటువిపాకము.

గుణములు: శోఫనాశిని: Deobstruent. పాషాణభేదిని- Lithontriptic.

ఉష్ణకారి: -Stimulant. అతర్స్నిగ్ధకారి-Demulcent.ఉదరవాతహరకారి -Carminative.

(4) Ocimum Canum. N.O.Labiatae. ENGLISH-HOARY BASIL.

TELUGU: కుక్క తులసి, కుప్పతులసి. TAMIL: నాయ్ తులసి, గంజామ్కోరై.

Sanskrit: అరణ్యతులసి,వనబర్బరిక, జంబీరం. MALAYALAM: కాట్టురామ తులసి. KANNADAM: నాయ్ తులసి. HINDI: వన్ తులసి.

ఉపయోగపడు భాగములు: సమూలము, ఆకులు, వేర్లు.

రసగుణవీర్యవిపాకములు: కటురసము, ఉష్ణవీర్యము, కటువిపాకము.

గుణములు:- జీర్ణకారి Digestive. ఉష్ణకారి – Stimulant.

శ్వేదకారి- Diaphoretic. కఫహరకారి-Expectorant.

(5) Ocimum Kilimanscharicum. Guerke: N.O. Lamiaceae, English: Camphor Basil. **TELUGU:** కర్పూర తులసి **TAMIL:** కర్పూర తులసి

**SANSKRIT:** కర్పూర తులసి **MALAYALAM:** కర్ పూరట్టులసి

**KANNADA:** కర్పూర తులసి **HINDI:** కపూర్ తుల్సీ

ఉపయోగపడు భాగములు: ఆకులు: సమూలము.

రసగుణ వీర్యవిపాకములు: కటురసము, ఉష్ణవీర్యము, కటువిపాకము.

గుణములు: క్రిమినాశిని: – Anti Bacterial దీపనకారి- Appetising.

నేత్రరోగశమని-Ophthalmic. దుర్గంధనాశిని- Deodrant.

In addition to the above Information on Tulasi Let us see what the English Meteria Medica of Herbal plants says about Tulasi.



**Ocimum canum : Dog Basil**
కుక్క తులసి





**Ocimum Album: White Basil**
శ్రీ తులసి : తెల్లది

Some extracts are reproduced herewith with apologise and Gratitude to the Author Mrs. *M. Grieve,* F.R.H.S., and the Editor Mrs. C.F.Leyel of the Book " **A MODERN HERBAL**". Printed in London.

**(1) NATURAL ORDER:** Labiatae. Botony Name - Ocimum minumum.

**English Name:** Basil Bush. **Parts used**- Leafy tops.

" Bush Basil (Ocymum minumum) is a low bushy plant seldom above 6 inches in Height, much smaller than Sweet Basil. "Both Bush and garden Basil are natives of India from whence it was introduced in 1573. The leafy Tops of Bush Basil are used in the same manner as the Sweet Basil for seasoning and in salads. The leaves of O.canum and O. gratissimum in India and of O. crispum in Japan, all sweet scented Varieties are prescribed as a remedy for colds. "In crete it symbolizes *"Love washed with tears"* and in some parts of Italy it is a love- token.

" Boccaccio's story of Isabella and the pot of Basil, immortalized by Keats, keeps the plant in our memory, though it is now rarely cultivated in this country.

Drayton places it first in his poem polyolbion "with Basil then I will begin, whose scent is wondrous pleasing". In tudor days, Little pots of Basil were often given as graceful conpliments by farmers' wives to Visitors.

**Cultivation:** Basil dies down every year in this country, so that the seeds have to be sown annually and it is preferable to sow in a Hot bed, about end of March and remove to a warm broder in May. planting 10 inches to a foot apart. Basil flourishes best in a rich soil.

**PARTS USED MEDICINALLY:** The Whole herb, both fresh and dried gathered in July.

**MEDICINAL ACTION AND USES:** Aromatic and carminative. Basil has been occassionally used for mild nervous disorders and for the alleviation of wandering rheumatic pains, the dried leaves in the form of snuff, are said to be a cure for nervous hedaches.

An iffusion of the green herb in boiling water is good for all obstructions of the internal organs, arrests vomiting and allays nausea.

"O. Americanum, first recorded in 1789 as found in West Indies" The name *"Ocymum"* is said by Mathiolus to be derived from the Greek word '*To smell*' because of the powerful aromatic and pungent scent characterizing most of the plants of this genus.

O. Americanum are used in cases of chest trouble and dysentery, and an essential oil is also extracted from the plant.

O. canum is used as a tincture made from the leaves in Homeopathy

(2) N.O. Labiatae . Bot. Name: Ocymum basilium (Linn).

**ENGLISH:** Basil Sweet.

**PARTS USED:** Herb.

**DESCRIPTION:** Common or Sweet Basil, which is used in medicine and also for culinary purposes, especially in France, is a hairy, Labiate plant growing about 3 feet high.

**HISTORY:** The derivation of the name Basil is uncertain. Some authorities say it comes from the Greek *"basileus"* a king, because, as Parkinson says " the smell thereof is so excellent that it is fit for a king's house" or it may have been termed royal, because it was used in some regal unguent or medicine.

In India the Basil plant is Sacred to both Krishna and Vishnu, and is cherished in every Hindu house. Probably on account of its virtues, in disinfecting, and vivifying malarious air, it first became inseparable from Hindu houses in India as the protecting spirit of the family.

' Every good Hindu goes to his rest with a Basil leaf on his breast" This is his passport to paradise.

(3) N.O.Labiatae.Bot.Name-Calamintha clinopodium. English: Basil wild. **PARTS USED:** Whole herb. **SYNONYMS:** Hedge Basil; Hedge calamint.

**DESCRIPTION:** The wild Basil (Hedge Basil) is a straggling plant with some what weak- looking, though erect stems, raising to a hight of a foot or 18 inches and thickly covered with soft hairs. The shortly stalked, egg shaped leaves 1 to 2 inches long are placed opposite to one another on the four angled stem. They are only slightly toothed at their edges and like the stem are downy with soft hairs. The flowers, with tubular lipped corollas of a pinkish colour, are arranged on the stem in several crowded, bristly rings or whorls, at the points from which leaf stalk spring and are in bloom from July to September.

The whole herb is aromatic and fragrant with a faint Thyme-like odur. The name of the species "*Clinopodium*" Signifies *"Bed foot"* "the tufts of the plant are like the knobs at the feet of a bed."



## శ్రీ తులసి-హోమియోపతి వైద్యవిధానము

Now let us see what homeopathy says about Tulasi. Even though Indians have forgotten, Homeopathic Doctors have not. In Homeopathy Tulasi has won an eminent position in the Meteria Medica.

The first Homeopathic pharmacopoeia was published by Dr.C. Caspari Leipzig, Germany in 1825.

The first British Homeopathic pharmacopoeia was Published in 1870. by the British Homeopathic society. London.

The First American Homeopthic pharmacopoeia was Published in 1897 by the American Institute of Homeopathy by Otis clap and son.

In India the first attempt in this regard was made by *M.Bhattacharyya &co.* A revised & enlarged edition of the Homeo Pharmacopoeia was Published in July 1962 on behalf of *M. Bhattacharyya &co. Private Ltd,* Calcutta. under the mame and style of M. *Bhattacharyya & co's*-Homeopathic pharmacopoeia.

The First Homeopthic pharmacopoeia of India was Published by the Government of India (Ministry of health) in 1971 which contains 180 drugs.

From among the 180 drugs Ocimum Sanctum is one, which is introduced in the Pharmacopoeia & is described as follows:

**BOT.NAME:** Ocimum Sanctum ( Linn) **FAMILY:** Labiatae.

**SYNONYMS:** Hindi-Tulsi: (Oci. Sant)

**DESCRIPTION:** A much branched Herb 30-90 Cms, high, sometimes woody at the base. Stems and branches clothed with soft appearing hairs. leaves 2.5-5 cm. Long, oblong or elliptic oblong,

obtuse or acute, entire or subserrate, hairy on both surfaces and minutely dotted. Racemes slender, 15-20 Cm long. bracts not exceeding the calyx broadly ovate or cordate- ovate, 4 mm Long. purplishpink. Upper pair of stamens with a small bearded appendage at the base. Nutlets broadly ellipsoid, smooth yellow dotted with black.

**HABITAT:-** It is cultivated and planted throughout India.

**PARTS USED:-** Whole plant excluding roots.

**PREPARATION:-** Mother Tincture Ø Drug Strength 1/10

Ocimum Sanctum, moist magma containing solids 100g & 333g plant moisture 233ml.

Strong Alcohol in sufficiant quantity. To make one thousand millilitres of the tincture.

**POTENCIES:-** 2X and higher with dispensing alcohol.

The Ocimum sanctum is eloborately described in the Book "The drugs of Hindoosthan" written by *Dr. S.C. Ghose.* The first edition was published in 1944.

some of the important feautures as published in the above said book are herein reproduced with apolozise & gratitude to the Author.

## *Ocimum Sanctum* (Ocl. Sant)

**COMMON NAMES:** SANSKIRIT: Vishnupriya Tulasi, Krishnamul

BOMBAY, TELUGU, TAMIL, MALAYALAM, MARHATI- Tulasi

BENGALI- Tulsi. HINDI-Kala Tulasi. ENGLISH- Holy Basil.

*"Ocimum Sanctum"*, of which I am writting, is the black variety of the herb.

## Homeo Provings and Materia Medica.

**MIND:-** Forgetfulness; very much disturbed difficulty to concentrate on any subject. child is peevish and cries. patient falls asleep while answering Questions.

**HEAD:-** Headache, giddiness of head worse while walking. heat on the vertex,

**EYES:-** Eyes red, Lachrymation. It is a good remedy in ophthalmia. Mist before eyes especially when fixing them on something.

**EARS:-** Noises in the ears. watery secretion from the ears. Offensive pus from the ears. Ears painful due to nasal catarrh.

**NOSE:-** It is an excellant remedy in nasal catarrh associated with frequent sneezing. Nostrils ulcerated.

**FACE & MOUTH:-** Putrid and bitter taste in the mouth. Ulcer in the mouth. Lips dry and black as if burnt.

**THROAT:-** Pain is felt in the throat, ulceration of throat, glairy phlegm enlargement of both tonsils. voice gets changed, hoarseness .

**STOMACH & ABDOMEN:-** Abdomen distended, hiccough, heaviness of abdomen doesnot appear in spite of frequent passage of stools, pain is felt over the region of liver and spleen. Hepatic pain. painthe the right iliac region, gurgling sound can be felt on pressure.

**STOOLS:-** Stools liquid, copious, watery, very offensive, involuntary stools during high fever. Diarrhoea during rainy season and autumn.

**URINE:-** Involuntary Urination of the children, desire to Urinate off and on.

**FEMALE:-** Discharge of Lochia is very offensive and lasts for a long period. profuse bloody discharges after delivery. Leucorrhoea.

**CHEST:-** Pains are felt on both sides of the chest. worse while coughing or sneezing. pleuritic pains in the chest, asthmatic attack. Very useful in asthma of infants and children.

**SKIN:-** It is very useful in skin diseases.

**KEY NOTE SYMPTOMS:-** Forgetfulness.

The peevishness of children is very easily removed by this remedy.

The characteristic syptoms of headache are that it is relieved by appliiction of cold water on the head or by fanning the head.
In ophthalmia neonatorum, Ocimum is a curative remedy. Ocimum has come to stay and it will stay as long as Homeopathy will last.

## OCIMUM CARYOPHYLLATUM ( DULAL TULSI)

It is extensively used is spermatorrhoea and gonorrhoea. It has a decided action upon the kidney, bladder, and Urethra, and so it is very efficaciously employed in haematuria, inflammation and congestion of the kidney & similar other diseases.

In bloody dysentery its action has been verified.

**DILUTIONS:**-ø,3X,6X.

## Ocimum Gratissimum (Ram Tulsi)

The Therapeutic properties that have been attributed to Ocimum Sanctum are present in this variety also. Used in costiveness and also in costiveness of children with nasal catarrh, cough & fevers. It is generally employed in gonorrhoea where there is difficulty in urination. Burning sensation while passing urine. pus mixed with urine.

Dilution:- ø, 3x,30.

A wellknown, all over the world the book called "Boericke's Materia Medica" in which we find Tulasi described Homeopathically which is herewith reproduced with apologise & gratitude to the Great Author "*William Boericke*, M.D," who is the first professor of Homeopathic Materia Medica and therapeutics at the University of california.

It is needless to say about the Author "*William Boericke*" as every Indian homeopath, who steps in to this Method of

Treatment will first have to read the Book "Hahneman's organon of Medicine" which was translated in to English of the sixth German Edition, wich is the Last authentic work of DR. SAMUEL HOHNEMANN and is the High water Mark of Medical philosophy & a Mountain of light. This Book is the Hahnemann's last work of greatest importance to the Homeo' practitioners of the world.

Now let us see what the Honourable Wlliam Boericke has said about Thulasi *ie.* Ocimum Canum.

**Ocimum Conum,. (Brazillian Alfavaca)**

This is to be remembered in diseases of the kidneys, bladder, and urethra. Uric acid diathesis. Red sand in the urine is its chief characteristic, and frequently verified. Swelling of glands, inguinal and mammary. Renal colic, especially rightside. symptoms of renal calculus are pronounced.

**URINE:-** High acidity, fromation of spike crystals of uric acid. Tubrid, thick, purulent, bloody, brick dust red or yellow sediment. Odor of musk, pain in ureters. Cramps in kidneys.

**MALE:-** Heat & Swelling of left testicle.

**FEMALE:-** Vulva swollen: darting pain in labia nipples painfull to least contact.& Breasts feel full and tense, itching, Prolapsus Vaginae.

**RELATIONSHIP:-** compare-Berb: Hedeoma; lycop; pareira; Urtica.

**DILUTION (DOSE):-** sixth to thirtieth potency.

In addition to the above the following readings appear in the "Dictionary of practical Materia Medica" of *John Henry clarke* M.D. of London

**CLINICAL:-** Albuminuria, breasts painful, bubo,calculus, renal, passage of Diarrhoea Gravel, kidneys Diseases of. Renal colic,

urine, abnormal. Vagina prolapse of. Ocim. can: It is used in Brazil "as a specific for diseases of the kindneys, Bladder and urethra"

"Renal colic, with violent vomiting every fifteen minutes. Red urine with brick dust sediment after the attack".

Mujumdar (India) adds that *"Ocim Can"* is the sacred Tulasi of india and that the kabirajes use it in diseases of the Liver and billous remittant fevers.

The vaginal prolapse, excessive sensitiveness of the breasts and pain on nursing, are important symptoms. concomitant symptoms are: Vomiting; cries; tossing about and wringing hands.

In addition to the above the following symptoms have been furnished.

**ABDOMEN:-** Swelling of the Inguinal glands.

**STOOL:-** Diarrhoea, several attacks a day.

**URINARY ORGANS:-** Turbid urine, depositing a white and albuminous sediment; urine of a saffron colour-Red ( Bloody) urine with brick dust sediment after the attack; Thick purulent urine, with an intolerable smell of musk; Burning during micturition; crampy pain in the kidneys; Renal colic ( R-also-L) with violent vomiting every fifteen minutes; she twists about wrings her hands, screams and groans.

**MALE SEXUAL ORGANS:-** Heat, Swelling, and excessive sensibility of the left testiscle.

**FEMALE SEXUAL ORGANS:-** Lancinations in the labia majora; swelling of the whole vulva-falling of the vagina-itching at the breasts. The tips of the breasts are very painfull; the least contact extorts

a cry. compressive pain in the breasts, as in the case with wet-nurses.

**LOWER LIMBES:-** Numbness of the r. thigh for two Days.

**SKIN:-** Acts as an irritant.

**SLEEP:-** dreams about being poisoned- derams about her parents, friends, children.

**FEVER:-** Is sudorific- used in bilious remittant Fevers.

**GENERALITIES:-** It is employed in bath for rheumatisim.

This Medicine is well followed by dioscorea.V. In Renal colic this medicine may be compared with Berberis, Colocynth, dioscorea .V. and lycopodium.

**RELATIONSHIP:-** Compare with Berb, Borax, Hedeoma, colocynthis, dioscorea, lycopodium, Phellandrium, PareiraBrava, staphisagria, Urtica. Followed well by Diosc.

**SDOSE:-** 6 to 30th potency.



# శ్రీ తులసి- ఆయుర్వేదప్రాశస్త్యము, వైద్యయోగములు.

శ్లో॥ మాహాప్రసాద జననీ అధివ్యాధివినాశినీ।
సర్వసౌభాగ్యదా దేవీ తులసీత్వాం నమోస్తుతే॥

**అర్థం:** ఓతల్లి, జననీ నీవు మహాప్రసాదములను యిచ్చుదానివి. గొప్పవ్యాధులను నశింపచేయుదానివి. నీవే జగన్మాతవు. అట్టినీకు నా నమస్కారములు.
ఇందు వలన తెలియునదేమనగ తులసి సకలవ్యాధులను పోగొట్టుటలో శ్రేష్ఠమైనదనియూ, మహాప్రసాదమనగా పరమేశ్వరుని ప్రసాదమైన, అమృతముతో సమానమైనది కావున తులసి జగన్మాతతో సమానమైనది. కావున సకల సౌభాగ్యములను యిచ్చుననియూ తెలియుచున్నది. "ఆరోగ్యమే మహాభాగ్యమను" దానిననుసరించి తులసిని సేవించిన సకలవ్యాధులు నశించి ఆరోగ్యమునిచ్చి సర్వ సౌభాగ్యముల నిచ్చుననుటలో సందేహములేదు.

భారతదేశము నందు నీచమైనలోహములను ఉచ్చమైన రజిత, స్వర్ణములుగా చేయు ప్రయోగములనేకములున్నను, యిప్పుడవి బురదలో యుండు మాణిక్యస్లై యున్నవేగాని బహిర్గతముకాలేదు. మనపూర్వీకులు ఋషులు, సిద్ధపురుషులు మున్నగువారు అనేక తాళపత్ర గ్రంథములను ప్రసాదించియున్ననూ అచ్చుతెనుగున రచించిన గ్రంథములు కానవచ్చుటలేదు. సకలగ్రంథములు సంస్కృతమున వ్రాయబడినవియున్నవేకానీ తెలుగు గ్రంథములు లేవనియేచెప్పవచ్చును. సంస్కృతము నుండి తెలుగున అనువదించ బడినవియున్నవి, గాని అందులోను యిప్పుడు మనకుదొరుకునవి అతిస్వల్పములే. తమిళభాషయందువ్రాయబడిన తమిళ పద్యగ్రంథములు అనేకములు కలవు. వాటివివరములు శ్రీ అగస్త్యమహామునిచే వ్రాయబడినగ్రంథములు సుమారు 500 కలవు. ఇతరఋషులైన భోగఋషి; రోమఋషి; తిరుమూలర్; తిరువళ్ళువర్; కొంగణఋషి; పులిప్పాణిఋషి; పులస్తియముని; మత్స్యముని; యూగిముని; కరువూరార్ముని; నందీశ్వరముని; జడాముని; తెరైయర్ ఋషి; శ్రీధన్వంతరిముని; యాకోబు అనబడు రామదేవ మహర్షి- యింకా అనేక సిద్ధపురుషులచే వ్రాయబడిన గ్రంథములు సుమారు 500 పైబడినవికలవు. ఈగ్రంథములు కొన్ని చెన్నై ఓరియంటల్ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునందును, తంజావూరు సరస్వతీమహాలు లైబ్రరీలోను, తిరుమల తిరుపతి దేవస్థానలైబ్రరీలలోను తాటాకు గ్రంథరూపముగను, కొన్ని పుస్తక రూపముగనువున్నవి. వాటిని అనువదించి వచన రూపముగ యెల్లప్రజలకు తెలియజేయునాథుడే లేక గ్రంథాలయములందే గతించిపోవుచున్నవి.

తమిళ దేశమునందు మాత్రము అనేకములైన వైద్యగ్రంథములు తమిళ పద్యరూపముగ యుండువానిని గద్యరూపముగ తాత్పర్యము వ్రాసి ముద్రించబడినవి అనేకములు కలవు. ఆంధ్రదేశమునందు కూడ సంస్కృతగ్రంథముల నుండి అనువదించబడిన గ్రంథములున్నను అవి యిప్పుడు దొరకుటలేదు. ఈ గ్రంథములను ముద్రించుటకు కావలసిన అర్థికసహాయము, ప్రభుత్వ అదరణ, ఆయుర్వేదవైద్యుల ప్రోత్సాహము, ప్రజల ఆచరణ యివన్నియూ ఈ నాడుకరువై పోయినవి.

ఎందరో మహానుభావులు, మునీశ్వరులు, ఋషులు, సిద్ధపురుషులు, మన భారత దేశమునందు మానవసేవకై ఎన్నో ఆధ్యాత్మిక, వైద్య, మంత్ర, యంత్ర గ్రంథములను రచించి యిచ్చి యున్నను, అవి యిప్పుడు మనకు దొరుకుటలేదు. అనేకములైన గ్రంథములు బ్రిటీషు ప్రభుత్వము వారిచే దోచుకోబడినవి. కొన్ని అగ్నికి ఆహుతియై పోయినవి. కొన్నిస్వార్థపరుల వశమైపోయినవి. ఉన్నవాటినైనను వెలికితీసి ముద్రించి ప్రజలకందించుభాగ్యము ఏనాడువచ్చునో అందులకై మనము, మనసంతతివారు వేచి చూతము.

ఈ మహాభూమండలమునందు జన్మించిన జీవులన్నింటిలో మానవునిజన్మ మహత్తరమైనది. పుణ్యమైనది. అండజ, స్వేదజ, ఉద్భిజ, జరాయుజములలో పుట్టిన సకలజీవరాసులలో మానవ జన్మయే శ్రేష్ఠమైనది, ఏజీవరాశికి లేనటువంటి మాట్లాడే శక్తి, ఆలోచించుశక్తి, మంచి చెడులను నిర్ణయించు శక్తి, విచక్షణాజ్ఞానము అనునవి ఒక్కమానవునికే కలదు. ఆశక్తి తోనేప్రతి మానవుడు తనపుట్టుగతులను, జనన మరణరహస్యమును ఆలోచించి, ఆలోచించి తెలుసుకోవలయును. మరణము అనునది శరీరమునకేగాని శరీరమునందలి ఆత్మకు రాదను నిత్యసత్యమును తెలుసుకోవలయును. ఇట్టి మహత్తరమైన జీవరహస్యమును తెలుసుకొనుటకు మానవ జీవితకాలమైన 125 సం॥ సరిపోవు. ఏలనగా ఈ శరీరము పంచభూతాత్మకమైనది. పంచభూతముల వైషమ్యమునే, త్రిదోషములైన వాత, పిత్త, కఫములు ప్రకోపించి శరీర అనారోగ్యమునకు కారణమగుచున్నది. అందువలన మానవుడు మోక్షసాధనకై తనశరీరమును ఆరోగ్యముగ వుంచుకొను విధానమును తెలుసుకోవలయును. అరోగ్యవంతునికే ఆలోచనాశక్తి మిక్కుటముగకల్గును. త్రిదోషములను ప్రకోపము చెందనీయక శాంతపరచి తన ఆయుః ప్రమాణమును వృద్ధిచేసుకుని యోగ, మోక్ష, జ్ఞాన సాధనకు కృషిచేయ వలయును. ఇందులకు శరీరజ్ఞానము, శరీరము నందలి భాగములు అవిచేయుకార్యములు, అవివైషమ్యముచెంది నపుడు చేయువలసిన త్రిదోషసామ్యము చికిత్స మున్నగు వాటినిగూర్చియూ, ఆయువునుక్షీణింపచేయక

వృద్ధిచేసుకొనుమార్గములను తెలియచేయుటకై ఆయుర్వేదమును మానవులకు ప్రసాదించిరి.

తమిళదేశమందు సిద్ధపురుషులచే అనగా సిద్ధిపొందినయోగులచే అనేకములైన వైద్య,వాద, జ్ఞానగ్రంథములు పద్యరూపమునగలవు. అందువలననే వారు చేయు వైద్యమునకు "సిద్ధ వైద్యము" అని పేరు వచ్చెను.

సిద్ధవైద్యగ్రంథములందుకూడా సిద్ధపురుషులచే చెప్పబడినదేమనగా ప్రతిమానవుడు మోక్షసాధన చేయుటకు, తన ఆయుఃకాలమును పెంచుకుని జీవన్ముక్తిని సాధించుమార్గములను బోధించియున్నారు. మానవుడు తన శరీరమును నశింపచేయక జీవాత్మ, పరమాత్మలను ఏకముచేసి శరీరముతోనే పరమేశ్వరుని యందు లీనము అగుటయే ముఖ్యోద్దేశము. జీవాత్మ శరీరమును వదలివెడలి పోయినచో మానవవుడు ఏమియూతెలుసుకోలేడు. శరీరము శవమగుచున్నదేగాని, శివత్వమును పొందదు. అట్టి శవమును పూడ్చిపెట్టుట, లేక అగ్నికి ఆహుతి చేయుట, అనుకార్యములందు భుమిలో కలసిపోవుట, బూడిదయై భూమిలోనే కలిసిపోవుచున్నదేగాని పరమేశ్వరునియందు లీనమగుటలేదు. శరీరమునందు జీవాత్మయున్నంతవరకే మానవునికి మనస్సు, బుద్ధి, జ్ఞానము అనునవి యుండును, అవియున్నపుడు మాత్రమే పరమాత్మ యందు లీనమగుటను తెలుసుకో కలుగుచున్నాము. అందులకే జీవాత్మ, శరీరములను ఏకముచేసి మరణము చెందని స్థితిని పొందుటకే ఆయుఃకాలమును పెంపొందించుకొనుటకే వైద్య,వాద, జ్ఞానమార్గములను వుపదేశించియున్నారు, జీవితకాలములోవచ్చు వ్యాధులను నిర్మూలించుటకై వైద్యవిధానము, తనశరీరము ప్రకృతి వైపరీత్యములకు, పంచభూతములకు వశము కాకుండా యుండుటకు వాదవిధానములు, శరీరము సిద్ధిపొందిన పిదప పరమేశ్వరునిలో ఐక్యము చెందుటకు జ్ఞానమార్గములు అత్యావశ్యమైనవి. వాద ప్రక్రియప్రిధానము నందు నీచమైన, మలినమైన లోహములను మలినములేని ఉన్నతమైన లోహములుగ మార్చుటకు కొన్నిసిందూరములను, సున్నములను తయారుచేసి అట్టిసున్న, సెందూరములను సేవించిన శరీరము శుద్ధిచెంది, సిద్ధి పొందును. సిద్ధి పొందిన శరీరమునకు మరణములేదు. మరణములేని శరీరముతో జ్ఞానసాధన చేసిన జీవన్ముక్తినిపొందును.

వాదవిధానముచే స్వర్ణముచేసి భోగభాగ్యములను అనుభవించుటను ఏ గ్రంథమందును చెప్పబడలేదు. రసవాదము చేయువారికి మాచిన్నిసూచన యేమనగ వాదము సిద్ధించుటకు ప్రప్రథమముగ కాయశుద్ధి, కాయసిద్ధి కావలయును. పిదప లోహశుద్ధి, లోహసిద్ధికావలయును. కాయసిద్ధి పొందుటకు కాయశుద్ధి, లోహశుద్ధి

అత్యవసరము. ఈ రెండు శుద్ధి యైన పిదపలోహసిద్ధితో కాయసిద్ధినిపొంది దానిచేమోక్ష జ్ఞానసిద్ధినిపొంది జీవన్ముక్తుడు కావలయును.

జీవన్ముక్తిని సాదించుటకు మాచేప్రచురించబడిన "శ్రీచరణము" అను గ్రంథమును చదువ వలసినదిగా ప్రార్థన.

ఈ శుద్ధి, సిద్ధులకు ఓషధులే సోపానములు. అట్టి కాయశుద్ధి, లోహసిద్ధి చేయు ఓషధులలో శ్రీ తులసి శ్రేష్ఠమైనది. సూర్యోదయమునకు ముందే కాలకృత్యములు, స్నానము మున్నగువాటిని పూర్తి చేసి తులసికోటను మంచిమనస్సుతో ప్రదక్షిణము చేసి ఐదు దళములను "హరే కృష్ణ"యనునామమును జపించుచు గోర్లు, చిటికెనవ్రేలు తగల కుండత్రుంచి తూర్పుదిక్కును చూచుచూ నోటిలో వేసుకుని సేవించ వలయును. తరువాత కొంచెము శుద్ధోదకమునుత్రాగవలయును. ఒక గంటకాలము తర్వాత సాత్వికమైన ఆహారము సేవించవచ్చును,పిదప తన దినకృత్యములను దర్మ బద్ధముగ నిర్వర్తించుకోవచ్చును. ఈ విధముగ ప్రతి దినము విడువక నిర్మలమైన భక్తితో చేయచుండిన ముదిమి, వలీపలితములు హరించి జీవితసౌఖ్యమును, దీర్ఘాయువును కల్గించును.

శ్రీ తులసిని సేవించునపుడు ఈక్రింది మంత్రమును పఠించుచు సేవించిన దీర్ఘాయువు కల్గునని చెప్పబడియున్నది.

శ్లో॥ ఓం విష్ణుప్రియే మహామాయేకాలజాల విచారిణీ।
తులసిమాం సదారక్ష మామేక మమరంకురు॥

అమృతమును సేవించిన ఏవిధముగ మరణము దరిచేరదో అదేవిధముగ తులసిని సేవించిన మరణము దరిచేరదు అందుకే దీనిని "అమృతతులసి" అందురు.

**విన్నపము**

ఈ ప్రకరణమున అనేక ఆయుర్వేద, సిద్ధ, యునానీ వైద్య గ్రంథములనుండి సంకలనము చేయబడిన యోగములు ప్రసిద్ధి చెందినవియేగాక మంచి ఫలితములను యిచ్చునవి. ఇవిగాకసుప్రసిద్ధవైద్యులు, అనుభవవృద్ధులు, వంశపారంపర్యముగ, గోప్యముగ అనుభవసిద్ధముగ చేయబడు వైద్యయోగములు చేర్చబడియున్నవి. ప్రజాశ్రేయస్సునుకోరి "సర్వేజనా: సుఖినోభవంతు" , అనుసూక్తిని సార్థకము చేయుటకై సుమారు 549 యోగములను తులసితోచేర్చి చేయబడువాటిని, మీముందుంచడమైనది. ఇందేమైనతప్పులున్న సహృదయముతో తెలియజేసిన వాటిని శిరసావహించి శాస్త్రసమ్మతముగ, సవరణచేయుటకు వీలుకల్పించిన వారగుదురని సవినయముతో అంజలి ఘటించుచున్నాను.

# జ్వరప్రకరణము, చికిత్స.

1. అడవి తులసిగింజలు, గుడూచిసత్వము, తవక్షీరి, మిరియములు, జీలకర్ర వీటిని సమభాగము గ్రహించి ఖల్వములో పెట్టి వనతులసి స్వరసముతో నూరి పెసరగింజంత మాత్రలు చేసిపెట్టుకుని ఉదయము, సాయంత్రము రెండు పూటలు, పూటకు ఒకమాత్రను చనుపాలు లేక తేనెతో సాదియిచ్చిన పసికందుల జ్వరముహరించును.

2. తులసీదళస్వరసము 1 భా। అల్లపురసము 2 భా। తెల్లపాయలస్వరసము 2 భా। తేనె 10 భా। వీటిని ఏకముచేసి అందు30నుండి60 చుక్కలవరకు బిడ్డలకిచ్చిన శ్లేష్మజ్వరము, దగ్గు, కాసమున్నగునవి హరించును.

3. తులసీదళములు 10। మిరియాలు 10। పుదీనా అర్ధతులము, ధనియాలు 1తు. వీటిని గ్రహించి ఒకచట్టిలో పెట్టి నీళ్ళు పోసి నాల్గింట ఒక భాగము మిగులునట్లు కషాయము కాచిదించుకుని అందు తగుమాత్రము కలకండపొడి వేసి కలిపిత్రాగుచుండిన చలిజ్వరము, జలదోషము పూర్తిగా హరించును.

4. తులసి ఆకుల స్వరసముతో మిరియాలపొడిని 21సార్లు భావనచేసి తీసి ఆస్వరసముతోనే కాటుకవలె మెత్తగా నూరి గురిగింజ ప్రమాణము మాత్రలు చేసి ఆరబెట్టి భద్రపరచుకునేది. రెండు నుండి నాలుగు మాత్రల వరకు వేన్నీళ్ళలో సేవించిన చమటబట్టి జ్వరముహరించును. ఇది విషజ్వరములకు మంచిది.

5. తులసి స్వరసము ఒకతులము, చక్కెర అరతులం- వీటిని చేర్చి అందు 5. గురిగింజలెత్తు మిరియాల పొడివేసి కలిపి వయస్సునకు తగినట్లు 25 నుండి35 చుక్కలవరకు బాలురకు యిచ్చిన జ్వరము, కాసతీరును.

6. తులసీదళముల స్వరసముతో శొంఠిని మొత్తగానూరి వెచ్చచేసి నుదుటిపై పట్టువేసి వెంటనే ముఖమును దుప్పటితో కప్పుకుని పరుండిన చెమటపట్టి జ్వరము శాంతించును.

7. తులసీదళములు7. మిరియాలు7. వీటినినోటిలోవేసుకుని బాగుగానమిలి మ్రింగిన యెడల మలేరియా జ్వరము హరించును. రోజుకు 3పూటలు 3 రోజులు సేవించేది.

8. నల్లతులసీదళములు 6తులములు, మిరియాల చూర్ణము, ఉమ్మెత్తవేే పైపట, జిల్లేడువేరుపై పట్ట-ఇవిప్రతిదీ ఒకతులము వంతునగ్రహించి తుల స్వరసముతోనే మెత్తగానూరి శెనగలంతమాత్రలు చేసి ఆరబెట్టిభద్రపరచుకునేడ గంటకు ఒకమాత్రవంతున మూడుగంటలకు మూడుమాత్రలు సేవించి మలేరియా జ్వరము హరించును.

9. తులసీ దళములు 1తు॥ మిరియాలపొడి1 తు॥ కాకరఆకు 2 తు॥ వీటి మెత్తగ నూరి శెనగల ప్రమాణము మాత్రలుచేసి ఆరబెట్టి భద్రపరచుకొ అందు పూటకు ఒకమాత్రవంతున3 పూటలు జ్వరము వచ్చుటకుపూర్వాే సేవించ వలయును. తరువాత కొంచెము నీళ్ళుత్రాగేది. చలిజ్వరము మలేరియాజ్వరము మున్నగునవి హరించును.

10. రామ తులసీదళములు, దవనము, పిప్పళ్ళుచూర్ణము, ఆవునెయ్యి ఇవిప్రతిదీ1 తు, వంతున ఎత్తుకుని ఆందుగడ్డకర్పూరము 24 గురిగింజలెత్త చేర్చి, వేపచిగుర్లను వుడుకబెట్టి తీసిన కషాయముతో ఖల్వము నందుమెత్తగా నూరి 4గు. గింజలెత్తు మాత్రలు కట్టి ఆరబెట్టి భద్రపరచేది. సాధారణ జ్వరములందు ఒకదినమునకు మూడుపూటల వంతున పూటకు 4మాత్రల యిచ్చేది. జ్వరము అధికముగయున్న యెడల రెండు గంటలకొకసారి 4మాత్రల యిచ్చేది. గ్రంథిక జ్వరము హరించును.

11. కృష్ణతులసీదళములు5 భా॥ మిరియములు ఒక భా॥-ఈ రెంటినీ మెత్తగా చూర్ణించి బఠాణిగింజంతవటుకములు చేసి దినమునకు 3పూటలు వంతున పూటకు ఒకమాత్ర సేవించి వేడినీళ్ళుత్రాగవలెను. చలి జ్వరము నంద పూటకు రెండు మాత్రలు సేవించవలెను. దీనివలన సాధారణ జ్వరములు చలి జ్వరములు, మలేరియా మున్నగునవి హరించును.

12. తులసీదళములు 45; మారేడాకులు 15; రావి ఆకులు 5-వీటిని మెత్తగ నూరి అర్ధశేరు నీళ్ళలో కలిపి అష్టావభాగముగ కషాయము కాచిదించుకుని వడియ కట్టి గంటకు ఒక ఔన్సు వంతున త్రాగుచుండిన సన్నిపాత జ్వరము హరించును

13. తులసీదళములు 20, మిరియాలు 9, దాల్చినచెక్క 2తుండ్లు (2చిన్నాలు) అల్లం ముక్క బేడెత్తు-వీటిని మెత్తగానూరి పావుశేరు నీళ్ళలోకలిపి అర్ధభాగము మిగులు నట్లు యిగరకాచిదించుకుని అందు రెండు చెంచాలు పటిక బెల్లం చూర్ణం కలిపి సేవించుచుండిన ఇన్ఫ్లూయంజా జ్వరము హరించును.

14. అడవితులసీదళములను తెచ్చి దంచి రసము పిండుకుని చేతులు, కాళ్ళు, గోర్లు వీటిపై రుద్దిన జ్వరమునందు శరీరము చల్లబడుట, శీతలము హరించును.

15. తులసీదళములు, జాపత్రి, రససింధూరము- ఇదిసమభాగములు తెచ్చి తులసి స్వరసముతో మెత్తగానూరి బఠాణీలంత మాత్రలుచేసి పూటకు ఒకమాత్రవంతున దినమునకు రెండు పూటలు అల్లపురసము లేక కషాయముతో సేవించుచుండిన సకలవిధ జ్వరములు హరించును.

16. తులసి వేరును గచ్చకాయంతగ్రహించి దంచి ఒక ఆళాకు నీళ్ళలోవేసి అర్థాళాకు మిగులునట్లు కాచి దినమునకు 3పూటలు వంతున 6 దినములు సేవించిన వాత జ్వరము నందలి వాపు చెమటమూలముగ వెలువడి వాపుకరిగి జ్వరము తగ్గిపోవును.

17. తులసీదళముల స్వరసము1 భా॥ పటికబెల్లంపొడి 1/4 భా॥ ఈ రెంటినీ చేర్చి పాకమువలె కాచి పూటకు 1/4తు॥ వంతున దినమునకు రెండు పూటలు కొంచెము నీళ్ళుకలిపిసేవించిన పిల్లలకు వచ్చు జ్వరము, దగ్గు హరించును.

18. తులసీపుష్పగుచ్ఛము, అల్లము, కాచాకు- ఇవిసమ భాగము తెచ్చి నూరిసేవించిన శీతలాజ్వరము హరించును.

19. తులసి, వావిలివేరు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, జీలకర్ర, మాను పసుపు, తెల్లగడ్డ, నారింజపిందెలు- ఇవిసమభాగములు చూర్ణించి కలిపి పూటకు అర్ధతులం వంతున రోజుకు మూడుపూటలిచ్చిన చలిజ్వరము హరించును.

20. తులసీదళములు ఎడించినవి ఉసిరికాయ ప్రమాణము గ్రహించి కొంచెము అల్లముచేర్చి నూరి సేవించిన జ్వరము హరించును.

21. తులసి, గుంటగలగర, ముండ్లముష్టి. వావిలి, అడ్డసరము- ఇవి ప్రతిదీ ఒక పిడికెడు తెచ్చి అందు ఒకశేరు లేక తగినంత నీళ్ళుపోసి పొయ్యిపై పెట్టికాచేది. పొంగువచ్చునపుడు కొంచెము పిప్పళ్ళను గుడ్డలో మూటకట్టి అందులో వేసి బాగుగా పుడికిన తరువాత దించి పిప్పళ్ళమూటను తీసి వేరుగా నూరి పైకషాయములోనే కలిపి వడియకట్టుకుని రోజుకు రెండు పూటలు వంతున 4లేక5 దినములు సేవించిన పిత్త జ్వరము హరించును. కృష్ణతులసి ఒక పిడికెడు

గ్రహించి దంచిరసము పిండుకుని కొంచెము పొంగించి రెండు పూట
సేవించేది.

22. తులసి, కుక్కతులసి, వాకుడు, వేప, మజ్జిపండ్లు, మారేడ
సుగంధిపాల వేర్లు, పర్పాటకము, అడ్డసరము, కామంచి కసువు- ఇవి ప్రతి
ఒక పలముగ్రహించి ఒక శేరునీళ్ళలో వేసి కాచి నాల్గింట ఒక భాగవ
మిగులునట్లు కాచి, దానిని 5లేక6 పూటలు సేవించిన శ్లేష్మ జ్వరవ
హరించును.

23. తులసీదళములు ఎండించినవి ఒక పిడికెడు గ్రహించి అం
ఏలకులు3, కుంకుమపువ్వు, లవంగపట్ట- ప్రతిదీ 3 గురిగింజలు ఎత్తు చేర్చిదం
పొడిచేసి నీళ్ళలో వేసి బాగుగకషాయపక్వముగ కాచి మూత బెట్టి దించుకునే
5 నిమిషములతరువాత దానిలో పాలుపోసి చక్కెర కలిపి సేవించి
జ్వరముతీరును.

24. తులసి, మారేడు, మామిడి- వీటి ఆకులను సమభాగము చేర్చినీడ
ఆరబెట్టి పొడిచేసుకుని అందు ఆరువుస్తికాయల ప్రమాణమును అర్ధశేరునీళ్ళ
వైచి 1/8 భాగము మిగులునట్లు కాచి దించి సుఖోష్ణముగాసేవించి
అన్నివిధములైన జ్వరములు హరించును.

25. అడవితులసి, శుంఠి, విష్ణుక్రాంతి, తామరగడ్డలు, చిట్టాముట్టి- ఇ
సమభాగము గ్రహించి కషాయపక్వముగకాచి దించి భద్రపరచి అందు ఒక పల
కషాయములో కొద్దిగపిప్పళ్ళచూర్ణము చేర్చిసేవించిన శీతజ్వరము హరించున

26. తులసీదళములు నీడనఆరబెట్టి దోరగావేయించినది ఒక భాగమ
చిన్నఏలకులగింజలు1/2భా॥ లవంగములు 1/2భా॥ లవంగ పట్ట 1/2భ
చేర్చి చూర్ణించి కొంచెము తేనె కలిపి ఒక ఆళాకు తెళ్ళనీళ్ళలో వేసి దించుకు
5 నిమిషముల తరువాత వడియకట్టి అందు పాలు, చక్కెర కలిపి సేవించి
మలేరియాజ్వరము, కాస, నాలుకపిండుట వాంతి మున్నగునవి హరించును

27. తులసిఆకులు, నల్లతుమ్మచిగుర్లు, వెల్లుల్లి- ఇవిప్రతిదీ 16గురిగింజలెత
గ్రహించి 5తులముల నీళ్ళలో వేసి వుడుకబెట్టి చక్కెర చేర్చిత్రాగిన పిల్ల
జ్వరములు హరించును.

28. అడవితులసి పంచాంగములనుదంచి కషాయముకాచి, సేవించిన చెమట పట్టును.

29. తులసీ దళములు 6తు॥ మిరియాలు, జిల్లేడువేరుపైపట్ట, ఉమ్మెత్తవేరు పైపట్ట, జీలకఱ్ఱ-యివి ప్రతిదీ ఒక తు॥ గ్రహించి మెత్తగానూరి శెనగల ప్రమాణము మాత్రలుకట్టి పెట్టుకుని రెండుగంటల కొకసారి రెండు మాత్రల వంతున 3సార్లు యిచ్చిన చలిజ్వరము, వాతజ్వరము తీరును.

30. తులసి, గుంటగలిజేరు, తమలపాకులు, తెల్లగడ్డ, తిప్పతీగ,వాయింటాకు, శొంఠి,పిప్పళ్ళు,మిరియాలు, జీలకఱ్ఱ, అల్లము, అడ్డసరము, మునగచెక్క, లవంగములు, చిత్రమూలము- ఇవి సమముచేర్చి కషాయముగకాచి కొంచెము చక్కెర కలిపి సేవించిన సకల జ్వరములు హరించును.

31. రుద్రజడ, ఆవుకొమ్ము, ఆవుఎముకలు, వస, మేక వెంట్రుకలు, మిరియాలు, ఇంగువ, యవలు, తెల్లావాలు, నెమలిఈకలు, ఈశ్వర నిర్మాల్యము, నెయ్యి, వెదురుపై త్వక్కు, జటామాంసి, మంగకాయ, నాగుపాముకు బుసము, పిల్లిమలముఎండినది - ఇవి సమభాగములు గ్రహించి మేకమూత్రముతో మర్దించి తీసి అందుతగినంత చూర్ణమును నిప్పులపైవేసి ధూపమువేసిన సమస్తవిషజ్వరములు, శాకినీ, డాకినీగ్రహ, భూత, ప్రేత,పిశాచావేశముల వల్ల జనించిన వికారములు హరించును. దీనికి జ్వరధూపమని పేరు.

32. తులసీదళములు 10తు॥ మిరియాలు, ఎండినరావిపండ్లచూర్ణము, జాజికాయ - ఇవి ప్రతిదీ 1తు॥ గ్రహించి ఖల్వములో పెట్టి మెత్తగానూరి శెనగల ప్రమాణము మాత్రలుకట్టి నీడన ఆరబెట్టి పూటకు ఒక మాత్రవంతున దినమునకు 3 లేక 4 పూటలు సేవించిన వాతసంబంధమైన జ్వరము హరించి చెమట బట్టి శరీరమునకు ఆరోగ్యముకల్గును. చిన్న బిడ్డలకు వయస్సుననుసరించి 1/8భా॥ 1/4 భా॥ 1/2భా॥ మాత్రలు ఇచ్చేది. ఉష్ణమధికమైనచో మాత్రలను తగ్గించేది.

33. తులసీపత్రములు, బిల్వపత్రములు, రావిఆకులు - ఇవిసమతూకముగ్రహించి నూరి ఒకశేరు శుద్ధ జలముతో కషాయముకాచి మూడింట ఒకభాగము మిగులునట్లు చేసిదించి చేతితోబాగుగా పిసికి కలిపి వడియకట్టి రెండుగంటలకొకసారి రెండు తులములు కషాయమును మూడు,నాలుగు సార్లుసేవించిన జన్ని,స ప్లేగు విషజ్వరములు హరించును.

34. తులసి ఆకురసముతో సన్నిపాతభైరవిరసమును సాదియిచ్చిన జ్వరము హరించును.

35. తులసి, వేపాకు, మారేడు, కరక్కాయ, మిరియాలు, చందనకట్టె-ఇవిప్రతిధీ 25 గ్రా॥ గ్రహించి పొడిచేసి తులసిస్వరసముతో కాటుకవలెనూర మిరియాలంత మాత్రలు చేసి నీడనఆరబెట్టి భద్రపరచి పూటకు ఒక మాత్రవంతున రోజుకు మూడు పూటలు సేవించినసకలజ్వరములు తీరును. బిడ్డలకు ప్రమాణము తగ్గించియిచ్చేది.

36. తులసీదళములు, మారేడు పత్రములు, వేపచిగుర్లు- వీటిని సమభాగముచేర్చి నాలుగు మిరియాలు వేసి మెత్తగానూరి వుంటచేసిసేవించిన చలిజ్వరము తీరును.

37. నల్ల తులసి, వాకుడు, విష్ణుక్రాంతి, పర్పాటకము, తిప్పతీగ అడ్డసరము, నేలవేము- ఇవి సమభాగముగ్రహించి అర్ధశేరు నీరుపోసి నాల్గింట ఒకభాగము మిగులు నట్లు యిగరకాచి పూటకు 2 నుండి 4ఔన్సుల వరక బలము అనుసరించి ఒకదినము సేవించిన జ్వరములురావు. జ్వరము వచ్చినవారికి దినమునకు 3 పూటలు వంతున 3 దినములు యిచ్చేది.

38. కృష్ణ తులసి, అడవితులసి, పుదీనా- ఇవి సమభాగములు గ్రహించి స్వరసముపిండి దానిని మూడురోజులు సేవించిన ముదుర జ్వరము హరించును. లేనిచో 7 రోజులిచ్చేది.

39. తులసీస్వరసముతో- జ్వరాంకుశరసము, స్వచ్ఛందభైరవరసము, హింగ్ళేశ్వరరసము, అగ్నికుమారరసము, మృత్యుంజయరసము- వీటిలో దేనినై నొకదానిని, రోగము, రోగిబలము ననుసరించి సేవించిన సకల జ్వరము హరించును.

40. తులసీదళములు, పుదీనా- ఇవిసమభాగము చేర్చికషాయము కాచిసేవించిన ప్రతినిత్యము వచ్చు జ్వరము హరించును.

41. కుక్కతులసిస్వరసము ఒక ఔన్సులో శొంఠిపొడి 2 గ్రా॥ మిరియాలపొ

42. తులసి. శొంఠి, మిరియాలు, వస, కరక్కాయ, తెల్లపాయ, గోతుమ్మి- ఇవిసమభాగములు గ్రహించి- ప్రపంచమేతెలియని శిశువు మూత్రముతో నూరి దూదితోతడిపి నశ్యము చేసిన జన్ని హరించును.

43. తులసి. కుక్కతులసి, తుంగముస్తెలు- ఇవిప్రతిదీ రెండు పలములు రాతి రోటిలోదంచి ఒక పాత్రలో పోసి 6శేర్లు నీళ్ళుపోసి అందు కటుకరోహిణి, పిప్పళ్ళు- ప్రతిదీ అర్ధపలము గ్రహించి ఒక గుడ్డలో మూటకట్టివేసి తరువాత పాత్రనుపొయ్యిపైబెట్టి అర్ధభాగము ఆనగా 6పడి, అగునట్లు యిగరకాచేది, ఈ కషాయమును 6భాగములుచేసి పూట ఒకటికి అరింట ఒకభాగమువంతున రెండుపూటలు వుదయము, సాయంత్రము సేవించేది. సకల జ్వరములు హరించును.

44. తులసి. శొంఠి, పిప్పళ్ళు, ముల్లువుచ్చింతతీగవేరు, చిత్తాముట్టి వేరు, పేరాముట్టివేరు, విష్ణుక్రాంతి, దుసారితీగ, వల్లేరాకు, రత్నపురుష, తిప్పతీగ, ఒంటిరేకుతెల్లబాయ, మదనబుడత సమూలము- ఇవిప్రతిదీ 2వ రహావెత్తు రాతిరోటిలో వేసిదంచి ఒక పాత్రలోవేసి శుద్ధ జలము అర్ధశేరు పోసి పొయ్యిపై పెట్టి ఒకతవ్వమిగులునట్లు కాచిదించుకునేది. ఈ కషాయము తగుమాత్రము సేవించిన వరుస జ్వరములు హరించును.

45. తులసి, జీలకర్ర, శొంఠి, పర్పాటకము, నారదబ్బాకు , తిప్పతీగ, రేగుఆకు, చేదుపొట్ల, విష్ణుక్రాంతి, రామువములకచెట్టువేరు- ఇవిప్రతిదీ రెండువరహా ఎత్తుగ్రహించి దంచి శుద్ధజలము అర్ధశేరులో వేసి పొయ్యిపైబెట్టి ఎనిమిదింట ఒక భాగము మిగులునట్లు కాచిదించి వడియకట్టి కొంచెము మిరియాల చూర్ణము, చక్కెరచేర్చి పూటకు ఒక ఔన్సు లేక రెండు ఔన్సులు వంతున రోజుకు రెండుపూటలు సేవించుచుండిన విషజ్వరములు, శీత జ్వరములు గుణమగును.

46.తులసి, శొంఠి, దుష్టపువేరు, సుగంధిపాలవేరు, చిట్టామట్టి, పేరామాట్టి, ఈశ్వరి చెట్టువేరు, విషబొద్దివేరు, చిత్రమూలమువేరు- ఇది ప్రతిదీ రెండు వరాఎత్తుగ్రహించి దంచి అర్ధశేరుశుద్ధజలములో వేసి పాత్రను పొయ్యిపై బెట్టి ఒక ఆళాకు మిగులునట్లుకాచి సేవించుచుండిన విషను, శీతజ్వరములు తీరును.

**47.** తులసి వేర్లు, అడవిమల్లివేరు, కుక్కతులసి, ముండ్లతోటకూరవేర్లు
ుల్లువుచ్చింతతీగవేరుపైపట్ట, స్వర్ణరేలచెట్టుపట్ట దానివేర్లు, నీరుఉత్తరేణి,
లబందగుజ్జు, తుంగముస్తెలు, అడవి ఆముదపుచెట్టువేరు, ఉప్పివేర్లు, తిప్పతీగ,
ెట్టాముట్టివేరు, గలిజేరువేరు- ఇవిప్రతిదీ అర్ధపలమువంతున గ్రహించి
ాతిరోటిలో వేసి దంచి $1^1/_2$ శేరు శుద్ధజలములోవేసి అందు జీలకర్ర,
ురియాలు ప్రతిదీ 1/2 పలం ఒకగుడ్డలోమూటకట్టి వేసి పొయ్యిపైబెట్టి
ర్ధభాగము మిగులునట్లు యిగరకాచి దించి భద్రపరచేది. ఈ కషాయమును
ూటకు ఒక ఔన్సు వంతున రోజుకు రెండు పూటలు పైమూట కట్టిన దాని
ోని, జీలకర్ర, మిరియాలుచేర్చి నూరినది గెచ్చకాయప్రమాణము కలిపి
ేవించిన సకలజ్వరములు తీరును.

**48.** తులసి, కుక్కతులసి, పిపళ్ళు, గంటుభారంగి, శొంఠి, మిరియాలు,
వంగపత్రి, జీలకర్ర, ఈశ్వరిచెట్టు ఆకు, దానిపట్ట, ఆగరుశొంఠి, విష్ణుక్రాంతి,
ుదురుఆకు, మానుపసుపు, నారదబ్బకాయఆకు, నారదబ్బకాయలేతది,
ురాముట్టి, వావిలి ఆకు, మట్టియొక్క పండిన ఆకులు, పొగచూరు, అటుక
ూమిడి వేర్లు - ఇవిప్రతిదీ ఒకపలము గ్రహించి ఒకకుండలోవేసి ఒకపడి
ుద్ధజలము పోసిపొయ్యిపై బెట్టి ఒకతవ్వమిగులునట్లు యిగరకాచిదించి
ఆకషాయమును తగుమాత్రము సేవించిన శీతజ్వరములు తీరును.

**49.** తులసీదళములు-3ఎండించినవి, అల్లమువుస్తికాయంత, మిరియాలు-6
వీటినిచేర్చినూరి అందుపాలు, చక్కెర కలిపిసేవించిన జ్వరములు, రొమ్ముపట్టు
అనునవి తీరును.

**50.** తులసిస్వరసము ఒకతులము, అల్లపుస్వరసము అర్ధతులము-
ఈరెంటినీ ఒకటిగకలిపి సేవించిన మలేరియా జ్వరము హరించును.

**51.** నల్ల తులసి, శొంఠి-ఈరెంటిని చేర్చికషాయముకాచి కొంచెము
లకండకలిపి సేవించిన వరుసజ్వరము హరించును.

**52.** మంచితులసి స్వరసము, బాగుగాశుద్ధిచేసిననెల్లికాయగంధకము, బాగుగా
ుద్ధిచేసిన పత్రితాళకము, శుద్ధిచేసిన లింగము, శుద్ధిచేసిపొంగించిన వెళిగారము,
ొంఠి, పిప్పళ్ళుమిరియాలు, అక్కలకర్ర- ఇవిప్రతిదీ సమభాగముగ్రహించి
ుదటిదినము నిమ్మపండురసముతోను, రెండవ దినము గలిజేరు రసముతోను,

మూడవదినము గుంటగలిజేరు రసముతోను, నాల్గవదినము తులసి స్వరసముతోను మెత్తగానూరి ఉద్దులప్రమాణము మాత్రలుచేసి భద్రపరచుకునేది. పూటకు ఒక మాత్రవంతున రోజుకు మూడుపూటలు తగిన అనుపానములతో సేవించిన చలిజ్వరము హరించును. పులుపు, చింతపండు, కారమువాడరాదు.

53. శివతులసిని ఆవిరిలో పిట్టుబెట్టి పిండినరసమునందు మిరియాలపొడి, లవంగములపొడి, తగుమాత్రము వేసికలిపి సేవించిన జ్వరములు హరించును.

54. తులసీదళములను మెత్తగానూరి చేతులు, కాళ్ళు, వేళ్ళకు ఘనముగ పూసిన చల్లబడియుండుచేతులు, కాళ్ళు, వేళ్ళు, శరీరము వీటియందు వుష్ణమును పుట్టించును.

55. తులసివేరు, అడ్డసరపువేరు, వాకుడువేరు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, త్రిఫలములు, కొత్తిమిరివిత్తులు, అతిమధురము, చిన్నముత్తవపులగమువేరు, కటుకరోహిణి, మంజిష్ట, విషబొద్దివేరు, విష్ణుక్రాంతి, తుంగముస్తెలు, ఖర్జూరపుకాయ, వెదురాకు, పులిచింత, చందనపుపొడి- ఇవిప్రతిదీ $1^1/_2$ వరహా ఎత్తు గ్రహించి దంచి మొత్తతూకమునకు ఎనిమిదింతలు శుద్ధజలముపోసి (252 వరహా ఎత్తు) పొయ్యిపైపెట్టి అర్ధభాగము మిగులునట్లు యిగరకాచి దించివడియకట్టి అందు చక్కెర, తేనె తగుమాత్రము కలిపి పూటకు అర్ధఔన్సు లేక ఒక ఔన్సు వంతున రోజుకు 2,3పూటలు సేవించిన శీతజ్వరములు, తీరనిజ్వరములు హరించును.

56. తులసి, పర్పాటకము, సుగంధిపాలవేరు, తిప్పతీగ, చిన్నముత్తవపులగమువేరు, అతివస, శొంఠి, అతిమధురము, ఖర్జూరపుకాయ, తానికాయ, నెల్లివరుగు, వట్టివేరు, తామరగడ్డలు, కర్పూరము, నల్లకలువదుంప, ద్రాక్ష- ఇవిప్రతిదీ $1^1/_4$ వరహాఎత్తు గ్రహించి దంచి దానికి ఎనిమిదిరెట్లు నీళ్ళుపోసి పొయ్యిపైబెట్టి ఎనిమిదింట ఒక భాగము మిగులునట్లు యిగరకాచి దించి వడియకట్టి పూటకు అర్ధఔన్సునుండి ఒకఔన్సువరకు రోజుకు రెండుపూటలు సేవించిన దాహ జ్వరము హరించును.

57. తులసి, శొంఠి, అడవిరేగుఆకు, నారదబ్బకాయఆకు, ఎలుకచెవియాకు కలిగొట్టు, కూటికలబందగుజ్జు- ఇవిప్రతిదీ $1^1/_4$ వరహాఎత్తుగ్రహించిదం

దానికిఎనిమిదిరెట్లు నీళ్ళుపోసి ఎనిమిదింట ఒకభాగము మిగులునట్లు యిగరకాచి దించి వడియకట్టి పైవిదముగ తగుమాత్రము సేవించిన శీతజ్వరము, భూతజ్వరము తీరును.

58. తులసీదళములు, మారేడుదళములు, మారేడువేరు, కరకవలుపు, ఏలకులు, తిప్పతీగ, జీలకర్ర, విష్ణుక్రాంతి, అతిమదురము, ములువుచ్చింత తీగవేరు,చందనపొడి,ఎర్రచందనపొడి,తుంగముస్తెలు- ఇవిప్రతిదీ$1^1/_4$ వరహా ఎత్తు తెచ్చిదంచి ఎనిమిదిరెట్లునీళ్ళుపోసి ఎనిమిదింట ఒకభాగము మిగులునట్లు యిగరకాచి దించివడియకట్టి తగుమాత్రము సేవించిన ఘనజ్వరములు తీరును.

59. తులసి, అడ్డసరపాకు, ములువుచ్చింతతీగఆకు, వాకుడు, ఎర్రముండ్ల తోటకూర,వావిలి,అల్లము- ఇవిప్రతిదీ సమభాగముగ్రహించి దంచి రసము పిండుకుని అందుకొంచెముపిప్పలి చూర్ణము, తేనె కలిపి తగుమాత్రము సేవించిన శీతజ్వరము తీరును.

60. తులసీదళములు, అడ్డసరపాకు, మోదుగఆకు,వాకుడు,ములువుచ్చింతతీగ ఆకు- ఇవి సమభాగముతెచ్చిదంచి ఆవిరిలోవుడుకబెట్టి తీసి రసముపిండుకుని ఆరసమును తగుమాత్రము బిడ్డలకు పోసిన ఘనజ్వరము, శీతజ్వరము దగ్గు తీరును.

61. తులసి, కుక్కతులసి, అడ్డసరము, కామంచికసువు, మారేడు, సుగందిపాల, వావిలి, పర్పాటకము, గుంటగలగర, వాకుడు,కరివేప- వీటిని సమభాగముగ్రహించి కషాయముకాచి సేవించినశ్లేష్మ జ్వరము హరించును.

62. తులసీదళములు, వావిలిఆకులు, అడ్డసరపాకు, దుష్టుపాకు, ఊడుగ ఆకు, వేపపట్ట, కామంచి సమూలము- వీటిరసములు ప్రతిదీ ఒక తవ్వగ్రహించి దానికి నాల్గింట ఒకభాగము అనగా $1^3/_4$తవ్వనువ్వులనూనె కలిపి- అందు గంటుభారంగి, కర్కాటకశృంగి, త్రికటుకములు, త్రిఫలములు, గిలిగిరింత వేరు, ఈశ్వరివేరు, తెల్లపాయలు, వస, కోష్టు, కటుకరోహిణి, పసుపు, మాను పసుపు, నాగుపాముమాంసము- ఇవిప్రతిదీ వరహా ఎత్తుగ్రహించి చనుపాలుపోసి నూరి కల్కముచేసి పైరసములో కలిపి తైలపక్వముగకాచి వడియకట్టి ఆతైలమును శరీరమునకు పూయవలెను, నశ్యము చేయవలెను. పొగకూడా వేయవలెను. ఇట్లుచేసిన సకలజన్నిరోగములు, జ్వరములు హరించును.

63. రామతులసివేరు, విష్ణుక్రాంతి, శొంఠి-ఇవిసమభాగము తెచ్చి దంచి కషాయముకాచి సేవించిన చలిజ్వరము హరించును.

64. మంచితులసి, కుక్కతులసి, మిరియాలు, శొంఠి, ఓమము-ఇవిసమభాగము తెచ్చికషాయముకాచి సేవించిన పిత్త జ్వరము హరించును.

65. తులసీదళములు, కుప్పింటాకు, వావిలిచిగుర్లు, వేపాకు, తెల్లని వుల్లిపాయ, పిప్పుళ్ళు, మిరియాలు-ఇవిసమముచేర్చి గెచ్చకాయంత వుంటలు చేసిమూడు పూటలు సేవించిన చలివచ్చుటనుమాన్పును. కఠిన పథ్యముండవలెను.

66. తులసి, కృష్ణతులసి, కుక్కతులసి, విష్ణుక్రాంతి, గంటుభారంగి, చిన్నముత్తవపులగము, పెద్దముత్తవపులగము, దుంపరాష్ట్రము, చేదుపొట్ల, కరివేప, పర్పాటకము, లవంగములు, పిప్పుళ్ళు, కురువేరు, తిప్పతీగ- ఇవి సమము గ్రహించి కషాయము కాచిసేవించిన చలిజ్వరము హరించును.

67. తులసి, నాగుదోసాకు, చేదుపొట్ల, అడ్డసరపాకు, తుమ్మి, చిన్నవెలగ, ఉత్తరేణి, జుట్టపాకు-ఈ ఆకులను సమముగ్రహించి దంచి చట్టిలో రెండుపడిశుద్ధజలముపోసి, గుడ్డవాసెనకట్టి దానిపై బెట్టిఅందు శొంఠి, కటుకరోహిణి, మిరియాలు- వీటిని మెత్తగా చూర్ణించి గుడ్డలో మూటకట్టిపై ఆకులలోపలపూడ్చిపెట్టి పైనమూకుడు మూసి చీలమన్నుచేసి పొయ్యిపైబెట్టి బాగుగవుడుకబెట్టి తీసిగుడ్డలో యుండు చూర్ణము 3 భాగములకు ఒకభాగము చట్టిలోయుండు నీళ్ళతోనూరిమూడు దినములు ఆరుపూటలు సేవించిన జ్వరములు హరించును.-ఉప్పునువేయించియే చేర్చుకోవలయును.

68. తులసి, విష్ణుక్రాంతి, వాకుడు, వాయువిళంగములు, కోష్టు, వట్టివేరు, గుమ్మడి, దింటెన-ఇవిసమభాగము తెచ్చిదంచి కషాయముకాచి సేవించిన ద్వంధ జ్వరములు హరించును.

69. రుద్రజడను దంచి ఆవిరిలోవుడుక బెట్టి రసము తీసి అందుకొంచెము మిరియాలు, ఏలకులు పొడిచేసి కలిపి సేవించిన జ్వరము హరించును.

70. తులసీదళములు, 30 గ్రా॥ ఆరబెట్టి మెత్తని చూర్ణము చేసుకునేది. గట్టి మిరియాలను అవుమజ్జిగలో ఒకరోజు భావనచేసి తరువాత రెండురోజులు, ఎండలో ఎండబెట్టి మెత్తని చూర్ణము చేసుకునేది. ఈ రెండుచూర్ణములను

ఒకటిగ కలిపి అందు 5 గ్రా॥ చూర్ణమును తేనెతోవుదయము, సాయంత్రము సేవించుచుండిన ప్లూజ్వరము తీరును.

71. తులసి, వేపాకు, మారేడు, కరక్కాయ, చందనము, మిరియాలు - ఇవి సమభాగముతెచ్చి పొడిచేసి తులసిరసముతో నూరి మిరియాలంత మాత్రలుచేసి ఆరబెట్టి పూటకు ఒకమాత్రవంతున రోజుకు3 పూట లుఏడురోజులు సేవించిన సకలవిదములైన జ్వరములు హరించును. బిడ్డలకు అర్థభాగము యివ్వవలయును.

72. కృష్ణతులసి, అడ్డసరము, సప్తపర్ణి, త్రికటుకములు, త్రిఫలములు, పర్పాటకము, చేదుపొట్ల, కటుకరోహిణి, వేపచెక్క, నేలవేము, తుంగముస్తెలు, తిప్పతీగె, రక్తచందనమ- వీటినిసమభాగములుగ గ్రహించి 4రెట్లుమంచినీరుపోసి పొయ్యిపైబెట్టి నాల్గవవంతు మిగులునట్లు యిగరకాచి అందుకుసమము పంచదార చేర్చి పానకముగ కాచిదించి భద్రపరచి అందు ఒక తులం నుండి 3 తు॥వరకు కొంచెము వేన్నీళ్ళుకలిపి సేవించిన విషమ జ్వరములు, సర్వజ్వరములు, ప్లేగువ్యాధి హరించును.

73. తులసి స్వరసముతో శుద్ధిచేసినమణిశిల1 భా॥ త్రికటుకములు, పిప్పలీ మూలము, యివిప్రతిదీ 16 భా॥తూచిగ్రహించి ఖల్వములో మెత్తగాకాటుక వలెనూరి మిరియాలంత మాత్రలు చేసి ఆరబెట్టి భద్రపరచేది. ఒకటి లేక రెండుమాత్రలు తగుఅనుపానముతో సేవించిన చలిజ్వరము హరించును.

74. తులసి గింజలు 20 గ్రా, రావివిత్తులు 30 గ్రా॥- ఈ రెంటిని వేన్నీళ్ళతోనూరి వుస్తికాయంతమాత్రలు చేసి ఒకమాత్రను పాలలోకరిగించి ఉదయము సాయంత్రము సేవించిన యింద్రియస్కలితము వలనకల్గిన జ్వరము, అత్యుష్ణము తీరును.

75. నల్ల తులసి ఒకపిడికెడు, గరికె ఒక పిడికెడు, మిరియాలు-9, జీలకర్ర 4చిటికెలు వీటినిదంచి మట్టిపాత్రలోవేసి రెండుతవ్వలు నీళ్ళుపోసి అర్ధభాగము మిగులునట్లు యిగరకాచి దించి పూటకు ఒకఔన్సు వంతున ఒకరోజుకు 4నుండి 6పూటలు 3 దినములు సేవించిన ప్లూజ్వరము తీరును.

76. అడవితులసి, తిప్పతీగ, ఏడాకులపొన్నపట్ట, వేపవేరుపట్ట- వీనినిదంచి కషాయముకాచి అందు తేనె తగుమాత్రము చేర్చిసేవించిన కఫజ్వరము హరించును.

77. కృష్ణ తులసి, శ్వేతతులసి, మునగ- వీని ఆకులను సమభాగమునూరి కఫ, వాతోద్రేకము వలన కల్గిన విషమజ్వరములందు చలిచే బాదపడు చుండు జ్వరితుని శరీరమునకు పూసిన జ్వరము శాంతించును.

78. పుష్యమినక్షత్రముతో కూడినదినమునందు తులసి, వాకుడు, దిరిశెనము పువ్వు, శ్రీవేష్టకము, మెట్టతామర, పెద్దపాపర, దేవదారు, పద్మకింజిల్కములు, తెల్లలొద్దుగ, రేణుకలు, పసుపు, మానిపసుపు, ఇంగువ, పిప్పళ్ళు, కురువేరు, అడవిపెసర, చందనము, చంద్ర, యిప్ప, మ్రంగకాయ, వావిలి, రేల, లొద్దుగ, ప్రేంఖణము, ఉత్తరేణి, సన్నరాస్నము, లక్క, మణిశిల, వాయువిడంగములు, ఏలకులు, హరిదళము, కుంకుమపువ్వు, జటామాంసి, కామంచిపూరి, గ్రంథితగరము, తవాక్షిరి, కాకిదొండ, రాతిపువ్వు, మాచిపత్రి, స్పృక్కయను గంధద్రవ్యము, నాగరముస్తెలు, రేణుకలు, జాజిపువ్వులరసము, జిల్లేడుపువ్వుల రసము- వీటిని సమభాగములు సేకరించి తెచ్చినూరి గుళికలుగచేసి ఆరబెట్టి భద్రపరచేది. దీనిని అఘ్రాణించుట చేతను, లేపనముచేయుట వలనను, ధూమముగ వుపయోగించుటచేతను, శరీరమునందు ధరించుటచేతను- జ్వరములు హరించును. సమస్తమైన విషవ్యాధులను హరింపచేయును. స్త్రీలచే వుపయోగించబడు విషములు, అకాలమరణము కలుగక యుండునట్లు చేయును. (పుష్యమి ఆదివారము శ్రేష్ఠమని చెప్పుదురు).

79. వంచి తులసివేళ్ళకషాయము, భూతులసివేళ్ళకషాయము, గుంటగలగరాకు రసము, తక్కెడాకురసము, వావిలియాకురసము, మహాబీరాకురసము, పెన్నేరు గడ్డల రసము, చీకివెలగరసము, బలురక్కసిగడ్డ రసము, పిల్లిగడ్డలరసము, చతుర్థావశేషముగ కాచి వడియకట్టిన లక్కకషాయము, మేకపాలు- ఇవిప్రతిదీ ఒకప్రస్థము,, చిట్టాముదము 4 ప్రస్థములు- వీటన్నిటిని ఒకటిగకలిపికుండలో పోసి పొయ్యిపైబెట్టితైలపక్వముగ కాచిఅందు త్రిజాతక ములు, పంచ కోలములు, మిరియాలు తుంగముస్తెలు, కటుక రోహిణి, వట్టివేళ్ళు, తెల్లగడ్డలు, శ్రీగంధము, దేవదారుచెక్క, వాయువిడంగ ములు- ఇవి ప్రతిదీ ఒకతులమువంతున గ్రహించి కల్కముచేసి పై తైలములోవేసి తైలపక్వముగకాచి వడియకట్టి భద్రపరిచేది. ఈతైలమును తగుమాత్రము

సేవించవలయును. లేపనము, నశ్యముగకూడ వుపయోగించవలెను. దీనివలన ఏకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక,చాతుర్థిక,పక్షాంత, మాసాంత, వర్షాంత, విష పురాణ జ్వరములన్నియూ హరించును. ఈతైలము బిడ్డలకు మంచిఔషధము.

80. కుక్కతులసి, కలబంద, బిల్వవేరు, చిన్నపల్లేరు, తెల్లకలిమి వేరుపట్ట, అత్తివేరు, చేదుపొట్ల, నెల్లివరుగు, నేలవేము, శొంఠి, పర్పాటకము, వీటిని సమభాగములు తెచ్చికషాయము కాచి తగుమాత్రము సేవించిన పిత్త జ్వరము హరించును.

81. శివతులసిగింజలు, నీరుతూటికూర,పర్పాటకము, వడ్లబొరుగులు, మామిడిపప్పు, జంబునేరేడుపండు- వీటిని చేర్చిచూర్ణముగ గానిలేక కషాయముగ గాని చేసి సేవించిన దాహము శాంతించును.

82. తులసీదళములు20, తోలుతీసిన అల్లము ఒకచింతగింజంత-ఈ రెంటినీ దంచి ఒక తవ్వనీళ్ళలో వేసి అర్ధతవ్వయగునట్లు యిగరకాచి పూటకు ఒక ఔన్సు వంతున రోజుమూడు పూటలు సేవించిన శీతలమువలనవచ్చు జ్వరము 3 రోజులలో పుర్తిగ నయమగును.

83. తులసీదళములు పెద్దవి 51, శుద్ధిచేసిన మిరియాలు 21 - ఈరెంటినీ మెత్తగనూరి పెసలప్రమాణము మాత్రలుచేసి నీడన ఆరబెట్టి ప్రతిదినము వుదయము, సాయంత్రము పరగడుపున ఒకటి లేకరెండు మాత్రలను వేన్నీళ్ళలో కలిపి సేవించిన అన్నివిదములైన విషజ్వరములు హరించును.

84. తులసిదళములు,కాశాకు-ఈరెంటినీ సమభాగము గ్రహించినూరి తగుమాత్రము ప్రతిదినము సేవించుచుండిన శీతలజ్వరము హరించును.

85. కృష్ణతులసి, కుక్కతులసి, తిప్పతీగ, చేదుపొట్ల, విష్ణుక్రాంతి, పర్పాటకము, అడ్డసరము, తుంగముస్తెలు- వీటిని సమభాగములు గ్రహించి (ఒకపిడికెడు ప్రతిదీ) ఒక కుండలోవేసి మంచినీరుపోసి కషాయముగకాచి సేవించవలయును. ఇందువలన త్రిదోషములనబడు వాత, పిత్త, శ్లేష్మములు, ద్వంద్వదోషములు మున్నగువానిచే కలుగు సర్వరోగములు హరించును. ఈ కషాయమును విడువని విషజ్వరములందు వుపయోగించిన రెండు మూడుదినములలో శరీర ఉష్ణమును శాంతింపచేసి సమానస్థితికితెచ్చును. ఎటువంటిమందులకు లొంగని భూతజ్వరములు తీరును.

86. బాగుగాశుద్ధిచేసిన వళందాలింగము1 తులముగ్రహించి ఖల్వములో పెట్టియందు ఒకతులసీదళము, ఒక మిరియము వేయుచూనూరవలయును. ఇట్లు 300- తులసీ దళములు, 300-మిరియాలు, ఒక్కొక్కటిగావేసి మెత్తగా నూరవలయును. మాత్రపదమున శెనగలంత మాత్రలుచేసి ఆరబెట్టి భద్రపరిచేది. అనుపాన విశేషములతో పూటకు ఒక మాత్రవంతున రోజుకు మూడు పూటలు వాడుచుండిన సర్వవిధ జ్వరములు హరించును.

87. తులసీదళములు, 2తు॥ మిరియాలు 15--ఈరెంటినినూరి వెచ్చనినీళ్ళతో సేవించుచుండిన అన్నివిధములైన జ్వరములు, విషజ్వరములు, గ్రంథిక జ్వరములు అనేప్లేగు వ్యాధి, జీర్ణజ్వరములు, మందాగ్ని, అజీర్ణము, బేదులు, కాస, వాతరోగము, దంతశూల, శిశువులకాస, దగ్గు, విషకాట్లు, పాముకాట్లు మున్నగునవి నయమగును.

88. తులసి, వావిలి, చేదుపొట్ల, పెద్దచాతరాశికూరాకు, అడ్డసరము-వీటిరసములు ప్రతిదీఒకపడి, వేపనూనె ఒకపడి-ఈ రెంటినితైలప క్వముగకాచి అర్థ భాగము మిగిలినప్పుడు అందు కరక, తాడి, వుసిరిక, నల్లజీలకర్ర, మంజిష్ట, కటుకరోహిణి, వస, అతిమదురము, జటామాంసి, చిన్నతీటకసింద, నిమ్మపండు, బిళ్ళుగన్నేరు, వేప, వాకుడు, మంచిపాము తునకలు, వానపాములు, సన్నరాష్ట్రము, ఏలకులు, చాగ, అతివస, దేవదారు, జీలకర్ర, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, లవంగము, గోరోజనము, చెంగల్వకోష్టు, సదాపాకు, ఆవాలు- ఇవి ప్రతిదీ (3కళింజి) ఒక తులము గ్రహించి మెత్తగ చూర్ణించి వేసి తైలపక్వముగ కాచి దించివడియకట్టి తగుమాత్రము సేవించిన జన్నిరోగములు హరించును.

89. తులసీదళములు- 3, వేపచిగుర్లు- 5, వల్లేరాకు- 3, మిరియాలు- 2 - వీటిని చేర్చి, మెత్తగనూరి ఉదయము, సాయంత్రము పరగడుపున సేవించవలెను. ఇట్లు 5 దినములు సేవించిన డెంగ్ జ్వరము గుణముగును. (Dengue Fever)



# శిరోరోగ చికిత్స

1. తులసి స్వరసము, నిమ్మపండురసము-సమముచేర్చి తలపై పోసి బాగుగరుద్ది ఒక గంటతరువాత తలస్నానము చేయవలయును, ఇట్లు 15,20 దినములు చేసిన తలయందుపేనులు- హరించును.

2. తులసీదళముల స్వరసములో కొంచెము ఇందుప్పు కలిపి నాసికలో పోసిన బాధనివర్తియై సంజ్ఞవచ్చును. అపస్మారము హరించును.

3. తులసిచిగుర్లు, మునగవిత్తులు, మిరియాలు- ఇవిసమభాగము గ్రహించిమెత్తగాచూర్ణించి నాసికతో అఘ్రాణించిన (పీల్చిన) మైకమునుండి తేరుకొని ప్రజ్ఞవచ్చును. అపస్మారము హరించును.

4. తులసీదళములను తెచ్చి ఎండించి మెత్తగా చూర్ణించి ఆచూర్ణమును కొంచెముతీసి ముక్కుతో పీల్చిన యెడల తలనొప్పి హరించును. ముక్కునుండి కారేరక్తము అప్పటికప్పుడేనిలిచి కట్టి పోవును.

5. తులసీదళములు-5,6- రింటిని సేవించి దాని నేనలిపి వాసన చూచిన తలనొప్పి తీరును.

6. తులసిధళములు, లవంగములు, శొంఠి-ఇవి సమభాగము గ్రహించినూరి కొంచెము వేడిచేసి నెత్తిపైపట్టువేసిన తలనొప్పి శాంతించును.

7. తులసీదళముల స్వరసములో కొద్దిగా సైంధవలవణమును చూర్ణించి కలిపి ముక్కులో రెండుమూడు చుక్కలు వేసిన స్పృహతప్పిపడిపోయిన వారికి వెంటనే తెలివి వచ్చును.

8. శివతులసిదళముల స్వరసము నాలుగు చుక్కలు ఏవైపునొప్పి యున్నదో దానికి ఎదురుపక్క అనగానొప్పిలేని పక్కని ముక్కు రంధ్రములో వేయుచుండిన నొప్పి హరించును.

9. తులసి, మారేడు-ఇవిప్రతిదీ ఒక పిడికెడు గ్రహించిదంచిరసము పిండుకునేది. 1/4 లీటరు నువ్వులనూనెను బాణలిలోపోసి బాగుగాకాచేది. అప్పుడుపైరసమును అందులోపోసి నీరుయిగురు వరకు కాచిదించి చల్లారిన వెనుక సీసాలో భద్రపరచుకునేది. చిరునాలిక పెరిగి దగ్గుకలిగినపుడుపై

లో ఒక టీ చెంచాడునూనెను నోటిలో పోసుకుని చిరునాలికకు
ంనట్లు బాగుగ పుక్కలించేది. బాగుగ పుక్కలించిన తరువాత
సేది. ఇట్లు వుదయము సాయంత్రము చేసిన చిరునాలికపెరుగుట,
ున్నగునవి హరించును.

. శివతులసి ఆకులను తలకుకట్టిన తలపోటుతగ్గును.

. రుద్రజడ సమూలము దంచి తీసిన స్వరసమును వయస్సు, వ్యాధికి
ట్లు సేవించవలయును. ఇట్లు 21 రోజులు త్రాగిన ఉన్మాదము హరించును.

.మెదడు జ్వరము (Brain Fever) అనునది దోమలు కుట్టుట వలన
లను బాదించుచున్నదని ప్రచారము కలదు. ఏదిఏమైననూ ఈమెదడు
ునకు, తులసీదళములు 10, జీలకర్ర రెండుచిటికెలు, మిరియాలు10-
చేర్చినూరి పాలలో కలిపి సేవించుచుండిన మెదడు జ్వరము హరించును.
లు అధికముగా యుండు స్థలములు, ఇండ్లుమున్నగువానియందు
ంచువారు రోజు 5,6 తులసీ దళములను, సేవించుచుండిన పైవ్యాధిని
ండా నివారించును.

. తులసిరసము1శేరు, ఉప్పిపండ్లరసము 1/2పడి, నిమ్మపండ్ల రసము
, నీలిరసము1/2 పడి, నువ్వులనూనె 1పడి- వీటిని ఒకటిగ కలిపి అందు
, పిప్పిళ్ళు, మిరియాలు, కర్కాటకశృంగి, ఉప్పివేర్లు, లవంగములు,
ధిపాల, కోష్టు, అగరుచెక్క, తుంగముస్తెలు, జాజికాయ, అతిమదురము,
ందనము, నాగకేసరములు, వట్టివేర్లు, జాపత్రి, ముంతమామిడిపండ్లు,
ద్రాక్ష, కురువేరు- ఇవిప్రతిదీ ఒక పలము వంతున గ్రహించి పాలుపోసి
అముద్దను తైలములో వేసి కలియబెట్టి అన్నిటిని ఏకముచేసి ఆపాత్రను
్యపైబెట్టి తైలపాకాపక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరిచేది.
లమును 3 రోజుల కొకసారి అభ్యంగనము చేసుకుని పెసలపిండితో
మును రుద్ది వెచ్చని నీళ్ళతో స్నానము చేయుచుండిన శిరోవాయువు,
ు, కఫాలశూల, ముక్కునీరుకారుట, పిత్తము మున్నగునవి హరించును.

4. తులసీరసము, ఉప్పిఆకులరసము, చింతాకురసము, నీలి
రసము, నిమ్మపండ్లరసము, పొగడ పువ్వులరసము- ఇవి ప్రతిదీ ఒక తవ్వ
లనూనె ఒకతవ్వ అన్నిటిని కలిపిఒకపాత్రలోపోసి అందుకోష్టు, చందనము,

గ్రంథితగరము, చంపకపుష్పము, అగరు చెక్క, తక్కోలములు, ఎర్రకలువగడ్డ, లవంగములు, అల్లితామరగడ్డ, వుసిరికవిత్తులపప్పు, ఊడుగగింజలు, తామరవలయము, తాణికాయ, అతిమదురము, జాజికాయ, నాగకేసరములు, తుంగముస్తెలు, కురువేరు-ఇవి ప్రతిదీ దమ్మిడీఎత్తు(5 గురిగింజలెత్తు) గ్రహించి నిమ్మపండు రసముతో నూరి పైరసములు, నూనెలోవేసి కలియబెట్టి తైలపక్వముగ కాచి దించుకుని వడియకట్టి, అతైలముతో శిరస్నానము చేయుచుండిన తలలో పుండ్లు, తలలో పొట్టురాలుట, పేనుకొరుకుడు, వెంట్రుకలురాలుట, ఉష్ణము అనునవి
హరించును.

15. తులసీరసము, మునగాకురసము, పచ్చిపసుపురసము, తాటిమట్టల రసము, వావిలిరసము, పెద్దదుంపరాష్ట్రరసము, సన్నమల్లిరసము, మొగలిచండ్ల రసము, అల్లపురసము, కాకరాకు రసము, చాగదుంపరసము, తమలపాకు రసము- ఇవిప్రతిదీ 1/4 పడి, నువ్వులనూనె $1^1/_4$ పడి, ఆవుపాలు $1^1/_4$ పడి వీటిని ఒక చట్టిలోగాని కళాయిపాత్రలోగాని పోసి అందు దుంప రాష్ట్రము, వాయువిడంగములు, దేవదారు, పసుపు, అతిమదురమ, సహదేవి, అల్లి, కోష్ఠ, చిత్రమూలము, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, వస, ఇంగువ, ఆవాలు- ఇవి ప్రతిదీ అర్ధపలము పొడిచేసి పైనూనెతో కలిపి తైలపక్వముగ కాచిదించి కుండమూతికి గట్టిగ గుడ్డకట్టి ధాన్యపుటములో 15 దినములు పెట్టితీసి- అతైలమును చెవిలోయున్నూ, శరీరమునకు, తలకు అంటుకుని గంట తరువాత స్నానము చేయవలెను. ఈవిదముగ మూడుదినముల కొకసారి తలస్నానము చేసేది. దీనివలన శిరోరోగములు, చెవుడు, సప్తవిధములైన పీనశరోగములు హరించును. ఇప్పపిండితో రుద్దిస్నానము చేయ వలయును. ఇచ్చాపథ్యము.

16. తులసీదళములు, తుమ్మిపువ్వులు, వావిలి ఆకులు, పాతవియ్యైన కూకుడు గింజలు త్రికటుకములు, సన్నదుంపరాష్ట్రము, పటికారము- వీటినన్నిటిని సమభాగము ఒకటిగ చేర్చి చనుపాలు పోసిదంచి రసముపిండుకుని ముక్కుతో నశ్యముచేసిన అదురునటువంటి కాపాలశూల, కండ్లెర్రబడుట మున్నగునవి తీరును.

17. తులసీరసము, నిమ్మపండురసము-ఈరెంటిని సమముగకలిపి తలకుపూసి ఒక గంటతరువాత తలస్నానము చేయవలెను. ఇట్లుపలుసార్లు చేయుచుండిన తలయందు పేలులేకుండా నశించును.

18. తులసీరసము, గుంటగలగరరసము, గోరింటరసము, ఆవుపాలు-ఇవిప్రతిదీ ఒక ప్రస్థము, నువ్వులనూనె ఒక కుడవము వీటినన్నిటిని ఏకముచేసి, అందు ఒక పలము అతిమధురము చూర్ణించి చేర్చి తైలపాకపక్వముగ కాచిదించి చల్లారినతరువాత రాతిపాత్రలో భద్రపరచి - ఈ తైలమును నస్యముచేసిన పలితరోగము తీరును.

19. తులసి, వాకుడు, పద్మకేసరములు, పెద్దవాకుడు, దేవదారు, కోలపొన్న, మునుబాల, పిల్లిపీచర, రేణుకలు, ముయ్యాకుపొన్న, సుగంధిపాల, తుంగముస్తెలు, దాల్చినచెక్క, కరక్కాయ, కురువేరు, నల్లకలువ, సన్నఏలకులు, వాయువిడంగములు, మారేడు, ప్రపౌండరీకము, చందనము, అగరుచెక్క, ఆకుపత్రి, మానిపసుపుబెరడు, అతిమధురము, ముత్తవపులగము-వీటిని సమభాగములుగ గ్రహించి చూర్ణించినది ఒక భాగము, వర్షోదకము 100 భా॥ పోసి పొయ్యిపైబెట్టి కాషాయపక్వముగ పదిభాగములుమిగులునట్లు కాచిదించుకుని అందు ఒక భాగము కషాయము గ్రహించి ఒక భాగము తైలముచేర్చి, తైలపక్వముగ కాచవలమును. ఇట్లు మిగిలిన తొమ్మిది భాగముల కషాయమును పైతైలముతోనే తొమ్మిదిసార్లు కాచవలయును. కడపటి సారి అనగా పదవసారి కాచునపపుడు అందు తైలమునకు సమము మేకపాలు చేర్చి తైల పక్వముగకాచి దించుకునేది. ఈతైలమును నస్యకర్మనిమిత్తము ఉపయోగించవలెను. స్నేహ, స్వేద కర్మలు చేయబడిన తరువాత-ఈ తైలమును ముక్కునందు తగినంత వేయవలెను. ఇట్లుమూడుదినములకొకసారి వంతున ఏడుసార్లు (దినములు) చేయవలెను. ఇట్లు చేసిన ఈ తైలము త్రిదోషములను పోగొట్టును. కన్ను, ముక్కు, చెవులు, వీనికి బాధలుకలుగదు. మెడనరములు బిగియుట, తలనొప్పి, అర్దితవాతము, పడిశెము, పార్శ్వపునొప్పి, శిరఃకంపము, మున్నగునవి నశించును. సమస్తఇంద్రియములకు నైర్మల్యము, బలము కలుగును. శిరస్సునందలి సిరలు, సందులు, స్నాయువులు, కండరములు యివిబలపడును.

20. తులసియాకులు, ప్రొద్దుతిరుగుడు చెట్టువేర్లు, నల్లగోరింటవేర్లు, నల్లజనప ఆకులు, దేవదారు, గుంటగలగర, కాశికూరాకు, యష్టిమధుకము-యివిప్రతిదీ 10పలములు గ్రహించి అందు మరియూ త్రిఫలములు, పిప్పళ్ళు, మంజిష్ఠ, లొద్దుగ, కృష్ణాగరు, నల్లకలువ, మామిడిపప్పు, తామరదుంపయందలిమన్ను, తామరతూడు, రసాంజనము, ప్రపౌండరీకము, నీలియాకు, రక్తచందనము,

షిగింజలు, అడవిమల్లి, బావంచాలు, అన్నభేది, వేగిస, నల్లగ్రంగ, నల్ల చిత్ర
ాలము, లోహచూర్ణము, మద్ది, తామరపువ్వులు, పెద్దమ్మడి, నేరేడుపండ్లు,
ామిడిపండ్లు- ఇవిప్రతిదీ 5 పలములు వంతున గ్రహించి వీటిని అన్నింటిని
ూముగచేసుకునేది. ఒక అఢకము తానికాయలనూనె, నాలుగుఅఢకముల
సిరిక పండ్లరసము ఈరెంటినీ కలిపి పైకల్కమునువేసి కలిపి ఇనుప
త్రయందు పోసి కాచవలయును. తైలపక్వముగ కాచిదించి వడబోసి
ద్రపరిచేది. దీనిని పానము, నస్యము, శిరోభ్యంగముగ వుపయోగించ వలెను.
ని వలన సమస్తశిరోవ్యాధులు నశించును.నేత్రములకు మేలు చేయును.
ంట్రుకలు నెరయుటను నశింపచేయును.

21. తులసీదళములు, ఆముదపుచిగుర్లు-ఇవి సమభాగములు గ్రహించి
ెత్తగానూరి అందుకొంచము ఇందుప్పు చేర్చినూరి కొంచెము వేడిచేసి తలకు
ట్టువేసిన శిరశ్శూల హరించి శిరస్సునందుడు కృములు నశించును.

22. కృష్ణతులసి అకులను గ్రహించి తాటుకుచాపమీద దట్టముగ పరచి
ానిపై సన్ననిమల్లుగుడ్డను పరచి దానిపై శిరస్సునుపెట్టి పడుకోవలయును.
ులుఅన్నియు మరణించి గుడ్డపైపడివుండును. వానిని తీసి అగ్గిలోవేసేది.

23. కృష్ణతులసి ఆకులు మెత్తగనూరినవి ఒకపిడికెడు-వేపనూనె 1/2 లీటరు
ంటిని బాగుగకలిపి చట్టిలోవేసి కట్టెల పొయ్యిపైబెట్టి తైలపక్వముగకాచిదించి,
ద్రపరచి దానిని కణతలు, నెత్తి వీటిపై రుద్దిన తలనొప్పి హరించును. (Si-
us, Headache)

## నేత్రరోగ చికిత్స

. తులసీదళములను కొన్నింటిని సాయంత్రముపూట నోటిలోవేసుకొని
మిలి సేవించవలయును. అట్లునమలునపుడు నోటిలో వూరివచ్చునటు
ంటి వుమ్మినీరును తీసి తనకంటియందు, నాలుగుచుక్కలు అంజనము వేసు
ోవలయును. రోగియే ఈకార్యమును చేయవలెను. ఇట్లు చేయుచుండిన
ాత్రిపూట చూపుబాగుగ తెలుసును. కృష్ణతులసి స్వరసమును ఈ విధముగనే
ేసిన రేచీకటి హరించును.

2. తులసి స్వరసముతో మోదుగగింజనుభావనచేసి దానిని సాది కాటుక
లె కంటికిపెట్టిన పొరలు హరించును.

3. తులసి, మారేడు, ఉమ్మెత్త-వీటిఆకులు,కవిరి-ఇవి సమతూకము గ్రహించి ఖచ్చాగాదంచి నీళ్ళలోవేసి పొయ్యిపైబెట్టి తెళ్ళునిచ్చి ఆ ఆవిరిని నేత్రములకు తగులు నట్లు ముఖమునకు పట్టిన నేత్రసంబంధమైన వ్యాధులు తీరును.

4. తులసిస్వరసము, వెల్లుల్లిస్వరసము- ఇవిసమ భాగములు కలిపి రెప్పలపైరుద్దిన కంటిరెప్పలయందు చిన్నపొక్కులవలె లేచు రోగముతీరును (ఈరోగమును పోదకఅందురు).

5. తులసి, వేప, ఉత్తరేణి, బొక్కెన, దుష్టపు, నేలఉసిరిక, పొన్నగంటి, అగస్త్య, ఉమెత్త, గుంటగలగర, మునగ, కుప్పింట, పండుజిల్లేడాకు, చింతాకు, చిర్రికూర- వీటిరసములను సమభాగము గ్రహించి ఒకటిగ కలిపి ఒకచట్టిలో పోసి మంచి మల్లుగుడ్డను ఆరసములో 6-7 సార్లు తడిపి, ఆరించి వర్తిచేసి పెట్టుకుని యింకొక మూకుడునకు పైరసమునే 6-7 సార్లు పూసి ఎండించి పైవత్తులను నువ్వులనూనెతో దీపముపెట్టి రసముపూసిన మూకుడునకు ధూపముపట్టేది. అందుశద్ధిచేసిన తుత్తము, తురుసు, పటికారము ప్రతిదీ ఒక వరహాఎత్తుపెట్టి-ఎర్రవుత్తరేణి, విషబొద్ధి, నిమ్మపండ్లు వీటిరసముతోనూరి ఆరబెట్టి భద్రపరచేది. ఇందుకొంచెము వెన్న చేర్చినూరి కంటికి కలికమువేసిన సకలవిధములైన నేత్రరోగములు హరించును.

6. తులసీదళస్వరసము, పైతోలుతీసిన మిరియాలు-ఈరెంటినీ కాటుకవలెనూరి ఒకేకణికచేసి నీడన ఆరబెట్టి దానిని తేనెతో సాది సాయంత్రసమయము కంటిలోకాటుకవలె పెట్టుకొనుచుండిన రేచీకటి హరించును.

7. కృష్ణ తులసి స్వరసమును పిండి కంటిలో వేయుచుండిన కంటి మసక మానును.

8. తులసి స్వరసము, మునగపువ్వులరసము, చింతాకు స్వరసము, తొటిమట్టల స్వరసము మారేడుదళముల స్వరసము, గుంటలు- చెరువులలో యుండు జంటగాయుండుగవ్వలను ఎత్తి దానిలో యుండుజలము-ఇవిప్రతిదీ ఒక ఆళాకువంతునవడియ కట్టి ఎత్తుకుని అందు ఆవునెయ్యి ఒకఆళాకు, చనుపాలు ఒకఆళాకు, చేర్చుకునేది. మరియూ కావిరాయి, ఏలకులు,

అతిమధురము, సాదినచందనము, తేనెమైనము, - ఇవిప్రతిదీ అర్థవరహా ఎత్తు నూరి పైరసముతో కలిపి ఘృతపాక పక్వముగకాచి దించివడియకట్టి మంచి శుభ్రమైనబుడ్డీలో భద్రపరచేది. ఇందు ఒక చుక్క ఘృతమును కంటిలో వేసిన కండపెరుగుట, శుక్రము, వ్రణము, నేత్రములనుండి సదానీరుకారుట, కండ్లుకూచుట, చూపుపొగక్రమ్మట (ధూమందృష్టి), నేత్రకాస, శిరోభారముకలిగి నేత్ర రెప్పలపైభాగమున చుట్టిచుట్టి శూలకలుగుట, చూపు మందమగుట మున్నగునవి తీరును.

9. తులసిగింజలు, తులసిపుష్పగుత్తులు, కుంకుమపువ్వు, తుంగముస్తెలు, కూతురుబుడమవేర్లు, అగరుచెక్క, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, తాణికాయ, మానుపసుపు, కరకవలుపు, వస, వేపవిత్తులు, అతిమధురము, కానుగవిత్తులు, లవంగములు, ఇందుప్పు, శిరువేరు, పచ్చకర్పూరము, కాల్చినశంఖు, పొదిగినగుడ్ల పెంకులు, మణోశిల, వంగభస్మము, ముత్యభస్మము, తామ్రభస్మము, కంచు బస్మము, నీలాంజనము, రాజావర్తము, అభ్రకభస్మము, - ఇవిప్రతిదీ దుడ్డెత్తు గ్రహించి రాతిరోటిలోదంచి నీళ్ళుపోసి నాలుగుజాములు నూర వలయును. దానినితీసి ఒక శుద్ధమైన తామ్రపుడబ్బాలో భద్రపరచేది. ఇందు పెద్దమిరియపు గింజంత ప్రమాణము కంటిలో వేసిన సకలవిధములైన నేత్రరోగములు హరించును.

10. కృష్ణతులసి, రామతులసి, నంధివర్ధనము, ఉత్తరేణి, మారేడు, అల్లము, నల్లేరు, పల్లేరు, పసుపు, కర్పూరవల్లి, గుంటగలగర, పొన్నగంటి, తమలపాకు - వీటిని సమభాగముతెచ్చి ఎండించి భద్రపరచుకునేది. కావలసినపుడు వెన్నతో కాటుకవలె నూరి అంజనమిడిన నేత్రరోగములు హరించును.

11. తులసీదళముల స్వరసము, బిల్వపత్రస్వరసము - ఇవి సమభాగములు- దీనికి సమము చనుపాలు, వీటినికంచుపాత్రయందునిచి బాగుగామర్దనచేసి అందు గజపిప్పళ్ళు చూర్ణము సరిపోవునంత కలిపి రాగిచెంబు లేక గుండుతో ఒక జామునూరి కజ్జలిగచేసి భద్రపరచేది. అందు కొంచెముతీసి అంజనము వేసిన నేత్రరోగములు, నేత్రశూల మున్నగునవి గుణమగును.

12. తులసి ఒకపలము, కర్పూరము ఒకపలము, ఏలకగింజలు, అర్ధపలము- ఈ మూడింటిని కచ్చాగానూరుకుని తామ్రపుతట్టలోపెట్టి పైన చట్టితోమూసి మట్టూచీలచేసి, పొయ్యిపైబెట్టి మంచినూనె దీపముపెట్టి నాలుగుప్రక్కల శెగ

యిచ్చేది. 15 నిమిషముల మంటచాలును కర్పూరము పతంగించును. దానినివెన్న అనుపానముతో యిచ్చిన నేత్రరోగములు హరించును.

13. తులసిరసమును తామ్రపాత్రయందునిచి అందు పుష్పకాసీసమును మెత్తగ చూర్ణముచేసివేసి పదిదినములు భావనచేసి దానిని కంటికికాటుక వేసిన కనురెప్పవెంట్రుకలువూడుట, పిల్లరోగము హరించును.

14. తులసిపత్రస్వరసముతో- వెల్లుల్లి, సైంధవలవణము, మిరియాలు, తెల్లావాలు, వత్సనాభి- ఇవి సమభాగములుగ్రహించి, మెత్తగ కాటుకవలె నూరి నేత్రములకు అంజనమువేసిన పిల్లరోగము హరించును. ఆతరువాత ఆవునేతిని కంటియందు పూరించవలయును.

15. తులసిపత్రములు, భూతులసియాకు, పొన్నగంటియాకు, గుంటగలగరాకు, దొండాకు, తిప్పతీగఆకు- వీటిరసములు ప్రతిదీ ఒక్కొక్క భాగము, నెయ్యి ఆరింట ఒక భాగము (1/6) చేర్చిఘృతపాక పక్వముగకాచి- దానిని నస్యము చేయించిన నేత్రరోగములు హరించును.

16. కుక్కతులసి, కుక్కతులసిగింజలు, శుద్ధిచేసిన మడ్డివెలిగారము, శుద్ధిచేసిన తుత్థము, శుద్ధిచేసిన తురుసు, త్రికటుకములు, దుంపరాష్ట్రము, కోష్టు, నెల్లివరుగు, లవంగములు, చిర్రికూరవేర్లు, పిప్పలిబియ్యము- వీటిని సమభాగములు గ్రహించి చనుపాలతోనూరి మాత్రాపక్వమైనతురువాత మాత్రలుగ చేసి నీడన ఆరబెట్టి భద్రపరచేది. దీనిని తగుమాత్రము అనుపానరసములతో సాదికంటికి అంజన మిడిన తిమిరము తీరును.

17. తులసివేర్లు, శంఖు, శుద్ధిచేసినతలపుర్రి- ఇవిప్రతిదీ ఒక కళింజి (1¼ వరహా ఎత్తు) శుద్ధిచేసిన తుత్థము- 2కళింజి, నందివర్ధనపువ్వులు100. చంపకపుష్పములు 60 నువ్వులపువ్వులు 100-వీటిని సేకరించి చింతపువ్వులరసముతోను, నిమ్మపండురసముతోను కాటుకవలెనూరి వర్తివలెచేసి ఆరబెట్టి చనుపాలతో సాదికంటిలోవేసిన నేత్రశూల, కంటిరెప్పలుపైన క్రింద పుట్టు చిన్నగడ్డలు ఆనెలు మున్నగునవి గుణమగును.

18. తులసి, పిండికుండ ఆకు, చింతఆకు- వీటిని సమభాగముగ్రహించి ఒకగుడ్డలో మూటకట్టి నేత్రములకు ఒత్తడముచేసి, తంగేడుపువ్వులను నూరి శిరస్సుపై అప్పి పెట్టిన నేత్రశూల, ఎరుపు, నీరుకారుట, మంట, నవ్వకలుగుట మున్నగునవి హరించును. మరియూ చింతపండును శుద్ధోదకముతో కరిగించి నేత్రమందు రోజుకు 4-5 సార్లు పిండవలయును.

## నాశికారోగ చికిత్స

1. తులసివేరు. చిర్రికూరవేరు-యీరెంటినీ సమముచేర్చి ఆవుపాలతో నూరి దినమునకు రెండుపూటలు ఉదయ సాయంత్రము అందు 3 దినములు సేవించిన ముక్కునుండి రక్తము గడ్డగాపడుట అనువ్యాధి హరించును.

2. తులసిస్వరసము, అడ్డసరపురసము-రెంటినీకలిపి సేవించిన జల దోషముచే నాసికయందు శ్లేష్మము పడుట హరించును.

3. తులసీదళములు 30 లేక 40 ప్రతి దినము సేవించిన 3 దినములలో పడిశము హరించును.

4. తులసీదళవములు, మిరియాలు, ఇందుప్పు-ఇవి సమభాగవములు చూర్ణించి గచ్చకాయ ప్రమాణము సేవించేది. తులసి స్వరసమును శరీరమునకు పూసుకొనిన జలదోషము హరించును.

5. తులసి, మిరియాలు, వస, ఇంగువ, మునగవిత్తులు-ఇవిసమభాగము చూర్ణముచేసి చిటికెడుచూర్ణమును ముక్కుతోపీల్చిన ముక్కునందలి దుర్గంధముతీరును.

6. తులసి, శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు, వస, మునగవిత్తులు, ఇందుప్పు-వీటిని చూర్ణము చేసి అందు కొంచెముతీసి పీల్చి వాసనచూచు చుండిన దుర్గంధముతీరును.

7. తులసిస్వరసము, పసుపురసము, గలిజేరుఆకురసము, నువ్వులనూనె-ఇవిప్రతిదీ అర్ధపడిగ్రహించి కలిపి తైలపక్వముగకాచి దించివడియకట్టి భద్రపరచి కావలసినపుడు నస్యము వలెముక్కుతో పీల్చేది. దీనివలన ముక్కు నందలి దుర్గంధము, రక్తముపడుట హరించును. అనుభవసిద్ధమైనయోగము.

8. తులసీస్వరసము, వల్లేరాకుస్వరసము, పొన్నగంటిసమూలస్వరసము, వావిలి ఆకుస్వరసము, అవిశాకుస్వరసము, తెల్లపాయలస్వరసము, - ఇవిప్రతిదీ 2పడులు, ఆవుపాలు ఒకపడి, మంచినువ్వులనూనె ఒకపడి-వీటిని ఒక కళాయిపాత్రలో పోసి అందు పిప్పళ్ళు, పిప్పలీమూలము, కరకపువ్వు, కోష్ఠు, లవంగపత్రి, లవంగపట్ట, చవ్యము, ఏలకులు, వాయువిళంగములు, నల్లజీలకర్ర,

చందనము, మానుపసుపు, అతిమధురము, గంటుభారంగి, నాగకేసరములు- ఈ 15 సరుకులు ప్రతిదీ ఒక వరహాఎత్తు, శుభ్రముచేసినవి గ్రహించి పాలతోనూరి పాలలోనే కరిగించి - వీటినిఅన్నింటిని కళాయి పాత్రలో పోసి పొయ్యిపైబెట్టి తైలపక్వముగాకాచి వడియకట్టి భద్రపరచేది. ఈ తైలమును మూడుదినముల వరకు ప్రతిదినము కొంచెము కొంచెముగ శిరస్సుపై పెట్టుచూరావలయును. తరువాత 4 లేక 6 దినములు వదిలి మరల 3 దినములు చేసేది. మరియూ ప్రతిరోజు ఈ తైలమును శిరస్సున కంటుకొని స్నానము చేయుచుండిననూ, నస్యము చేయుచున్ననూ-శ్వాసను అడ్డగించు అష్టాదశ విధములైన పీనశములు హరించును.

**పథ్యము:**– పులుపు, పుగాకు, పొగ-వర్జ్యము.

9. తులసిస్వరసము, కుక్కతులసి స్వరసము, గుంటగలిజేరురసము, పచ్చిపుల్లిపాయరసము, పచ్చిపసుపురసము, నారదబ్బపండురసము, అల్లపురసము, పల్లేరురసము, ముండ్లతోటకూరరసము-ఇవిప్రతిదీ 1 / 4 శేరు, నువ్వులనూనె 1 / 4శేరు వీటిని ఒకటిగ కలిపి కళాయి పాత్రలో పోసి పొయ్యిపైపెట్టి పక్వముగ కాగునపుడు అందు వెద్రకలుపగడ్డ, కోష్టు, పిప్పళ్ళు-ఇవిప్రతిదీ ఒక పలంవంతున చూర్ణించి, పైతైలములో వేసి తైలపక్వముగ కాచి దించి వడియకట్టి భద్రపరచుకుని ఆతైలముతో శిరస్నానము చేయుచుండిన పీనశము, ముక్కునుండినీరుకారుట, తుమ్ములు మున్నగునవితీరును. పొగాకు, పులుపు, వగరు పదార్థములు వర్జ్యము.

10. మంచితులసి, చిన్నతులసి, వావిలి, కుక్కవాయింట, ఉమ్మెత్త,మోదుగ, జిల్లేడు, నీలి-వీటిరసములు ప్రతిదీ 1 / 4శేరు. అల్లపురసము 1 / 2శేరు, తాటికాయరసము 1 / 2 శేరు పచ్చిపసుపురసము 1 / 4 శేరు, కూతురుబుడమరసము 1 / 4శేరు, అరటిగడ్డరసము 1 / 4శేరు, ములువుచ్చింతతీగ పండ్లరసము 1 / 4శేరు, తమలపాకురసము 1 / 4శేరు -వీటినన్నిటిని కలిపిపెట్టుకుని అందు వెలగవేరు, పెన్నేరు గడ్డ, నీలివేరు, తెల్లతుత్తివేరు, చేకుణితవేరు, -వీటిని మెత్తగనూరిన కల్కముప్రతిదీ 1 / 2 పలము మరియూ గచ్చపప్పు, కోష్టు, నులిదడకాయలు, ఏలక్కాయలు, చంపకపుష్పము, సముద్రగవ్వలు, సముద్రపాలవిత్తులు-ఇవి చూర్ణించినది ప్రతిదీ ఒక వరహాఎత్తు కలిపి శుద్ధమైన నువ్వులనూనె 4శేర్లు, వీటినిఅన్నింటిని ఒక కళాయి పాత్రలో కలిపి పొయ్యిపై బెట్టి తైల పక్వముగ కాచి దించుటకు ముందు పచ్చకర్పూరము కాల్దమ్మిడీ

ఎత్తు చూర్ణముచేసి వేసి దించుకునేది. ఈ తైలమును ప్రతిదినము అభ్యంగనము చేసుకుని శిరస్నానము చేయుచుండిన పురాతన 18 విధములైన పీనశములు హరించును.

11. తులసిరసము, తుమ్మిరసము, వావిలిరసము, దానిమ్మపువ్వురసము- ఇవి ప్రతిదీ 1/4 శేరు గ్రహించి మిరియాలు ఒక పలము చేర్చినూరి ఒక శేరు నువ్వులనూనెలో అన్నిటిని పోసి కలియబెట్టి కళాయిపాత్రలో పోసిపొయ్యిపైబెట్టి తైల పక్వముగకాచి దించి వడియకట్టి భద్రపరచేది. ఈతైలముతో శిరస్నానము చేయుచుండిన సకల పీనశములు గుణమగును.

12. తులసి వేర్లు, మిరియాలు, వాయవిడంగములు, శొంఠి, పిప్పళ్ళు, మునగవేర్లు, ముల్లువంగపండు, ఇందుప్పు, నేపాళమువేర్లు- ఇవి సమభాగము గ్రహించి ప్రత్యేకముగ గోమూత్రముతో కాటుకవలె నూరి ఒకటిగ కలిపి ఆమొత్తముద్దకు నాల్గింతలు నువ్వులనూనె చేర్చి పొయ్యిపైపెట్టి కాచితైల పక్వముగ దించుకుని వడియకట్టి భద్రపరచేది. ఈ తైలముతోనస్యము చేసిన పీనశము, దుర్గంధము తీరును.

13. తులసి, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, నేలములక, మునగపట్ట, ఇందుప్పు, నేపాళమువేరు, వస- వీటినిసమభాగము గ్రహించి నీళ్ళుపోసినూరి- ఆనూరినముద్దకు నాల్గింతలు నువ్వుల నూనెపోసి కలియబెట్టి పొయ్యిపైపెట్టి తైల పక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరచేది. ఈ తైలముతో నస్యము చేయుచుండిన దుర్గంధము, పీనశము మున్నగునవి హరించును.

14. తులసిరసము, కర్పూరవల్లిరసము, గుంటగలిజేరురసము, అల్లపురసము, పచ్చిపసుపురసము, తమలపాకులరసము, వావిలిరసము- ఇవిప్రతిదీ అర్ధపడి గ్రహించి ఒకపడి నువ్వులనూనెలో కలిపి- అందు అతిమధురము, లవంగములు, కోష్టు, సన్నరాష్ట్రము, వస, పెద్దదుంపరాష్ట్రము, సదాప, ఏలక్కాయ, చంఫకపుష్పము మానుపసుపు, కస్తూరిపసుపు, కమ్మిభంక, నల్లజీలకర్ర, ఇందుప్పు, నులిదడ కాయ- ఇవిప్రతిదీ $1^1/_4$ వరహాఎత్తు గ్రహించి పైరసముతోనే మెత్తగానూరి పైనూనెలో కలిపి పొయ్యిపైబెట్టి తైలపక్వముగ కాచి దించి వడియకట్టి భద్రపరచేది. రోగబలము, కాలమును అనుసరంచి శ్రీగణేశుని ధ్యానించి పూజచేసి ఈ తైలమును అభ్యంగనము చేసుకుని శిరస్నానము చేయవలెను. నస్యముకూడా చేయవలెను. దీనివలన నాశికారోగములు, పీనశములు హరించును.

15. తులసీదళముల చూర్ణమును పీల్చిన ముక్కులోని పుండు, పీనశ హరించును.

16. తులసీదళములు, వాకుడు, వస, దంతిమూలము, మునగపట్ట, త్రికటుకములు- ఇవిసమభాగములు నూరి ముద్దగ చేసుకుని మంచినువ్వులనూనెలో వేసి కలిపి తైలపాకపక్వముగకాచి దించివడియ కట్టి భద్రపరచుకునేది. ఈతైలమును ముక్కులో వేసిన పీనశము (Ozoena ) హరించును.

17. తులసీదళములు, త్రికటుకములు, చెంగల్వకోష్టు, రేగు, గుమ్మడి, చెన్నచర్లగడ్డ- వీటినిసమముగనూరి గుడ్డలో వడియకట్టి వచ్చినరసమును ముక్కులో పోసిన పీనశము, ముక్కునుండినీరు కారుట హరించును.

18. తులసిరసము 20పలములు, కుందురుష్కముచూర్ణము 2పలములు, నువ్వులనూనె 20పలములు గ్రహించి అందుమొదట నువ్వులనూనె, తులసిరసములను ఒకటిగ చేర్చి తైల పక్వముగకాచి అందు కుందురుష్క చూర్ణమును చల్లి దించి భద్రపరచేది. ఇందు ఒకటి రెండు చుక్కలు ముక్కునందు నస్యము చేయించవలయును. దినమునకు మూడుసార్లు తలకు రుద్దవలయును. కడపట తలస్నానము చేయుచూరావలయును. ఇట్లు చేసిన జలపీనశము, మున్నగు ఏడు రకముల పీనశములు తీరును.

19. తులసి, వాయువిడంగములు, త్రికటుకములు, సైంధవలవణము, మునగవిత్తులు, వాకుడుగింజలు, దంతివిత్తులు- వీటినిసమభాగము గ్రహించి మెత్తగ నూరి తగుమాత్రము నువ్వుల నూనెలోకలిపి తైలపక్వముగ కాచి ఆతైలమును నశ్యము చేసిన పూతినాస, పీనశరోగములు హరించును.

20. తులసీదళములను, ఆవిరిలోపిట్టుపెట్టితీసి పిండినరసమును సేవించిన జల దోషము తీరును.



# కర్ణరోగ చికిత్స

1. తులసీదళముల స్వరసము,గుంటగలగరాకురసము- ఇవి సమభాగములు నిప్పులపై కాచి వడియకట్టి చెవిలోపోసిన చీముకారుట హరించును.

2. శివతులసి రసమునుచెవిలోపోసిన చెవిలోపోటు, చీముకారుట హరించును.

3. తులసి, సర్పాక్షి, గుంటగలగర, ప్రత్తి, తెల్లపాయ, జిల్లేడుపండుటాకులు, కాకర, అరటిగడ్డ, వావిలి, మునగపట్ట, అల్లము- వీటినిదంచి తీసినరసము ప్రతిదీ ఒకతవ్వఅందు శుద్ధమైన నువ్వులనూనె 1/4 పడిచేర్చి మరియూ ఇందుప్పు, ఇంగువ, అవాలు, అడవిజీలకర్ర, పసుపు- ఇవిప్రతిదీ చూర్ణించినది ఒక వరహాఎత్తు పైరసములో దేనితోనైననూ మెత్తగానూరి, ఆరసనూనెలోనే కలిపి పొయ్యిపైపెట్టి తైలపక్వముగా కాచిదించి భద్రపరచేది. పూటకు 4 చుక్కలవంతున రోజుకు రెండు పూటలు చెవిలో వేయుచుండిన చెవినొప్పి, బాద, వాయువు తీరును.

4. తులసి, వావిలి, జాజిఆకు, కాకర, జిల్లేడు, గుంటగలగర, వెల్లుల్లి, మునగ, ప్రత్తికాయ, అల్లము- వీటిరసములు సమభాగము గ్రహించి అందుకు సమము మంచినూనె కలిపి, అందు కొంచెము నాభిని వైచితైలపక్వముగకాచి దించి భద్రపరచుకునేది. ఈతైలమును చెవిలోవేసిన-చెవుడు, కర్ణనాదము, కృములు, శూల, చీముకారుట తీరును.

5. తులసి, వావిలి, మునగ, తెల్లగడ్డ, జిల్లేడు, అల్లము, కాకరవేరు, నల్లఅరటిగెడ్డ, నల్లజీలకర్ర, చీమలగుడ్లు, -ఇవి సమభాగముగ్రహించి అందుకు సమము మంచినూనె కలిపి తైలపక్వముగ కాచిదించి వడియకట్టి వాడేది. ఈతైల మును చెవిలో పోయుచుండిన చెవినొప్పి, చెవిలోహోరు మున్నగునవి హరించును.

6. తులసి చిగుళ్ళు, ఆముదపుచిగుళ్ళు- ఇవిసమభాగములు గ్రహించినూరి కొంచెము ఉప్పుకలిపి వెచ్చచేసి లేపనము చేసిన చంగ, వాపు మరియూ చెవివెనుకవాపు తీరును.

7. తులసీదళములరసము, మొక్కజొన్నపాలు- ఇవిసమము చేర్చి చేవులందు రెండు మూడు చుక్కలు వేసిన నొప్పి హరించును.

8. తులసి ఆకురసము, పసుపుగుంటగలిజేరు ఆకురసము-ఈరెంటినీ కలిపి చెవిలోపోయుచుండినచెవినుండి రక్తముకారుట, చీముకారుట గుణముగును.

9. తులసి, ముల్లంగి, అరటిగడ్డ, మునగ, అల్లము, వెల్లుల్లి- వీటిరసములను వేరువేరుగ- పెచ్చచేసి తరువాత కలిపి సుఖోష్ణముగ చెవులయందు పోసిన కఫజ కర్ణరోగములు తీరును.

10. తులసి, వావిలి, కాకర, అల్లము, అరటి, పత్తికాయ, వెల్లుల్లి, గుంటగలగర, జాజియాకు, మునగ, జిల్లేడు- వీనినిసమభాగము గ్రహించి అందుకు సమము నువ్వులనూనె కలిపి పొయ్యిపై పెట్టి అందు కొంచెము వసనాభిని వేసి తైలపక్వముగ కాచి చేసిన తైలమును చెవిలో వేయుచుండిన- చెవుడు, కర్ణనాదము, చీముకారుట, శూల, క్రిములు మున్నగునవి హరించును.

11. పువ్వుతోకూడిన తులసీదళములు గ్రహించి నిప్పు శెగన వాడ్చి పిండినరసమును చేవిలో రెండు, మూడుచుక్కలు పిండిన 10 దినములలో చెవిమందము హరించును.

12. తులసి స్వరసములో ఇందుప్పు కొంచెమువేసి వెచ్చచేసి రెండు చుక్కలు చెవిలో వేసిన చెవిమందము తీరును.

13. తులసి ఆకులను తనఅరచేతిలోనే పెట్టి వేడిపుట్టు నట్లు నలిపి తీసినరసము చెవిలో వేసిన చెవిమందము తీరును.



## ముఖరోగ చికిత్స

## ముఖం ,నోరు, దంతములు,వీనియందు కలుగు రోగములకు చికిత్స

1.తులసి స్వరసము 4శేర్లు, తిప్పతీగస్వరసము 1తవ్వ, చిన్నములక స్వరసము 1తవ్వ, తెల్లపాయస్వరసము 1తవ్వ- వీటిని ఒకటిగ కలిపి అందు శు॥గుగ్గిలము 4ఫ॥ శొంఠి 1పలం, పిప్పళ్ళు1ఫలం, మిరియాలు 1ఫలం - వీటిని మెత్తగానూరి పైరసకలియికలో వేసి కలిపి ఆముదము ఒకతవ్వచేర్చి కలిపి ఆపాత్రనుపొయ్యిపైబెట్టి మంటవేసి తైలపక్వముగ కాచివడియకట్టి భద్రపరచేది. ఈతైలమునుముక్కుతో నస్యము చేయుచుండిన ముఖరోగములు, మైకము, ముక్కునుండి రక్తముపడుట, చీముకారుట యివి తీరును.

2. తులసీదళములు, గరొకె- ఇవిసమభాగము కలిపినూరి గుడ్డలోస్వరసమును పిండుకుని 3-4చుక్కలు- ముక్కులోవేసిన ఎక్కిళ్ళు హరించును.

3. తులసీదళములు, తులసివేర్లు, తుమ్మిఆకు, తుమ్మివేర్లు, శుభ్రముచేసిన ఉప్పు- వీటిని సమబాగము గ్రహించి మెత్తగానూరి వేన్నీళ్ళలోకలిపి వుదయము పూట సేవించవలెను. దీనివలన గండమాలరోగము హరించును.

4. తులసి ఆకుస్వరసములో వాముును భావనచేసి ఎండించి ఇట్లు మూడుసార్లు చేసి ఎత్తుకుని అందు శుద్ధిచేసిన సైంధవలవణము 1/15వ, భాగముచేర్చి మెత్తగనూరి భద్రపరచేది. ఉదయము, సాయంత్రము గుమ్మపాలు లేక గోరువెచ్చని ఆవుపాలలో 1/8 తు॥చూర్ణము కలిపిసేవించిన కోకిలస్వరమేర్పడును.

5. శివతులసిగింజలను అనగా సబ్జావిత్తులను నీళ్ళలో భావనచేసి నోటిలోవేసుకుని బాగుగానమిలి సేవించిన శీతలమువలన గొంతుబొంగురు పోవుట తీరును.

6. రుద్రజడ ఆకులను నోరుపట్టునంత నోటిలోవేసుకుని ఉదయముననే నమిలి తినవలయును. ఇట్లు వారము దినములు సేవించిన వోకరింత హరించును.

7. తులసీదళములు, మాచిపత్రి-ఈరెంటినీ నూరిముఖముపై లేపనము

ముఖముపై లేపనము చేయవలెను. దీనివలన ముఖముపై జనించు నల్లనిమచ్చలు హరించును.

8. తులసి, వస, కుంకుమపువ్వు, చందనము, తెల్లావాలు, జాజి, మఱ్ఱిచిగుర్లు, లక్క, ప్రేంకణము, మోదుగపువ్వులు, నాగకేసరములు, మానిపసుపు, పసుపు, గోరోజనము, చెంగల్వకోష్టు, తామరపువ్వు, పద్మకాష్ఠము, అతిమధురము, లవంగపత్రి, వట్టివేరు, మంజిష్ట, పీతచందనము, రక్తచందనము, లొద్దుగచెక్క, రసకర్పూరము, కావిరాయి, మైనము- ఇవి ప్రతిదీ ఒక అక్ష ప్రమాణము గ్రహించి మెత్తగనూరి, నాల్గింతలు ఆవుపాలు పోసి కషాయము కాచి అందు రెండు ప్రస్థములు నువ్వులనూనె కలిపి మందాగ్నితో తైలపక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరచి- ఆతైలమును ముఖమునందు లేపనము చేయుచుండిన నీలిక, వ్యంగము, తిలకాలము, మొటిమలు, పద్మినీకంటకము, జంతుమణి, న్యచ్ఛము, మాషము అను ముఖరోగములు హరించును.

## నోరుమున్నగువాటిరోగములకు చికిత్స

1. ఆహారము సేవించిన తరువాత తులసీదళములను నమిలి తినుట వలన నోటి సంబంధమైన వ్యాధులు నివర్తియగును. పంటియందు చిక్కుకొనిన ఆహారము మూలముగ జనించు కృములు నశించును.

2. తులసీదళములు, జాజిఆకులు, జాజిపువ్వులు, నేరేడుఆకులు, బోడతరం ఆకులు, మంగకాయలు, పసుపు, మానుపసుపు- ఇవి సమభాగము తెచ్చిమెత్తగనూరి, అందు నువ్వులనూనె తగుమాత్రముపోసి, తైలపక్వముగకాచి వడియకట్టి భద్రపరచేది. ఈతైలములో కొంచెము నోటిలోవేసుకుని బాగుగా పుక్కిలించి ఉమ్మివేయవలెను. ఇట్లుచేసిన నోటిదుర్గంధము హరించును.

3. తులసీదళములను బాగుగానమిలి వుమ్మివేయవలెను. ఇట్లు చేయుచుండిన రస సేవనవలన నోరు పట్టుట హరించును.

4. రామతులసి స్వరసము 1తు॥ గ్రహించి ఏలకుల గింజలపొడి 8గురిగింజలెత్తు చేర్చి సేవించిన వాత, పిత్తసంబంధమైన వాంతి హరించును.

5. తులసిగింజల చూర్ణము, పిప్పలి చూర్ణము- ఇవి సమభాగము చేర్చి తేనెతో సేవించిన అరుచి హరించి ఆకలికల్గును.

6. శివతులసిఆకును వేకువజామున మాత్రము నోటినిండుగ వేసుకుని ాగుగా నమిలిమ్రింగిన వోకరింత హరించును. ఐదుదినములు సేవించిన లును.

7. తులసిస్వరసము 1 తు॥ ఏలకులగింజలపొడి 1 అణాఎత్తు, చక్కెర తు॥- ఈమూడింటిని కలిపి సేవించిన వాంతులు హరించును.

8. తులసీదళములు, జిల్లేడువేరుపట్ట, నల్లతుమ్మచెక్క, తెల్లతుమ్మచెక్క- విసమభాగముగ్రహించి దంచి కషాయముగ కాచి దానిని దినమునకు 3 పూటలు ంతున నోటియందుంచుకుని పుక్కిలించేది. ఈవిదముగ 4-6 రోజులు, చేసిన టి పుండ్లు, నోటిశూల, నోటియందలి వ్రణము హరించును.

9. తులసీదళములు, మిరియాలు-ఈరెంటిని సమముచేర్చి బాగుగా నమిలి వించిన గొంతులోని కండరములు (Tonsils) వుబ్బుట గుణమగును. రలపెరుగవు.

## దంతరోగ చికిత్స

1. తులసి స్వరసము నందు కర్పూరమును పొడి చేసి దూదిలో కలిపి అందు ంచెముతీసి పంటిలో నొప్పి; పుచ్చుగలస్థలమున వేసి అదిమి యుంచిన రుగులు నశించి దంతశూల హరించును.

తులసీదళములు 1 భా॥ సన్నజాజి ఆకులు 1/2 భా॥ కలిపి నమిలిమ్రింగిన ంతచిగుర్లవాపు నొప్పి తగ్గిపోవును.

భూతులసీదళ స్వరసమును చెవిలో పిండిన వుప్పిపంటిలోని పురుగులు చ్చిబాధ తీరును.

తులసీదళములు ఎండించినవి ఒకకర్షము, ఇందుప్పు 48గు. గింజలఎత్తు, దాము గింజపై బొప్పెడను కాల్చి బొగ్గుచేసినది ఒక కర్షము, ఏలక్కాయలు గు. గింజలెత్తు- వీటిని మెత్తగా దంచి చూర్ణించి ఉదయము సాయంత్రము పొడి తో దంతధావనము చేయు చుండిన దంతరోగములన్నియుహా వర్తించును.

5. వనతులసి, భూతులసి, బర్బరీతులసి- వీటిస్వరసములను చెవిలో పోసిన దంతము నందలి పురుగులు నశించును. పుప్పిపన్నుబాదలు తీరును.

6. తులసీదళములు, కర్పూరము, లవంగములు-ఇవిసమభాగము గ్రహించి మెత్తగానూరి వుంటచేసి రెండుదంతముల మధ్యపెట్టి యుంచిన దంతరోగము హరించును.

7. తులసీదళములు, మల్లిపువ్వు ఆకులు- ఈరెంటినీ సమము ఒకటిగ చేర్చి నోటిలో వేసుకుని నమలు చుండిన పంటినొప్పి తగ్గి అందుండు కృములు నశించును.

8. తులసీదళములను నమిలి నీటితో పుక్కిలించిన నోటియందలి దుర్వాసన దంతచిగుర్లవాపు హరించును.

9. తులసి స్వరసముతో కరక్కాయ. ఇందుపగింజ, గారకాయ- వీటిని సమభాగము మర్దించి, దంతములయందుంచిన నొప్పి హరించును.

## శ్వాసకోశముల రోగము మరియు శ్వాస, కాసరోగచికిత్సలు

1. తులసి పుష్పగుచ్ఛములను గ్రహించి అందుకు సమము పిప్పళ్ళు, వస-చేర్చిదంచి దానికి నాల్గింతలు చక్కెర చేర్చి కలిపి అందు ఒకటి లేక రెండు చిటికెల చూర్ణమును తేనెతో కలిపి సేవించిన కక్కాయి దగ్గు హరించును.

2. తులసిపుష్ప గుచ్ఛములు, పిప్పళ్ళు, గురుగింజవేరు- ఇవిప్రతిదీ ఒక తులము గ్రహించి అందు అర్ధతులము ద్రాక్ష, అర్ధతులము కలకండ కలిపి ఒక శేరు నీళ్ళుపోసి తెళ్ళబెట్టి నాల్గింట ఒకభాగము మిగులునట్లు కాచి వడియకట్టి భద్రపరచి అందుండి ఒక్కొక్క ఔన్సువంతున సేవించుచుండిన కాస, దగ్గు హరించును.

3. తులసిదళములు, తామరవేరు, అల్లము-ఇవి సమభాగము చేర్చినూరి నిప్పుశెగన పొంగించుకుని మందముగా పట్టువేసిన పక్కశూల హరించును. మరలరాదు.

4. తులసి 5 గ్రా॥ గరిక 15 గ్రా॥ మిరియాలు నాలుగు, జీలకర్ర చిటికెడు ఒకటి - వీటిని కాటుకవలెనూరి వుస్తికాయ ప్రమాణము వేన్నీళ్ళతో వుదయముపరగడుపున సేవించవలయును. గంజి ఆహారమునే సేవించవలయును. ఇట్లు నియమముతో సేవించుచుండిన వారము, పదిదినములలో కక్కాయి దగ్గు హరించును.

5. కృష్ణతులసి సమూలము తెచ్చి దోరగా వేయించినది ఒక భాగము, కరక్కాయలు, నల్లజీలకర్ర, దుంపరాష్ట్రము-ఇవి ప్రతిదీ $1 \frac{1}{2}$ భా॥ సీమకరక్కాయలు, పెద్దదుంపరాష్ట్రము, కురంజివాము, కురసానివాము, మంచివాము, మోదుగమాడలు, ఆకుపత్రి, సునాముఖి, తాళిసపత్రి, వాయువిడంగములు-ఇవిప్రతిదీ 1 భా, పిప్పళ్ళు, మిరియాలు 1/2భా॥- వీటినన్నింటిని దోరగవేయించుకొని నలియకొట్టవలయును. పైదంచిన వస్తువులన్నింటిని రెండుమానికల నీళ్ళలో వేసి పొయ్యిపై పెట్టి ఎనిమిదింట ఒకభాగము మిగులునట్లు యిగరకాచి దించి వడియకట్టి భద్రపరిచేది. అందుపూటకు ఒక ఔన్సు వంతున ఉదయము, సాయంత్రము రెండుపూటలు సేవించవలయును. పసిబిడ్డల పాల ఉబ్బసము, నలభైరోజులు వాడిన తప్పకగుణమగును. పెద్దవారు ప్రమాణము పెంచి సేవించవలెను.

6. తులసీదళములు, అడ్డసరపాకు-వీటిరసములను సమభాగము కలిపిపూటక అర్ధతులము వంతున దినమునకు రెండు పూటలు ఉదయ, సాయంత్రములంద సేవించిన పలు విధము లైన దగ్గులు హరించును.

7. తులసీదళములు, తులసివేర్లు, అడ్డసరపువేర్లు, వాకుడువేర్లు, పిప్పళ్ళు తిప్పతీగ, కరక్కాయ-యివిప్రతిదీ శుభ్రపరచి సమభాగము గ్రహించి దం చూర్ణముచేసుకుని అందు 5నుండి 10గు. గింజలెత్తు చూర్ణమును తేనెతో మిది సేవించిన శ్వాస యందలి ఆయాసము శాంతించును. విడువకుండ ప్రతిదినమ రెండుపూటలు సేవించుచుండిన అస్త్మా వ్యాధి కూడా గుణముగును.

8. తులసిస్వరసము, దవనము స్వరసము, తేనె- ఈ మూడింటిని సమము కలి పూటకు ఒక చెంచాడు ఉదయము, సాయంత్రములయందు సేవించు చుండిన వారవ దినములలో కక్కాయిదగ్గు శాంతించును. అట్లుకాని యెడల పైరసముల కలియికక మంచిపగడభస్మము, శృంగిభస్మము కలిపియిచ్చిన గుణమగును.

9. ప్రతిదినము 5నుండి 10 తులసీదళములను సేవించుచుండిన శ్వాసకోశముల హృదయము వీటికి సంబంధపడిన వ్యాధులను రాకుండా నివారించున వ్యాధివచ్చినవారు 10నుండి 15 దళములను ఒక మండలము లేకరెండు మండలము సేవించిన హరించును.

10. తులసి, గుంటగలగర, ముండ్లవుచ్చింత తీగ, వావిలి, బాడిదవ చిన్నతేలుకొండి, చిన్నవాకుడు-ఇవి సమభాగములుగ్రహించి దంచి రసము పిండుకొనే

ఈరసము 1శేరు, మంచి నువ్వులనూనె 1శేరు కలిపి- అందు మాల్కంగుణీ విత్తులు శొంఠి, పిప్పళ్ళు, వస, అతివస, కొడిశెపాలవిత్తులు, నల్లజీలకర్ర, ఊడుగువేరుపట్ట -ఇవిప్రతిదీ శుభ్రముచేసినవి 10గ్రా॥దంచి చూర్ణించి ఆవుపాలు ఒకశేరులో కలిపి పైకలిపిపెట్టిన రసమూనెకలియికలో పోసి కలిపి పొయ్యిపై పెట్టి తైలపక్వముగ కాచి దించి వడియకట్టి భద్రపరచేది. ఈ తైలమును పూటకు ఒక చెంచావంతున దినమునకు రెండుపూటలు సేవించుచుండిన శ్వాస, కాసలు గుణమగును.

11. తులసి సమూలము, తుంగముస్తెలు, ముండ్లవుచ్చింతతీగ ఆకు, పతంగి, గచ్చాకు, శిరువేరు- యివిప్రతిదీ ఒక పలము వంతునగ్రహించి దానిని ఖల్వములో పెట్టి నూరి అందు ముండ్లవుచ్చింతతీగ పండ్లు ఒక పలము వేసినూరి అందు 1 లీటరు నీళ్ళు, మంచినువ్వుల నూనె ఒక లీటరు అన్నిటిని కలిపి అందు ఇందుప్పు, పెద్దమానుచెక్క, పిప్పళ్ళు- యివి ప్రతిదీ 1పలం। నూరివేసి అన్నిటిని ఒకటిగ కలిపి తైలపక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరచేది. ఈతైలమును తగుమాత్రము సేవించిన దగ్గు, కాస హరించును.

12. తులసి, బొక్కెన, గుంటగలిజేరు, ఉప్పిఆకు, తుమ్మి, దుష్టపుఆకు, కుప్పింట, చెప్పుతట్టాకు, ముండ్లవుచ్చింతతీగ, ఎర్రముండ్లతోటకూర, అడ్డసరము- ఇవి అన్నియూసమభాగము ఒకటిగచేర్చి రాతిరోటిలో వేసి దంచి రసముపిండుకుని అందు ఒక తెల్లని గుడ్డనుతడిపి నీడన ఆరబెట్టేది. ఆరినతరువాత మరల ఒక సారి తడిపి ఆరబెట్టేది. బాగుగ శుద్ధిచేసిన తాళకమును అడవి తుమ్మి ఆకురసముతో నూరి పులుసువలె చేసుకుని యిందులో కూడాపై ఆరబెట్టినగుడ్డను తడిపి నీడన ఆరబెట్టేది. ఈగుడ్డను చిన్న చిన్న తునకలుగ చించి వర్తివలె చేసి ఒక ప్రమిదలో నువ్వులనూనెపోసి అందు ఈవర్తిని వేసి దీపము ముట్టించి దాని పై ఒక రంధ్రముండు కుండను బోర్లించి ఆరంధ్రము ద్వారా వచ్చుపొగను పీల్చేది. అన్నివిధములైన దగ్గులు గుణమగును.

13. తులసి, గుంటగలగర, బొక్కెన, హంసపాది, నేలములక, ములువుచ్చింతతీగ, పేరాముట్టి, ఎర్రముండ్లతోటకూర, అడ్డసరము, వావిలి, ఉప్పివేరు, పెద్దపురుగుడువేర్లు -ఇవిసమము తెచ్చి రాతిరోటిలో వేసి దంచిరసముపిండుకుని ఒక కొత్తచట్టిలోపోసి అందుకొంచెము మిరియాలు, తెల్లపాయలు నూరి కలిపిబాగుగా మరగకాచి అందు కొంచెము శొంఠి, పిప్పళ్ళ చూర్ణము వేసి కలియబెట్టి దించి భద్రపరచేది. దీనినిదినము ఉదయము పూట మాత్రము ఒకపూట సేవించవలెను. 4 రోజులలో శ్వాస, కాసతీరును పులుపు చేదు వస్తువులు వాడరాదు.

14. తులసి, అడ్డసరము, ఉచ్చింత, కాశాకు, ఉప్పివేర్లు, నేలములకవేర్లు, తొగరు- వీటిరసములు ప్రతిదీ కాల్‌పడివంతున ఒక చట్టిలో పోసి పొయ్యిపై పెట్టి కాచి యిగురుసమయమున తాటికలకండ 5పలములువేసి కాల్‌పడిమిగులు సమయమున కరక్కాయ, పిప్పళ్ళు, దుంపరాష్ట్రము- ఇవిప్రతిదీ 15వరహా ఎత్తుతీసి ఎండబెట్టి దంచి వస్త్రగాలితము చేయబడిన చూర్ణమునుపై పాగులోవేసి అడుగు మాడకుండ కలిపి శుద్ధమైనతేనె 1/8 పడి, నెయ్యి 1/8పడిపోసి పక్వముగకాచి దించుకునేది. ఇందు ఒక తాణికాయ ప్రమాణము ఉదయము సేవించేది. ఇట్లు 40దినములు సేవించిన కఫరోగములు, దగ్గు హరించును.

**పథ్యము:** – ఉప్పు, పులుపు, చేదువస్తువులు, పొగాకు వాడరాదు. ఆవుపాలు, నెయ్యి, ఆరటికాయపిందెలు, మునగపిందెలు, చిక్కుడు, మొలకూరాకు- వీటినిచేర్చుకునేది.

15. శ్వేతతులసీ పత్ర స్వరసమును తేనెచేర్చి సేవించిన కఫజకాసలు హరించును.

16. తులసిబీజములు, గుడూచి, శొంఠి, వాకుడు, గంటుభారంగి- ఇవి సమభాగములు చూర్ణించి కలిపి కావలసినంత ప్రమాణము సేవించిన శ్వాసకోశము, రొమ్మునందలి రోగములు, దగ్గు హరించును.

17. కుక్కతులసి ఆకులను కషాయముపెట్టి పాలు చెక్కెర చేర్చివుదయముపూట సేవించుచుండిన అత్యుష్ణము, దగ్గు, కఫము, వాతము హరించును.

18. తులసిదళములు కొంచెము, అడ్డసరపాకు ఒకటి, వాకుడు ఆకులు-3, ములువుచ్చింతతీగ ఆకులు-5, వీటిని అవిరిలో వుడుకబెట్టితీసి నలిపిరసము పిండుకుని కొంచెము గోరోజనము చేర్చియిచ్చేది. ఒకపూట గోరోజనము, మరుపూటదుంపరాష్ట్రము, మరియొకపూట కస్తూరి చేర్చి యిచ్చిన బిడ్డలపడిశము, దగ్గు, జ్వరము మున్నగునవి హరించును.

19. తులసి, మిరియాలు, బెల్లము-చేర్చి సేవించిన రొమ్మునొప్పి హరించును.

20. తులసి స్వరసము కావలసినంత-కస్తూరి ఒకభాగము, కుంకుమపువ్వు, జాజికాయ, జాపత్రి, లవంగములు- ఇవిప్రతిదీ 1/4 భాగము వంతునతీసి ఖల్వమునపెట్టి నాలుగు దినములు తులసి స్వరసముతోనూరి శెనగలంత మాత్రలు చేసి ఆరబెట్టి భద్రపరచేది. రోజుకు 1లేక 2మాత్రలు యిచ్చిన దగ్గు హరించును.

21. తులసీదళములు ఒక పిడికెడు, శుద్ధిచేసిన ఓమచూర్ణము ఒక టీ-చెంచాడు-ఈ రెంటినీ కలిపి ఒక తవ్వశుద్ధజలముపోసి కాచి అర్ధభాగము మిగులు నట్లు ఇగరకాచి అందు కరక్కాయపొడి, శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు, అక్కలకర్ర, ఓమవుప్పు, కుంకుమపువ్వు, యివిప్రతిదీ 2గ్రా॥ తెచ్చి వేయించి చూర్ణము చేసి ఖల్వములో పెట్టి పైకషాయము కొంచెము కొంచెముగ పోసి కాటుకవలెనూరి ఉద్దులంత ప్రమాణము మాత్రలుచేసి నీడన ఆరబెట్టి భద్రపరచుకునేది.
పెద్దవారికి వుదయము సాయంత్రము రెండు మాత్రలు తమలపాకులో పెట్టియిచ్చి నమిలిమ్రింగవలయును. చిన్నపిల్లలకు ఒక మాత్రను తమలపాకు వాడ్చితీసినరసముతో సాదియిచ్చేది. అన్నిదగ్గులు గుణమగును. అనుభవయోగము.

22. కృష్ణ తులసిరసము, గుంటగలగరాకురసము, కసివిందరసము, వంకాయ రసము, వాకుడురసము, అగరుచెక్కచూర్ణము, మిరియాలుచూర్ణము ఇవిసమ భాగముతేనెతో కలిపి నాకించి సేవించవలెను. కఫకాస గుణమగును.

23. తులసి, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, పుష్కరమూలము,గంధకచోరము, ఇంగువ, మారేడుగుజ్జు-ఇవిప్రతిదీ ఒక తులమువంతున గ్రహించికల్కము చేసిపెట్టుకుని అధకప్రమాణము దశమూలకషాయములో ఒక ప్రస్థము ఆవునెయ్యి పోసి కలిపి అందు పైకల్కమునుకూడా కలిపి పొయ్యిపై పెట్టి ఘృతపాకపక్వముగ కాచి ఆరనిచ్చి భద్రపరిచేది. రోగి, రోగబలానుసారము తగినంత ఘృతమును సేవించిన వాతకాసములు, కఫకాసలు హరించును.

24. నల్ల తులసి, ఆముదపుఆకు-ఈరెంటినీభస్మముచేసి త్రికటు చూర్ణము, నువ్వులనూనె,పాతబెల్లము వీనితోకలిపి సేవించిన శ్వాసకాసలు హరించును.

25. తులసి, లవంగపట్ట, తుంగముస్తెలు, చిన్నఏలకులు, పెద్ద ఏలకులు, పుష్కరమూలము, మనుబాల, లింగదొండ, నేలవుసిరిక, అగరుచెక్క, గంటుభారంగి, శొంఠి,కురువేరు, కర్కాటకశృంగి, కచ్చూరములు, పిప్పళ్ళు,నాగకేసరములు, కచోరము -ఇవి సమభాగముగ్రహించి చూర్ణము చేసి అందుకు రెండింతలు పంచదారకలిపి తగుమాత్రము సేవించుచుండిన శ్వాసము, కాసము, ఎక్కిళ్ళు, జ్వరము, పార్శ్వశూల హరించును.

26.అడవి తులసి, మెట్టతామర, కచ్చూరాలు, క్షీరకాకోళి-వీటిని మెత్తగ చూర్ణించుకుని పంచదార, బెల్లము, తేనె, నెయ్యి, వీనితో సేవించిన కాస, శ్వాస, పార్శ్వశూల, స్వర భేదము వీనిని నశింప చేయును.

27. తులసి, అడ్డసరము, వాకుడు,-ఇవిసమభాగముగ్రహించి దంచి ఒక భాండములో వేసి,శుద్ధోదకము పోసి,కషాయము కాచి అందు కొంచెము పిప్పళ్ళ చూర్ణముకలిపి సేవించిన కాస,కఫము, ఆయాసము మున్నగునవి తీరును.

28. తులసి, సన్నరాస్నము, కర్కాటకశృంగి,తిప్పతీగ,గంటు భారంగి, వస, కచోరములు, పుష్కరమూలము,తీటకసిందవేరు, కరక్కాయలు, తుంగముస్తెలు, చిత్రమూలము, మోడి, త్రికటుకములు-ఇవి ప్రతిదీ ఒక కర్ష ప్రమాణము గ్రహించి కల్కముచేసి అందు 200 పలముల ఎత్తు శుద్ధోదకము పోసి, 20 పలములు మిగులునట్లు కషాయము కాచి వడియకట్టి అందు 10 పలములు ఖండ శర్కర లేక కలకండ, ఆవు నెయ్యికుడవప్రమాణము కలిపి, లేహ్యపక్వముగ వండి దించి చల్లారిన పిదప అందు ఒక కుడవము మంచితేనె ఒకకుడవము పిప్పలిచూర్ణము, వెదురుప్పు 4పలములు వేసి కలిపి బాగుగాకలియబెట్టి భద్రపరచుకుని అందు తగుమాత్రము సేవించిన శ్వాస, కాస,రొమ్మునొప్పి, గుల్మము మున్నగునవి హరించును.

29. తులసీదళములు ఒక పిడికెడు గ్రహించి నాలుగు తవ్వలనీళ్ళలో వేసి కషాయముకాచి దించుకుని అందు 30గ్రా॥ చీనాకలకండపొడి, నాలుగుటీ చెంచాలు మంచితేనె వేసి బాగుగా కలిపి పూటకు ఒక ఔన్సువంతున రోజుకు నాలుగు పూటలు సేవించిన రొమ్మునందలి రోగములు, కాసవ్యాధితో వచ్చుజ్వరము హరించును.

30. తులసీదళములరసము, అడ్డసరపాకురసము, కొాచాకురసము, ములువుచ్చింతతీగరసము, వాకుడురసము, ఉప్పి ఆకురసము- ఇవిప్రతిదీ1/4 పడిగ్రహించి ఒకటిగకలిపి అందు 5పలములు తాటిబెల్లమువేసి కరిగించి పాకము చేసేది. అందు పిప్పళ్ళు,దుంపరాష్ట్రము, శొంఠి,-ప్రతిదీ 2 పలములు(16కళంజి) దంచిచూర్ణము చేసి వేసి ఒక అళాకు నెయ్యిపోసి మైనపక్వముగ కాచిదించి ఆరబెట్టి అందు 1/8 పడి ( అళాకు, అరిక్కాల్ పడి) తేనెపోసి కలిపి తాణికాయ ప్రమాణము సేవించుచుండిన సకల విధములైన దగ్గులు హరించును.

31. కృష్ణ తులసి ఆకు, కర్పూర వల్లి ఆకు, నల్లతమలపాకు, అడ్డసరపాకు- వీటిరసములను సమభాగము కలుపుకుని పూటకు 5,6 చుక్కలు సమముతేనె కలిపి రోజుకు మూడుపూటలు వంతున సేవించుచుండిన కోరింత దగ్గు హరించును.

32. కృష్ణ తులసి ఆకుల చూర్ణము, అతిమధుర చూర్ణము, సన్నదుంపరాష్ట్రము చూర్ణము, శొంఠిచూర్ణము ఇవి సమభాగములు కలిపి యుంచుకునేది. ఇందు కాల్‌టీ

స్ఫూన్‌చూర్ణమును తేనెతోకలిపి వెచ్చనినీళ్ళతో రోజు ఒక పూట ఉదయమున సేవించుచుండిన శ్వాసకోశములు, గొంతుమున్నగునవి పరిశుభ్రమగును. శ్వాస బాగుగఆడును.

## క్షయరోగ చికిత్స

1. తులసివేర్లు, ములువుచ్చింతతీగవేర్లు, పిప్పళ్ళు, ఏలకులు, జీలకర్ర, శొంఠి, విష్ణుక్రాంతివేరు, గోరోజనము, కరకవలుపు, అతిమధురము- ఇవిప్రతిదీ ఒక పలము వంతున సేకరించి దంచిచూర్ణించి లేతకొబ్బరినీళ్ళు పోసిబాగుగా నూరి పెట్టుకునేది. ఆముదము 1 పడి, లేతకొబ్బరినీళ్ళు1 పడి. ఆవుపాలు 1 పడి, పొన్నగంటి స్వరసము 1/4 పడి. ఉసిరికకాయల స్వరసము 1/4 పడి- వీటినికలిపి పైచూర్ణములను కూడావేసిబాగుగా కలిపి పొయ్యిపై పెట్టి తైలపక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరచుకునేది. రాత్రియందు ఆహారము సేవించిన తరువాత ఒక గరిటెడుత్రాగి నిదురించవలెను. ఉదయమున ఒకసారిబేదియగును. క్షయరోగము, దగ్గు, జ్వరము ఇవి హరించును. ఎనుము మజ్జిగ, బూడిదగుమ్మడికాయ -వర్జ్యము. ఆవునెయ్యి, పాలు, వంగపిందెలు, మునగపిందెలు- వీటిని సేవించవలెను.

ఇది ఒక అద్భుతమైనయోగము,

2. తులసి స్వరసము, అడ్డసరపురసము, గుంటగలిజేరురసము, ఎర్రముండ్లతోట కూర రసము, హంసపాదిరసము, తంగేడురసము, ములువుచ్చింతతీగరసము, బొమ్మన రసము, మునగాకురసము-ఇవిప్రతిదీ రెండు పడివంతున ఒక పాత్రలోపోసి అందు ఆవునెయ్యి ఒక పడి పోసి కలిపిపెట్టేది. అందు కోష్టు, తానికాయవలుపు, ములువుచ్చింతతీగవేర్లు ఏలక్కాయ, కర్కాటకశృంగి, పిప్పళ్ళు, బావంచాలు, ఓమము, వస, చెవ్యము, పెన్నేరుగడ్డ, సుగంధిపాలవేరు, ఉప్పివేరు, శిరివేరు, మాల్కంగుణివిత్తులు, కిచ్చిలిగడ్డ, ఇందుప్పు-ఇవిప్రతిదీ 1 1/4 వరహాఎత్తుదంచి మేకపాలతోమెత్తగానూరి పైరసనెయ్యి కలయికలోవేసి కలిపి పొయ్యిపై పెట్టి ఘృతపాకపక్వముగ కాచిదించి వడియకట్టి నెయ్యితో మాగిన మట్టికుండలో భద్రపరచేది. ఇందు1 1/4 వరహాఎత్తు ఘృతమును కొంచెము తేనె కలిపి సేవించేది. క్షయ, దగ్గు, కాస మున్నగురోగములు తప్పక హరించును.

3. కుక్కతులసిని మెత్తగనూరి మంచిపగడములకు కవచముచేసి తగు పుటమిడిన సున్నమగును. క్షయకాసలకు అద్భుతమైనది.

 తులసి, కుక్కతులసి, కూతురుబుడమ, ములువుచ్చింతతీగ, వాకుడు, ము- వీటివేర్లు, దుంపరాష్ట్రము, అతిమధురము, అక్కలకర్ర- ఇవి అన్ని శుభ్రముచేసినవి 10 గ్రా॥ వంతున గ్రహించి ఒక శేరునీళ్ళు పోసి నాల్గింట గముమిగులునట్లు ఇగరకాచిదించి వడియకట్టి పూటకు 2నుండి ల వరకు తాటికలకండ, తేనెచేర్చి సేవించుచుండిన క్షయ, శ్వాస, కాస, రము మున్నగునవి గుణమగును.

తులసి, అడ్డసరము, ములువుచ్చింతతీగ, పిప్పలీమూలము, దుష్టపుతీగ, ము, నేలములక, ముండ్లవంకాయ, తెల్లవుప్పి, - వీటి వేర్లుప్రతిదీ 20 ల వంతున గ్రహించి దంచి ఒక పాత్రలో పోసి 16శేర్లు శుద్ధజలము పోసి పైపెట్టి ఎనిమిదింట ఒకభాగము మిగులునట్లు యిగరకాచి దించి కట్టి పెట్టుకునేది. ఈ కషాయము, తులసిరసము, వావిలిరసము వుచ్చింతతీగ రసము, ఎర్రముండ్లతోటకూరరసము, దూలగొండి , గుంటగలిజేరురసము, అడ్డసరపాకురసము- ఇవిప్రతిదీ 1/4శేరు న ఒకటిగ కలిపి అందు 4శేర్లు మంచిబెల్లముచేర్చిపొయ్యిపై పెట్టి క్వముగవండి, అందు-చెవ్యము, శొంఠి, పిప్పలీమూలము, నాగకేస ు, ఏలకులు, చిత్రమూలము, జటామాంసి, పిప్పళ్ళు, లవంగపట్ట, పత్రి, ఇందుప్పు-ఇవిశుభ్రముచేసినది ప్రతిదీ ఒకపలము చూర్ణించి గాలితము చేసి పైపాగులోవేసేది. మరియుయీఅందు మంచిలోహ రము 1పలము కూడవేసి అన్నియూ బాగుగా కలియునట్లు కలిపి పక్వముగ కలిపిదించి ఆరినతరువాత తేనె 20 పలములుచేర్చి నెయ్యితో పకుండలోవేసి బాగుగమూసి 15 దినములు ధాన్యపుతములోవుంచేది. హ్యము పూటకు 1/4 పలవువంతున రోజుకురెండుపూటలు మచుండిన క్షయరోగము, శ్వాస, కాస మున్నగునవి గుణమగును.

తులసి, ఉచ్చింత, అడ్డసరము, చిత్రమూలము పిప్పలీమూలము, ఉప్పి, ము, నేలములక, ముల్లువంకాయ- వీటివేర్లు శుభ్రముచేసినది ప్రతిదీ 20ప॥ వ తెచ్చి చూర్ణించుకుని, ఎనిమిదిశేర్లునీళ్ళు పోసి ఎనిమిదింట ఒకభాగము నట్లు యిగరకాచి అందువావిలి, ఉచ్చింత, ఎర్రముండ్లతోట గుంటగలిజేరు, అడ్డసరపాకు, చిన్నదూలగొండి - వీటి ఆకురసములుప్రతిదీ ు పోసి కలిపి కాచి దానిలో రెండుశేర్లు బెల్లమువేసి పాగుపదమువచ్చునపుడు

-శొంఠి, పిప్పళ్ళు, పిప్పలీ మూలము. చిత్రమూలము, చెవ్యము, లవంగపత్రి, లవంగపట్ట, జటామాంసి, నాగకేసరములు, ఏలకులు, ఇందుప్పు-ఇవిప్రతిదీ ఒకపలము వంతున దంచిచూర్ణించివేసి, లోహసిందూరము 1 పలముకూడవేసి బాగుగకలియబెట్టి లేహ్యాపక్వముగ దించుకుని అందు కావలసినంత లేహ్యమును తేనె, నెయ్యికలిపి రోగి, రోగ బలమునననుసరించి సేవించుచుండిన క్షయ, దగ్గు మున్నగురోగములు, ముఖ్యముగ వాతక్షయ హరించును.

## శ్లేష్మరోగ చికిత్స

1. తులసి, అడ్డసరము, వాకుడు, కరక్కాయ, అతిమధురము- ఇవిప్రతిదీ $2^1/_2$ పలములు గ్రహించి దంచి పొడిచేసి చూర్ణించి వస్త్రగాలితము చేసిపెట్టుకునేది. ఈచూర్ణమును అర్ధచెంచా ప్రమాణము నెయ్యిలో కలిపి సేవించుచుండిన శ్లేష్మము, కఫము, దగ్గు తీరును.

2. తులసీదళముల చూర్ణము, శొంఠిచూర్ణము- యివిసమభాగము కలిపి తేనెతోచేర్చి సేవించిన శ్లేష్మ జ్వరము నివర్తియగును. శ్వాసనక జ్వరముతీరును.

3. తులసీదళములు, పూగుత్తి-విత్తనములతోసహా యుండునది- శుభ్రపరచి 9తులములు గ్రహించి టెంకాయచెట్టుకల్లులో ఒకవారము దినములు భావనచేసి తరువాత వడియకట్టి అర్ధనుండి ఒకడ్రాముపరకు దినమునకు 2, 3సార్లు సేవించిన శ్లేష్మ జ్వరము తీరును.

4. తులసీదళములరసము, ములుఉచ్చింతతీగ ఆకురసము, వాకుడు ఆకురసము, చిన్నానేలములక ఆకురసము, తెల్లవావిలి ఆకురసము, అడ్డసరపు ఆకురసము- ఇవి ప్రతిదీ 1/4 పడిగ్రహించి ఒక కొత్తచట్టిలో పోసిపొయ్యిపైపెట్టి సన్ననిమంటవేసి కాచుచుండినపైన అంగికట్టును. ఈవిధముగనేకాచుచుండిన ఆఅంగీయైనది, ఎక్కువగావచ్చును. ఆసమయమున దానిని దించి గుడ్డలోవడియ కట్టి పిప్పిని తీసివేసి ఆతేటనీరును మాత్రమువేరుగ పెట్టుకునేది. మరియూ యిందు ముళ్ళువుచ్చింతతీగ వేరుచూర్ణము $2^1/_2$ వరహా ఎత్తు, పసుపుకరక్కాయవలుపు చూర్ణము $2^1/_2$ వరహాఎత్తు, పైతోలుతీసిన శొంఠి, లవంగపట్ట, పచ్చకర్పూరము, పిప్పలీబియ్యము, ఏలకగింజలు, లవంగములు, లవలగపత్రి, కస్తూరిపసుపు, సదాపాకు, కచోరములు, నాగకేసరములు, తక్కోలములు, జటామాంసి, మంచిజీలకర్ర, అతిమధురము, జాజికాయ, జాపత్రి, ఓమము, కర్కాటకశృంగి, గంటుభారంగి వీటి మెత్తనిచూర్ణములు, ద్రాక్షపండు,

ఖర్జూరపండు, చిల్లగింజలు-ఇవిప్రతిదీ 2వరహాఎత్తు మరియూ కలకండ,చక్కెర, తేనె, నెయ్యి యివిప్రతిదీ 10పలములువీటినన్నింటిని సేకరించిపెట్టుకునేది. చిల్లగింజలను చిన్నతునకలుగునరికి నీళ్ళలోవేసివూరబెట్టి మెన్నవలె మెత్తగానూరుకునేది. ద్రాక్షపండు, ఖర్జూరపండు వీటిని ప్రత్యేకముగనూరి పెట్టుకునేది- ఈనూరిన మూడుసరకులను కలుపు కొని పై చూర్ణములలో పచ్చకర్పూరము తప్ప మిగత అన్నిటిని ఒకటిగ కలిపి పైదానిలో చేర్చి కలిపి పెట్టి ఆతరువాత మొదట తులసిమున్నగు వానినికాచితీసిన తేటనీరులో చక్కెర, కలకండను కరిగించి పాకము పట్టి పాకమువచ్చు సమయమున ముందుసిద్ధపరచియుండు, చూర్ణములన్నింటిని కొంచెము కొంచెముగ వేయుచూ పప్పుగుత్తితోఎనపవలయును. తరువాత తేనె పోసి కలిపి కడపట నెయ్యిపోసి బాగుగా కలిపి వేడితగ్గి చల్లారినతరువాత పచ్చకర్పూరపొడిని చల్లి పీంగాణీపాత్రలో భద్రపరచుకునేది.

**ప్రమాణము:**- 1నుండి 1 $^1/_2$ వరహాఎత్తు, రోగి, రోగ బలమునను సరించి పథ్యముపెట్ట వలెను.

**తీరువ్యాధులు:**- శ్లేష్మరోగములు 96న్నూ, కఫ జ్వరము,గళ్ళ, దగ్గు, కాస, క్షయ, సర్వపిత్తరోగములు మున్నగునవి హరించును.

5. తులసి, అడ్డసరము, వాకుడు- వీటిని సమము దంచి ఒకపాత్రలోవేసి పొయ్యిపై బెట్టి భాగప్రకారము కషాయముకాచిదించుకుని అందు పిప్పళ్ళ చూర్ణముకొంచెమువేసి సేవించిన-శ్లేష్మము,కాస, ఆయాసము మున్నగునవి తీరును.

6. తులసి, వాకుడు, అడ్డసరము, ముండ్లవుచ్చింతతీగ, విష్ణుక్రాంతి, నీరు సాంబ్రాణి ఆకు-ఇవి ప్రతిదీ పదిపలములు తెచ్చిదంచి 12పడినీళ్ళలో వేసి 1$^1/_2$ పడిమిగులు నట్లుకాచి మంచినువ్వులనూనె 1పడి, ఆవునెయ్యి 1పడి కలిపి అందు పిప్పళ్ళు 1పలం, దుంపరాష్ట్రము 1ప॥ వీటిని దోరగ వేయించి మెత్తగ చూర్ణముచేసి కలిపి పొయ్యిపైపెట్టి ఘృతపాకపక్వముగ కాచిదించి పూటకు ఒక చెంచాఘృతమును ఉదయము, సాయంత్రము సేవించుచుండిన శ్లేష్మము, దగ్గు, జ్వరము, కఫకట్టు, అంతర్జ్వరము, క్షయ- మున్నగునవి హరించును. ఈ ఘృతమును సేవించునపుడు త్రికటుకములు, వరిపేలాలు-ఈ రెంటిని దంచి చూర్ణించుకుని వస్త్రగాలితము చేసుకుని అందు 1/4 చూర్ణముతేనెతో సేవించవలయును. ఇదిశాంతినిచ్చును.

7. తెల్లతులసి, వాయువిడంగములు, దంతివేరు-ఇవి సమభాగముచేర్చి వీటితోతైలము కాచి అందు శుద్ధిచేసిన సైంధవలవణము కొంచెము కలిపి-నస్యముగను, నోటియందు ధారణము చేసిన కఫజ రోహిణీరోగము హరించును.

8. తులసీదళములు, అడ్డసరపు ఆకు, ముండ్లవుచ్చింతతీగ ఆకు, నేలములక ఆకు, పిప్పళ్ళు - ఇవి సమభాగములు గ్రహించి ఒక మూతి వెడల్పుగయుండు చట్టిలో 1/2 భాగము నీళ్ళు పోసి మూతికి గుడ్డ వాసెన కట్టి దానిపైపై ఆకుదినుసులను పెట్టి పైన ఒక చట్టి మూసి ఆవిరి పిట్టు పెట్టి దించుకుని ఆ ఆకులన్నింటిని నలిపి రసము పిండుకుని ఆరసములో శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవలుపు-ఇవి సమభాగములు దోరగవేయించి పైరసముతోమెత్తగనూరి గెచ్చకాయప్రమాణము వుంటలుచేసేది. ఒక మాత్రను వరిపేలాల చ్ఛూర్ణములో పొర్లించి లేక తేనెలో పొర్లించి నోటిలో వేసుకుని రసము మింగుచుండిన శ్లేష్మమువిరుగును.

9. తులసీదళములు 1 తులము నీళ్ళలోవేసి అర్ధభాగముమిగులునట్లు కషాయముకాచి వడియకట్టి అందు కొంచెము ఇందుప్పువేసి కరిగించి సుఖోష్ణముగా యున్నపుడే సేవించిన శ్లేష్మజ్వరము హరించును. **(Influenza)**

10. తులసీదళములు, మారేడుదళములు, వేపఈనెలు, చింత ఆకు ఈనెలు, నెల్లి ఆకు ఈనెలు, ఇవిప్రతీదీ ఒక పిడికెడు తెచ్చి రెండుపడి మంచినీళ్ళలోవేసి అందు శొంఠి, పిప్పళ్ళు, వాయువిడంగములు, కటుకరోహిణి, కరక్కాయ, చేదుపొట్ల-యివిప్రతిదీ 1/2 వరహాఎత్తు చూర్ణించివేసి నాల్గింటఒక భాగము మిగులునట్లు కాచి పూటకు 1 లేక 2 ఔన్సులవంతున దినమునకు 4 పూటలు సేవించినశ్లేష్మ జ్వరములు హరించును.

11. తులసీ, అడ్డసరము, వాకుడు, ముండ్లవుచ్చింతతీగ- వీటి ఆకులనుప్రతిదీ ఒక పిడికెడు, సన్నదుంపరాష్ట్రము 1 తుండు, అల్లము 1 తుండు చేర్చిదంచి తీసినరసము ఉదయ సాయంత్రముల యందు 10నుండి 20చుక్కల వరకు వెన్నతో కలిపి సేవించిన శ్లేష్మముగట్టి పడుట, తీరనిదగ్గు, శిశువుల నిక్కాక తీరును.

12. తులసి, అల్లము, తేనె- వీటితోపానకము తయారుచేసి అందు తాటికలకండ చేర్చి మూడుపూటలు సేవించిన శ్లేష్మజ్వరము హరించును.

13. తులసీదళములు, కర్పూరవల్లి ఆకు, మారేడుదళములు- వీటినిదంచి స్వరసము తీసి కస్తూరి, గోరోజన మాత్రలను సాది సేవించిన శ్లేష్మము గట్టిపడుట, కష్టముగయుండు శ్వాస మున్నగునవి హరించి గుణమౌను.

14. తులసి, అడవితులసి- వీటిస్వరసమునందు సైంధవలవణచూర్ణము, త్రికటుచూర్ణము, తేనె-సమభాగము కలిపి అందు కొంచెము ఎత్తుకుని నస్యముచేసిన శ్లేష్మ వాతములు, సంజ్ఞానాశము హరించును.

# పిత్తరోగ చికిత్స

1. తులసీదళములు, అడ్డసరము, గుంటగలగర- ఇవిప్రతిదీ ఒక పిడికెడు, నాలుగుపిప్పళ్ళ బియ్యముదంచి వేసి ఒక పడిమంచినీళ్ళలోవేసి నాల్గింట ఒకభాగము మిగులునట్లు ఇగరకాచి పూటకు 2 ఔన్సులు వంతున రోజుకు 3 పూటలుత్రాగిన పిత్త జ్వరము హరించును.

2. తులసీదళములు, దానివేరు, స్వరసము- వీటిని నువ్వులనూనెతో తైలభాగ ప్రకారము చేర్చి తైలపక్వముగకాచి శిరస్నానము చేయుచుండిన పిత్తము తీరును. విషమించిన కఫరోగములు, వాతము, కఫము, జన్ని యివికూడతీరును.

3. తులసిస్వరసము, అల్లముస్వరసము, నిమ్మపండురసము- వీటిని సమభాగముచేర్చి అందుకొంచెము చక్కెర కలిపి సేవించిన పిత్తవాంతి హరించును.

4. నేలతులసి, విష్ణుక్రాంతి, సూర్యకాంతి- ఈమూడింటిని సమభాగము దోరగవేయించి, తాబేలుచిప్ప, మిరియాలు, నేలవేము, విషబొద్ది, కామంచికసువు, కాడికారము, గుంటగల్జేరు- ఇవిసమభాగము బూడిదవలె, వేపుడుచేసిపెట్టుకునేది, మరియూ నల్ల జీలకర్ర, ఓమము చిట్లించునట్లు వేపుడు చేసుకునేది. శొంఠి, సన్నరాష్ట్రము, తిప్పతీగ, కరకవలుపు, గొంటువక్క, కటుకరోహిణి, కలబందగుజ్జు- వీటిని కచ్చాగాదంచి వీటిని అన్నింటిని ఒక శేరు నీళ్ళలోవేసి నాల్గింట ఒక భాగము మిగులునట్లు కషాయముకాచి దించుకుని అందు ఉదయ, సాయంత్రములయందు పూటకు రెండు ఔన్సులవంతున సేవించుచుండిన పిత్తశీతలమునివర్తియగును.

5. తులసీదళములు, వావిలి ఆకులు, తుమ్మి ఆకులు,-యివి ఒక నెల్లికాయప్రమాణము, పసుపు, పిప్పళ్ళు-యివి అర్ధనెల్లికాయప్రమాణము చేర్చి వీటినన్నింటిని మేకగొంజురాన నూరితీసి, తాటిమట్టలరసము, చీమగుడ్లరసము, సమముగచేర్చి ఒక తెల్లనిగుడ్డలోపెట్టి మూటకట్టిరెండునాసికలయందు రెండు చుక్కల వంతున నస్యము చేయించవలెను. ఇట్లు 3 దినములుచేయవలయును. 4వరోజు చింతాకుతెచ్చి దంచి ఒకశేరురసముతీసి దానిని శిరస్సునకు వెంట్రుకలను తీసి అచ్చట బాగుగామర్దించి కొంచెము కొంచెముగా వేడిఅగునట్లు రుద్దేది. దానినే శరీరమునకుకూడ పూయవలెను. తరువాత కొంచము సేపుఎండలో రెండు మూడుఘడియలుండి ఆతరువాత నాలుగుకుండల వేడిజలమును వేడిలాలునంతగా శిరస్సుపై పోయవలెను. పైత్యముతీరును.

# వాతరోగ చికిత్స

1.తులసి స్వరసము 1 భా॥ అవనూనె 1 భా॥ ఈరెంటినీకలిపి తైలపక్వముగ కాచిదించి సీసాలో భద్రపరచి నొప్పియుండు భాగమున మర్దించిన వాతనొప్పులు హరించును.

2. తులసీదళముల స్వరసముతో శుద్ధిచేసిన గంధకమును 3రోజులు మర్దించి మూడురోజులు ఎండించి అనగా ఒకదినము మర్దన ఒక దినము ఎండించుట, ఇట్లు మూడుసార్లు చేసి చూర్ణము చేసుకొని పూటకు అణావెత్తువంతున దినమునకు రెండుపూటలు తేనె అనుపానముతో సేవించిన వాత వ్యాధులు తీరును.

3. అడవితులసి పంచాంగములను దంచి నీళ్ళలోవేసి కషాయము కాచేది. బాగుగావుడుకునపుడు అందుండివచ్చు ఆవిరిని శరీరమునకు, శిరస్సునకు పట్టిన ఊర్ధ్వాంగవాతము, గ్రంథివాతము మున్నగునవి హరించును.

4. తులసీదళములు, ఆముదపు ఆకు, ఇందుప్పు-యివిసమభాగములు చేర్చినూరి, వేడిచేసి గ్రంథివాతముండుస్థలముపై పట్టువేసినను, కట్టుకట్టినను గ్రంథివాతముతీరును.

5. తులసి స్వరసము, ఎర్రవుల్లిపాయ స్వరసము, తెల్లగడ్డస్వరసము-ఈమూడు రసములు సమభాగములు కలిపి తగుమాత్రము సేవించిన ధనుర్వాతము తీరును.

6.తులసివేర్లు, చిట్టాముట్టివేరు, ముండ్లవుచ్చింతతీగవేర్లు, పెన్నేరువేర్లు, తెల్లగలిజేరువేర్లు, అదొండ వేర్లు, వాతనారాయణ చెట్టువేర్లు, ఉలిమిరివేర్లు, పాపిటచెట్టువేర్లు, కానుగపట్ట, నెమలూడుగచెట్టు పట్ట, వావిలిపట్ట-యివి ప్రతిదీ 6పలములు గ్రహించి దంచి ఒక కుండలోవేసి 16శేర్లునీళ్ళుపోసి ఎనిమిదింట ఒక భాగము మిగులునట్లు కాచిదించి వడియకట్టి పెట్టుకునేది. ఆముదము 2పడి, ఆవుపాలు 4పడి కూడపోసి కలియబెట్టి అందు-ఇందుప్పు, ఇంగువ, అతిమధురము, ఓమము, గంటుభారంగి, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరక్కాయ, మానుపసుపు, పెద్దదుంపరాష్ట్రము, జీలకర్ర, వాయువిడంగములు, గజపిప్పళ్ళు, కోష్టు, కటుకరోహిణి, వస, పసుపు, సన్నరాష్ట్రము, దేవదారుచెక్క, తెల్లజిల్లేడు పువ్వులు, ఆవాలు, నాగకేసరములు, పాలగుండపిండి- యివిప్రతీదీ 2వరహాయెత్తుగ్రహించి మెత్తగానూరి కలిపి నూనెమాడిపోకుండా 5 దినములు మంటవేసి తీసి- ఆతైలమును శరీరమునకు, తలకు పూసిన వాతము హరించును. రాత్రిపూట దశమూలకషాయము లేక దశమూలారిష్టము సేవించవలయును.

7. తులసి, చిన్నపాదపత్రి, పెద్దపాదపత్రి, ములువుచ్చింతతీగ, వాకుడు, పెన్నేరు, జిల్లేడు, పొన్నగంటి, వంకాయ, తెల్లవుస్తి, నల్లవావిలి, వట్టివేరు, నల్లపురుగుడు, తెల్లపురుగుడు, అడవిమునగపట్ట, అత్తిపట్ట, నెల్లిపట్ట, పిప్పళ్ళు, ముష్టిగింజలు-ఇవిప్రతిదీ 10 వరహాఎత్తు, కుంకుమపువ్వు 1 వరహాఎత్తు- వీటినన్నింటిని నిమ్మ పండు రసముతో నూరి తమలపాకుల్లో చుట్టి నిప్పుసెగలో మూడుసార్లు పుటపాకముచేసి నూరి గెచ్చకాయంత వుంటలుచేసి ఆరబెట్టి దానిని తగుమాత్రము వెచ్చనినీళ్ళతో సేవించిన వాతరోగములు హరించును.

8. తులసి స్వరసము, చిత్రికూరరసము, గాడిదగడపాకురసము- ఇవి ప్రతిదీ 5 ప॥ మంచినూనె 10 పలములు, ఊడుగవేరుపై పట్ట 1 ప॥ మిరియాలు 1 ప॥, పొట్టు తీసిన తెల్ల గడ్డపాయలు 2 ప॥ గ్రహించి యిందు తెల్లపాయలను వెన్నవలెమెత్తగనూరి ఆతరువాత ఊడుగవేరుపైపట్టనుచూర్ణము చేసి కలిపినూరి, మిరియాలు చూర్ణముచేసి కలిపినూరి పైద్రవములన్నింటిని ఒకటిగ కలిపి అందు నూరినముద్దను వేసికరిగించి పొయ్యిపైబెట్టి సన్నని మంటతోకాచి తైలపక్వముగ దించి వడియకట్టి భద్రపరచేది.
ప్రమాణము:- పూటకు 1 నుండి $1^1/2$ వరహా ఎత్తు, ఉదయం, సాయంత్రం రెండు పూటలు శరీరబలము ననుసరించి వారము దినములుపయోగించిన అండవాతము, విత్తనముల వాపు మున్నగునవి తీరును. వాతపదార్థములు వర్జ్యము.

9. తులసీదళములు 25 గ్రా॥ మారేడు ఆకులు 25 గ్రా॥ ముదురువేపాకులు 25 గ్రా॥ గ్రహించి ఒక చిన్న కరక్కాయను పొడిచేసి పైఆకులలో కలిపి అన్నిటిని ఒక మట్టిపాత్రలో పెట్టి $1^1/2$ లీటరుమంచినీళ్ళుపోసి కషాయపక్వముగ కాచి శుభ్రమైనగుడ్డలో వడ్డియకట్టి పెట్టేది. ప్రతిదినము పరగడుపున 50 మి. లీ. కషాయమును రాత్రి భోజనమునకు ముందు 50 మి. లీ. కషాయమునుసేవించుచుండవలయును. ఈకషాయమును సేవించుచున్న దినములందు ఏపూటకూడా ఉప్పు రుచి కలియరాదు. బాధననుసరించి 48 దినములు 96 దినములుసేవించిన చేతులుకాళ్ళు, వీటియందు కలుగు నొప్పులు, సలుపులు హరించును.

10. తులసి, చందనము, ఆకుపత్రి, జటామాంసి, వ్యాఘ్రనఖమునెడ. గంధద్రవ్యము, కుంకుమపువ్వు, దాసినిచెక్క, గ్రంథితగరము, పసుపు, శు॥ మణిశిల - ఇవిసమభాగము శుద్ధోదకముతోనూరి, నస్యము, అంజనము, లేపనము, పానము చేయించినచో సమస్తవాపులను, విషములను హరింపచేయును.

11. తులసి, వేప, నెల్లి, మునగ, శొంఠి, కొడిశెపాల- వీని ఆకులు, వేర్లు, కాయలు మున్నగువాటిచే కాచబడిన జలమును వెచ్చగ యున్నదానిచే సేకమును చేయించవలెను. ఊరుస్తంభము హరించును.

12. తులసి, చిరునెల్లి, గగ్గెర, కానుగ, చంద్ర, పెగ్గుమ్మడి, మారేడు, చిన్నవాకుడు పెద్దవాకుడు, ఏపి, సరలవృక్షము, మునగ, నెల్లి, పల్లేరు- ఇవిసమభాగము గ్రహించి కషాయముకాచి దానిచేసేకమును చేయించవలెను. లేక వీటిని గోమూత్రముతోనూరి లేపనము చేయవలెను. ఊరుస్తంభము హరించును.

13. తులసి, కుక్కతులసి, మంచితక్కాలి, వెంపలి, పెద్దతుమ్మి, గుంటగలగర, ప్రత్తి, చిట్టాముదము, వేప, చాతరాశిఆకు, దుష్టపుఆకు, నల్లపురుగుడు, బుడ్డకాకర, రెండురకములబోడతరము, కానుగ, హంసపాది, చిన్నతీటకసింద, కుప్పింట, బొక్కెన, బిళ్ళుగన్నేరు, చిన్నిఆకు, చదురకళ్ళి, కాశాకు, విషముష్టి, జిల్లేడు, తక్కాలి, ఇప్ప, అడ్డసరము, చిత్తాముట్టి, ములువెంపలి, నల్లేరు, గలిజేరు, పాపిట , గచ్చ, తంగేడు, పసుపుఉమ్మెత్త, ఉలిమిరి, ఆవుపాలు, పెరుగు, నెయ్యి, భూనాగము, నూనె, ఏలకులు, ఎర్రకలువగడ్డ, మానిపసుపు, లవంగము, అతిమధురము, మాల్కంగుణీవిత్తులు, శొంఠి, పసుపు, గుగ్గిలము- వీటిని భాగప్రకారము కూర్చి కాచితీసిన తైలమును పూయుచుండిన వాతరోగము లన్నియుూ తీరును.

14. తులసియాకులు, నేలవుసిరిక, పసుపుగుంటగలగర- ఇవిసమముగ గ్రహించి నూరి తగుమాత్రము ఉదయం సాయంత్రం సేవించిన చేతులు, కాళ్ళవాపు, కీళ్ళవాపు హరించును. ఇచ్చాపథ్యము.

15. తులసిరసము 2ఔన్సు, మంచి ఆవునెయ్యి 1టీచెంచా- వీటిని కలిపి అందు తగుమాత్రము మిరియాలపొడిచేర్చి మూడుపూటలు సేవించిన వాతము, వున్నట్లుండి వాయువుచేవీపు, నడుము పట్టుకొని పోవుట మున్నగునవి గుణమగును.

16. తులసివేర్లు గ్రహించి అందు చింతగింజంతనూరిన ముద్దను ఒక ఆలాకునీళ్ళలో వేసి అర్థభాగముమిగులున ట్లు యిగరకాచి మూడుపూటలు ఆరుదినములు సేవించిన వాతజ్వరములో వచ్చువాపు, చెమటరూపముగ విచ్చివేయును. వాపుకరిగి జ్వరము హరించును.

17. తులసి, తెల్లావాలు- ఇనిసమభాగముగ్రహించి నూరి శుద్ధోదకముతో తెళ్ళబెట్టి కషాయము కాచి వేడిగవున్నపుడే సేవించిన- తొడలవాతము అనగా తొడలుపట్టు కొనిపోవుట అనురోగము హరించును.

18. తులసి, మారేడు, వేప, కడిమి- వీటి ఆకులు, వేర్లు,పండ్లు ఈమూడింటిని గ్రహించి సమముగనూరి కషాయము పెట్టికొంచెము వేడిగవున్నపుడే సేవించిన తొడపట్టుకొనుపోవు రోగము హరించును.

19. తులసీదళములను వెచ్చచేసి కట్టుచుండిన అండవృద్ధి నివర్తించును.

20. తులసి, శొంఠి, దింటెనవేరుపట్ట, తిప్పతీగ, బ్రాహ్మి ఆకు, ములువుచ్చింత తీగ, గంగరావిపండుటాకులు, తెల్లగలిజేరు, పచ్చపువ్వులవములుగోరింటతీగ, మునగఈనెలు, తెల్లవాయింటవేరు, చాగదుంప, చిన్నపొడపత్రివేరు, నల్లజీలకర్ర, నీరుగొరిటివేరు, ఈశ్వరివేరు-ఇవిప్రతిదీ 1/4 పలవువంతున గ్రహించి రాతిరోటిలోవేసి దూదివలె మెత్తగదంచి ఒకపడిమంచి నీరు పోసి ఎనిమిదింట ఒక భాగము కషాయము కాచి దించి వడియకట్టి సేవించవలెను. ఇది ఒక పూటకు ప్రమాణము. ఈ విధముగ ఉదయము సాయంత్రము వంతున 3 దినములు 6పూటలు సేవించిన సకలవాపులు, జ్వరము, కడుపుబ్బుట, మాందము, నీరుకట్టు మున్నగునవితీరును. ఇచ్ఛాపథ్యము.

## హృదయ, యకృత్, ప్లీహరోగ చికిత్స

1. తులసీదళములను పిట్టువలె ఆవిరిలో ఉడుకబెట్టి తీసిదంచి రసముతీసి అందు అర్ధరూపాయఎత్తు పెద్దవారికి, 1/4 లేక 1/2 టీ చెంచారసము బిడ్డలకు, దినమునకురెండు పూటలు యిచ్చిన హృదయమునకు, యాకృత్తునకు బలము చేకూర్చును. దీపనము కల్గించును. కఫమును హరించును. స్త్రీలకుచనుపాలు వృద్ధి చెందును.

2. తులసిస్వరసము, మకరధ్వజముచేర్చి సేవించిన శీతాంగము అనువ్యాధిహరించి నాడీవేగము సమముగ వచ్చును.

3. తులసీదళముల స్వరసము మిరియాలు-సమము చేర్చి బెల్లముతో సేవించిన గుండెశూల హరించును.

4. సురసాదిగణద్రవ్యములను కంచు పాత్రయొక్క శోధనముచేత నల్లగబూడిదవలె అయిన దానిని తైలములోచేర్చి నస్యము చేసిన రోమాదములు, కేశాదములు అనురక్తజక్రిములు నశించును.

5. తులసి, వస, చిత్రమూలము, మోడి, త్రికటుకములు, ఇంగువ, తీటకసింద కచ్చూరాలు,మెట్టతామర, గజపిప్పళ్ళు, గంటుభారంగి, తిప్పతీగ, సన్నరాష్ట్రము కర్కాటకశృంగి, ద్రాక్షపండ్లు-ఇవి ప్రతిదీ ఒక్కొక్క-కర్షము (చూర్ణము చేసినది వాకుడును ఏబది పలములుగ్రహించికషాయము కాచిదించుకుని అందు చూర్ణములను, పటిక బెల్లము 25 పలములు, ఘృతము 4పలములు కలిపి లేహ్యము కాచిదించుకుని ఆరిన తరువాత అందు తేనె,పిప్పళ్ళచూర్ణము, తవక్షీరిచూర్ణము ఇ ప్రతిదీ 4పలములువేసి బాగుగకలిపి అందు తగుమాత్రము సేవించిన హృద్రోగములు శ్వాస, కాస, గుల్మము హరించును.

6. తులసీ దళముల చూర్ణము అరతులము, మద్దిచెక్క చూర్ణము ఒక తులము- ఈ రెంటినీ తేనెతో కలిపి సేవించిన హృదయరోగములు హరించును.

7. హృదయమునందు పొడిచినట్లుండుశూల, పట్టిపిండినట్లుండుశూల- వీటికి నల్లతులసీదళములు 25, దాశానిపువ్వులు రెండు-ఈరెంటిని కొత్తచట్టిలోవేసి నీళ్ళుపోసి అర్ధభాగము మిగులునట్లు కషాయముకాచి దించుకుని వడియకట్టి దినమునకు నాలుగుపూటలు వంతున గుక్కెడు కషాయమును 12 దినములుసేవించిన హరించును. ఆవాలు వాడరాదు.

8. తులసి,గుమ్ముడుటేకు, ద్రాక్షపండ్లు, కటుకరోహిణి, కసివింద, కరక్కాయ, శొంఠి ,పిప్పళ్ళు, చిరుబొద్ది, తుంగగడ్డలు, పెగ్గుమ్ముడు- ఇవి ప్రతిదీ ఒకకర్షము గ్రహించి కల్కముచేసి-పాలు, ద్రాక్షపండ్లరసము-ఇవి ఒక్కొక్క అఢకము గ్రహించి, ఒక ప్రస్థము ఘృతము- వీటినన్నింటిని ఏకముచేసి ఘృత పాకపక్వముగకాచి ఆరబెట్టి భద్రపరచి దానిని తగుమాత్రముసేవించినప్లీహవ్యాధి, జ్వరము, శోష, సమస్తకాసలు హరించును.



# ఉదరరోగ చికిత్స

1. తులసి విత్తులు 8గు. గింజలెత్తునూరి చనుపాలతో బిడ్డలకు యిచ్చిన అతిసారము హరించును.

2. తులసీదళములు, బిల్వదళములు, మిరియాలు- ఇవి సమభాగము దంచి గుడ్డలోరసము పిండుకుని, దానిని సేవించిన కడుపుసుగ్గు, అజీర్ణము మున్నగునవి తీరును.

3. తులసివిత్తులు, శొంఠి యందలి నార, పిప్పళ్ళు- ఇవిసమముచేర్చి మెత్తగానూరి తులసిస్వరసముతోనూరి ఉద్దులు ప్రమాణముమాత్రలుచేసి వుదయ, సాయంత్రములందు తేనెతో యిచ్చిన అతిసారము, వాంతి, శ్వాసకాసములు, పిల్లలకు వచ్చు జ్వరము మున్నగునవి హరించును.

4. తులసి గింజల చూర్ణము 30గు. గింజలెత్తు, పటికబెల్లం, 6గు. గి. ఎత్తు ఈరెంటిని కలిపి రెండు భాగములు చేసి పూటకు ఒక భాగము వంతున దినమునకు రెండుపూటలు సేవించిన కడుపునొప్పి, ఉబ్బరము హరించును.

5. తులసీదళములు 20గ్రహించి వేనీళ్ళతోనమిలిసేవించిన కడుపునొప్పి హరించును.

6. తులసీదళములస్వరసమును పూటకు రెండు చెంచాలవంతున దినమునకు మూడుపూటలు సేవించుచుండిన కడుపులోని బల్లలు హరించును.

7. తులసీదళములు, తెల్లగడ్డ, ఇందుప్పు, గడ్డకర్పూరము- ఇవిసమభాగము మెత్తగ నూరి బఠాణీలంత మాత్రలు చేసి పూటకు ఒక మాత్రవంతున దినమునకు మూడుపూటలు సేవించిన బేదులు హరించును.

8. తులసీదళములస్వరసములో, నెయ్యితోవేయించిన పెద్దజీలకర్రపొడి, చక్కెర సమము కలిపి సేవించిన ఆమాతిసారము హరించును.

9. అడవితులసి గింజలు అరతులం, పటిక బెల్లంచూర్ణం 5తులం, కలిపి నీళ్ళలో ఒకజాము నానబెట్టి సేవించిన కఠిన రక్తవిరేచనములు కట్టిపోవును.

10. రామతులసి స్వరసమును పొంగించి సేవించిన కడుపు నొప్పితీరును. మూలవ్యాధి కూడతీరును. మూలవ్యాధిలో పైకి ఆస్వరసమునే పూయవలెను.

11. తులసీదళముల స్వరసము 3తు॥ జాజికాయ చూర్ణము ఒక చిటికెడు కలిపి త్రాగుచుండిన నీళ్ళవిరేచనములు, జిగట విరేచనములు హరించును.

12. అడవి తులసిరసము 1 భా॥ శొంఠి 1 భా॥పాతబెల్లము 2 భా॥ వీటిని దంచి ఒకటిగచేర్చి గచ్చకాయప్రమాణము వుంటలుచేసి పూటకు ఒక వుంట వంతున దినమునకు మూడుపూటలు సేవించుచుండిన అజీర్ణము, ఆకలిలేమి మున్నగునవి హరించును.

13. తులసిగింజలు, పటికబెల్లము-సమముచేర్చి నూరి సేవించిన కడుపుబ్బరము, నొప్పితీరును.

14. తులసిగింజలు,పమిడిప్రత్తిగింజలు--ఈ రెంటిని వాసెనపై వుడికించి దంచి రసముపిండి దానిలో రెండు దుడ్డెత్తు రసమును గ్రహించి కొంచెము ఏలకుల చూర్ణము కలిపి యిచ్చిన వాంతులు గుణమగును.

15. తులసీదళములు, జిల్లేడువేరు, మిరియాలు- యివిసమభాగము చేర్చి మెత్తగనూరి మిరియాలంత మాత్రలుచేసి పూటకు 2,3 మాత్రలుమూడు పూటలు సేవించిన బేది గుణమగును.

16. తులసివిత్తులు ఒక పలము, తాటికలకండ 1/2 పలము చేర్చి ఒక మట్టి పాత్రలోవేసి ఒక ఆళాకునీళ్ళుపోసి మూతమూసి ఒక రాత్రి భావనచేసి మరుసటి రోజు వుదయము తీసి సేవించిన శీతబేది హరించును.

17. తెల్లతులసి, వేపచెక్క (లోపలిచెక్క)--ఈ రెంటిని సమభాగముచేర్చి కషాయము కాచి ఆ కషాయమును కడుపునిండుగ త్రాగిన వాంతిగలిగి చురుకుదనమును కలిగించును.

18. తులసీదళములు, వావిలి ఆకులు, వారిజీపాకు, నల్లవుమ్మెత్త ఆకు, ప్రత్తి ఆకు, దుష్టపాకు, (ప్రతిదీ ఒక భాగము) వీటిస్వరసములు సమభాగము గ్రహించి శుద్ధిచేసిన తెల్ల గుగ్గిలపు చూర్ణము, లోహకిట్టము చూర్ణము (కొలిమి వద్దయుండు కిట్టము), కరక్కాయలు- ఇవిప్రతిదీ ఒక్కొక్క భాగము, శుద్ధిచేసిన పాదరసము ఒక భాగము, వీటిలో మొదట గుగ్గిలము, కిట్టము, కరక్కాయలను బాగుగా దంచి చూర్ణము చేసి దానితో పాదరసమును చేర్చి పైస్వరసములతో కలిపి పొయ్యిపైబెట్టి పాగుపదమునకాచి దించుకునేది. ఆరిన తరువాత గురుగింజ

ప్రమాణము మాత్రలుచేసుకుని రోగి, రోగ బలానుసారము ఒకటి లేక రెండు మాత్రలు తాటిబెల్లముతో సేవించిన అష్టవిధములైన గుల్మములు హరించును.

19. తులసి 5 వరహాఎత్తు, పొంగించిన ఇంగువ 5 వరహాఎత్తు -ఈ రెంటినీనూరి ఒకటిగ చేర్చిపూట ఒకటికి $1^1/_2$ వరహాఎత్తు వంతున రోజుకు రెండు పూటలు సేవించి వెచ్చనినీళ్ళుత్రాగవలయును. మరుదినము కందిపప్పు, మిరియాలురసము వుప్పులేకుండ పెట్టి సేవించి వేన్నీళ్ళు సేవించవలెను. ఇట్లు 20 దినములు రెండు పూటలా సేవించి, తరువాత 10 దినములు ఒకపూట సేవించిన గుల్మము హరించును.

20. తులసిని ఎనుముపెరుగుపోసినూరి, ఆ పెరుగులోనేకలిపి వుదయ సమయమున త్రాగవలయును. ఇట్లు 3,4 దినములు సేవించిన గ్రహణి, రక్తబేదులు- హరించును.

21. తులసి పంచాంగములను బాగుగ ఆరబెట్టి సమము మిరియాలుచేర్చి మెత్తగ చూర్ణముచేసి వెచ్చని నీళ్ళతో సేవించుచుండిన, ఆకలిలేమి, ఉదర సంబంధమైన వ్యాధులు తీరును.

22. తులసీదళములు 1 తు॥ శొంఠి పొడి 1 తు॥ పాతబెల్లము 2 భా॥ వీటిని మెత్తగనూరి ఉస్తికాయప్రమాణము మాత్రలుచేసి ఆరబెట్టి పూటకు రెండు మాత్రలు వంతున రోజుకు మూడు పూటలు సేవించిన అజీర్ణము హరించి ఆకలియగును.

23. తులసి, వాయింట, ఏలకులు, వస, కచోరములు, ఇంగువ, సౌవర్చలవణము, బిడాలవణము, త్రికటుకములు, దానిమ్మపండు, ఓమము, పుష్కరమూలము, జీలకర్ర , ధనియాలు, పుల్లప్రబ్బలి, సర్జక్షారము, చిత్రమూలము-ఇవి సమభాగములు- వీటికన్నింటికి నాల్గింతలు ఆవునెయ్యి, నెయ్యికిసమము ఆవు పెరుగు, నెయ్యికి నాల్గింతలు వుదకము- వీటినన్నింటిని ఒకటిగచేర్చి ఘృతపాకపక్వముగ కాచి చల్లారనిచ్చి భద్రపరచేది. ఇందు తగుమాత్రము సేవించుచుండిన వాతగుల్మము, శూల, కడుపుబ్బరము- హరించును.

24. తులసి, ఏలకులు, వస, వాయింటవేరు, చిత్రమూలము, కచోరములు త్రికటుకవులు, ధనియాలు, పుల్ల(ప్రబ్బ)లిపండ్లు, యవక్షారము పుష్కరమూలము, వామము, దానిమ్మపట్ట, జీలకర్ర, ఇంగువ, బిడాలవణము సౌవర్చలవణము- వీనిని సమభాగముచేర్చి కషాయముగకాచి అందుకుసమము పెరుగునుచేర్చి- ఈ రెంటికి నాల్గవభాగము ఘృతముచేర్చిసిద్ధము చేయబడిన ఘృతమును పానము చేయుచుండిన వాతగుల్మము హరించును.

25. తులసి, మద్దిపట్ట, అమ్లవేతసము, వాయువిడంగములు, మునగవేర్లు, కంపిల్లము, కరక్కాయ, నల్లతెగడ, సౌవర్చలవణము- వీనినిసమభాగము చూర్ణించి తగుమాత్రము మద్యముతో కలిపి పానముచేసినచో వాతమువలన జనించినశూల నివర్తియగును.

26. నల్ల తులసి ఆకు 5 భా॥ పాటవేరు, చిత్రమూలము, కటుకరోహిణి, వస, త్రికటుకములు- ఇవి ప్రతిదీ ఒక్కొక్క భాగము చేర్చి చూర్ణించి పెసరకట్టువమున్నగు వాటితో తగుమాత్రము చేర్చి సేవించిన శ్లేష్మశూల నివర్తియగును.

27. సురసాదిగణద్రవ్యముల కల్క కషాయములచే సిద్ధము చేయబడిన తైలమును తగుమాత్రము పానము చేసిన కృములు నశించును.

28. తులసిసమూలమును తెచ్చి బాగుగ దంచి నలియగొట్టి పిసికి రసముతీసి అందు ఎర్రవరిబియ్యపు పిండిని కలిపి అప్పడము వలెచేసి పొగలేని నిప్పులపైకాల్చి వాయువిడంగములతైలము, సైంధవలవణము చేర్చిసేవించవలెను. దీనిసేవన వలన కృములు హరించును, ఇదేవిధముగ ఎలుకచెవి చెట్లనుకూడ చేసి సేవించిన కృములు హరించును.

29. అడవి తులసి, ఏలకులు, వస, అజామోదము, కచ్చూరము, చిత్రమూలము, యవక్షారము ధనియాలు, చింత, ప్రబ్బలి, మెట్టతామర, త్రికటుకములు, వాము, జీలకర్ర, ఇంగువ, దానిమ్మ, సౌవర్చలవణము, బిడాలవణము- వీటిని సమభాగము గ్రహించి చూర్ణించి తగుమాత్రము ఘృతము కలిపి కాచి సేవించిన కడుపుబ్బరము, శూల, వాతగుల్మము యివి హరించును.

30. తులసీ దళములు ఒకపిడికెడు గ్రహించి నూరి అందుగెట్టిమిరియాలు 9 దింటిని దంచి వేసి ఆరుఔన్సులు నీళ్ళుపోసి కాచి అర్ధభాగముమిగులు నట్లు చేసి దానిని సేవించిన కడుపు నందలి పురుగులు బయటకు వచ్చివేయును.

31. వనతులసిని మెత్తగ నూరి ముద్దచేసి ఒక బాణలిలో వెచ్చచేసి దానిపై కొద్దిగ ఉప్పును చూర్ణించి చల్లి అంత్రపుచ్ఛప్రదాహ వ్యాధియందు నొప్పిగావున్న స్థలముపై వేడివేడి ముద్దను పెట్టి కట్టవలయును. రోగితాళునంతవేడి యుండుట మంచిది. 48 గంటలలో మూడుసార్లు కట్టవలయును. రోగిపూర్తిగా విశ్రాంతితీసు కొనవలయును. చికిత్సానంతరవురోగవము శాశ్వతముగా దూరమగును. (అంత్రపుచ్ఛ ప్రదాహవ్యాధి అనగా అపెండిసైటిస్). (ఇది రహస్యయోగము).

## విషూచి, అర్శస్సు, మూత్రరోగ చికిత్స

1. తులసీదళములు 20. మిరియాలు 15. వట్టివేర్లు 1 తు॥ (ఎండినవి) - వీటిని మెత్తగనూరి రసమును గుడ్డలో పిండి అందు తగినంత మాత్రము పంచదారతో కలిపి సేవించేది. ఇట్లు 15 నిమిషములకు ఒక మోతాదు యిచ్చుచుండిన 5,6 మోతాదులతో కలరా వ్యాధి హరించును. అట్లు కానియెడల ఇంకారెండు మూడుసార్లు మందుయిచ్చేది.

2. తులసి, పెన్నేరు గడ్డ, వాకుడు, పిప్పళ్ళు, నెయ్యి- వీనిని వేరు వేరుగనూరి కలిపి ధూపము వేసిన అర్శస్సులకు హితముకల్గును.

3. అడవి తులసి, నేలములక, పెన్నేరు, పిప్పళ్ళు- వీటిని చూర్ణించుకుని నెయ్యి కలిపి ధూపము వేసిన అర్శస్సులు హరించును.

4. సురసాదిగణము, ఊషకాదిగణము, ముస్తాదిగణము, వరుణాదిగణము- వీనితో చేర్చి సిద్ధము చేయబడిన తైలము లేక వీనికషాయముతో చేయబడిన యవాగును వస్తి, పానములయందుపయోగించినచో కఫజమూత్రకృచ్ఛ్రము తీరును.

5. నల్లతులసి సమూల చూర్ణమును నిమ్మపండురసముతో కలిపి సేవించు చుండిన ఎటువంటి మూత్రరోగములైననూ హరించును.

# చర్మరోగ చికిత్స

1. తులసీదళములను నిమ్మపండురసముతో నూరిపైనపూయుచుండిన గజ్జి, చిడుము దురద, తామర మున్నగు చర్మవ్యాధులు హరించును.

2. తులసీదళములు ఒక నిమ్మకాయంత గ్రహించి అందు పాదరసము 2 వరహాలఎత్తు చేర్చిఖల్వములో మెత్తగనూరి, నిమ్మకాయంత వెన్నచేర్చి రంగరించి భద్రపరచేది. దీనిని పుండ్లు, తీట, గజ్జి మున్నగువాటిపై పూసి సాయంత్రము వెచ్చని నీళ్ళతో స్నానముచేసిన అవిగుణమగును.

3. తులసి, అవిశి, నువ్వులు, కురువేరు, ఇందుప్పు- ఇవిసమభాగములు చేర్చి మెత్తగ నూరి శరీరముపై పూసి, నెయ్యిలో ఇందుప్పు పొడివేసి కాచి మూడు లేక నాలుగుసార్లు తలకురుద్ది ఒకగంట తరువాత వేనీళ్ళస్నానము చేసిన శీతపిత్తము తీరును.

4. కృష్ణతులసి చూర్ణములో నిమ్మపండు రసముపోసి నూరి పై పూతగ పూసిన చర్మసబంధమైన వ్యాధులు తీరును.

5. తులసిసమూల చూర్ణము దినమునకు మూడుపూటలు సేవించి, బొల్లి యుండు స్థలమున తులసీదళము, దానివేరునకంటియుండు మట్టి ఈ రెంటినినూరి మచ్చలపై లేపనముచేయుచుండిన బొల్లితీరును. దీనిని వదలక ఆరుమాసములు నుండి ఒక సంవత్సరమువరకు వదలక భక్తితో చేసిన మంచి ఫలితముకలదు.

6. తులసీదళముల స్వరసము, రాతిసున్నము, తమలపాకుల స్వరసము, ఆవునెయ్యి- ఇవి సమభాగముగ్రహించి మెత్తగ నూరి భద్రపరచుకొని క్రుళ్ళిన వ్రణములపై పూయుచుండిన అందలి పురుగులుచచ్చి వ్రణము ఆరును.

7. తులసీదళముల స్వరసమునందు పసుపు కలిపి లేపనము చేసినగజ్జి, తామర హరించును.

8. తులసివేరు, శొంఠి- ఈ రెంటినిమెత్తగానూరి వెచ్చనినీళ్ళతో సేవించిన కుష్ఠు హరించును.

9. తులసిస్వరసము, పాదరసము, గంజాయి-ఇవిప్రతిదీ ఒక తులం చేర్చిఇనుప పాత్రలో వేసి వేపకొయ్యతో మూడుజాములు బాగుగా కలిపి మరలతగినంత తులసి స్వరసముపోసి ఒక జాము వేపకొయ్యతోరుద్దవలెను. తరువాత పత్యేకముగ జాపత్రి పొడిచేసినది, జాజికాయ పొడిచేసినది, ప్రతిదీ ఒక తులము చేర్చిమరల తులసిస్వరసముతో ఒక జాముపేపకొయ్యతోనూరేది. మెత్తగానూరిన తరువాత శెనగలంత ప్రమాణము మాత్రలు చేసి నీడనఆరబెట్టి భద్రపరచేది. ప్రతిదినము రెండు మాత్రలు సేవించు చుండిన కుష్టు, తామర, బొబ్బలు-హరించును. మందు సేవించుటకు పూర్వము కోష్ఠశుద్ధిచేయుట మంచిది. ఉప్పు, పులుపు, కారములు వర్జ్యము.

10. తులసీదళములు, తమలపాకులు, ఎర్రకాచు, సున్నము, మిరియాలు-ఇవిసమము కలిపి నూరి లేపనము చేయుచుండిన నాగసర్పి హరించును.

11. తులసీదళములను నోరుపట్టునంత తెచ్చి నమిలితినవలయును లేక స్వరసము పిండుకుని అర్ధ ఔన్సువంతున సేవించవలయును. ఇట్లుప్రతిదినము చేయుచూ పెరుగన్నము, కారము, పులుపు, స్త్రీభోగము వీటిని వర్జించి-దైవభక్తితో ఒకటి రెండు సంవత్సరములు సేవించిన కుష్టుహరించి దివ్యమైన శరీరము, రూపముకల్గును.

12. తులసీదళములను నూరి చేతులు కాళ్ళు వీటి యందు కనబడు వ్రణములపై లేపనము చేయవలెను. మాంసాహారము, లాహిరివస్తువులు వర్జ్యము. వ్రణములు మానును.

13. తులసి, బార్లీబియ్యము, గన్నేరువేరు, మునగవిత్తులు, ముల్లంగి విత్తులు, తెల్లావాలు వీటిని మజ్జిగతో నూరి పూసిన అర్బుదము హరించును.

14. కుక్కతులసి ఆకులు పూగుత్తితో తెచ్చి ఒక చిన్నముక్కవస చేర్చికాటుక వలె నూరి శరీరమునకు పూసుకొని ఒక గంట తరువాత చన్నీళ్ళతో స్నానము చేయవలెను. ఇట్లు చేయుచుండిన శరీరము, మర్మస్థానము, చంకలు యింకయూ అధికరోమములుండుస్థలములందు పట్టియుండు చీరపేనులు, పేనులు నశించును.

15. కుక్కతులసి, హంసపాది, కానుగపట్ట, శతావరి-వీటిని వేరువేరుగదంచి పిండిన స్వరసము ప్రతిదీ ఒకశేరు, ఆవుపాలు 4శేర్లు-వీటినికలిపి ఒకరోజువుంచి

తరువాత తీసి రెండుభాగములుచేసి ఒక భాగమును ఒక శేరు ఆవునెయ్యిలో కలిపి ఘృతపాకపక్వముగ కాచివడియకట్టి భద్రపరచేది. రెండవభాగమును ఒక శేరు నువ్వులనూనెలో కలిపి తైలపాకపక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరచేది శరీరబలమునుసరించి ఘృతమును తగుమాత్రము లోనికి సేవించవలెను తైలమును పైకిలేపనముగ పూయవలెను. వాతకరప్పాణి (పామ) తీరును.

16. కృష్ణతులసీదళములు, కరక్కాయబెరడు, మిరియాలు-ఇవి సమముచేర్చి నూరి లేపనము చేయుచుండిన బొల్లి, మచ్చలు హరించును.

17. తులసివేర్లు, త్రికటుకములు, త్రిఫలములు, విష్ణుక్రాంతిసమూలము-ఇవి సమముతెచ్చి దంచి కషాయముబెట్టి పూటకు ఔన్సు వంతున రెండు మూడుపూట లిచ్చిన శీతపైత్యము(Nettle Rash) హరించును. చెమటబెట్టు చుండిన కాశిపువ్వుకషాయముయిచ్చేది.

18. మంచితులసి, శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు, విష్ణుక్రాంతి, తిప్పతీగె-ఇవి సమము కషాయంబెట్టి త్రాగిన శీతపైత్యము హరించును ( దద్దుర్లు).

19. కృష్ణతులసీదళముల స్వరసముతో నల్లకరక్కాయను సాది గంధము తీసి తెల్లమచ్చలపై లేపనము వేయుచుండిన గుణమగును.

20. భూతులసి, శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు, వావిలివేర్లు- ఇవి సమము మెత్తగా నూరి తగుమాత్రము నువ్వులనూనెకలిపి లేపనము చేయుచుండిన తెల్లమచ్చలు హరించును.

21. తులసి ఆకులు, తులసిగింజలు-ఇవి సమము నిమ్మపండురసముతో నూరి శరీరమునకు లేపనము చేయుచుండిన దురద, చిడుము, గజ్జి హరించును.

22. నల్లతులసి, నల్లతమలపాకు-ఈరెంటిని సమముచేర్చిదంచి రసము పిండుకుని పొడలపైపూసిన అవి హరించును. లేక నల్లతులసితో ఒక వుప్పు రాయిని పెట్టి దంచి రసముపిండి పూసిన పొడలు హరించును.

23. నల్లతులసిని రాత్రిపడుకునేటప్పుడు తలగడపైపరచి దానిపై జడనువిప్పి పరిచి పండుకుని నిద్రపోయేది. వుదయమున తలగడనుతీసి ఎండలోపెట్టేది. పేనులు నశించును. తలను యిప్ప పిండితోపులుముకోవలెను.

24. శివతులసిఆకులు, నల్లఉమ్మెత్తఆకులు- వీటిరసములను కలిపి పూయుచుండిన కుష్టువ్యాధులు తగ్గును.

25. శివతులసివేరు సాది గంధంతీసి పూయుచుండిన వృద్ధి యనురోగము హరించును.

26. కుక్కతులసి ఆకును పిట్టుబెట్టి రసముతీసి, శొంఠి,పసుపు లనుకొట్టి వేయించి పైరసముతో నూరిపట్టువేసిన మంటలు మానును (*Burning of the Skin*).

27. తులసి, దేవదారు, త్రిఫలములు, త్రికటుకములు,పంచలవణములు, వాయువిడంగములు, చిత్రమూలము,చెవ్యము, మోడి,గుగ్గిలము, బోడతరము, యవక్షారము, చిరుబొద్ది, వస, కచోరము, ఏలకులు, సరళదేవదారు- ఇవి ప్రతిదీ ఒకకర్షముతెచ్చి కల్కముచేసి ఒక ప్రస్థము ఆవునేతితో కలిపి అందు దశమూలకషాయము, ధనియాలకట్టు, పెరుగుమీది మీగడ-ఇవిప్రతిదీ 2ప్రస్థములు చేర్చి ఘృతపాకపక్వముగ కాచిదించుకుని భద్రపరచుకునేది. ప్రతిదినము మూడు కర్షముల ఘృతమును పానముచేసిన కఫవాతములవలన పుట్టునటువంటిదియూ, మాంసరక్తమేధస్సులను ఆశ్రయించి యుండునటువంటి శ్లీపదరోగము, గండమాల, అంత్రవృద్ధి, అర్బుదము, గ్రహణి, వాపు, అర్శస్సు, అపచి,కోష్ఠరోగము, కృమిరోగము మున్నగునవి హరించును. జఠరాగ్ని దీపనముకలుగును. శ్లీపదరోగమునకు ముఖ్యమైన యోగము.

28. తులసీదళములు, మిరియములపొడి, పిప్పళ్ళపొడి-ఇవిప్రతిదీ ఒకతులమువంతున గ్రహించి అందు గడ్డకర్పూరము 3 ఉసిరికాయలప్రమాణము కలిపి వేపచిగుర్లరసముతో కాటుకవలెనూరి గురిగింజ ప్రమాణము మాత్రలుచేసి- రోగివయస్సును అనుసరించి ఒక మాత్రనుండి 4 మాత్రల వరకు 3గంటల కొకసారి యిచ్చిన ప్లేగు హరించును.

29. తులసిపూగుత్తి, లవంగములు,లవంగపట్ట, శొంఠి, పిప్పళ్ళు, ద్రాక్ష, తమలపాకులు-ఇవి ప్రతిదీ సమభాగము గ్రహించి కొంచెము నీళ్ళుపోసి వుడుకబెట్టి సేవించిన దాహము, అలసట-ఇవి తీరును.

30. తులసీదళములు, మారేడుదళములు, ముదిరినవేపాకు, గరిక, అత్తి ఆకులు, తుమ్మిఆకులు, మామిడాకులు-ఇవి సమభాగము తెచ్చి మట్టికుండలో

బెట్టి అవిమునుగునంతవరకు, నీళ్ళుపోసి అర్ధభాగము నీళ్ళుమిగులునట్లు యిగరకాచి దించి వడియకట్టి ఆరనిచ్చి శుభ్రమైన బుడ్డిలో భద్రపరచేది. ఈకషాయమును 3 లేక 4 దినముల కొకసారి తయారుచేసుకునేది. ప్రతిరోజు ఈకషాయమునంతటిని మట్టికుండలో పోసి వేడిచేసి 100 మి. లీ. కషాయమును గ్రహించి ఆరినతరువాత నాలుకతోరుచి చూచుచూ కొంచెము కొంచెముగ సేవించవలయును. మిగిలిన కషాయమును బుడ్డీలో భద్రపరచేది. కషాయమును ఉదయమునసే పండ్లుతోమిన తరువాత పరగడుపుననే సేవించవలెను. పురాతన చర్మవ్యాధులు గలవారు 3 లేక 4 మండలములు సేవించవలెను. ఉదయము, మధ్యాహ్న భోజనములు నిండుగను రాత్రిపూట అర్ధకడుపు ఆహారమే భుజించవలెను. కషాయము సేవించు కాలమంతయూ చిక్కుడుగింజలు, చేపలు, వంకాయ, ఉర్లగడ్డ వీటిని సేవించరాదు. చర్మవ్యాధులు, పొడలు, రాపిడిచే కలుగు మంట, నవ్వ, కోసినట్లుండుట హరించును.

31. తులసీదళములు, కర్పూరవల్లి ఆకు, వేపచిగుర్లు- ఇవి సమభాగమునూరి తగుమాత్రము (కూకుడుగింజంత) వారములో రెండు దినములు వెచ్చనినీళ్ళతో సేవించిన చర్మవ్యాధులు, కఫరోగములు మున్నగునవి రావు.

32. నల్లతులసి వేర్లు ఒక పిడికెడు తెచ్చి దానితో నల్లజీలకర్ర అర్ధభాగము చేర్చినూరి రాత్రులందు తెల్లమచ్చలపై పూయుచుండిన గుణమగును.

33. తులసిచెట్టువేర్లు వద్దయుండు మట్టిని తీసి శరీరమునకు పూసుకుని అర్ధగంట లేక గంటతరువాత స్నానముచేసి తడి గుడ్డతో తుడుచుకునేది. చర్మవ్యాధులు తీరును.

34. తులసి స్వరసము, గుంటగలిజేరురసము, బొక్కెనరసము, దాశానిస్వరసము- ఈ రసములతో, వేరువేరుగా, ద్వందించబడినట్టి శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిచేసిన తెల్లసీసము (ప్రతిదీ 2 వరహాఎత్తు) లను కాచేది. మంచి సత్తగును. దానినిభద్రపరచేది. ఇందు అర్ధవరహాఎత్తు ప్రమాణము ఎత్తుకుని ఒక తెల్లని గుడ్డలో మూటకట్టి చింతబొగ్గులనిప్పు సెగలో వేసి గ్రంథిపుండుకు పొగపట్టేది. ఈవిధముగ 6 దినములు 12 పూటలు చేసేది. చల్లని నీళ్ళతో స్నానముచేసిన తరువాత పొగవేయవలెను. ఉప్పులేకుండా ఉప్పుడుబియ్యంగంజి రెండు పూటలు సేవించవలెను. 6 దినములు ఈవిధముగ చేసినతరువాత ఆముదపు నూనె తలకు అంటుకుని శిరస్నానము చేయవలెను. ఆ తరువాత 20 దినములు పథ్యముగా యుండేది. గ్రంథిపుండు హరించును.

35. తులసీదళములు ఒక నిమ్మకాయంత గ్రహించి దానితో శుద్ధిచేసిన పాద రసము రెండు వరహాఎత్తు ఖల్వములోపెట్టి బాగుగనూరేది. దానితో నిమ్మకా యంత ఆవునెయ్యి చేర్చినూరి భద్రపరిచేది. ఈ మందును పుండ్లు, తీట, గజ్జి మునగువాటిపై పూసి సాయంత్రము పూట వేన్నీళ్ళతో స్నానము చేయుచుండిన అవి హరించును.

36. తులసీదళముల స్వరసముతో శుభ్రముచేసి, ఆరసమునందు తడిపిన సన్నని గుడ్డను పైన కప్పికట్టుకట్టిన దుష్టవ్రణములందుండుక్రిములు నశించి వ్రణము శుద్ధమై మానును.

37. తులసి, పిప్పళ్ళు, చిత్రమూలము, కానుగ, కోష్టు, గోపిత్తము- ఇవి సమమునూరి లేపనముచేసిన కిట్టిభకుష్ఠము హరించును.

38. తులసి, అవిశెఆకు, అడ్డసరపాకు, గరిక, కలబంద, గుంటగలిజేరాకు, తిప్పతీగ, నీలియాకు- వీటిరసములు ప్రతిదీ 1 $^1/_2$ పడి ఆవుపాలు 2పడి, ఆవునెయ్యి 2పడి చేర్చి అందు- పెన్నేరుగడ్డ, తామరతూడు, వట్టివేరు, కురువేరు, గాడిదగడపాకువేరు, తుంగముస్తెలు, ఎర్రకలువగడ్డ, కచ్చోరాలు, ఆవాలు, నెల్లివరుగు, తాణికాయ, ఏలకులు, లవంగములు, పచ్చాకు, కోష్టు, త్రికటుకములు, ఇంగువ, పునుగు, కుంకుమపువ్వు, ఎర్రతామర గడ్డ-ఇవిప్రతిదీ 2$^1/_2$ వరహాఎత్తు మెత్తగనూరి కలిపి పైవాటితో కలిపి కాచి మైనపక్వమున దించి వడియకట్టి ఒక తులము వంతున, ప్రతిదినము సేవించుచుండిన- కుష్ఠ, వ్రణములు, గ్రంథి, గర్భిణిగ్రంధి, వాపు, ఉష్ణమేహము, శరీరము నందలి వుష్ణము- ఇవిహరించును పథ్యముగ వుండ వలెను.

39. తులసీదళములు ఒక పిడికెడు, చందనము ఒక పలము, చంపకపుష్పము 1/2 పలము, వీటిని మెత్తగనూరి మంచినూనెలో కలిపి కాచిసేవించవలెను. ఈతైలమును శరీరమునకు కూడాపూయవలెను. శరీరదుర్గంధము హరించును.

40. తులసి ఆకురసమును లేపనముచేసిన శీతపిత్తము నివర్తియగును.

41. తులసి స్వరసము కావలసినంత సేకరించి పెట్టుకునేది. బాగుగ శుద్ధిచేసినరసము, శుద్ధిచేసిన మృద్దారుశింగి, శుద్ధిచేసిన రసకర్పూరము, శుద్ధిచేసినఇంగ్లీకము, శుద్ధిచేసిననెల్లికాయగంధకము, మంచితెల్లసీసభస్మము, కర్పూరము - ఇవి సమభాగములు తీసుకునేది. రసగంధకములను కజ్జలి చేసి

బాగుగ నూరి నల్లగ అయిన తరువాత, ఇతరసరుకులను ఒకటొకటిగ చేర్చి చూర్ణించి చేయివదలకుండా మూడుగంటలసేపు నూరవలయును. ఇట్లుపై సరుకులన్నింటిని ప్రతిఒకదానిని మూడుమూడుగంటలసేపునూరినతరువాత తులసిరసమును కొంచెము కొంచెముగ పోసి పన్నెండు గంటలసేపు (4 జాములు) మెత్తగనూరి ఉస్తికాయంత మాత్రలుచేసి నీడన ఆరబెట్టి బుడ్డీలో భద్రపరచేది.

**తీరువ్యాధులు:** - దీనినితులసి రసముతోనే సాది పైపూతగ వుపయోగించిన రాక్షసగజ్జి, కుక్కగజ్జి, నీరుకారేగజ్జి, ఎండుగజ్జి, అల్లుకొనిపోవుతామర, వండుకాట్లు, ఎంగిలిచిడుములు- మున్నగు అనేక విధములైన గజ్జి హరించును. పైరోగములు అధికముగను, పురాతనమైనదిగ యుండిన నిమ్మపండు రసములో సాదిపూయవలెను. ఇది ఒకగొప్ప అనుభవసిద్ధమైన యోగము.

42. నల్లతులసి స్వరసములో శుద్ధిచేసిన ఫిరంగిచెక్కను భావనచేసి నీడన ఎండబెట్టి పొడిచేసుకుని 15నుండి 20గ్రెయినులచూర్ణమును పాలు పంచదారతో సేవించిన కుష్టు, శ్విత్రము, మేహము, సకలవిధములగు చర్మవ్యాధులు గుణమగును.

43. కుక్కతులసిఆకు, వేపాకు-ఈరెంటిని సమముగతెచ్చిప్రతిదీ వేరువేరుగనూరి తరువాత ఒకటిగ కలిపి -శరీరమున రోమములయందు సాలె పురుగులవంటి పురుగులతో అవస్థపడునపుడు ఈ నూరినముద్దను ఆస్థలముపై పూయవలెను. ఒకగంట తరువాత స్నానముచేయవలెను, ఇట్లు ఒకమండలము చేసిన పూర్తిగ నశించును.

44.తులసి లేక అడవితులసి, తగిరిశవిత్తులు, కరకపిందెలు, గరిక, సైంధవలవణము- వీటిని సమభాగముగ్రహించి మజ్జిగతో మెత్తగనూరి అందు మజ్జిగకలిపి లేపనముచేసిన దురద, గజ్జి, దద్రురోగములు హరించును.

45. నల్లతులసి, కొడిశపాల, ఏడాకులఅరటి, వరగోగు, చెంగల్వకోష్టు, జాజిచిగుళ్ళు- ఇవిసమభాగము చూర్ణించి గోపిత్తముతో భావనచేసి మెత్తగానూరి ఆవనూనెతో కలిపి లేపనము చేసిన కుష్టు, నూతనముగజనించినబొల్లి, ఇంద్రలుప్తము, కిట్టిభ, దద్రుకుష్టము, భగందరము, అర్శస్సు, గజ్జి హరించును.

46. తులసి, పసుపు, మానిపసుపు, చెంగల్వకోష్ఠు, చేదుపొట్ల, వేప, పెన్నేరు, కడిలచెట్టు, కైవర్తముస్తెలు, ధనియాలు, తుంబుర్లు, ఆవాలు, మునగ, దేవదారు-ఇవి సమభాగములు తెచ్చి చూర్ణించి పెట్టుకునేది. మొదట, శరీరమునకుతైలమును పూసిపైచూర్ణమును మజ్జిగతో కలిపి నలుగుపెట్టి-గంట, రెండుగంటలతరువాత స్నానముచేసిది. ఇట్లు చేయుచుండిన కుష్ఠు, శోఫ దద్దుర్లు, పిటికలు, దురదలు నశించును.

47. పుష్యమీనక్షత్రము కూడిన ఆదివారదినమునందు-తులసి, మంజిష్ఠ, వేపాకు, వేపజిగురు, తనక్షీరి, పెన్నేరు, ఇంగువ, వెలగ, పుల్లప్రబ్బలి, లక్క, ఇప్ప, బావంచాలు, వస, నల్లదూర్వ, నందివర్ధనము, గోరోజనము, పసుపు, వావిలి, ఆవాలు, కానుగ, తెల్లదింటెన, జీలకర్ర, త్రికటుకవములు, దిరిశనవము పంచాగములు, గ్రంథితగరము, ప్రేంఖణము, చెంగల్వకోష్టు, కామంచిపూరి, కుంకుమపువ్వు, నాగకేసరములు, దేవదారు, వ్యాఘ్ర్యనఖమనెడి గంధద్రవ్యము, వట్టివేళ్ళు, రేణుకలు, కురువేరు, నల్లకలువ, తెల్లవట్టివేర్లు, దాసినిచెక్క, స్పృక్క-యనెడి గంధద్రవ్యము, చందనము, ఏలకులు, తుంగగడ్డలు, లవంగపత్రి, కృష్ణాగరు, ఐదువిదములగు వృక్షనిర్యాసములు, (జిగుర్లు) హరిదళము, మణిశిల, రసాంజనము, గైరికము, తేనె-వీనిని గ్రహించి గోపిత్తముతో నూరి గుళికలను చేసి భద్రపరిచేది. దీనిని పానము, అంజనము, లేపనముగ వుపయోగించినచో సమస్తవ్యాధులు నశించును. కిట్టిభకుష్ఠ, దద్రుకుష్ఠ, బొల్లి, పామ, విషూచి, అజీర్ణము, విషమజ్వరములు, నేత్రవ్యాధులు, జంతు, సర్పవిషములు హరించును. బాలగ్రహములు దరిచేరవు.

48. తెల్ల తులసి, పసుపు, మానిపసుపు, యష్టిమధుకము, జటామాంసి రేణుకలు, ఇంగువ, సుగంధిపాల, నల్లసుగంధిపాల, చెంగల్వకోష్టు, గైరికము లక్క, సైంధవలవణము, త్రికటుకములు, కుంకుమపువ్వు,-ఇవి సమతూకమ గ్రహించి మెత్తగాచూర్ణించి లేతమోదుగచెట్టుయొక్క క్షారోదకము నందు పో బాగుగాకలిపి పొయ్యిపై పెట్టి కాచవలయును. గట్టిపడి గుళిక పాకమున దిం రేగుకాయలంత మాత్రలుచేసి నీడన ఆరబెట్టి భద్రపరిచేది. సమయాను కూలముగ తగుమాత్రము సేవించినచో చర్మరోగములు, భగందరమ మూలవ్యాధి, అపస్మారము, శోఫ, గుల్మము, ప్లీహము, సమస్తవిషముల కృములు, కంఠవ్యాధులు, పాండు, దగ్గు, ఉన్మాదము, అగ్నిమాంద్యమ భూతబాదలు-వీనిని నశింపచేయును.

49. అడవి తులసి, నేలములగ, ముల్లంగి, గగ్గెర, చెంగల్వకోష్టు, చిరుబొద్ది, దింటెన, ఆముదపు వేర్లు, గురుగింజలు, వేప, చిత్రమూలము, ఏడాకుల అరటి, జిలేడాకులు, జిల్లేడువేర్లపట్ట, కానుగపట్ట, ఆవాలు, వెల్లుల్లి, వాయువిడంగములు, జాజికాయలు, బ్రహ్మదండి, గంటుభారంగి, నేపాళవిత్తులు, నేపాళపువేర్లు, రాతిపువ్వు, పగడము, తుంగగడ్డలు, తుమికి, వస, కచ్చూరాలు, చాగ, తగిరిశవిత్తులు, మునగ, కొడిశపాల, త్రికటుకములు, ఎర్రావాలు, జీడిగింజలు, తాళకము, ఉత్తరేణి, కంపిల్లకము, తిప్పతీగ, మైలతుత్థము, తువరిమన్ను, కాసీసము, మానుపసుపుపైతోలు(చర్మము), సర్జికాలవణము- ఇవి సమభాగములు గ్రహించి కల్కముచేసి- గన్నేరు, ముల్లంగి- వీని ఆకుల కషాయము, నువ్వులనూనె, సమభాగముచేర్చి నాల్గురెట్లు గోమూత్రమునుకలిపి తైలపక్వముగ కాచి భద్రపరిచేది. దీనిని అభ్యంగనముగ వుపయోగించుచుండిన కుష్ఠుయందు బొబ్బలు పగులును. కృములు, దురద నశించును.

50. తులసి ఆకులు, గచ్చఆకులు, తమలపాకులు, జీలకర్ర, నల్లజీలకర్ర, ములువుచ్చింతతీగపట్ట- ఇవి ప్రతిదీ దుడ్డెత్తుగ్రహించి మెత్తగ చూర్ణించి-నల్ల ఆరికలబియ్యము వేయించి పిండిచేసుకుని అందు శుద్ధిచేసిన పాదరసము దుడ్డెత్తువేసి బాగుగానూరి పైసరకుల చూర్ణములను కూడ వేసి దంచి మెత్తగ నూరి భద్రపరచేది. ఇందు తగుమాత్రము వెచ్చని నీళ్ళతో సేవించిన శూల, పుండ్లు, వాతపిత్తకఫములచే కల్గిన కరప్పాణి (పామ) మున్నగునవి హరించును.

51. తులసీదళములు, వావిలియాకులు, నీలిఆకులు, కుప్పింట, చేదుపుచ్చ ఆకులు, కళ్ళిఆకులు, రెడ్డివారినానపాలు, చేదుబీర, తెల్లవుప్పిఆకులు వీటిరసములు ప్రతిదీ ఒకతవ్వ, ఆముదము 10తవ్వలు, గ్రహించి ఒకటిగకలిపి అందు ఆముదపువిత్తులు, కోష్టు, తుత్తము, లవంగములు, కాకిచంపు విత్తులు, వట్టివేర్లు, వెలిగారము, తురుశు, అగరుచెక్క- ఇవిప్రతిదీ ఒక పలము సగ్గుబియ్యము ఒక పలము అన్నిటినిదంచి పైనూనెలో కలిపి కాచి పక్వముగ దించుకునేది. నూనెవేడిగ దించునపుడే 3తమలపాకులు వేసి ఎర్రగఅయిన తరువాత తీసివేసేది. ఈనూనెను సేవించుటకున్నూ, పైపుతకున్నూ వుపయోగించిన గజ్జి హరించును.

52. తులసి, రేల, మాశికాయ, మానిపసుపు- ఇవిసమతూకముగ్రహించి ఊడుగ ఆకురసము పోసినూరి పూసినతీట, గజ్జి హరించును.

53. తులసి, రేలచిగుర్లు, తగిరిశవిత్తులు, తంగేడువిత్తులు, పసుపు, కరక్కాయ, తాణికాయ, నెల్లివరుగు, ఇప్పపిండి- ఇవిసమభాగముగ్రహించి చూర్ణించి పాతమజ్జిగలో భావనచేసి, తీసి నిమ్మపండురసముతో నూరి పూయుచుండిన అల్లుకునిపోవుతామర హరించును.

54. తులసిరసము, కాశాకురసము, వల్లేరాకురసము, చిన్నహంసపాది ఆకురసము, ఉప్పిరసము, కానుగపాలు, టెంకాయపాలు, ఆవుపాలు- ఇందు టెంకాయ పాలు మాత్రము ఒకపడి ఇతర రసములు ప్రతిదీ కాల్‌పడి వంతున గ్రహించి ఒక పాత్రలో పోసి దీపాగ్నిచే మూడుదినముల వరకు కలుపుచూ కాచ వలయును. పక్వమునకువచ్చుటకు ముందు శుద్ధిచేసిన నెల్లికాయ గంధకము ఒకపలము, శుద్ధిచేసిన రసకర్పూరము ఒక రూకవెత్తు ($3\ ^1/_2$ గు. గింజెత్తు), తూచి పొడిచేసి వేసి కొంచెముసేపు తెళ్ళబెట్టి ఘృతపాకపక్వము వచ్చినదే దించి వడియకట్టి భద్రపరచేది. ఇందు ఒకపలము ఉదయముననే మూడు దినములు సేవించవలయును. దీనివలన దుష్టవ్రణములు, ఆరనిపుండ్లు, చర్మముపైవచ్చు సన్ననిపూగ్రంథి మున్నగునవి హరించును.

**పథ్యము:**– పులియకుండయుండునీరాహారమును కొత్తగవండిన అన్నము నందు పోసికలిపి ఉప్పులేకుండ భుజించవలయును. ఇట్లుమూడు దినములు సేవించి, మరు పథ్యము 3 దినములు, వేయించిన తెల్లఉప్పుచేర్చుకుని ఏడవ దినము ఆవునెయ్యి అభ్యంగనము చేసుకుని స్నానముచేసి, మరుసటిదినము నుండి పులుపుకూడ చేర్చుకోవచ్చును.

55. తులసివేరును చూర్ణించి తమలపాకులో బెట్టి సేవించిన సాధారణ రక్తస్రావములు హరించును.

56. తులసిరసము ఒకపలము, తాటిబెల్లము 4 పలములు-ఈరెంటినిచేర్చి పాగుపదముగకాచి త్రికటుకములు, అతిమదురము, బావంచాలు, శు॥ గంధకము, పరంగిచెక్క, వాయువిడంగములు, కోష్టు-ఇవిప్రతిదీ ఒక పలముతెచ్చి శుద్ధిచేసి చూర్ణముచేసి పైపాగులో కలిపి మంచి ఆవునెయ్యి 1 / 4 పడి వేసి మంచితేనె, నెయ్యిలో అర్ధమువేసి మైనపక్వముగచేసి గాజుబుడ్డిలో భద్రపరచేది. ఈమందును తగుప్రమాణము సేవించిన 18 విధములైన కుష్టులు తీరును.

# మశూచిరోగ చికిత్స

1. తులసీదళములు, వేపాకు, నేలవేము, వావిలి, ములువెంపలి, మారేడు, రేగటిధూల, చిరుబొద్ది, ఆకుపత్రి, ఏలకులు, లవంగపుచెక్క, తక్కోలములు, వాయువిడంగములు, పర్పాటకము, కొత్తిమిరి, జీలకర్ర, తిప్పతీగ, అడ్డసరపు ఈనెలు, శొంఠి, పసుపు- ఇవిసమభాగములు గ్రహించి శుద్ధోదకముతో మర్దించి దాని రసమును తగుమాత్రము సేవించుచుండిన మసూరిక జ్వరములు హరించును.

2. తులసి, నేలవేము- సమభాగములు తెచ్చి కషాయము కాచి ఆ కషాయముతో హరతికర్పూరము 2 భా॥ కుంకుమ పువ్వు 2 భా॥, బాలింతబోలు 2 భా॥, ముసాంబ్రము- 2 భా॥- వీటిని మెత్తగానూరి శెనగగింజప్రమాణము మాత్రలుచేసి పూటకు ఒకటి నుండి రెండుమాత్రలు వంతున దినమునకు మూడుపూటలు సేవించిన మహామ్మారి హరించును.

3. తులసి, లక్క, వెదురాకు, ప్రత్తివిత్తులు, చిరుశెనగలు, యవపిష్టము, వస, బ్రహ్మి, అతివస, పొద్దుతిరుగుడు- వీటిని ఒకటిగ చేర్చి ధూపమువేసిన మసూరిక రోగము హరించును.

4. తులసీదళములు, వేపాకు, పసుపు, శొంఠి, తిప్పతీగ, వావిలిఆకులు, ములువెంపలి, మారేడు, నేలవేము, తక్కోలములు, లవంగపట్ట, లవంగపత్రి, వాయువిళంగములు, పర్పాటకము, కొత్తిమిరి, జీలకర్ర, అడ్డసరపు ఈనెలు, ఏలకులు- ఇవిసమభాగములు కూర్చి నూరి రసముపిండుకుని తగుమాత్రము సేవించుచుండిన మశూచి జ్వరములు శాంతించును.

5. తులసీదళములు, సరస్వతిఆకులు, వెదురాకు, వస, లక్క, ప్రత్తిగింజలు, శిరుశెనగలు, బాణ్లీబియ్యము- ఇవి సమభాగము మెత్తగాచూర్ణించి అందు కొంచెము ఘృతము కలిపి దానిని నిప్పులపై వేసి అందుండువచ్చు పొగను మశూచి రోగికి ధూపమిడిన మశూచి హరించును.

6. తులసీదళములు 7, మిరియాలు7, మంచికుంకుమపువ్వు 4గు.గి.ఎత్తు- వీటిని మెత్తగానూరి సుమారు 9 మాత్రలు చేసి ఎండుద్రాక్షలో పొదిగించి ఉదయము, సాయంత్రము ఒకటినుండి మూడుమాత్రల వంతున సేవించుచుండిన మశూచి పొంగులు పక్వమై జ్వరము తగ్గును.

## విషకాట్లు చికిత్స

1. తులసివేరును సానరాతిపై అరుగదీసిన గంధమును తేలు కాటుపై పట్టువేసిన విషము హరించును.

2. తులసీదళములు రెండుపిడికెడు గ్రహించి తినిపించవలెను. తులసి వేరును సాది గంధముతీసి వెన్నతో కలిపి కాటుపై వేయవలెను. ఆవెన్న నల్లబడిన దానిని తీసివేసి మరల తులసివేరు గంధమును వెన్నతో కలిపి వేయుచుండవలెను. ఇట్లు వెన్న నల్లగ కానంతవరకు వేయుచుండవలెను. పాముకాటుకుపైన గుడ్డతో కట్టుకట్టి కరచినచోట కత్తితో గీచి రక్తమును స్రవింప చేయవలెను. ఆ తారువాతనే పై చికిత్సచేయవలెను. పాముకాటు విషము హరించును. తులసీదళములను నమిలి పిండినరసమును వేడిగనున్నదానిని కంటికి కలికమువేసేది.

3. కృష్ణతులసీదళముల స్వరసము 2తు॥ చిర్రివేర్ల స్వరసము 2తు॥ పసుపుచూర్ణం 3తు॥ పాతబెల్లం 7తు॥ వీటినికలితో నూరి సేవించిన పామువిషముతీరును. ఆవుమజ్జిగ, అన్నము పథ్యము.

4. తులసి స్వరసముతో ఇంగువను నూరి తేలు కుట్టిన చోట పూసిన విషము హరించును.

5. మంచి తులసిదళములు, తుమ్మి ఆకులు- ఈరెండు సమభాగము ఒక టెంకాయ ప్రమాణము గ్రహించి రసము పిండి ఆ రసమును త్రాగినగుండెపోటు తగ్గి నాగుపాము కరచినవానికి విషము తగ్గును.

6. తులసి, తెల్లగంటెన, చిర్రికూర, ఉత్తరేణు, గుమ్మడి, అడవిమాదీ ఫలచెట్టు, విరిగి- వీని రసములచే పానము, నస్యము, అంజనములు చేయించిన 'రాజీమతు' అను సర్పవిషములందు హితము కల్గును.

7. తులసి పువ్వులు, మారేడువేర్లు, పసుపు, మానిపసుపు, త్రికటుకములు, త్రిఫలములు, క్రానుగవిత్తులు, గ్రంథితగరము, దేవదారు- వీటెని సమభాగములు గ్రహించి గొజ్జెమూత్రముచే మెత్తగా నూరి దానిని పానము, నస్యము, అంజనములుగ తగుమాత్రము వుపయోగించిన సాలెపురుగు, ఎలుక, తేలు, సర్పము మున్నగు వాటివిషములు, గరమనువిషము, అజీర్ణము, విషూచిక, జ్వరము, భూతగ్రహ బాధలు యివియన్నియు హరించును.

8. తులసిపుష్పములను, మాదీఫలపురసము, గోమూత్రము- వీనితోనూరి లేపనము చేసిన వృశ్చిక విషము హరించును.

9. తులసి పూగుత్తులు, చిన్నముత్తవపులగము, పెద్దముత్తవపులగము, వస, తవక్షీరి, గ్రంథితగరము, చిరుబొద్ధి, దుంపరాష్ట్రము, చెంగల్వకోష్ఠ, దిరిశెనము, పసుపు, మ్రానిపసుపు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, కామంచిపూరి, దింటెన, తెల్లదింటెన, అజామోదము, శిలాజిత్తు, యవక్షారము, కరిధూపము, మణిశిల- వీనిని గ్రహించి రోహీతకమనెడి చేపపిత్తముచే మెత్తగనూరి- నస్యము, అంజనము, లేపనము చేయించినచో కీటకముల విషములన్నియూ హరించును.

10. తులసి, మేకమలము, స్వర్జికాలవణము, యవక్షారము, శింభీభేదము వీటిని మదిరయనెడి మద్యము యొక్క తేటతోనూరి వుపయోగించినచో జెల్లీ విషము హరించును.

11. తులసి, అడ్డసరము, కొండిశెపాల, దిరిశెనపట్ట, త్రిఫలములు, త్రికటుకములు, నల్లకలువ, చందనము, పెద్దముత్తవపులగము, చిన్నముత్తవ పులగము, అడవిమల్లి, సుగంధిపాల, వేప, కలిగొట్టు, అందుగ, మంకెన, చాగ, కందులు, ఊడుగ, చిరుబొద్ధి, పెన్నేరు, జిల్లేడువేర్లు, పాపర, యష్టిమధుకము, పద్మకము, వాకుడు, పిల్లిపీచర, దేవకాంచనము, లక్క, జ్యోతిష్మతి, నేపాళపువేర్లు, ఉత్తరేణి, కోలపొన్న, తెల్లదింటెన, రసాంజనము, గొలిమిడి, దేవదారు, చెంగల్వకోష్ఠ, ప్రేంఖణము, నేలగుమ్మడి, యష్టిముధుకము, సారవృక్షము, కానుగవిత్తులు, పసుపు, మానిపసుపు, వస, లొద్దుగ- వీనిని ప్రతిదీ ఒక్కొక్క కర్షము గ్రహించి కల్కముచేసుకుని- ఉదకము, మేకమూత్రము, గోమూత్రము- ఇవిప్రతిదీ ఒక అఢకము, ఘృతము ఒక అఢకము, వీటినన్నింటిని కలిపి ఘృతపాకపక్వముగ కాచి దించి వడియ కట్టి భద్రపరచి, అందు తగుమాత్రము సేవించవలెను. మరియూ దీనిని అభ్యంగము, నస్యముగ, ఉపయోగించవలెను. ఇట్లు చేసిన యెడల విషములను హరించును. విషవేగముచే మృతి నొందుటకు సిద్ధముగనున్న వానినికూడ బ్రతికించును. ఈ మందు ఆపస్మారము, ఉన్మాదము, ఉదరము, పాండు, క్షయ, క్రిములు, గుల్మం, ప్లీహము, ఊరుస్తంభము, భూతబాధలు, గ్రహాభాదలు, గరవ్యాధులు మున్నగు వాటిని కూడ హరించును.

12. మంచితులసి లేక కృష్ణతులసిని దంచి తీసిన రసము ఒక ఔన్సు త్రాగించేది. తులసీదళములను మెత్తగనూరి శిరస్సు, ఉచ్చిపై, కత్తితో గీచి దానిపై నూరినముద్దను పెట్టి కట్టలెను. ఇందువలన పాముకాటులో కల్గిన మూర్ఛ గుణమగును, రసముత్రాగిన తరువాత వాంతి, బేదియగును. తరువాత కొంచెము తులసి రసమును సేవింపచేసి కాటుపై తులసివేరును నూరి పూయవలెను. ఇట్లుచేసిన విషము విరిగి సుఖము చెందును.

13. తులసి ఆకు, తేలుకొండి ఆకు, కాకరాకు- వీనిని సమముగ కలిపి రసము పిండి తేలుకుట్టిన చోటపూసిన విషము హరించును.

## మూలరోగ చికిత్స

1. తులసివిత్తులు, గజపిప్పళ్ళు, మిరియాలు- ఇవిప్రతిదీ ఒకపలము, శివనింబ2పలములు, శొంఠి 4పలములు, శుద్ధిచేసిన జీడిగింజలు 8పలములు కందగడ్డ 16పలములు, చిత్రమూలము, కరకవలుపు- యివిప్రతిదీ 5పలములు వీటినన్నింటిని రాతిరోటిలో వేసిదంచి చూర్ణించుకుని ఆ చూర్ణమునకు సమము మంచిబెల్లము చేర్చి దంచి వక్క-ప్రమాణము మాత్రలుచేసి భద్రపరచేది. పూటకు ఒక మాత్రవంతున 3దినములు 6పూటలు మజ్జిగతో సేవించేది. మూలము, మూలగ్రహణి, పౌత్రము, పాండు, సోమరోగము,గర్భరోగములు మున్నగునవి హరించును.

2. తులసీదళములు, గురుగింజవేరు-ఇవి సమభాగము గ్రహించి నూరి స్వరసము పిండుకుని సేవించిన మూలము తీరును. ఇదేస్వరసమును మూలముపై పూయవలెను.



# ఉన్మాదరోగము, అపస్మారరోగము, భూతబాధ చికిత్స.

1. తులసీదళములు 10, మిరియాలు10, సహదేవిచెట్టువేరు 15చిన్నముల ఎత్తు- వీటిని ఆదివారమునాడు స్నానమాచరించి ధూపదీపనైవేద్యములు యిచ్చి ఒక చిన్నగుడ్డలో గాని లేక రాగితాయెత్తులోగాని వేసి బిగించి భూతబాధకల్గిన రోగిమెడలో కట్టినయెడల హరించును.

2. తులసి, జటామాంసి, జిల్లేడుకాడలు, వెల్లుల్లి, కస్తూరి, హరిదళము, వస, త్రికటుకములు, ఇంగువ, తెల్లగరిక, నల్లవావిలి, ప్రేంకణము, బూరుగు, సర్పాక్షి, నవ్వులు, కాకోళి, క్షీరకాకోళి, నల్లేరు, అతివస, కరక్కాయలు, స్రోతోంజనము, తెల్లావాలు, గుగ్గిలము, మరియూ సింహము, పెద్దపులి, ఆవు, గుఱ్ఱము, గాడిద, ఒంటె, ఎలుగుబంటి, ముండ్లపంది, ఉడుము, ముంగిస- మున్నగు వాటిచర్మము, పిత్తము, దంతములు, గోళ్ళు- ఈద్రవ్యములన్నింటిని కల్కముచేసి పాతనేతిలోగాని, కొత్తనువ్వులనూనెలోగాని కలిపి తైలపాకపక్వముగ చేసి దానిని స్నానాభ్యంజన, నస్యములుగ వుపయోగించ వలయును. ధూపము వేయవలయును. లేపనముచేయవలయును. ఆ తరువాత స్నానము చేయించ వలెను. దీనివలన భూతబాధలు, ఉన్మాదము, అపస్మారము మున్నగు వాటిని పోగొట్టును.

3. తులసి, సర్వతియాకు, పిన్నపాపర, త్రికటుకములు, వాయువిడంగములు, జటామాంసి, ఇంగువ, సన్నరాష్ట్రము, మురయనుగ్రంధ్యము, చెన్నచెర్లగడ్డ, కరక్కాయలు, దూలగొండి, నాగదంతి, మాల్కంగుణి, వస, అతివస, వెల్లుల్లి, సౌరాష్ట్రికము- వీటిని సమభాగములుతెచ్చి ఏనుగు మూత్రముతో నూరి వర్తిచేసి నీడనఎండిచి-దానిని నస్యము, లేపము, ధూపము, అంజనములుగ ఉపయోగించిన ఉన్మాదము హరించును.

4. తులసి, తిప్పతీగ, వస, సన్నరాష్ట్రము, ఉల్లిపాయ, జటామాంసి, పసుపు, మరువము, ఇంగువ, త్రికటుకములు, వాయువిళంగములు, సర్వతియాకు, కరక్కాయ, చేదుపుచ్చవేరు, మాల్కంగుణివేరు, తమలపాకు, సుగంధిపాల, సౌరాష్ట్రమృత్తిక- వీటిని సమభాగములుగ్రహించి ఏనుగుమూత్రముతో మర్దించి వర్తిచేసి నీడన ఆరబెట్టి దానిని అంజనమునకు, అవపీడనస్యమునకు, అభ్యంగమునకు, ధూపమునకు, లేపనమునకు వుపయోగించినచో ఉన్మాదము నశించును.

5. తులసి, చెంగల్వకోష్టు, భూతకేశీ, గడ్డిదమనము, కరక్కాయ- వీనిని మూత్రముతోనూరి ఉద్వర్తనమును చేయించి మూత్రముచేతనే స్నానము చేయించ వలయును. ఇందువలన అపస్మారము నశించును.

6. తులసి, భావంచివిత్తులు, పాలకూర, పెన్నేరుగడ్డ, జిల్లేడుపాలు, చెన్నచెర్లగడ్డ, సైంధవలవణము- వీటిరసములు ప్రతిదీ ఒక్కొక్కభాగము గ్రహించి అందు ఉడుము, గద్ద- వీటి కొవ్వు ఒక్కొక్కభాగము కలిపి నువ్వులనూనెలో కలిపి కాచి అభ్యంగనము చేసిన ఉన్మంధకము అనురోగము శీఘ్రముగ హరించును.

## సుఖరోగ, మేహరోగ చికిత్స

1. తులసివిత్తులు 20గ్రా॥ రావివిత్తులు 30గ్రా॥ వీటిని వేన్నీళ్ళతో నూరి పుస్తికాయంత మాత్రలు చెసి ఆరబెట్టి భద్రపరిచేది. ఇందు ఒక మాత్రను ఆవుపాలలో కరిగించి ఉదయ సాయంత్రములయందు సేవించుచుండిన ఇంద్రియస్ఖలితము వలన వచ్చిన జ్వరము, అత్యుష్ణము మున్నగునవి శాంతించును.

2. తులసివిత్తులచూర్ణము 4గు. గి. ఎత్తు. తంబూలములో సన్నగా కత్తిరించిన పచ్చిపోకలు చేర్చి సేవించిన మగతనము హెచ్చును. భోగమునందు స్త్రీలు సంతృప్తి చెందుదురు. శీఘ్రస్ఖలనము హరించును. శరీరమునకు చెరుపు చేయదు. స్వప్నస్ఖలనము, మోహిని దోషములు హరించును.

3. తులసివిత్తులు చూర్ణముచేసినది, కర్పూరశిలాజిత్తు భస్మము, శృంగి భస్మము, -ఇవి సమభాగములు తులసి స్వరసముతో మెత్తగనూరి ఆరబెట్టి చూర్ణముగనైనను లేక పుస్తికాయంత మాత్రలుగచేసి ఆరబెట్టి భద్రపరిచేది. దీనిని 12గు. గి. ఎత్తు చూర్ణము లేక రెండుమాత్రలు రోజు 2పూటలు వెచ్చని నీళ్ళతో సేవించిన మేహ వ్యాధులు హరించును.

4. కృష్ణతులసి వేరు ఒక చిన్నముక్కను తాంబూలములో పెట్టి సేవించిన వీర్యమునకు స్తంభనము కలిగి ఆనందమును కలిగించును.

5. తులసివేరుపైపట్ట, కందగడ్డ- ఇవిసమముకలిపి మెత్తగనూరి శెనగలంత మాత్రలుచేసి అందొకమాత్రను తాంబూలములో పెట్టి సేవించిన, వీర్యవృద్ధి, స్తంభనము కలుగును.

6. తులసిగింజలు 3తు॥ నల్ల నేలతాడి గడ్డలు 3తు॥ ఈరెంటిని చూర్ణముచేసుకొని పూటకు అరతులము వంతున దినమునకు రెండుపూటలు ఆవుపాలతో సేవించిన కామశక్తి వృద్ధిచెందును.

7. భూతులసి గింజలు, అగస్త్యచెట్టుజిగురు, గొలిమిడిగింజలు- వీటిని ఆవు లేక మేకపాలతో నూరి శెనగలంత మాత్రలుచేసి పూటకు రెండుమాత్రలు వంతున ఉదయ, సాయంత్రములందు సేవించిన శుక్రనష్టము హరించును.

8. భూతులసివిత్తులు 1 / 4 భా॥ పటికబెల్లం 1 / 2 భా॥ ఈ రెంటిని పొడిచేసి పాలలో నానబెట్టి ఆపాలతోనే మెత్తగనూరి పాలలోకలిపి సేవించుచుండిన శుక్రము స్తభించును.

9. తులసివేరును నీటితో అరగదీసిన గంధమును రాత్రిపూట రాహస్యాంగమునకు లేపనముచేసుకొనినచో సంభోగ శక్తి వృద్ధిచెందును.

10. తులసి 10భా॥ నాగకేసరములు 2భా॥ కలకండ 50భా॥ పురాతనతేనె 50భా॥ పైనాటిని మెత్తగ చూర్ణించుకుని తేనెలో కలిపి ఒక రోజువుంచి గ్రహించి చక్కెరను పాగుగకాచి ఆరిన తరువాత పై తేనె కలిపిన చూర్ణమునుపోసి అందు జాపత్రి, కేసరి, ఏలకులు యివి ప్రతిదీ ఒక్కొక్క భాగము పొడిచేసి కలిపి ఒక బుడ్డిలో భద్రపరిచేది. 1లేక 2తు॥ చూర్ణమును శరీరబలము ననుసరించి చక్కెరకలిపి ఆవుపాలతో సేవించిన శుక్రమేహము, ఇంద్రియము నీరైయుండుట మున్నగునవి హరించును. పథ్యమైన ఆహారము సేవించవలయును. స్త్రీసంభోగము చేయరాదు.

11. తులసీదళములు, నల్లవుమ్మెత్తాకు, గాడిదగడపాకు, - యివి సమంనూరి పట్టువేసిన అడ్డగర్రలు హరించును.

12. తులసీదళములు, పంచదార-సమభాగములు నూరి ఆవునేతితో దోరగవేయించి కాకిదొండాకురసము పోసినూరి లేహ్యమువలె గట్టిగ అగునపుడుతీసి భద్రపరచుకుని, పుసిరికాయ ప్రమాణము సేవించుచుండిన వీర్యనష్టము హరించును.

13. తులసీదళములు నీడన ఎండించినది, పెన్నేరు, మెంతులు, - ఇవి సమభాగములు చూర్ణించి ఒకటిగ కలిపి మూడువేళ్ళలో పట్టునంత చూర్ణమును ఆవుపాలతో సేవించుచుండిన మేహరోగములు హరించును.

14. తులసిదళములు, కర్పూరము, చీనాకలకండ- ఇవిసమఎత్తు చేర్చిమెత్తగ నూరి చల్లని నీళ్ళతో కలిపి శయనించుటకు ముందు సేవించుచుండిన స్వప్న స్ఖలితము హరించును.

15. రుద్రజడ ఆకునునూరి గచ్చకాయంత సేవించిన మేహపుదగ్గు, ప్రవర్తి హరించును.

16. తులసీదళస్వరసముతో కూడ వంగభస్మమును కలిపి సేవించుచుండిన ప్రమేహరోగములు నయమగును.

17. శివతులసిఆకుతెచ్చి మెత్తగనూరి గొంటు వక్కప్రమాణము సేవించుచుండిన మేహరోగములు, దగ్గు, ఉదరరోగములు హరించును. దీనిస్వరసమును చెవిలో పోసిన నొప్పితీరును.

18. తులసీదళముల స్వరసము ఒకశేరు, మంచినువ్వులనూనె 1 / 2 శేరు--ఈ రెంటిని కలిపి వేకువజామున తగుమాత్రము సేవించుచుండిన మేహవెట్ట తీరును.

19. తులసిగింజలను సకలదేవప్రియతో చేర్చి సేవించిన వీర్యస్తంభనమగును.

20. మంచితులసిఆకు స్వరసమును గ్రహించి అందు పంచదారను కలుపుకొని సేవించిన పచ్చసెగలు హరించును.

21. మంచితులసిఆకు స్వరసముతో ముద్దహారతి కర్పూరము, శుద్ధిచేసి పోగించిన మడ్డివెలిగారము, పచ్చకర్పూరము - ఇవి సమభాగములు గ్రహించి మెత్తగనూరి రేగుగింజంత మాత్రలు చేసుకొని వ్యాధికి తగినట్లు ఒకటి రెండు మాత్రలు సేవించుచుండిన పచ్చసెగలు హరించును.

22. తులసివేరుపైబెరడు, నేరేడువేరుపైబెరడు, వేపవేరుపైబెరడు, శీకాయవేరుపైబెరడు, కానుగవేరుపైబెరడు- ఇవిసమభాగములు తెచ్చి మెత్తగ చూర్ణించి అందు జీలకర్ర, రాతినార-సమభాగములు ఈ రెంటిని మెత్తగచూర్ణించి పైచూర్ణముతో కలుపుకుని పూటకు 1/4 తు॥ మంతున 15 దినములు సేవించిన మూడురకములైన సెగలు హరించును. మందుసేవించినవెంటనే ఆవుమజ్జిగను త్రాగవలయును. ఉప్పు, కారము వర్జ్యము.

23. శివతులసివిత్తులు 2 భా॥ వట్టివేర్లు 1 భా॥ తుంగగడ్డలు 1 భా చలువమిరియాలు 1 భా॥ పటికారము 1 భా॥ సురేకారము 1 / 4 భాగము - వీటిని శుభ్రపరచి మెత్తగ చూర్ణించి దీనికి రెండింతలు చక్కెర చేర్చి మెత్తగానూరి పూటకు 1 / 2తు॥ వంతున రోజుకు రెండు పూటలు 10 దినములు సేవించిన ఎంతటి సెగలైనను హరించును.

24. రుద్రజడవిత్తులు, ఉసిరికవలుపు, రేవల్‌చిన్ని, మిరియాలు, మంచి గంధపుపొట్టు- వీటినిమెత్తగచూర్ణించి పూటకుబేడఎత్తువంతున దినమునకు రెండు, మూడుపూటలు చక్కెరచేర్చి10 దినములు సేవించిన పూరాతన సెగరోగములు హరించును.

25. మంచితులసీదళముల రసముతో శొంఠి, కరకవలుపు, ఏలకులు ఇవి ఒకభాగము శు॥ రసకర్పూరము, శు॥ వంశలందా ఇంగ్లీకము, శు॥ పాదరసము, శు॥ రసశిందూరము- ఇవి అర్ధభాగము, వీటిని మెత్తగ8 జాములు నూరి పెసరగింజంత మాత్రలుచేసుకుని అందు రోజుకు 3పూటలు, పూటకు ఒక మాత్ర వంతున ఆరుపూటలు సేవించవలెను. దీనిసేవనవలన సర్వసెగలు హరించుటయేగాక సర్వసవాయిరోగములు హరించును.

పథ్యము:- ఉప్పువాడరాదు. తాలింపు చేయునివట్టి శెనగగుగ్గిళ్ళు, చప్పిడిఅన్నము, కాచి చల్లార్చిన నీళ్ళు వాడవలయును. పట్లకురావచ్చును కానీగుణమునిచ్చును.

26. మంచితులసి ఆకురసముతో శు॥ సీమజంగాలపచ్చ, శు॥ పాదరసము, శు॥ రసకర్పూరము, శు॥ రససింధూరము, హారతి కర్పూరము-ఇవి సమభాగము చేర్చి మెత్తగనూరి రేగుగింజంత మాత్రలుచేసి పూటకు ఒకమాత్ర చొప్పున రోజుకు రెండు పూటలు 7 దినములు సేవించిన సర్వసవాయిలు హరించును.

పథ్యము:- కందికట్టు, అన్నము.

27. మంచి తులసి ఆకు స్వరసముచే శుద్ధిచేసిన గంధకము శు॥ పాదరసము, శు॥ రససింధూరము, శు॥ రసకర్పూరము శు॥ ఇంగ్లీకము-ఇవిసమభాగము తెచ్చినూరి అందు శొంఠి, జీలకర్ర, వాయువిడంగములు, లవంగములు, చక్కెర ఇవి ప్రతిదీ అర్ధభాగము చూర్ణించి వీటినన్నింటిని మరల నిమ్మపండురసముతో 8 జాములు, తేనెతో 8 జాములు నూరి మరల తులసిస్వరసముతో 8 జాములు నూరి చిరు శెనగలంతమాత్రలు చేసుకొని పూటకు ఒక మాత్రవంతున రోజుకు

రెండు పూటలు 7 దినములు సేవించిన సర్వసుఖవ్యాధులు తప్పకహరించును. పథ్యము కఠినముగా యుండవలయును. వరి అన్నము, కందికట్టు, వేయించిన ఉప్పుతప్ప వేరేదియు వాడరాదు.

28. తులసీదళములు 1 భా॥ దొండాకు 1 భా॥ తమలపాకు తొడిమెలు 1 భా॥ శు॥ గంధకము 1/4 భా॥ శు॥ రసభస్మం 1/8 భా॥ మిరియాలు 1/8 భా॥ పాతబెల్లము 3 భా॥ వీటిని ఖల్వములో మెత్తగనూరి కుంకుడుగింజ ప్రమాణము మాత్రలు చేసి పూటకు ఒకమాత్రవంతున దినమునకు రెండు పూటలు 15 దినములు సేవించవలెను. ఇచ్ఛాపథ్యము. దీనివలన కురుపు, సవాయి హరించును.

29. శివతులసి విత్తులు అర్థభాగము, ఏలకులు 1/4 భా॥ జాజికాయ 1/4 భా॥ చక్కెర 1/2 భా॥ ఇందు శివతులసి గింజలను ఆవుమజ్జిగతో నానబెట్టి ఆతరువాత తక్కినవాటిని వేసి మెత్తగనూరి పూటకు మాడ ఎత్తువంతున సేవించిన ఎర్రసెగ, మంట, హరించును.

30. రుద్రజడ విత్తులు 1 భా॥ గొబ్బివిత్తులు 1 భా॥ పెన్నేరుదుంప 1 భా॥ యష్టిమధుకము 1 భా॥ కుంకుమ పువ్వు 1 భా॥ పంచాదార 2 భా॥- వీటిని మెత్తగ చూర్ణించి ఆవునెయ్యితో మర్దించి పూటకుగెచ్చకాయంత తేనెలోకలిపి సేవించిన సెగరోగము హరించును. ఇచ్ఛాపథ్యం.

31. తులసీదళములు 4 భా॥ శు॥ మైలతుత్తము 1 భా॥ మెత్తగనూరి రేగుగింజలంత మాత్రలుచేసి అందు ఒకమాత్ర ఉదయముననే వేడినీళ్ళతో సేవించిన సెగరోగములు హరించును. కఠినపథ్యము.

32. రుద్రజడవిత్తుల చూర్ణము, వంగభస్మము- సమభాగములు కలుపుకొని పంచదారతో పూటకు 1/4 తులము వంతున రోజాకు మూడుపూటలు 10 దినములు సేవించిన సెగరోగములు హరించును.

33. భూతులసివేరు, పొన్నగంటివేరు, తెల్లదింటెనవేరు, చవ్యము, పిప్పలికట్టె- వీటిని సమభాగము చూర్ణించి పూటకు పావుతులము వంతున 3 పూటలు సేవించిన ఎర్రసెగహరించును.

34. తులసి, తుత్తి, బిల్వం, సరస్వతి, గుంటగలగర, బ్రహ్మి, బొక్కెన మడ్డిచెట్టు, కానుగ, దింటెన-వీటి ఆకురసములు ప్రతిదీ 1/4పడి, ఆముదమ ఒక పడి, కరక్కాయ, తాణికాయ, శొంఠి, పిపళ్ళు, దుంపరాష్ట్రము, ఓమము వస, కస్తూరి పసుపు-ఇవి ప్రతిదీ 1/2 పలం, జాజికాయ 1/8ఫలము, వీటిని పొడిచేసి వేసి పక్వముగకాచి దించి వడియకట్టి బిడ్డలకు చిన్నచెంచా ప్రమాణము, పెద్దలకు, కాల్‌పలము ప్రమాణమువంతున ఏడుదినములు ఇవ్వవలయును. ఇచ్ఛాపథ్యము, మేహవుడుకు, నల్లగ్రంథి, అత్యుష్ణములు హరించును.

35. తులసిఆకుపసరు, పత్తిఆకుపసరు, తమలపాకుపసరు, నేలములక పసరు, వరికడుగు, వీటితో-శుద్ధిచేసిన రసకర్పూరము ఒకతులమును ప్రత్యేక ముగా వేరువేరుగనూరి సూర్యపుటంవేసి దానితో పిప్పళ్ళు, మిరియాలు, మోడి, జాపత్రి, జాజికాయ, లవంగాలు, ప్రతిదీ ఒక్కొక్కతులము వేసిమెత్తగా నూరి రేగు.గింజలంత మాత్రలు చేసి దినముకు ఒక మాత్రవంతున నెయ్యితో సేవించిన ఏడుదినములకు చర్మి, పొక్కుసవాయి మున్నగునవి మానును. **పథ్యము:** కందిపప్పు, నెయ్యి, అన్నము 12 దినములు, ఈపథ్యము తరువాత వేయించినవుప్పు,పప్పులో కొంచెమువేసేది. వేడినీళ్ళువాడేది.

36. తులసి, బిల్వము, ఉప్పి, సరస్వతి, బొక్కెన, గుంటగలిజేరు, కామంచి బ్రమి, తుత్తి, తొగరు, కానుగ-వీటి ఆకుల రసము ప్రతిదీ 1/4 పడి, చిట్టాముదము ఒక పడి-తాణికాయ, కరక్కాయ, శొంఠి, పిప్పళ్ళు, దుంప రాష్ట్రము,ఓమము, వస, కస్తూరిపసుపు-ఇవిప్రతిదీ 1/2 పలము, జాజికాయ 1/8 పలము- వీటి నన్నింటిని చూర్ణముచేసుకుని పైసరకులు అన్నింటిని ఒకటిగకలిపి పొయ్యిపైబెట్టి మైనపదముగకాచిదించి వడియకట్టి భద్రపరచు కునేది. ఇందుపెద్దవారికి కాల్‌పలము బిడ్డలకు ఒకచిన్నచెంచాడు వంతున 7దినములు ఇచ్చేది. ఇచ్ఛాపథ్యము. దీనివలన నల్లగ్రంథి, మేహవెట్ట, అచ్చురము, ఉష్ణము మున్నగు వ్యాధులు హరించును.



# స్త్రీరోగ చికిత్స

1. తులసివేరు 1పిడికెడు, పెద్దముత్తవపులగమువేరు 1పిడికెడు, వావిలివేరు-1పిడికెడు, కొండపిండిచెట్టువేరు-అరచేతి గుంతలో పట్టునంత-వీటిని బాగుగా కచ్చాగాదంచి 2పడి నీళ్ళలోవేసి పొయ్యిపైబెట్టి అష్టావభాగ కషాయముగకాచి, అందు కరకవలుపు-10పలములు, శుద్ధిచేసిన తెగడవేరు 2పలములు, కటుకరోహిణి 2ప॥ చూర్ణము చేసినదానిలో 5వేళ్ళలో పట్టునంతచూర్ణమువేసి, పొంగించిన వెలిగారము పొడి రెండు గురిగింజెత్తు చేర్చి వ్యాధిగ్రస్తురాలికి సేవించుట కిచ్చిన బాగుగ విరేచనమగును. గర్భిణీరోగములు హరించును. వాపుతగ్గును. మరుదినము నువ్వులనూనె ఒక తవ్వ, గంటగలిజేరురసము ఒకతవ్వ మిరియములుదంచినది-1పిడికెడు-వీటిని కలిపి పొయ్యిపైబెట్టి తైలపాక పక్వముగ కాచి దించుకుని దానిని శరీరముపై లేపనము చేసుకుని వేన్నీళ్ళతో బాగుగ స్నానముచేసిన పలువిధములైన గర్భిణీ వ్యాధులు తీరును. ( అనుభవసిద్ధ యోగము)

2. తులసివిత్తులను నీళ్ళతోనూరి, బహిష్టుకాలమున 3 దినములు సేవించిన గర్భాశయము శుద్ధమై గర్భధారణము కల్గును.

3. తులసి స్వరసమును సేవించిన ప్రసవవేదన హరించును.

4. నల్లతులసిని వుదయసాయంత్రములయందు కొంచెము సేవించుచుండిన బహిష్టుసరిగా ఏర్పడని దానిని హరించును.

5. తులసిచెట్టును (నోరుతెరవకుండ, మాట్లాడకయుండి) కుడిప్రక్క ప్రదక్షిణముచేసి సూర్యుని ఎదుటనిలబడి మూడుదళములు తీసి ఎదుటవేసి ఒకపిడికెడు దళములను తీసుకుని, చిన్న చీమలు కొంచము, మునగపిందెలు, మిరియాలు, తెల్లనినీరుల్లిపాయ- వీటినిచేర్చి నూరి వెచ్చని నీటిలో కలిపించుచ్చేది. శరీరముపై కూడ పూయవలెను. ఇట్లుచేసిన గర్భముధరించుదురు. ఇది అనుభవసిద్ధమైనయోగము.

6. తులసి వేరును మెత్తగానూరి నీటియందు కలిపి త్రాగిన యోని శూలహరించును.

7. తులసి సమూలము, పెద్దముత్తవపులగము వేరు-ఈ రెంటినిదంచి కషాయముకాచి పాలు, నువ్వులనూనెచేర్చి అందు కటుకరోహిణి, కొత్తిమిరి,

కోష్టు, విడంగములు, విషబొద్ది, దుంపరాష్ట్రము, గంటుభారంగి త్రికటుకములు - ఇవిసమభాగము నూరి పైకషాయములో కరిగించి వడియకట్టి సేవించినగర్భిణులకు వచ్చు జ్వరము, సర్వాంగశూల, ఎడమప్రక్క తలనొప్పి-మున్నగునవి హరించును.

8. ఎర్రతులసిని రెండు పచ్చివక్కల ప్రమాణము నూరి వుదయముననే బహిష్టు అయిన రోజునుండి 3రోజులు సేవించవలయును. ఇట్లు మూడు మాసములు సేవించిన ఋతుక్రమము సరిగలేనివారికి ఋతుక్రమము సక్రమముగ అగునట్లు చేయును.

9. కృష్ణతులసి, నేలతులసి, నేలగొలిమిడిఆకు, కాశాకు, బొక్కెనాకు, బుడ్డకాకర ఆకు, భూతులసి, గంగరావిపువ్వు, వల్లేరాకు, పెద్దహంసపాదిఆకు, నేలగుమ్మడి ఆకు, బుడ్డతక్కాలిఆకు, కర్పూరవల్లిఆకు, - ఇవిప్రతిదీ 3పలములు, మిరియాలు, శొంఠి, కస్తూరి, కుంకుమపువ్వు, జాపత్రి, పరంగిచెక్క, గసాలు, ఏలకులు, గోరోజనము, జాజికాయ, మాచికాయ, శు॥ ఇంగ్లీకము, శు॥ రసకర్పూరము- ఇవిప్రతిదీ 3వరహాలఎత్తు- మాధీపలములు 2, ద్రాక్ష 3పలములు, చీనీపండ్లు2, ఖర్జూరపండ్లు3 - ఈసరకులన్నిటిని గ్రహించి బాగుగా ఎండించి కావలసినవాటిని ఎండించి దంచిపొడిచేసి వస్త్రగాలితముచేసిపెట్టుకునేది. ఇందు గోరోజనము, ఇంగ్లీకము, రస కర్పూరము, కస్తూరి- మున్నగువాటిని పత్యేకముగ మెత్తగనూరి కలుపుకునేది. ఒకచట్టినిపొయ్యిపై బెట్టి, అందు ఆముదము ఒకవీశె, లేతకొబ్బరినీళ్ళు 2పడి, ఆవుపాలు 2పడి, పుల్లనికాడి 2పడి, ఈతకల్లు 2పడి, అత్తికల్లు 2పడి- వీటిని పోసి బాగుగాకాచి తైలపక్వమువచ్చినతరువాత దించుకుని వేడిమీదనే పైచూర్ణములు అన్నింటిని వేసి కలిపి మరలపొయ్యిపైబెట్టి రెండుమూడు పొంగులు రానిచ్చి దించుకుని బాగుగ ఆరినతరువాత కస్తూరి, గోరోజనము, రసకర్పూరము, ఇంగ్లీక చూర్ణములమపోసి బాగుగాకలియబెట్టి సీసాలో భద్రపరచేది. ఈ తైలమును ఒక చిన్నగరిటెడుగ్రహించి వెచ్చని పాలతో స్త్రీ, పురుషులు ( భార్యా- భర్తలు) సేవించవలయును. ఒకమండలము రోజులు సేవించిన సకలవ్యాధులు, గర్భదోషములు, హరించి గర్భముధరించును. ఇచ్ఛాపథ్యము.

10. [illegible] ...ంటినీ సమముగ చేర్చి ఒక పిడికెడుగ్రహించి కాడు పోసినూరి బొడ్డుకుక్రింద అడుగుకడుపుపై పూసిన సుఖప్రసవముగును.

11. తులసిరసము 1 భా॥ మారేడాకురసము 1 భా॥ చేదుపుచ్చకాయలరసము 2 భా॥ చిట్టాముదము 2 భా॥ వీటినన్నిటిని కలిపి సన్ననిమంటలో మైనపక్వముగ కాచిదించిన వెంటనే వేరుపాత్రలో పోసి అందు (1) బాగుగశుద్ధిచేసి, చేసిన తాళకభస్మము 3 గ్రా॥ (2) బాగుగాశుద్ధిచేసి. చేసిననాగభస్మము 3 గ్రా॥ (3) బాగుగశుద్ధిచేసి, చేసిన శృంగిభస్మము 5 గ్రా॥ వేసి బాగుగాకలిపి భద్రపరచేది. ఇందు 5నుండి 10చుక్కలవరకు, ఆవుపాలు లేక వేన్నీళ్ళలో ఇచ్చిన బాగుగబేది యగును. మొదటకొంచెముగ యిచ్చి ఆతరువాత చుక్కలను అధికపరచవచ్చును. ఈవిధవుుగ ఒకదినవుు నుండి వుూడుదినవుులు ఇచ్చేది. దీని వలన కడుపులోయుండు కృములు పూర్తిగ నశించి బయటకువచ్చివేయును. స్త్రీల సూతికాశూలతీరును. కఫమువచ్చివేయును.

బిడ్డలులేనివారికి: బహిష్టు అయిన నాల్గవరోజు ఒకేరోజు యిచ్చేది. మరుసటి నెల గర్భముధరించును. ఒకవేళతప్పిన మరుసటినెలకూడా యిచ్చేది. తప్పక భర్తసంయోగముచే గర్భము ధరించును. బిడ్డలకు 2నుండి 4చుక్కలవరకు వయస్సు, బలము అనుసరించి యిచ్చిన కృములవలన కలుగు మాందరోగము గుణమగును. వారమునకొక దినమువంతున 3 వారములు ఇచ్చేది.

12. తులసివేర్లు, వెలగవేర్లు, కానుగవిత్తులు- ఇవి సమభాగము ఆవుపాలతో మెత్తగనూరి గర్భవతికి నాభి, పాదములు, హస్తములు వీనియందు లేపనముచేసిన గర్భాశయంవుునందుం అడ్డుపడియుుండుం శిశువునుం సుఖవుుగ ప్రసవించునట్లుచేయును.

13. తులసిరసము 2 భా॥ పచ్చిమొక్కజొన్నలరసము 2 భా॥ తేనె1 భా॥ వీటిని ఒకటిగచేర్చి ప్రతిదినము వుదయమున ఒకవారము దినములు సేవించిన స్త్రీలకు చనుపాలు శుద్ధమగును.

14. కృష్ణతులసి ఆకులు- 1 పిడికెడు; నల్లేరుకాడలు- 4 వేళ్ళప్రమాణము; తెల్లగడ్డ- 5 రేకులు; జిల్లేడుఆకు- 1; మఱ్ఱిచిగుర్లు- 2 చిగుర్లు; తెల్లతామర మధ్య భాగము( గింజ) - 3 పువ్వులది; నువ్వులనూనె 1 / 8 లీ., చిట్టాముదము1 / 4 లీ., దీపనూనె 1 / 4 లీ., పైవస్తువులను మెత్తగనూరి పైనూనెలలోకలిపి ఒక చట్టిలో పోసి కట్టెలపొయ్యిపైబెట్టి తైలపధముగకాచి దించి భద్రపరచుకునేది. అధిక రక్తస్రావము, పొత్తికడుపునందలి బాదలు, పొత్తికడుపునొప్పి ( బుుతుశూల) మున్నగువాటికి ముట్టుఅగుటకు ముందు 10 దినవుులు ఈతైలవుును పొత్తికడుపు, నడుము మున్నగుస్థలములందు పైపూతగ ఉపయోగించిన

# శిశురోగ చికిత్స

1. తులసీదళములు 10 దింటిని ఆవుపాలలో వేసికాచి రోజుయిచ్చుచుండిన శ్లేష్మవుత్పత్తిని నివారించి జీర్ణశక్తిని పెంచును. బలము, చురుకుదనము కలిగించును.

2. బిడ్డ పుట్టిన పదకొండవదినము, తులసీదళములతో పచ్చిఉల్లిపాయలుచేర్చి అరచేతిలో బాగుగానలిపి ఆముదపునూనెలో వూరబెట్టి పొయ్యిపై బెట్టికాచి వెచ్చగ యున్నపుడేవడియకట్టి యిచ్చిన బిడ్డలకు మంచిచేయును. రోగనిరోధక ముగ పనిచేయును.

3. తులసీదళములు, తెల్లనినీరుల్లిపాయలు, దుందిలపుచెక్క, వస-ఇవిసమ భాగముతెచ్చి దంచిపిండి వడియకట్టి బిడ్డలకు పోసిన అత్యుష్ణము, అత్యుష్ణ మాందము హరించును. ఈరోగమునందు బిడ్డయొక్కహృదయము చిన్నదగును. నోరుఎండిపోవును. జ్వరతాపముకానును. అప్పుడప్పుడు కంటిలో పుసికట్టును. నాలుక ఎండిపోవును. స్వరభంగముండును. బిడ్డఏడ్వలేని స్థితిలో యుండును.

4. తులసిగింజలు, పిప్పళ్ళు, తవాక్షీరి, కర్కాటకశృంగి, చిన్నముత్తవపులగము, నాగకేసరములు, అతివస, నాగరముస్తెలు, పొంగించినఇంగువ, వాయువిళంగములు, ఇవిసమభాగములు గ్రహించి చూర్ణించి తులసిస్వరసముతోనూరి పెసలు ప్రమాణము మాత్రలుచేసి ఆరబెట్టి భద్రపరచేది. పూటకు ఒకమాత్రవంతున దినమునకు మూడుపుటలు తగుఅనుపానముతో సేవించిన పిల్లల జ్వరములు, దగ్గులు, విరేచనములు మున్నగు సర్వవ్యాధులు-నాలుగైదు దినములలో హరించును.

5. తులసీదళములను కావలసినంతగ్రహించి ఒకవెడల్పుమూతిగలకుండలో పాలు-నీళ్ళు సమము కలిపి పోసిమూతికి గుడ్డవాసెనకట్టిదానిపై తులసీ దళములను పరచి పైనచట్టిమూసి పిట్టువలెవుడుకబెట్టి తీసి రసముపిండుకుని అందు తగుమాత్రము సరిపోవునంత గోరోజనము కలిపి అప్పుడుపుట్టిన బిడ్డమొదలు అన్నివయస్సుల బిడ్డలకు యిచ్చుచుండిన సకలవ్యాధులు రాకుండా కాపాడును. ముఖ్యముగ జలదోషము, దగ్గు, శ్లేష్మముఘనీభవించుట, మాందము, గర్భవుష్ణము, గణమాందము, ముక్కుదిబ్బడ, ఈడ్పు, జన్ని దోషము, చిన్నబిడ్డల వాతము-మున్నగు వ్యాధులు రాకుండాకాపాడి ఆరోగ్యమును చేకూర్చును.

6. తులసి, కుక్కతులసి, నూగుదోస-ఇవిప్రతిదీ ఒక పిడికెడు; గంటు భారంగి, తాళిసపత్రి, సన్నదుంపరాష్ట్రము, శొంఠి, పిప్పళ్ళు- ఇవిప్రతిదీ 2 గ్రా॥ వీటిని అన్నిటిని దంచి రెండు ఆళాకుల నీళ్ళలోవేసి 1 / 4 ఆళాకు మిగులునట్లు యిగరకాచి దించి వడియకట్టి, పూటకు ఒకచెంచా కషాయముయిచ్చేది. దినమునకు రెండుపూటలు వంతున వారము, పదిరోజాలుయిచ్చేది. ఇందువలన బిడ్డలతలపై వచ్చుపుండ్లుగుణమగును. తుత్తి ఆకును నీడన ఎండించి దానిని వుడుకు నీళ్ళతోనూరి పుండ్లపై లేపనముచేయవలెను.

7. తులసీదళములు, కాకరాకు- యివిసమభాగముగ్రహించి స్వరసముతీసి దానిలో ఎఱ్ఱతేలు భస్మమునుసూదివెనకు వచ్చినంత ప్రమాణమువేసి త్రాగించిన చంటిబిడ్డల అపస్మార రోగముహరించును.

**తేలుభస్మము:**– మంచి ఎఱ్ఱనితేలును ఒకదానినితెచ్చి ఒక చిన్నదుత్తలో వేసి పైమూతమూసి చీలమన్నులేపనముచేసి బంధించి తగుమాత్రము చిన్నపుటముపెట్టి తీసిన భస్మముగును.

8. తులసి, వావిలి, నూగుదోసాకు-ఇవిప్రతిదీ ఒక పిడికెడుతెచ్చి పిట్టుబెట్టి నలిపి రసముపిండుకుని అందు 1 / 4 లేక 1 / 2 టీ-చెంచాప్రమాణము రసము బిడ్డలకిచ్చిన గణమాంద్యము హరించును.

9. కుక్కతులసీదళములస్వరసమును కొంచెము పొంగించుకుని అందు కస్తూరి మాత్రలు లేక గోరోజనమాత్రలు చేర్చి వయస్సునకు తగినంత1 / 4 లేక 1 / 2 టీ-చెంచాప్రమాణము యిచ్చిన బిడ్డలకు పచ్చు మాంద్యము, జ్వరము, దగ్గు- ఇవి హరించును. జ్వరమునందు చేతులు, కాళ్ళు చల్లబడినపుడు కుక్కతులసి ఆకులను నూరి చేతులు, కాళ్ళకు, వ్రేళ్ళకు, దళముగా పూసియుంచిన మరల శరీరములో ఉష్ణము పుట్టును.

10. తులసి, ఎఱ్ఱముండ్లతోటకూర, తుమ్మి, కుక్కతులసి, వాయింట-వీటి ఆకులు నల్లజీలకర్ర- ఇవిసమభాగముచేర్చి, నిప్పుసెగను వాడ్చిరసముపిండుకుని సేవించిన బిడ్డలకువచ్చు ఉబ్బుమాంద్యము హరించును. ఇదిబిడ్డలకు కల్గుమాంద్య రోగములలో ఒకటి.

11. కుక్కతులసి, బొక్కెన, త్రికటుకములు, గలిజేరు, అటుకమామిడి, జీలకర్ర- ఇవిసమభాగముగ్రహించి దంచి నీళ్ళలోవేసి కషాయము కాచియిచ్చిన, బిడ్డలకు వచ్చు అమజన్నితీరును.

12. కృష్ణతులసీదళముల చూర్ణము, వసచూర్ణము-ఈరెంటినికలిపి తేనె అను పానముతో యిచ్చిన బాలుర అరిష్టము నివర్తియగును. (బాలారిష్టము)

13. తులసి, పెద్దతుమ్మి, బొక్కెన, నీరుసాంబ్రాణి, అగస్త్య, తుత్తి, మెగభీర- వీటి ఆకులను, సమభాగముగ్రహించి దంచి పిండిన రసము 1/4 పడి, పచ్చిపసుపురసము ఒక అళాకు, ఆముదము 1/2 పడి- వీటిని ఒకటిగ కలిపి అందు ఓమము, తాబేలుచిప్పకాల్చిన బూడిద, వెల్లుల్లి, వస- ఇవి ప్రతిదీ 1/4 పలము దంచి వేసి తైలపాకపక్వముగ కాచిదించి వడియకట్టి- అందు దుడ్డెత్తునూనెలో పొంగించిన వెలిగారము, ఇంగువ- ప్రతిదీ 3గు.గి. ఎత్తు పొడిచేసికలిపి సేవించుచుండిన మాందరోగము, ఉబ్బురోగము, శూల, సెరియామాందము అను బాలరోగములు హరించును.

14. తులసి, కుక్కతులసి, నందివర్ధనము, తెగడ, అడవిమల్లి, ముండ్లవుచ్చింత తీగె - వీటి వేర్లనునూరినది ప్రతిదీ ఉసిరికకాయంతగ్రహించి మరియూ వాకుడు, ముండ్లవుచ్చింతతీగె, కామంచి, విత్తుబోడతరము, కుప్పింట, కోడిచిక్కుడు, చిన్నిచెట్టు- వీటిని సమముగ్రహించి దంచి పిండినరసము 1/2పడి, ఆముదము ఒకపడి, వీటినన్నింటిని ఒకటిగ కలిపి తైలపాకపక్వముగ కాచి దించివడియకట్టి భద్రపరచేది. ఇందు దుడ్డెత్తుయిచ్చిన సుళ్ళిమాందము హరించును.

15. తులసి, ముండ్లఉచ్చింతతీగ, అతిమధురము, కరక్కాయ, తాణికాయ, శొంఠి, విష్ణుక్రాంతి వేరు- ఇవిప్రతిదీ 1/4పలము, నేలవుసిరికరసము 1/8పడి, ఆవుపాలు ఒకపడి, ఆముదము ఒకపడి- వీటిని సేకరించి పైసరుకులను లేతకొబ్బరి నీళ్ళతో నూరికలిపి పొయ్యిపైబెట్టి పక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరచేది. దీనిని రాత్రిపూట ఆహారము సేవించిన తరువాత ఒకచెంచా ప్రమాణము నూనెను యిచ్చిపడుకోబెట్టేది. ఉదయమునబేదియగును. అతరువాత-ఈనూనెను కాసెత్తుసేవించుచుండిన వరట్చిమాందము అను వ్యాధి హరించును.

16. తులసి, కాచాకు, తుత్తి, సాంబ్రాణి, మారేడు, వల్లేరాకు, గుంటగలగర, బొక్కెన, మడ్డిచెట్టాకు, కానుగ, శంఖపుష్పి- వీటి ఆకులరసము ప్రతీదీ

1/4పడి, ఆముదము ఒకపడి- వీటిని ఒకటిగకలిపి- పిప్పళ్ళు, దుంపరాష్ట్రము, ఓమము, వస, కస్తూరిపసుపు ప్రతిదీ 1/2పలం, జాజికాయ 1/8 పలము, చూర్ణముచేసి వస్త్రగాలితము చేసి పైనూనెలో వేసి కలిపి తైలపాకపక్వముగ కాచిదించుకుని వడియకట్టి బిడ్డలకు ఒకచెంచావంతున, పెద్దవారికి కాల్‌పలము వంతున ఏడు దినములు సేవించుచుండిన అచ్చురము, మేహవెట్ట, నిక్కాక మున్నగువ్యాధులు హరించును. ఇచ్ఛాపథ్యము.

17. తులసి, నూగుదోసాకు, దుష్టపు ఆకు, టపాకాయచెట్టు, తేలుకొండి (గురుగుచెట్టు కాదు) హంసపాది, గుంటగలగర, వావిలి, నేలగొలిమిడి, సాంబ్రాణి ఆకు- వీటిరసము ప్రతిదీ 1/8పడి, కూటికలబందగుజ్జు కిచ్చిలికాయ్యంత, రాగులు గడ్డితోవాడ్చి తీసిన 6ఏటిపుచ్చకాయలరసము- వీటిని ఆముదము 50 పలములుగ్రహించి అందుకలిపి కాచి చిక్కగయుండునపుడు. నల్లజీలకర్ర, మెంతులు, కోష్టు- ఇవిప్రతిది 1/2పలం, చంపకము ఒకవరహాఎత్తు, తెల్లగడ్డలు1/2పలం వేసి పదముగకాచిదించి వడియకట్టి దేహబలము ననుసరించి 1/4 లేక 1/2 పలము వంతున సేవించవలెను. సాయంత్రమున మిరియాలను బూడిదచేసుకొనినది, తుత్తిఆకు, వుల్లిపాయలు- చేర్చిచేసిన కషాయము కాచిఇవ్వవలయును. ఇట్లు సేవించుచుండిన బిడ్డలకు వచ్చు సకలమాందరోగములు తీరును.

18. కృష్ణతులసి స్వరసము, 1తు॥ ఆవునెయ్యి 1తు॥ ఈ రెంటిని ఒకటిగ కలిపి కొంచెమువేడిచేసి ఒకచెంచావంతున దినమునకురెండుపూటలువంతున 3దినములు యిచ్చిన డొక్కలు ఎగరవేయు శిశువ్యాధి హరించును.

19. నల్లతులసి స్వరసమును ఇనుపగరిటలో వేడిచేసి, తేనెచేర్చి శిశువులకువచ్చు కఫకట్టు, జలదోషము, శ్వాస, జన్ని, దగ్గు, జ్వరము- మున్నగువాటికిచ్చిన అవి హరించును.

20. రామతులసీదళములు, వస- ఇవిసమభాగము చేర్చి పొడిచేసి తేనె అనపానముతో సేవించుచుండిన బాలారిష్టము హరించును.

21. తులసిరసము ఒక ఆళాకు, భూతులసిరసము, మాచిపత్రిరసము, ఎర్రగడ్డలరసము, గుంటగలగరరసము, మారేడాకురసము- ఇవిప్రతిదీ అర్ధ ఆళాకు, చిట్టాముదము ఒక ఆళాకు- వీటినన్నింటిని ఒకటిగకలిపి అందు

శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు- ఇవిప్రతిదీ 1 వరహాఎత్తుచూర్ణములను కలిపి పొయ్యిపై బెట్టి తైలపక్వముగ కాచిదించి భద్రపరచేది. ఇందు ఒకవరహాఎత్తు తైలమును శిశువునకుత్రాగించేది. శిశువునకు ఎన్నినెలలు వయస్సువున్న అన్నిరోజులు మందును త్రాగించవలయును. ఇందువలననోటి దుర్గంధము, గొంతు-నోరుపుండుగుట, దగ్గు, శ్వాసము- మున్నగునవితీరును. 3 నెలలు వరకు వచ్చు అన్నిరోగములను కుదుర్చును. ఈతైలమువాడుకాలమున తల్లి పులుపు లేకుండా పథ్యముండవలెను.

22. ఒకపాత్రలోతులసిదళములను దట్టముగ పరచి దానిపై- అతిమధురము, కర్కాటకశృంగి, కమ్మిబంక, ఓమము, సదాప, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవలుపు, నెల్లివరుగు, తాణికాయవలుపు, దానిమ్మపండుపైపెంకు, లవంగపత్రి, జాపత్రి, అతివస, పెద్దమానుచెక్క, వాయువిడంగములు పిప్పలిమూలము, పచ్చకర్పూరము, జీలకర్ర, కస్తూరిపసుపు, చందనపుపొడి, జాజికాయ- ఇవిప్రతీదీ ఒకతులం, ఏలక్కాయలు 2 తు॥ గోరోజనం 2 తు॥ గ్రహించి ఇందు ఏలకులు, పచ్చకర్పూరము, గోరోజనం తప్ప అన్నిసరుకులను కచ్చాగాదంచి తులసీదళములపై పోసి మిగల తులసీ దళములనువేసి 4 పడి నీళ్ళు మెల్లగ పోసి పొయ్యిపైపెట్టి సన్నని మంటతో 1/4 పడి మిగులునట్లు యిగరకాచి దించుకుని ఆకషాయముతోనే అందుండు సరకులన్నింటిని ఖల్వములో పెట్టి మెత్తగానూరి అందు వుడికినతులసీ దళములను కూడవేసి, పచ్చకర్పూరము, ఏలకులు, గోరోజనములను చూర్ణించి వేసి మెత్తగనూరవలయును. దీనిని కాటుకవలెనూరి మిరియాల ప్రమాణము మాత్రలుచేసి ఆరబెట్టి భద్రపరచేది. ఇందు శిశువుల వయస్సు, బలము అనుసరించి ఒకటి లేక రెండు మాత్రలను వెచ్చనినీళ్ళతో సేవించిన అన్నిరకములైన జ్వరములు, మాందజ్వరములు తీరును. వాత, పిత్త, శ్లేష్మ జ్వరములుతీరును. గ్రంథి, పుండ్లు హరించును.

మరియూ:- ముండ్లఉచ్చింతతీగ, తులసి, కుక్కతులసి, దానిమ్మ, వాకుడు- వీటిని వాసెనలోపెట్టి వుడుకనిచ్చి రసము పిండుకుని దానిలో పైమాత్రలు రెంటిని సాది బిడ్డల కిచ్చి వెచ్చనినీరు కూడయిచ్చిన సుఖముగ బేదిఅగును.
మరియూ:- దానిమ్మ ఆకును వుడుకబెట్టి యిగురబెట్టిన నీళ్ళతో పైమాత్రను యిచ్చిన బేదులు నిలచును.
ఇందుకు పథ్యము:- వంగపిందెలు, మునగపిందెలు, ములువుచ్చింతతీగ పండ్లవరుగులు, కందిపప్పు వీటిని సేవించవలయును.

23. తులసి, తుత్తి, బ్రహ్మి, కాచాకు,మారేడు, సరస్వతి, గుంటగలగర, బొక్కెన, మడ్డి, కానుగ- వీటి ఆకులను సమభాగము గ్రహించి దంచి పిండిన రసము ఒక లీటరు, కరకవలుపు, తాణికాయవలుపు, శొంఠి, పిప్పళ్ళు, ఓమము, వస, కస్తూరిపసుపు, దుంపరాష్ట్రము, తాబేలుచిప్ప- ఇవిప్రతిదీ 15గ్రా॥ జాజికాయ ఒకటి, వీటిని శుభ్రము చేసినవి తెచ్చి ఎండబెట్టి దంచి వస్త్రగాలితముచేసిన పొడిని ఆముదము ఒకలీటరులోకలిపి పై ఒకలీటరు ఆకులరసముచేర్చి మాగిన మట్టికుండలోపోసి పొయ్యిపై బెట్టి సన్ననిమంటతో తైలపక్వముగకాచి బాగుగ కలిపి మైనపక్వమగునంత వరకు కాచిదించి ఆరబెట్టి వడియకట్టి భద్రపరచేది. ఈతైలమును తల్లి- బిడ్డయిద్దరికి సేవించుటకు యివ్వవలయును. బిడ్డలకు 1 చిన్న టీ చెంచాప్రమాణము (5 మీ. లీ), తల్లికి ఒక 'మేజా' చెంచాప్రమాణము (15 మీ. లీ) వంతున ఇవ్వవలయును. ఇందు వలన ఏవిధమైన మాందరోగము ఆయిననూ, ఏవిధమైన ఉదరరోగ ములున్నూ తీరును. అచ్చురవములు, అత్యుష్ణము హరించును. తల్లికాల్చిన చింత పండు,వేయించినవుప్పు- పప్పు,చేర్చిపథ్యముండుటమంచిది.
(ఈతైలమును కాచేవారు దైవభక్తి, గురుభక్తి కలిగి, శరీర- ఆత్మశుద్ధితో పరోపకారార్థమై విశ్వాసముతో కాచుట శ్రేష్ఠము).

24. తులసీదళములు, గుంటగలగర, నీలి, గడిదడపాకు,గచ్చ, వాయింట, కాచాకు - వీటి ఆకులను సమభాగముతెచ్చి దంచిపిండినరసము 200 మి. లీ., ఆవునెయ్యి 200 మి. లీ., ఒకటిగకలిపి అందు కస్తూరిపసుపు, కోష్టు, కటుకరోహిణి, నల్లజీలకర్ర- ప్రతిదీ 10 గ్రా॥ గ్రహించి శుభ్రపరచి ఎండబెట్టి దంచివస్త్రగాలితము చేసి పైనెయ్యితో కలిపి సన్ననిమంటతో ఘృతపాకపక్వముగ కాచిదించి ఆరబెట్టి వడియకట్టి భద్రపరిచేది. ఒక టీ చెంచాప్రమాణము బిడ్డకు ఇచ్చి తల్లికి ఇచ్చా పథ్యముపెట్టేది. ఈఘృతముతో బిడ్డలకు కలుగు 21 విధములైన మాందరోగములేగాక సకలవిధదోషములు, దిక్కుతెలియనిరోగములు తీరుటయేగాక శరీరముధృఢముగను, రక్తముప్రసరించి, ఉష్ణముతగ్గి చురుకుగాను, సంతోషముగను బిడ్డలు వుందురు.

25. తులసీదళములు10, ములుఉచ్చింతతీగ ఆకుకు, వాకుడుఆకు3, అడ్డసరపు ఆకు ఒకటి- వీటిని చట్టికి వాసెనకట్టి దానిపైబెట్టి పిట్టువలె వుడుకబెట్టి రసముపిండుకుని ఒక పెసర గింజంత గోరోజనము చేర్చి తేనలోకలిపి పై ఆకులరసమును అనుపానముగ ఉదయం, సాయంత్రం రెండు పూటలు వంతున

ఒక వారము ఇచ్చిన శిశువాతము(*Infantile Paralysis*) రాకుండ నిరోధించును. కఫము, జ్వరము, ఈడ్పు, నొప్పి, శిశువాతము హరించును.

26. నేలతులసి, పేముచెట్టుఆకు, వల్లేరాకు, బొక్కెన,కామాక్షికసువు- వీటిని కావలసినవంత సమభాగము చేర్చి ఆవిరిలోవుడుకబెట్టి నలిపి అందుండి రసము పిండుకుని దానిలో కుంకుమపువ్వు, గోరోజనములను మిరియాలంతసాది శిశువులకుపోసిన మాందము హరించును.

27. తులసివేర్లు, తెల్లగలిజేరువేర్లు, తెల్లజిలేడువేర్లు, తెల్లగరికవేర్లు, జుట్టుపాకువేర్లు, ఆదొండవేర్లు,చిట్టాముట్టివేర్లు,పేరాముట్టివేర్లు, గుంటగలగర వేర్లు, విష్ణుక్రాంతివేర్లు, పల్లేరువేర్లు- ఇవిప్రతిదీ సమం లేక ఒక్కొక్క పలము గ్రహించి చూర్ణముచేసి ఆముదము అరపడిలోవేసి ఒకమండలము సూర్యపుటము బెట్టి భద్రపరచేది. ఈనూనె ఒకదమ్మిడిప్రమాణము శిశువు నాలుకకు పూసి సేవింపచేసిన మాందరోగము హరించును.
**పథ్యము:**–చనుపాలు లేక చారు అన్నము మాత్రమే.

28. తులసీదళములరసం ఒకశేరు, భూతులసిరసం ఒక ఆళాకు, మారేడు ఆకులరసం, గుంటగలగరాకురసం, మాచిపత్రి ఆకురసం, ఎర్రగడ్డలరసం- ఇవిప్రతిదీ ఒక ఆళాకు-ఈరసములన్నింటిని ఒకశేరు ఆముదములో పోసిపొయ్యిపై బెట్టికాచేది. కాచునపుడు త్రికటుచూర్ణము ( ప్రతిదీ 2వరహాఎత్తు) 6వరహాఎత్తు వేసి కావలసినంతతేనె పోసి మైనపక్వముగకాచి భద్రపరచేది. ఇందు ఒక చిన్నచెంచా తైలమును శిశువుకు త్రాగించేది. ఎన్నినెలలశిశువు అయితే అన్నిదినములు మందుఇచ్చేది. ఎగశ్వాస, దగ్గు, ఉష్ణము, శోష, కడుపుబ్బరము, పాలు త్రాగకుండుట, ముఖమునందు చెడువాసన మున్నగు నవి హరించి ఆరోగ్యము కల్గును ( ఇందు కొలతలోవ్యత్యాసమున్నా, తేనెవున్నది.)

29. తులసి, బొక్కెన, భూతాంకుశము, అగసిపట్ట, ఆగసిపండుటాకులు, కాచాకు, జుట్టుపాకు, బీర- వీటిస్వరసములు ప్రతిదీ ఒక ఆళాకు, పచ్చిపసుపురసము ఒక ఆళాకు, శుద్ధమైననువ్వులనూనె ఒక ఆళాకు, ఆముదము 1/4శేరు- వీటినన్నింటిని ఒకటిగచేర్చికలిపి అందు ఓమము, తెల్లపాయ, వస, తాబేలుచిప్ప- ఇవిప్రతిదీ 1/2 పలము గ్రహించి బాగుగా వేయించి చూర్ణము చేసి కలిపి పొయ్యిపై బెట్టి తైల పక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరచేది. ఈతైలము 1/2 నుండి ఒక ఔన్సుగ్రహించి అందు దుడ్డెత్తు వెలిగారమును

నెయ్యిలో పోంగించి దానితో ఇంగువ 4గు. గి. ఎత్తుచేర్చి పాదిఅన్నియూ కలిపి ఇచ్చేది. బాగుగా మలముజారీయగును. కడుపుబ్బరము తగ్గిమాందరోగము హరించును.

30. తులసీదళములు పిడికెడుతెచ్చి ఆవిరిలో వెచ్చచేసి అరచేతిలో పెట్టినలిపి పిండగా వచ్చినస్వరసముతో తేనెకలిపి చంటిబడ్డలకు నాకించిన శ్వాసకాసలు హరించును. జీర్ణశక్తి పెరుగును.

31. తులసి, విష్ణుక్రాంతి, వావిలి, చేదుపొట్ల, దింటెన, నేలతంగేడు, వాకుడు, ములువుచ్చింతతీగ, ఎర్రముళ్ళతోటకూర, అడ్డసరము, మెగభీర, తెల్లకిచ్చిలిగడ్డ- ఇవి సమభాగముతెచ్చి కషాయముచేయ కాచియిచ్చిన సుళ్ళిక్కరైరోగము (సుడిగాలివంటి అత్యుష్ణరోగము) హరించును. శ్వాస, జ్వరము, అత్యుష్ణము, దోషములన్నియూ హరించును.

32. తులసీదళములు, కుక్కతులసీ ఆకులు, వావిలి ఆకు, కామంచి, దింటెన ఆకు- వీటిరసములు ప్రతిదీ అర్ధపడి, నీరుగొరిటి- కాల్అరిక్కాల్ పలము(1/4+1/8) వెల్లుల్లి 1 / 8 పలం॥ వీటినిమారి కలిపి కాచిలోనికి సేవింపచేసి పైపూతకుకూడ వుపయోగించిన సకలవిదవములైనవమాందరోగవములు హరించును. పథ్యముగ వుండవలెను.

33. తులసి, వాకుడు, కాశాకు, మునగపువ్వు, దుష్టపు ఆకు, చిక్కుడు ఆకు, మంచివాయింట, నీలి, వెల్లుల్లి, కుప్పింట, పెద్దతుమ్మి, చిన్నతుమ్మి, వావిలి, మద్దిచెట్టాకు, ములువుచ్చింతతీగ ఆకు- ఇవి సమభాగములు కలిపి దంచి తీసనరసము ఒక లీటరు, ఎనుము నెయ్యి ఒకపడి, త్రికటుకములు, పసుపు, ఇంగువ, దుంపరాష్ట్రము, తెల్లగడ్డ- ఇవిప్రతిదీ 15గ్రా॥ పొడిచేసి దుష్టపాకు రసముతో నూరి పైరసములో కలిపి పొయ్యిపై బెట్టి కాచి ఘృతపక్వముగ కాచి దించుకుని చల్లారనిచ్చి నెయ్యిని వడియకట్టి భద్రపరచేది.

ప్రమాణము:- పూటకు ఒక టీ చెంచాప్రమాణము నెయ్యి, ఉదయము మాత్రము 3 దినములు యివ్వవలెను.

పథ్యం:- ఉప్పువాడరాదు. పాలిచ్చు తల్లులు చేపలు, మాంసము, పాము, తీట- కలిగించు పదార్థములనుసేవించరాదు. వారుకూడ ఈనెయ్యిని ఒకపూట 1 / 2 ఔన్సు సేవించవలెను. ఇందువలన బాలుర అత్యుష్ణము-18, జ్వరము, మాందము, బలమైన ఉళమాంద, అంతర్గతరోగములు, ప్రక్కసుడి, పామ- 18, ఎండుట, మూలము, అరోచకము, విప్రుథిగడ్డలు, పుండ్లు- మున్నగునవి హరించును.

34. తులసి, తిప్పతీగ, చెప్పుతట్టాకు, జిల్లేడాకులు- వీనిస్వరసములన ఒకభాగముగ్రహించి ఆవుపాలు ఒకభాగము, తిలతైలము ఒకభాగము- వీటిని కలిపితైలపక్వముగ కాచి ఈతైలమును శిశువుశరీరమునకు లేపనముచేసిన బాలగ్రహదోషములు తీరును.

35. తులసి, చందనము-ఈరెంటిని మెత్తగనూరి పూసిన పిల్లలకు కలుగు ఎంగిలిచిరుముడి గుణమగును.

36. తులసిరసము, జుప్పుపు ఆకురసము, ఉల్లిపాయరసము, కలబందరసము, ములుఉచ్చింతతీగరసము, పుల్లదానిమ్మరసము- ఇవిప్రతిదీ ఆరు ఆళాకులు, ఆవునెయ్యి 3 ఆళాకులు, అతిమధురము, నల్లజీలకర్ర, ఓమము, ఈశ్వరి, జాజికాయ, చందనము, గోరోజనము, ఆకాశగరుడ గడ్డ, పిప్పళ్ళు, తంగేడు, జీలకర్ర, అక్కలకర్ర, ఏలకులు, మాశికాయ- ఇవి ప్రతిదీ $1^1/_4$ వరహాఎత్తు గ్రహించేది. పైసరకులలో గోరోజనము తప్ప మిగతవాటిని దంచి చూర్ణముచేసుకుని ఆవుపాలు పోసి మైనపదముగనూరి పైరసములలోకలిపి, కలియబెట్టి ఒకతైలభాండములో పోసి పొయ్యిపైబెట్టి నెయ్యిపోసి సన్ననిమంటతో ఘృతపాకపక్వముగ కాచిదించి వడియట్టి, గోరోజనమును ఖల్వములోపెట్టి పైనెయ్యితోనూరితీసిపైనెయ్యిలోనేకలిపి కలియబెట్టి భద్రపరచేది. ఈఘృతమును చిన్నబిడ్డలకు దమ్మిడిఎత్తు ఉదయము, సాయంత్రము యిచ్చేది. ఇందువలన బిడ్డలకు కలుగు గణమాంద్యము గుణమగును. తల్లి ఇచ్చాపథ్యముగవుండి బిడ్డకు తనపాలనే యివ్వవలెను.

37. తులసి, కుక్కతులసి, కూతురుబుడమ, దుష్టపు ఆకు, హంసపాది, గుంటగలిజేరు, కాశాకు, నేలగొలిమిడి, బ్రహ్మి, గ్రంథితగరము, నారింజఆకు, తేలుకొండియాకు- వీటియొక్కరసములు 1/8పడి, కూటికలబంద గుజ్జు శుద్ధిచేసినది అనగా వరిలేక రాగిగడ్డిలో వుడకబెట్టి ఎత్తినది 6వట్టలు, 6చేదుపుచ్చకాయలరసము- వీటినన్నింటిని ఒక కళాయి పాత్ర లేక కుండలో పోసి అందు చిట్టాముదము 50పలములు వేసి పక్వముగకాచి మైనపక్వముగ అగునపుడు నల్లజీలకర్ర, మెంతులు, కోష్టు- ప్రతిదీ 1/2పలము, చంపక పుష్పమొగ్గ ఒకవరాఎత్తు, తెల్లగడ్డ 1/2పలము- వీటిని చూర్ణించివేసి పదముగ కాచిదించి వడియకట్టి భద్రపరచేది.

వయసుకు తగినట్లు 1/4, 1/2, 3/4 పలమువంతున యిచ్చేది. సాయంత్రము పూాట మిరియాలను కాల్చినబూడిద, తుత్తియాకు, మెంతులు, వుల్లిపాయ- వీటితో కషాయముబెట్టి యిచ్చేది. బిడ్డలకువచ్చు సకలమాంద రోగములు హరించును.

(ఇందు పేర్కొనబడిన మాందరోగముల గురించి ఈగ్రంథము కడపట వివరించబడియునది.)

## పుట్టకురుపురోగ చికిత్స

1. విష్ణుప్రియ, శివప్రియ, శక్తిప్రియ, గంగప్రియ, గణేశప్రియ, బ్రహ్మప్రియ, సకల దేవప్రియ- వీటిని సభాగములుతెచ్చి ఒకమట్టిపాత్రలోపరిచి ఈమూలికలు మునుగునట్లు నీరుపోసి అర్ధభాగముమిగులునట్లు కాచిదించివడియకట్టి ఒక వారమునకు ఒకసారి మాత్రము వయస్సుకు తగినట్లు 10 మి. లీ నుండి 100 మి. లీ వరకు సేవించవలయును. దీనివలన కేన్సరువ్యాధిరాకుండా కాపాడును. భోజనములోచేదురుచి కలిగిన కూరగాయలు, ఆకుకూరలైన- అగిసే, వేపపువ్వు, ఉస్తికాయ, వాకుడుకాయలు, కాకరకాయలు, మున్నగువాటిలోదేనినైన ఒక దానిని అనుదినము చేర్చుకుని సేవించుచుండుటశ్రేష్ఠము. కేన్సరువ్యాధి హరించును.

2. తులసీదళములు 30 నుండి 40 దళములను పెరుగులోవేసి చిలికిన చల్లను వడియగట్టి సేవించవలయును. ఇట్లు ఉదయము, సాయంత్రము పూటలు సేవించవలయును. ప్రతిరోజు అర్ధకిలో నుండి ఒకకిలో మంచిపెరుగును ఆహారముతో సేవించవలయును. కేన్సరువ్యాధి హరించును.



## కాయకల్పము, ధాతు పుష్టి యోగములు.

1. నల్లతులసీదళములను నూరి పెద్దవక్కప్రమాణము తేనెతో సేవించవలయును. ఇట్లుప్రతిరోజు చేయుచుండిన శరీరము రాతిస్తంభము వలెయగును. ఇట్లు చేయుటవలన లోలోపలప్రాణము ఆడును. అనగాప్రాణాయామముసిద్ధించును. సుషుమ్నలో ప్రాణవాయువు ఆడును. వీర్యము క్రిందికిజారదు. చంద్రనాడిలో ప్రాణాయామముచేయుచుండిన జలపాతమువలె అమృతము చిరునాలికలోపడును. దానినిసేవించిన కాయసిద్ధియగును. ఇందులకు పట్టుదల, దైవభక్తి అవశ్యము. (2) దీని ఆకురసముతో సూతమును నూరినవెన్నవలెఅగును. దానిని ఒకగుడ్డలో మూట కట్టి ఒక పడిఈరసములోసురుకియ్యవలెను. చెదరకుండ తీసికర్పూరమంటలో వాడ్చి ఎత్తుకుని మూసలోపెట్టికరిగించిన ఆడును. అందు 1 / 4 భాగము శు॥ అపరంజిచేర్చి అందు 1 / 4 భాగము శు॥ నాగముచేర్చి అందుకు సరిభాగము శు॥ గెంధిచేర్చి (3) వీటినన్నిటిని ఒకటిగ చేర్చి నల్లతులసిరసముపోసి బాగుగాకలిపి వెంగారశిలను చేర్చిమెత్తగనూరి మేరుకెక్కించి తరువాత వాలుకాయంత్రమున మంటవేసి ఆతరువాత ఆరబెట్టి ఎత్తుకుని ఫైయ్యికొకటిచ్చిన అధికవేధ. ధృడముగ నవలోహములకిచ్చినచో పదహారు వయస్సుయగును. ఇదియొక గొప్పరహస్య యోగము. కానీశుద్ధి, తూకము, పుటభాగము, హస్తవాసి, పట్టుదల, శాపనివర్తి, దైవభక్తి మున్నగువాటిని అనుసరించిన తప్పక జయమగును పై యోగమునకు మూలము య్యైనతమిళపద్యములను కూడ ఇచ్చట తెలుగులో తెలియ చేయబడిన దానిని చదివి అర్థము చేసుకోవలయును. భోగర్‌కర్పం 300లోనిది.

(1) శెంబానకరుంతులసియిలైయరైత్తు, శిరప్పానపాక్కళవుతేనిలునూ్న॥
కంబానకాయందాన్, కల్‌తూనాగుం, కనమాగిమూచ్చాడుంవుళ్ళుకుళ్ళే॥
వంబానశుక్లందాన్‌కీళ్యోడాదు, మదియెన్రచందిరనిల్‌వాశియూాదు॥
అంజానఅరువిపోల్ అమృదంతానుం, అన్నాక్కిలే విళ్యుందద్దై
నీఅరుందువాయే॥

(2) అరుందవేయిలైసాట్రిల్‌సూతందన్నై, అరైక్కివేవెన్నైయాంకిలిపోల్‌కట్టి॥
తిరుందవేపడిసాట్రిల్‌సురుక్కుపోడు, సిదరామల్‌సూడనుడతీయిల్
వాట్టి॥
[illegible]
[illegible]॥

నరుందవేకాల్‌వాసినాగమూట్టు, నయందపాడిసరిక్కతాన్‌గెంధికూట్టే॥
(3) కూట్టియేకరుంతులసిచ్చారువిట్టు, కులావియే వెంగారంశిలైయుం
కూట్టు॥
పూట్టియే పాడిపన్ని మేరుకేట్టి పుగళ్యాగవాలుక్కైవైరిత్తపిన్ను॥
ఆట్టియే అరవిట్టు యెడుత్తు క్కొండు ఆయిరత్తుక్కొండ్రిడవే అధికవేదై॥
నాట్టియేనవలోగత్తీయ్‌న్‌దాయానాల్‌నలమాగపదినారు మాఱ్ఱుమామే॥

2. సూర్యోదయమునకుముందేలేచి కాలకృత్యములను తీర్చుకుని స్నానముచేసి మంచిమనస్సుతో తులసికోటకు ప్రదక్షిణము చేసి (కనీసము 3సార్లు) ఐదు లేక తొమ్మిదిదళములను గోర్లు, తర్జని, కనిష్ఠిక వేలునకు తగులకుండా శ్రీకృష్ణ నామమును జపించుచూ కనీసము 'హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే' అని జపించుచూ (తుంచితూర్పుదిక్కును చూచుచు నోటిలో వేసుకుని నమిలి మింగి పరిశుభ్రమైన జలము త్రాగవలయును. ఒక గంటతరువాత ఆహారము సేవించవచ్చును. ఆహారము నందు ఉప్పు, పులుపు, కారము తగ్గించవలయును. శాకాహారము మాత్రమే సేవించవలయును. ఇట్లు108 దినములు చేసిన మంచిఫలితము నిచ్చును. రోగవిముక్తుడగును. దీర్ఘాయువునిచ్చును. జీవితసౌఖ్యము పొందుదురు- ఇదియొక లఘుకాయకల్ప యోగము.

3. తులసి, 1 భా॥ కలకండ, తాటికలకండ- ప్రతిదీ 2 భా॥ రావిచెట్టువేరు 2 భా॥ మంచితేనె 20 భా॥ చక్కెర 40 భా॥ కేసరి, ఏలకుల గింజలు, జాపత్రి- ఇవిప్రతిదీ 2 భా॥- వీటినన్నింటిని సేకరించి మొదటి మూడుసరకులను చూర్ణించి తేనెలో ఒక దినము భావనచేసేది. చక్కెరను పాగుపట్టి ఆరిన తరువాత తేనె అందలి సరకులను ఈపాగులోవేసి అందు ఏలకులు మున్నగువాటిని మెత్తగాచూర్ణించి వేసి బాగుగా కలియబెట్టి ఒకజాడిలోవేసి భద్రపరచేది. దీనిని ఉదయము ఒకతులము వంతున సేవించి చక్కెరకలిపిన ఆవుపాలను సేవించవలయును. ఇందువలన ధాతు సంబంధమైనవ్యాధులుతీరును. శరీరమునకు పుష్టికలుగును. దీన్ని వాన-చలికాలములో కూడ ఉప యోగించ వచ్చును. మందుసేవించుకాలమున బ్రహ్మచర్యము అవశ్యము.

4. తులసీదళములుక్, మిరియాలుక- ఈరెంటినిమారి అర్ధఔన్సుతేనెలో కలిపి భోజనాత్పూర్వము ఒకగంట ముందు సేవించుచుండిన శరీరమునకు శీఘ్రముగ పుష్టిని కలిగించును. తులసీదళములును ప్రతినిత్యము దంతధావనము

తరువాత ఏమియూసేవించకముందే పరగడుపున నమిలి తినుచుండిన జీర్ణశక్తినిపెపొందించి శరీరమును ఆరోగ్యముగ వుండునట్లుచేయును. జ్వరములురాకుండాకాపాడును.

5. రామతులసి, దానివిత్తులు-రెంటిని పొడిచేసి 4గు. గి.ఎత్తు తములపాకులో పెట్టిసేవించిన వీర్యముగట్టిపడి పుష్టికల్గును.

6. అడవితులసివేరు, శివతులసివేరు, వావిలివేరు, గుంటగలగరవేరు, జాజి కాయలు, లవంగాలు, వాయువిడంగములు, గజపిప్పళ్ళు, లవంగపట్ట, ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, వెదురుప్పు, నల్లసుగంధిపాల, నేలతాడిదుంపలు, పిల్లిపీచరవేర్లు, నేలగుమ్మడి, పల్లేరుకాయలు-ఇవిసమభాగములు గ్రహించి మెత్తగా చూర్ణించి ఖల్వములో పెట్టి తుమ్మచెక్క కషాయముతో 3 దినములు మర్దించి మాషప్రమాణము మాత్రలుచేసినీడన ఆరబెట్టి భద్రపరిచేది. పూటకు ఒకమాత్రవంతున కల్లుతేటతో సేవించిన వీర్యస్తంభనవంగును. సద్యశుక్రముకల్గును, పుష్టికల్గును.

7. తులసి వేరుపైపట్ట, ఉసిరికగింజలోనిపప్పు, తామరగింజలోనిపప్పు. ఉత్తరేణి బియ్యము-ఇవిసమభాగములు గ్రహించి తులసిస్వరసముతో మెత్తగానూరి వుసిరిక ప్రమాణము మాత్రలుచేసి పూటకు ఒకమాత్రవంతున పటిక బెల్లము, పాలు అనుపానముతో 4, 5 పూటలు సేవించిన ఆకలికలుగదు.

8. తులసి, వేపచిగుర్లు, గుంటగలగర, వల్లేరాకు, ములువుచ్చింతలీగాకు, నేలవుసిరిక-వీటిని పచ్చివిగనే గ్రహించినూరి సేవించుచుండిన వ్యాధినిరోధకముగ పనిచేయును. పుష్టికల్గును.

9. తులసిగింజలు, శివతులసిగింజలు, రావిగింజలు, మర్రివిత్తులు, అత్తివిత్తులు, ప్రత్తివిత్తులపప్పు, నీరుగొబ్బివిత్తులు, చిల్లగింజలు, ముల్లంగి విత్తులు, గసాలు, జాజికాయ, జాపత్రి, లవంగములు (మొగ్గలుతీసినవి), సోంపు, చలువ మిరియాలు, అతిమధురము, సన్నదుంపరాష్ట్రము, పరంగిచెక్క, ఏలకగింజలు, సన్నలవంగచెక్క, నేలగుమ్మడివేర్లు-ఇవిప్రతిదీ ఒక పలము గ్రహించి బాగుగాఎండించిచూర్ణించి వస్త్రఘాళితము చేసి అందు కుంకుమపువ్వు, అభిని, నేలతాటి గడ్డలు, పచ్చకర్పూరము-ఇవి ప్రతిదీ ఒక పలము చూర్ణించి అందు కావలసినంత పీనాకలకండ పొడిచేసి అన్నింటిని కలిపి భద్రపరచేది.

పూటకు పదిహైసా ప్రమాణము చూర్ణము సేవించి వెంటనే ఆవుపాలు సేవించేది. ఇట్లు ఒకమండలము సేవించిన మేహరోగములు, చర్మరోగము, చచ్చువాయువు, నిక్కాకరోగములు హరించును. నపుంసకత్వము మానును. అదిక ధాతువృద్ధికలుగును. వుద్దివడలు, మాంసము, పాలు సేవించవలయును. ఉప్పు, పులుపు, కారము వర్జ్యము.

10. శివతులసి విత్తులు, తులసివిత్తులు , చిర్రికూరాకువిత్తులు, అత్తివిత్తులు, గొబ్బివిత్తులు, ఏలక గింజలు, సారపప్పు, బాదాంపప్పు, తామరగింజలపప్పు. సాలామిశ్రి, రూమిమస్తకి, చలువమిరియాలు, మంత్రివిత్తులు, గసాలు, అతిమధురము జాజికాయ, జాపత్రి, నల్లతుమ్మబంక, గోరోజనము, కుంకుమపువ్వు పచ్చకర్పూరము, అభిని-ఇవి సమభాగము శుభ్రముచేసినవి గ్రహించి బాగుగ ఎండబెట్టి చూర్ణముచేసుకొని భద్రపరచేది. అందు అరతులం చూర్ణమునంత గినంత కలకండ పొడిచేర్చి ఆవుపాలతో సేవించవలెను. ఈచూర్ణమును సేవించుపుడు బియ్యపు గింజప్రమాణము మంచిస్వర్ణ భస్మమును చేర్చి సేవించిన మంచిఫలితము కల్గును. ధాతుపుష్టి, మేహవృష్ణము, శరీరముచిక్కిపోవుట, లింగలేపనము లేకుండుట, నపుంసకత్వం, స్త్రీవాంఛ లేకుండుట, నాడీబలహీనము- ఇవిహరించి శరీరమందు రక్తవృద్ధికలిగి మిక్కిలిధాతువృద్ధికలిగి బలముకలిగి యుండును.

11. తులసి విత్తులను శుభ్రముచేసిన దానిని కాచిన ఆవుపాలలో వేసి నూరబెట్టి సేవించుచుండిన ధాతుపుష్టి కల్గును. తెలుపు, నీరుచురుకు, శీతబేది హరించును.

12. తులసి బీజములు-5 భా॥ పోస్తుకాయ 4 భా॥ పల్లేరుకాయలు 5 భా॥ పిల్లడుగుబీజములు3 భా॥ నేలతాటిగడ్డలు4 భా॥ చక్కెర6 భా॥- వీటినిమెత్తగా నూరికలిపి భద్రపరచేది. ఇందు 20వడ్లగింజలఎత్తు సేవించిన-బిందు గట్టిపడును. ధాతుపుష్టికల్గును.

13. తులసివేరుచూర్ణము నెయ్యితోకలిపి 1/2 తులము, ప్రతిరోజు సాయంత్రము పూట 40రోజులు సేవించిన శరీరము నందలి విద్యుచ్ఛక్తిని పెంపొందించును. ఆరోగ్యమును బలమును అధికపరచును. నరములకు బలము చేకూర్చును.

14. సబ్జావిత్తులు, చిల్లగింజలు, నీరుగొబ్బివిత్తులు, దురదగొండివిత్తులు చింతగింజపప్పు, నేలతాడి, అక్కలకర్ర, లవంగాలు, జాజికాయలు, సాలామిశ్రి సఫేదుమిశ్రి- ఇవిసమభాగములు చూర్ణించి ఇందుకుమూడురెట్లు పంచదారన గ్రహించి పాకవుబట్టి అందులోవేసి, మరియూ అందు 1/4తు। కుంకుమపువ్వును పన్నీరుతోనూరి పాకములోపోసి బాగుగాకలిపి లేహ్యాపక్వముగ వండి దించుకొని పూటకు6చిన్నములఎత్తు వంతున, దినమునకు రెండు పూటలు 40దినములు సేవించిన ఇంద్రియకాంతి కల్గును. వీర్యవృధి అపరిమితముగ కల్గును. పుష్టికలుగును.

**తులసి స్వరసమును సేవించుటవలన తీరువ్యాధులు.**

శీతపిత్తము; సాధారణజ్వరము ; జ్వరమువలనకలుగు బలహీనము, అశ్వస్థత; చెమటనుపుట్టించిజ్వరమును హరించును; శ్లేష్మజ్వరము ; జలదోషజ్వరము; జీర్ణజ్వరము; వాతజ్వరము; పురాతన జ్వరము; మూలము; కాస; దాహము; వాతరక్తము; మూత్రకృచ్ఛ్రము; ప్లీహరోగము; వాపు; కుష్టు; రక్తపిత్తము; జలదోషము; కృమి. కడుపుబ్బరము; శ్వాస; వాంతి; శీతలరోగము; విషము; మైకము; పిత్తముతగ్గుట- ఇంకయూ అనేకవ్యాధులను హరించును. అందువలననే దీనిని ఒకమహత్తరమైన దివ్యౌషధిగా సిద్ధపురుషులు నిర్ణయించిరి.

**2. కోళ్ళకువచ్చురోగమునకు:**- తులసి, కొత్తమీరి, అల్లము, ఒంటిరేకు వెల్లులిఖ్లా- వీటిని ఒకటిగ చేర్చికోళ్ళకు తినిపించిన వాటికికలుగు రోగమును రాకుండ చేయును. రోగమువచ్చిన తరువాతకూడా తులసి, మంచికర్పూరము, ఓమము, పుదినా- ఇవిసమభాగములుగ్రహించి దంచి మిరియాలంతమాత్రను రోగబలమును అనుసరించి కోడికి తినిపించిన కోళ్ళరోగము నయమగును.

**3.** కుక్కతుళసి ఎన్ను, మొగిలిపువ్వునందలి మకరందపట్టలనువేసి యుంచిన గుడ్డలయందు పురుగులు చేరవు.

**4. తులసి- టీ :**- తులసి ఆకులు-20, తోలుతీసిన శొంఠిచిన్నతునక, మిరియాలు-5 తేయాకు-3టీస్పూన్లు, వీటినిగ్రహించి 300మి. లీ. నీళ్ళలో తెర్ళబెట్టేది. (తులసి ఆకులు, మిరియాలు ఖచ్చగాదంచివేసేది) బాగుగ తెర్ళిన పిదప దించి వడియకట్టి అందు పాలు చక్కెరకలిపి సేవించిన ఉత్సాహము నిచ్చును. పుష్టినిచ్చును.



# భస్మములు, సిందూరములు, రసౌషధయోగములు.

1. కృష్ణతులసి స్వరసముతో పాదరసమును ఏడుదినములు మర్దించి లఘు పుటమువేసిన భస్మమగును. కృష్ణతులసిరసముతో రసముకట్టును.

2. మంచిచైనారసకర్పూరము ఒకపలము చనుపాలలో 3 దినములు భావనచేసి తీసి ఆరబెట్టి ఒక చట్టిలోపెట్టి సన్నని మంటబెట్టి తులసి స్వరసముపోసి రసము ఇగురువరకు మంటబెట్టి తీసినకట్టును.

3. శ్లో॥ చక్రంకావిష్ణుక్రాంతాచ తులసీతథా।
మహాసోమాహివల్లీచ తథాసూర్యప్రవర్తకః
ఏభిస్తు మర్దిత సూతః పునర్జన్మం నవిద్యతే॥

**అర్థం:** – సుదర్శనలత, విష్ణుక్రాంత, బలామూలము, తులసీ, మహాసోమలత, నాగవల్లి, పొద్దుతిరుగుడు ఈఓషదులతో శుద్ధిచేయబడి మర్దించబడిన సూతము మారణమై మరల తన స్వరూపము దాల్చని భస్మమగును.

4. శుద్ధిచేసిన ఇంగ్లీకము ఒకపలము గ్రహించి సముద్రవుప్పు ఒక ఆళాకుతెచ్చి నల్లతులసి స్వరసముతో మెత్తగానూరి ఇంగ్లీకమునకు కవచము చేసి చీలచేసి ఆరబెట్టి పది (10) పిడకలతో పుటము బెట్టిన భస్మముగును. జన్నిదోషములకు చలి జ్వరములకు తగుమాత్రము వాడేది.
**అనుపానము:** – అల్లపురసము, తేనె, చక్కెర.

**5. స్వర్ణభస్మమాత్రలు:** – కుక్కతులసిని మెత్తగానూరిన పెద్దనిమ్మకాయంత ముద్దలో రెండు గురిగింజెత్తు, శుద్ధిచేసినస్వర్ణపత్రములను పెట్టి 8 పిడకలతో పుటమిడిన భస్మము. అక్కలకఱ్ఱను పై భస్మమునకు సమ భాగము వస్త్రగాళితము చేసి దానితో లవంగములు, అంబరు, కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము- ఇవి ప్రతిదీ ఒక గురుగింజెత్తు చేర్చి తేనెపోసి మెత్తగానూరి మిరియాలప్రమాణము మాత్రలుచేసి భద్రపరచేది.

తెల్లగడ్డను పాలలోవుడుకబెట్టి- పాలు, తెల్లగడ్డ, రెంటిని మర్దించి చక్కెర కలిపి ఇందుపైమాత్రలలో రెండింటిని కరిగించి సేవించిన పార్శ్వవాయువు గుణమగును. కర్పూరము 1 భా॥ ఓమవుప్పు 1 / 4 భా॥ చేర్చిపైకి పూసేది.
**(ఇది ఒక అనుభవసిద్ధమైనయోగము. వ్రాతపుస్తకమునుండి గ్రహించబడినది)**

6. నల్లతులసీదళములు, తేలుకొండి ఆకు- ఇవి సమభాగము చేర్చి మెత్తగ నూరి శుద్ధిచేసిన నాగము 4 తు॥ ఒకేబిళ్ళగ చేసి దానికి కవచముచేసి దుత్తలో పెట్టి చీలచేసి 12 పిడకలతో పుటమిడిన కట్టును.

7. తులసిస్వరసముతో- ముందుగ పాతచింతపండును గొడిసెతో కూడదంచి మైనమువలె చేసిన దానితో మూస, మూతచేసి శుద్ధిచేసిన పగడములను పెట్టి పైనకూడ ఆచింతపండుమూతమూసి గుడ్డబిగువుగ చుట్టి 2 పలములకు 20 పిడకలతో పుటమువేసి తీసినదానిని, మెత్తగనూరి బిళ్ళతట్టి ఆరబెట్టి 8 పిడకలతో పుటమిడిన భస్మము. రెండణాల ఎత్తు సేవించిన దగ్గు, శ్వాస, కాస, అగ్నిమాంద్యము మున్నగునవి తీరును.

8. మక్కాసబ్జా ఆకులు 32తో- శుద్ధిచేసిన స్వర్ణము, శుద్ధిచేసినరసము- ప్రతిదీ రెండు వరహాఎత్తు చేర్చి మెత్తగనూరి మరలసబ్జా ఆకురసము, తెల్లదింటెన రసములతో 12గంటలసేపునూరి బిళ్ళతట్టి ఆరబెట్టి శరావసంపుటములో బెట్టి 20 పిడకలతో పుటములు రెండు మూడుసార్లు వేసి తీసిన మంచి భస్మమగును. నపుంసకత్వము, ఆస్మా, చక్కెరవ్యాధి వీటికి రోగి, రోగబలమును అనుసరించి తగిన అనుపానములతో వాడవలయును.

9. తులసీదళములు, అడ్డసరపు ఆకులు- ప్రతిదీ ఒక పిడికెడుతెచ్చి ఒక చట్టిలో శుద్ధిచేసిన తగరమును కరిగించి అందు కొంచెము కొంచెముగ వేసి వేయించి, తరువాత ఎండినకలబంద ఒక పిడికెడు కొంచెము కొంచెముగవేసి వేయించి, ఆతరువాత పెట్లుప్పు ఒక పలము వేసి వేయించిన సిందూరమగును. దీనిని ఎనిమిది జాములు మంటబెట్టిన శ్వేతవర్ణమగును. 1/8 రుపాయఎత్తు ఆవువెన్నలో 10 రోజులు సేవించిన మూత్రరోగములు, చురుకులు హరించును.

10. తులసిస్వరసముతో మంచి శు॥ వంగభస్మమునుకలిపి సేవించినప్రమేహ రోగములు తీరును.

11. కృష్ణతులసీ స్వరసముతో బాగుగాశుద్ధిచేసిన రసము, గంధకము, శంఖుపాషాణము, పత్రతాళకము- సమభాగములను ప్రత్యేకముగ ఒక్కొక్క దినము మర్దించి ఐదవరోజు అన్నిటిని ఒకటిగ కలిపి పైస్వరసముతోనే మూడు దినములు మర్దించి బిళ్ళచేసి స్వేతాభ్రకరేకులు చుట్టిశరావసంపుటములలో పెట్టి మూడు చీలమన్నుచేసి వాలుకాయంత్రమున ఒకదినము మందాగ్నిచే వండి స్వాంగశీతలమున దీసి మెత్తగానూరి భద్రపరచేది. గురుగింజప్రమాణము

తమలపాకులో పెట్టి సేవించిన శ్వాస,కాసలు హరించును. 80 వాతములు మున్నగు ఇతరరోగములు కూడా అనుపానభేదములచే హరించును.

12. కృష్ణతులసీదళములు, సునాముఖి ఆకు-ఈరెంటిని మెత్తగా నూరి ఒకరాత్రి యుంచి వుదయముననే గుడ్డలోరసమును పిండుకుని-విషముష్టి ఖల్వములో పాదరసమును పైరసముతో బాగుగావుంట అయ్యేవరకు మర్దించి పెట్టుకుని, తర్వాత ఒక శు॥ రాగిడబ్బీలో మరల కృష్ణతులసీదళములు, సునాముఖి ఆకు-ఈరెడింటిని నూరిన ముద్దను అర్ధభాగము పై శు॥ తామ్రడబ్బాలో పెట్టి దానిపై పాదరసవుంటను పెట్టి మిగత అర్ధభాగమునూరిన ఆకుముద్దనుపైన పెట్టి డబ్బాపై మూత పెట్టి మూడుచీలమన్ను గట్టిగచేసి వాలుకాయంత్రమున మూడు వేళ్ళఎత్తు ఇసుక పోసి దానిపై చీలచేసిన రాగి డబ్బాను పెట్టి అదిమునుగువరకు ఇసుకపోసి పొయ్యిపై పెట్టి 12గంటలు మంటవేయవలెను. సాంగశీతలమునతీసి జాగ్రత్తగచీలతీసి చూచిన పాదరసము కట్టియుండును. ఇది ఒకరహస్యయోగము.

13. నల్లతులసీదళములు నూరినముద్ద (20) ఇరవైపలములు అందుసురుకిచ్చి శుద్ధిచేయబడిన ఇంగ్లీకము ఒక పలమును మద్యనపెట్టి, కూటివుప్పును వెన్నవలెమెత్తగనూరి అర్ధ అంగుళము ఘనముగ దానిపైకవచము చేసి ఆరబెట్టి దానిపై మూడు చీలమన్నుచేసి ఆరబెట్టి ఆ కవచము చేసిన దానికి ఐదింతలఎత్తు పిడకలచే పుటమువేసి ఆరిన తరుగాత తీసి చూసిన గడ్డగనే శిందూరించి యుండును.

**ప్రమాణము:-** $1^1/_2$ నుండి 2గు. గి. ఎత్తు

**తీరువ్యాధులు:-** జ్వరము, వాతరోగములు, సన్నిపాతరోగములు మున్నగునవి. ఇచ్ఛాపథ్యము.

14. తెల్లతులసి లేక కృష్ణతులసిరసము ఒకవరహాఎత్తు, తేనె ఒకవరహాఎత్తుకలిపి అందు బాగుగాశుద్ధిచేసిన కృష్ణాభ్రకనవనీతమును భస్మముచేసినది అర్ధనుండి ఒకగురిగింజంతఎత్తువేసి కలిపి సేవించిన జ్వరము, జన్ని మున్నగువ్యాధులు మరియూ అనుపాన భేదములచే అనేక రోగములు గుణమగును.

**అభ్రకభస్మము:-** బాగుగాశుద్ధిచేయబడిన కృష్ణాభ్రక నవనీతము 2పలములు. గోరుచిక్కుడుసమూలరసము, నల్లకలువ పువ్వురసము, దుసారితీగసమూల రసము, పచ్చివెదురుగడ్డలరసము-ఇవిప్రతిదీ 1 / 2పడి, అభ్రక నవనీతమును

పెట్టి పొడిచేసి. పైవుప్పునుకూడాచేర్చి పువ్వురసమును కొంచెము కొంచెముగపోసి రెండుజాములు మెత్తగనూరి చిన్న బిళ్ళలుగచేసి ఎండలో ఆరబెట్టి వజ్రమూసలో పెట్టి మూసకు పైనపెంకుమూసి ఐదు చీలమన్ను లేపనముచేసి ఆరబెట్టి తీసి దీనికిమూడింతల ఎత్తు పిడకలతో పుటమువేసితీసి ఆరినతరువాత తీసి మరల ఖల్వములో పెట్టి పొడిచేసి పైపువ్వురసముపోసి ముందుచేసిన విధముగనే నూరి బిళ్ళచేసి ఆరబెట్టి వజ్రమూసలో బెట్టి పెంకుమూసి చీలమన్నుచేసి పుటమువేసేది. ఈవిధముగనే ఏడుపుటములువేసి తీసిచూచిన సిందూరమైయుండును. దీనినిమెత్తగానూరిశుభ్రమైన బుడ్డీలో భద్రపరచివాడేది.

ఇదిఒకరహస్యాద్భుతమైనసంజీవివంటిసిందూరము. దీనిని అనుభవశాలురైన వైద్యులు అతిజాగ్రత్తగపుటములు వేసి సిందూరించు కోవలయును. మంట వ్యత్యాసముచే ఆలస్యముగ సిందూరమగును. కానీ ఏడుపుటములు వేయవలయుననునది సిద్ధాంతముకాదు. చిన్నపుటములు వేసి పైతాళకము కరిగి సిందూరముగు వరకు పుటమువేసేది. ( పుట,పుటమునకు తూచి తగ్గిన తూకమనకు పైనున్నవుప్పును చేర్చుకోవలయును.)

21. నల్లతులసిరసము, శుద్ధిచేసినపాదరసము 4వరహాఎత్తుగ్రహించి. శు॥ పాదరసమును ఖల్వములోపెట్టినల్లతులసి రసము కొంచెము కొంచెముగ పోసి చేయివదలక నూరవలెను . బాగుగావెన్నవలె అయిన తరువాత నూరుట నిలిపి ఒకరోజు అట్లేపెట్టియుంచిన అందురసము జనించును. మరుదినము మరల నల్లతులసిరసముపోసి వెన్నవలె నూరవలయును. ఇట్లు మూడునాలుగుసార్లు నూరిన పాదరసము మరల జనించకయుండును. ఈ పాదరసపిష్టిని నల్లఉమ్మెత్తకాయలో పెట్టి పైకాయనేమూసి అర్ధవేలులావు ఆవుపేడ కవచముచేసి కాయవుడుకునంత మాత్రము ఇసుక మరుగున రసము గట్టిపడువరకు పుటములువేసేది. ఆతరువాత తీసిమరల వుమ్మెత్తకాయలో పెట్టి పేడపూసి లఘుపుటములు రెండువేసేది. తరువాత గెంజాయి ఆకునూరి దానికి కవచముచేసి దానిపై పేడ కవచముచేసి ముందు వలె ఇసుక మరుగున ఐదుపుటములు వేసేది. పిదప ఆగులికను తీసి ద్రాక్షసారాయిలో వేసి 60ఘడియలు భావనచేసేది. తరువాత ఆవుపాలలో 60 ఘడియలు భావనచేసిది. ఇట్లు చేసినగులికను కాచిన ఆవుపాలలోవేసి ఐదునిమిషములుంచి తీసి ఆపాలను త్రాగవలయును. దీనివలన రక్తము పరిశుభ్రముగను. రక్తవృద్ధియగును. సంభోగశక్తిపెరుగును. ఇదిఒకగొప్పరహస్యయోగము. ఇంకనూ దీనివలన అనేక ప్రయోజనములు కలవు. అనుభవముపై తెలుసుకోవలెను.

22. అడవితులసిఆకులరసము, రావిచెట్టు పట్టబూడిద 2పడి, బాగుగాశుద్ధిచేసిన మణోశిల 1పలము, బాగుగాశుద్ధిచేసిన తాళకము 1పలము, ఇందుతాళకమును మెత్తగనూరిపెట్టుకునేది. మణోశిలను వేరుగనూరి పెట్టుకుని- రెండు చూర్ణములను చేర్చి తులసి ఆకులరసము కొంచెము కొంచెముగ పోసి బాగుగ నాల్గుజాముల సేపునూరి బిళ్ళచేసి ఆరబెట్టి పైరావిచెక్కబూడిదను ఒకచట్టిలో అర్ధభాగమువేసి దానిపైబిళ్ళనుపెట్టి మిగిలిన అర్ధభాగము బూడిదను దానిపై వేసి మూసి పైన మూకుడుమూసి చీలచేసి పొయ్యిపైబెట్టి (4) నాలుగుజాములసేపు మంటపెట్టి తీసి ఆరినతరువాత తీసి చూసిన భస్మమైయుండును.

**ప్రమాణము:-** 1/2 నుండి 1బియ్యపుగింజెత్తు

**అనుపానము:-** తేనె,వెన్న,నెయ్యి మున్నగునవి.

**తీరువ్యాధులు:-** అగ్నిదీపనమును అధికపరచును. ధాతుపుష్టి, శరీరపుష్టిని వృద్ధిచేయును. రక్తముచెడుట- దానివలనకలుగు రోగములను హరింపచేసి రక్తశుద్ధిని కలిగించును. ఇదియొకగొప్ప అనుభవసిద్ధమైన రహస్యయోగము.

23. నల్లతులసిరసము, లింగరసము 8 భా॥ శుద్ధిచేసిన నెల్లికాయగంధకము 2భా॥ శుద్ధిచేసిన తాళకము 1భా॥- ఇందురసగంధకములను బాగుగానూరి కజ్జలిచేసి, తాళకమును వేరుగపొడిచేసి పైకజ్జలితో చేర్చి ఒకగంటసేపు మెత్తగానూరి మూడుసరకులు బాగుగా కలిసినతరువాత నల్లతులసిరసమును కొంచెము, కొంచెముగ పోసి ఒకజాము మెత్తగనూరి ఆరబెట్టి మెత్తగ పొడిచేసి ఏడుచీలమన్నుచేసిన కాశికుప్పెలో అర్ధమువరకుపోసి ఒకకుండలో నాలుగు అంగుళములు ఇసుకపోసిదానిపై కుప్పెనుబెట్టి కుప్పెనోటివరకు యిసుకపోసి పైనచట్టిమూసి మంటవేసేది. పసుపురంగుగ పొగకలిగి అది అణిగిన తరువాత రాతిబిరడావేసి ఆపైనదీపాగ్నిన ఒకజాము, కమలాగ్నిగ 2జాములు, గాడాగ్నిగ 4జాములు మంటవేసి శలాకు పదము కనుగొని అరబెట్టి చల్లగ ఆరినతరువాత కుప్పెను నీళ్ళలో తడిపి పగులగొట్టితీసిన మోదుగపువ్వువలె సిందూరమై యుండును. దానిని తీసి మెత్తగా చూర్ణించి భద్రపరచుకుచేది.

**ప్రమాణము:-** 1నుండి $1^{1}/_{2}$గు. గింజెతు.

**అనుపానము:-** తేనె, నెయ్యి, మిరియాలపొడి, శొంఠిపొడి, అల్లపురసము మున్నగునవి.

**తీరువ్యాధులు:** – దీనిసేవనవలన వాతరోగములు, వాయసంబంధరోగములు, గుల్మరోగములు, క్షయరోగము, దగ్గు, వాతపిత్తకఫములను త్రిదోషము వలనకలుగు అన్నిరోగములు హరించును.

**పథ్యము:** – సమయోచితముగ వ్యాధిబలము, రోగిబలమునునుసరించి పెట్టేది.

24. నల్లతులసిని సమూలమునూరినముద్ద 5పలములు, అంగడిలో ఆమ్మేరస సిందూరవము (మంచిదిగ యుండవలయును) 1 పలము- ఈరససిందూరమునకు తులసిముద్దను కవచముచేసి దానిపై ఒకచీలమన్నుచేసి 25 పలముల ఎత్తు పిడకలను పేర్చి మంటపెట్టి పొగఅణిగినతరువాత పైకవచము చేసినముద్దను దానిలో పొర్లించుకునేది. కవచము నల్లగ అగుపదమునతీసి ఆరబెట్టి కవచము తీసి సిందూరమును ఖల్వమున పొడిచేసి భద్రపరచుకునేది.

**ప్రమాణము:** – 1నుండి $1^1/_2$గు. గింజెత్తు

**అనుపానము:** – నెయ్యి, తేనె, తాటిబెల్లము మున్నగునవి.

**తీరువ్యాధులు:** – వాయురోగములు, జ్వరము, ప్రసవించిన వారికి వచ్చు జ్వరము జన్ని, మేహవ్యాదులు, మున్నగు అనేకవ్యాధులు తీరును.

**పథ్యము:** – సాధారణరోగములకు ఇచ్ఛాపథ్యము. కఠిన రోగములందు పులుపు, పొగవస్తువులు, స్త్రీ సంగమము వర్జించి కఠిన పథ్యము పెట్టవలయును.

ఇదియొకఅనుభవసిద్ధరహస్యయోగము.

25. తులసిరసము 3వరహాఎత్తు, తేనె 3వరహాఎత్తు-ఈరెంటినికలిపి అందు ఒక బియ్యపుగింజెత్తు నుండి 2బియ్యపుగింజలెత్తు బాగుగాశుద్ధిచేసి కట్టిన పాషాణభస్మమును కలిపి సేవించిన, తృతీయక, చాతుర్థిక జ్వరములు, వణుకు జ్వరము హరించును. వ్యాధిని అనుసరించి వివిద అనుపానములతో సేవించిన రక్తమునందలి మాలిన్యమును పోగొట్టి పరిశుభ్రమైన రక్తమును కలిగించును. కఫము విసర్జించబడి దగ్గుతీరును. గ్రంథి, చేతులుకాళ్ళువముడుగుట, పీనశరోగములు, అర్ధాంగవాతము మున్నగునవి హరించును.

**పాషాణభస్మము:** – బాగుగాశుద్ధిచేసికట్టిన పాషాణము 6వరహాఎత్తు, గోరింటాకు 7వీశెలు. గోరింటాకునురోటిలోవేసి దంచి తీసి ఖల్వమున మెత్తగానూరి రెండు భాగములు చేసి ఒకభాగమును చట్టిలోపెట్టి చదరముచేసి పైకట్టిన పాషాణమునుబెట్టి దానిపైమిగిలిన రెండవ అర్ధభాగ ముద్దను బెట్టిసమముగ అదిమిపైన చట్టిమూసి ఐదు చీలమన్నులేపనము చేసి ఆరబెట్టి

18 వీశెల ఎత్తు పిడకలతో పుటమువేసి ఆరినతరువాత తీసి మరలపైవిధముగనే రెండవసారి పుటముపెట్టి తీసిన భస్మమైయుండును. దీనినిశుభ్రమైన బుడ్డిలో భద్రపరచేది. పైవ్యాదులకువాడేది. (అనుభవసిద్ధయోగము).

26. తులసి సమూలరసము, తమలపాకురసము, ప్రత్తి ఆకురసము, దుష్టుపుసమూలరసము, బొక్కెనసమూలరసము, నేలగొలిమిడి సమూలరసము- వీటిని గ్రహించి పెట్టుకునేది. బాగుగాశుద్ధిచేసిన పాషాణము, శుద్ధిచేసిన ఇంగ్లీకము, శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిచేసిన గంధకము, శుద్ధిచేసినరసకర్పూరము-ఇవిప్రతిధీ ఒకపలము-ఈసరుకులను వేరువేరుగ కాటుకవలె చూర్ణించి తరువాత ఒకటిగకలిపి మరల ఒకజామునేపునూరి పైరసములు ఒకటొకటిగగ్రహించి కొంచెము కొంచెముగ పోసి ప్రతిరసముతో నాలుగుజాములునూరి ( ఆరుధసములతో 24 జాములు నూరేది) ఒకేబిళ్ళగచేసి 4 దినములు ఎండలో ఆరబెట్టి రెండుమట్టి చట్టి తెచ్చి ఒక దాని నోటికి యింకొకటి సందులేకుండ యుండునట్లు రుద్ది క్రింది చట్టిలోతమలపాకులను పరిచి దానిపై నూరిన బిళ్ళనుపెట్టి దానిపై మరల తమలపాకులు పరచి మూసి పైచట్టి మూసి ఏడుచీలమన్నుచేసి ఆరబెట్టి పొయ్యిపైబెట్టి దీపాగ్నిగ నాలుగు జాములు మంట వేసి తీసి సాంగశీతలమున కవచమును తీసి పైచట్టిలో యుండు దానిని గీచిఎత్తుకునేది. ఇదిఎర్రగ సింధూరించి యుండును. శుభ్రమైనబుడ్డిలో భద్రపరచేది.

**ప్రమాణము:**– ఒకటి లేక రెండు బియ్యపుగింజెత్తు

**అనుపానము:**– తేనె, అల్లపురసము, నెయ్యి, ఆముదము, లేహ్యములు మున్నగునవి.

**తీరువ్యాధులు:**– జన్ని, జ్వరము, తెల్లబొల్లి, శూల, వాయురోగములు, వాతము, మేహము, గుల్మము, అతిసారము, చేతులుకాళ్ళుముడుచుకొనుట, గండమాల, కరప్పాణి, తామర, అండవాతము, గవదబిళ్ళలు, కఫాలకుష్టు, పౌత్రము, మొలకలుగలమూలము, కఫాలశూల, అర్ధగగ్ర- మున్నగునవి హరించును.

ఇదిపంచపాషాణసింధూరమనుగొప్ప సిద్ధవైద్యయోగము.

27. శు॥ నల్లసీసమును తులసి స్వరసముతో నూరి పుటముబెట్టి తీసిన భస్మమగును.

ఖల్వములో పెట్టి గోరుచిక్కుడు సమూలరసమును కొంచెము కొంచెముగ పోసినూరవలయును. ఇట్లుమొత్తము 1 / 2 పడి రసముపోసి నూరవలయును. నూరిన తరువాత బిళ్ళతట్టి ఆరబెట్టి ప్రమిదలోబెట్టిపైన ప్రమిదమూసి చీలమన్నుచేసి ఆరబెట్టి 5 పలముల తూకముగల 40 పిడకలతో గుంతపుటమువేసి సాంగశీతలమున ఎత్తుకుని మరలఖల్వములోపెట్టి నల్లకలువ పువ్వురసముతో నూరవలయును. అర్ధపడిరసము యిగురువరకు నూరి బిళ్ళచేసి ఆరబెట్టి ప్రమిదలలోబెట్టి చీలచేసి ఆరనిచ్చి ముందుచెప్పినవిధముగనే పుటమువేసి తీసి దుసారితీగరసము అర్ధపడి కొంచెము కొంచెముగపోసినూరి బిళ్ళతట్టి ఆరబెట్టి ప్రమిదలలోబెట్టి చీలచేసి ఆరబెట్టి పైవిధముగనే పుటమువేసి తీసి మరల ఖల్వములోపెట్టి పచ్చివెదురు గడ్డలరసము అర్ధపడి కొంచెము కొంచెముగ పోసి నూరి బిళ్ళతట్టి ఆరబెట్టి ప్రమిదలలో పెట్టి చీలచేసి ఆరనిచ్చి పైవిధముగనే పుటమువేసి తీసిచూచిన భస్మమైయుండును.

15. కృష్ణతులసిరసము $3^1/_4$ వరహాఎత్తు, పసపువర్ణముగయుండు కరక్కాయ చూర్ణము ఒక వరహాఎత్తు-ఈరెంటినీ కలిపి అందు పాదరసమును వెన్నఅగునట్లు చేయబడిన రజితభస్మమును ఒకటినుండి రెండుగురిగింజలెత్తు చేర్చి కలిపి సేవించిన అన్నివిదములైన దగ్గురోగములు హరించును. దగ్గు అధికముచేత నిద్రపట్టకుండిన కూడాదగ్గును శాంతింపచేసి నిద్రపట్టు నట్లుగచేయును. అనుపానభేదములచే ధాతు క్షీణత, దగ్గు, రక్తక్షీణత, ఆయాసము ప్రమేహము తీరును.

**రజిత భస్మము:-** బాగుగశుద్ధిచేసినవెండి ఒకరూపాయఎత్తు గ్రహించి చింతాకుమందముగ రేకుచేసి పెట్టుకునేది. అడవిఓమము ఆకులరసములో పైరేకులను బొగ్గునిప్పులలో ఎర్రగకాల్చి ముంచవలయును. రేకులురసములో బాగుగామునగవలయును. ఇట్లు 25సార్లుకాచి, కాచి పైరసములో ముంచవలయును. ఈరసమును ప్రతి 25సార్లకొకసారిమార్చవలయును. ఇట్లువెండిరేకులను 100సార్లు కాల్చిముంచి తీసి పైఆకునునూరినముద్ద 5పలములో మధ్యనపెట్టి పైన మూడుచీలమన్ను లేపనముచేసి 21సేర్లుఎత్తు తూకము గలపిడకలతో పుటమువేసి సాంగశీతలమున తీసి చూసిన రేకులు పుష్పించి తెల్లగభస్మమైయుండును. ధాతువృద్ధిచేయు వెండి భస్మములలో ఇదిమేలైనది. ఈభస్మమును పాదరసములో వేసిన వెన్నయగును.

16. తులసి స్వరసము $1^1/_2$ వరహాఎత్తు, తేనె 1 వరహాఎత్తు-ఈరెంటినికలిపి అందు బాగుగాశుద్ధిచేసి భస్మము చేయబడినముత్యపుచిప్పలభస్మము 1 నుండి 3గురుగింజలెత్తు చేర్చి కలిపి సేవించిన వరుసజ్వరములు, పురాతనజ్వరములు మున్నగునవి హరించును.

**ముత్యపుచిప్పలభస్మము:-** ముత్యపుచిప్పలను శుభ్రముచేసి పొడిచేసి ఒక మట్టి పాత్రలోపెట్టి అదిమునుగునట్లు అనగాదానిపై రసము ఒక అంగుళము వుండునట్లు పుల్లని నారదబ్బపండురసముపోసి పొయ్యిపైబెట్టి సన్నని మంటవేయవలెను. రసమంతయూ యిగిరిన తరువాత తీసి ఆరబెట్టి నీళ్ళుపోసి బాగుగుకడిగి ఎండలో పెట్టి తడిలేకుండా ఆరబెట్టితీసుకునేది. ఇట్లుశుద్ధిచేసిన ముత్యపుచిప్పలు ఒక పలము గ్రహించి ఖల్వములోపెట్టి పొడిచేసి పుల్లనారదబ్బ పండురసము కొంచము కొంచముగ పోసి నాలుగుజములునూరి బిళ్ళచేసి ఆరబెట్టి శరావసంపుటములలో పెట్టి చీలమన్నుచేసి ఆరబెట్టి 140 పలముల ఎత్తు పిడకలతో పుటమువేసి తీసిన భస్మమైయుండును.

అనుపానబేధములచే దగ్గు, కడుపుబ్బరము, మూత్రపిండములరోగములు, వరుసజ్వరము, పురాతనజ్వరము, రాతికట్టు, గండమాల, ప్రమేహము, వాయు సంబంధరోగములు, కంటిరోగములు మున్నగునవి హరించును.

17. తులసిస్వరసము 2వరహాఎత్తు, తేనె ఒక వరహాఎత్తు ఇందుబాగుగాశుద్ధిచేసి భస్మముచేయబడిన మంచిపగడభస్మమును 1నుండి 2గురిగింజలెత్తు కలిపి సేవించిన పార్శ్వవాయువు, వాతము, త్రిదోషజ్వరములు హరించును. అనుపానభేదములచే- కఫరోగము, క్షయ, బీజవాయువు, పిత్తరోగములు, శ్లేష్మరోగములు, విద్రధి, వాతరోగములు, వాతగుల్మము, కంటిచూపుతగ్గుట, పిత్తకాస, కఫకాస, మేహవెట్ట కడుపుబ్బరము, శిరశ్శూల, జన్ని, పక్షవాతము, దంతరోగము, ధాతుక్షీణత, నరముల బలహీనత మున్నగు అనేకరోగములు గుణమగును.

**పగడభస్మము:-** బాగుగశుద్ధిచేయబడిన మంచిపగడములు ఒకపలం అత్తి ఆకురసము, స్వర్ణరేల ఆకురసము, వేగిసపట్టరసము, తెల్లజిల్లేడు ఆకులు, పువ్వులు చేర్చిదంచి తీసినరసము కావలసినంత సేకరించి పెట్టుకునేది. పగడములను ఖల్వములో పెట్టి అత్తిఆకురసము కొంచెము కొంచెముగ పోయుచూ 4జాములునూరి బిళ్ళచేసి ఆరబెట్టి శరావసంపుటములో బెట్టి

3 చీలమన్నుచేసి ఆరబెట్టి 60 పలములు పిడకలతో పుటముపెట్టి తీసి మరల ఖల్వమునపెట్టి రేల ఆకురసము కొంచెము కొంచెముగ పోసి 4 జాములు నూరిబిళ్ళచేసి ఆరబెట్టి శరావసంపుటములలో బెట్టి 3 చీలమన్నుచేసి ఆరబెట్టి 50 పలములఎత్తు పిడకలతో పుటమువేసి తీసి మరల ఖల్వములోపెట్టి వేగిసపట్టరసము కొంచెము కొంచెముగ పోసి 4 జాములు నూరి ఆరబెట్టి శరావసంపుటములో బెట్టి 3 చీలలుచేసి 60 పలముల ఎత్తు పిడకలతో పుటముబెట్టి తీసిమరలఖల్వములో బెట్టి జిల్లేడురసముకొంచెము కొంచెముగ పోసి 4 జాములు నూరి ఆరబెట్టి శరావసంపుటములో బెట్టి 60 పలములుఎత్తు పిడకలతో పుటముబెట్టి తీసిచూసిన దైవకటాక్షమువలన మంచి భస్మమైయుండును. పైరోగములకువాడేది.

18. తులసీదళములరసము $1^1/_2$ వరహాఎత్తు, శుద్ధిచేసినమిరియాల చూర్ణము 4గు. గి.ఎత్తు-ఈరెంటిని కలిపి అందు అర్ధ ఆవాలనుండి ఒక ఆవాలు ప్రమాణము వజ్రభస్మమును కలిపి సేవించిన, తరుణజ్వరము, తృతీయుక జ్వరము, చాతుర్థికజ్వరము మున్నగునవి తీరును.

వజ్రభస్మము:- గుజ్జిపుమూత్రములో శుద్ధిచేసిన వజ్రము 1గురిగింజెత్తు, నల్లులు 8గు. గి. ఎత్తుతీసి- మొదటనల్లులను వెన్నవలెనూరి వజ్రమున కు కవచముచేసి గాడిదదవడఎముకను పొడిచేసి అందు అర్ధపలము ఒకప్రమిదలో బెట్టి దానిపై కవచముచేసిన వజ్రమును బెట్టిదానిపై మరల అర్ధపలము ఎముకపొడివేసి పైనప్రమిద మూసి 3 చీలమన్నుచేసి 5 వీశెలఎత్తుపిడకలతో పుటముబెట్టి తీసినవజ్రము భస్మమైయుండును. అనుపానభేదములచే అన్నివిధములైన జ్వరములు, హృదయము అదురుట, కఫసంబమధమైనదగ్గు, నంజుజ్వరములు, ఉదరరోగములు, మెదడువ్యాధులు వరుస జ్వరములు హరించును.

19. తులసివేరుపైపట్ట, తెల్లగడ్డపాయలు, మడ్డిచెట్టుపట్ట, పసుపు, మిరియాలు, కరివేపాకుఈనెలు- ఇవిప్రతిదీ ఒకపలం తీసుకుని ఖచ్చాగ దంచి 4 పడి మంచినీళ్ళుపోసి ఎనిమిదింటఒకభాగము మిగులునట్లు కాచి దించి వడియకట్టిన కషాయము నందు 1 / 4 పడి నువ్వులనూనె చేర్చి తైలపక్వముగ కాచిదించి వడియకట్టి భద్రపరుకునేది. ఈతైలమును అభ్యంగనము చేసుకుని శీకాయతో శిరస్స్నానము చేయవలెను. ఈ తైలమును వజ్రకంతిమాత్రలు సేవించినతరువాత తలంటిస్నానముచేసిన అనేక గుణములు కల్గును.

**వజ్రకంఠిమాత్రలు:–** (ఇదిఒక అద్భుతయోగము) బాగుగ శుద్ధిచేసిన లింగము 8వరహాఎత్తు, శుద్ధిచేసిన రససింధూరము 2వరహాఎత్తు, శుద్ధిచేసిన రసకర్పూరము ఒక వరహాఎత్తు, శుద్ధిచేసిన వీరము 1 / 8వరహాఎత్తు- వీటినన్నిటిని పొడిచేసి నిమ్మపండురసము కొంచెము కొంచెముగపోసి ఒకజామునూరేది. మరల అల్లపురసము కొంచెము కొంచెముగ పోసి ఒక జాము నూరేది. గురిగింజంత లేక ఉద్దులంతమాత్రలు చేసి శుభ్రమైన బుడ్డీలో భద్రపరచేది.

**ప్రమాణము:–** ఒకటి నుండి $1^1/_2$ మాత్ర.

**అనుపానము:–** అల్లపురసము, శొంఠికషాయము, చిత్రమూలవేరు కషాయము, తేనె, తాటిబెల్లము, తులసీస్వరసము, మున్నగునవి.

**తీరువ్యాధులు:–** ఐదుదినములు సేవించిన బీజములవాపు, కీళ్ళవాపు, మూర్ఛమున్నగునవి హరించును. 10దినములు సేవించిన పుండ్లు, మున్నగునవి తీరును. జ్వరమునకు మూడుపూటలు చాలును. దాహముతోకూడిన వణుకునకు రెండు దినములుచాలును. మరియూ తెలుపు, అడ్డగర్ర, గండమాల, దోషములు, జన్ని మున్నగునవి హరించును.

**పథ్యము:–** పెసలు. మునగపిందెలు, కందిపప్పు, మిరియాలు, అరకూరాకు, గోదుమగంజి, పూరేడుసూపు మున్నగునవి. ఈమాత్రలను సేవించిన తరువాత పై తైలమును అభ్యంగనముచేసుకుని శిరస్నానము చేయుచుండిన అధిక గుణము కల్గును.

20. తులసిరసము 7గ్రాములు, తేనె $3^1/_2$గ్రాము-ఈరెంటిని చేర్చి అందు తాళకసిందూరము వ్యాధిబలమునుసరించి ఒకటినుండి 3బియ్యపుగింజల ప్రమాణము సేవించిన చాతుర్థికజ్వరము హరించును. అనుపానభేదములచే కఫకాస, రక్తకాస, వాత-శ్లేష్మకాస, శ్వాసకాస, పిత్తకాస, గళ్ళుతోకూడినకాస, కఫజ్వరము, వాంతి, ఎక్కిళ్ళు, చాతుర్థికజ్వరము, శుక్లమేహము, బహుమూత్రము, గ్రహణి, అతిసారము, కృమి, కుష్టు, గుదరోగములు, మేహరోగములు, శిరోరోగములు. సకలబేదులు, దోషము, శూల-మున్నగు అనేకరోగములు హరించును. రోగి, రోగబలమును అనుసరించి కఠిన పథ్యము, లఘుపథ్యముపెట్టేది.

**తాళకసింధూరము:–** బాగుగా శుద్ధిచేసిన తాళకము ఒకపలము, సున్నపుప్పు ఒకపలము, ఎర్రప్రతిపువ్వులరసము కావలసినంత. శు॥ తాళకమునుఖల్వములో

28. తులసిస్వరసముతో ఈక్రిందచెప్పబడిన తామ్రభస్మమును సేవించి మొలలయందువచ్చు బొబ్బలు, పిటికలు, గడ్డలు హరించును. ఈభస్మమున నీళ్ళతో సేవించిన శ్లేష్మరోగములు, వెచ్చనినీళ్ళతో వాతరోగములు, నేతిత పిత్తరోగములు, వెన్నతో శిరోరోగములు, తమలపాకురసముతో విడువ జ్వరములు, ప్రమేహ జ్వరములు, పిత్తప్రబలజ్వరము, తేనెతో బుద్ధిమాంద్యమును కలిగించు ఉన్మత్తశ్లేష్మము, వాయువు. పైశాచికజ్వరము మూర్ఛ, జన్ని- మరియూ అనుపాన విశేషములతో అనేకరోగములు హరించును

**తామ్రభస్మము:-** బాగుగాశుద్ధిచేసిన తామ్రపురజను ఒకపలము (35 గ్రా గ్రహించి తమలపాకురసము $3^1/_2$ పలములతో 16 దినములు నూరవలయును నూరినదానిని బిళ్ళుతట్టి 6 దినములు నీడన ఆరబెట్టి తీసి 8 దినములు ఎండలో ఆరబెట్టి కవచముచేసి ఒక దినము ఎండనిచ్చి 66 పిడకలతో పుటమువేసి తీసి ఖల్వములో పెట్టి తక్కోలిరసము $3^1/_2$ పలములతో 12 దినముల నూరవలయును. నూరినదానిని బిళ్ళుతట్టి నీడన 4 దినములు ఆరబెట్టి తీసి ఎండలో 7 దినములు ఆరబెట్టి కవచముచేసి ఎండలో ఒకదినము ఎండనిచ్చి 44 పిడకలతో పుటమువేసి తీసి ఖల్వములో బెట్టి ఆకుజెముడు ఆకురసము $3^1/_2$ పలములతో 8 దినములు నూరవలెను. నూరినదానిని 2 దినములు ఆరబెట్టి తీసి ఎండలో 5 దినములు ఆరబెట్టి కవచముచేసి ఎండలో ఒకదినము ఎండనిచ్చి 33 పిడకలతో పుటమువేసి తీసి ఖల్వములో బెట్టి జమ్మి ఆకురసము $3^1/_2$ పలములతో 4 దినములు నూరి బిళ్ళుతట్టి నీడన ఒకదినము ఆరబెట్టితీసి ఎండలో 2 దినములు ఆరబెట్టి కవచముచేసి ఎండలో ఒక దినము ఎండనిచ్చి 22 పిడకలతో పుటమువేసి తీసిన భస్మమగును.

*గమనిక:-*

(1) ప్రతిదినము కొత్తరసములతోనే తూకము ప్రకారము నూరవలెను.

(2) నూరినబిళ్ళను నీడలోగాని-ఎండలోగాని ఎండించినట్లే రాత్రులంద మంచులో పెట్టవలెను.

(3) ఈభస్మమును- రోజుకురెండు పలములు పొన్నకాయల తైలములో 3 దినములు సురుకిచ్చేది.

(4) భస్మమైన దానిని మంచులో బెట్టి పుష్పించిన దానిని గ్రహిం పుపయోగించవలెను.

ఈభస్మము తయారుచేయుటకు- తూక, పుటభాగములు, నూరుట, హస్తవాసి, దైవకృప కలిసిరావలయును. నిష్కల్మషమైనమనస్సుతో దురాశలేక జీవకారుణ్య బుద్ధితో చేయవలెను. ఈ భస్మము సంజీవివలె పనిచేయును. వేగములో పాశుపతాస్త్రము వలె పనిచేయును. ఈ భస్మమును సూదిమొనంత గ్రహించి తులసి రసము, కూతురుబుడమ రసము సమముచేర్చినది, చింతగింజంతప్రమాణములో కలిపి సేవించిన కఫరోగములు హరించి మరణము నుండి కాపాడును. దీని సేవన వలన రాబోవు ఇతర అనేక వ్యాధులు కూడ హరించును.

29. తులసిరసముతో ఈ క్రింది శంఖుభస్మమును సేవించిన కఫజన్ని, పురాతన ద్వంద్వ జ్వరములు మున్నగునవి తీరును. మరియూ యితర అనుపానములతో సేవించిన పిత్తము, కండ్లు పొగకమ్ముట, చూపుతగ్గుట మున్నగునవి హరించును. శరీరమునకు రంగునిచ్చును.

**శంఖుభస్మము:** – బాగుగా శుద్ధిచేసిన శంఖునకు తామరాకునూరిన ముద్దను కనచముచేసి ఎండలో ఎండించి ఘనపుటముబెట్టి తీసిన భస్మమగును.

30. తులసిరసముతో ఈ క్రిందిరససింధూరమును సేవించిన అండవాతము హరించును. మరియూ వత్తబొంగుఆకుతో చేయబడిన రసముతో సేవించిన ఉష్ణ వ్యాధులచే కలుగుటమైకము, జమ్మి ఆకురసముతో సేవించిన కడుపునొప్పి, బోడతరము రసముతో తృగ్దోషము, తామరాకు రసముతో సేవించిన పిత్తోష్మత్తము కలసిన గుల్మము, జిల్లేడాకురసముతో ఉష్ణశైత్యరోగములు, తుంగముస్తెల రసముతో పిత్తఅరోచకము, నీళ్ళతో ఉష్ణవాతము మున్నగునవి హరించును.

**రససింధూరము:** – బాగుగాశుద్ధిచేసిన పాదరసము ఒక పలముగ్రహించి కందిచెట్టు ఆకురసము, వేగిస ఆకురసము, పతంగి చెట్టు ఆకురసము కలిమిచెట్టు ఆకురసము, కదంబ చెట్టు ఆకురసము, గురుగుచెట్టు ఆకురసము, సారచెట్టు ఆకురసము, ఆరెచెట్టు ఆకురసము- వీటినిక్రమ ప్రకారముగ ప్రత్యేకప్రత్యేకముగ పోసినూరవలయును. బాగుగనూరి బిళ్ళతట్టి ఎండ బెట్టి ప్రమిదలలో బెట్టిచీలమన్నుచేసి ఆరబెట్టి తగుపుటమువేసి ఆరిన తరువాత తీసి చూసిన సింధూరమైయుండును. అన్నిరసములను ఒకటిగ కలుపరాదు.

31. తులసిస్వరసముతో ఈక్రింది గంధకసిందూరమును సేవించిన కఫరోగవములు హరించును. మరియూ చక్కెరతో- ధనుర్వాతవము, బెల్లముతో- వాంతి, గుల్మము, నెయ్యితో- కాస, పెరుగుతో- పిత్తరోగములు, తేనెతో కృశించుట, తుమ్మిరసముతో- విషజన్నిరోగములు మున్నగునవి హరించును.

**గంధకసింధూరము:-** బాగుగ శుద్ధిచేసిన గంధకము ఒకపలము, ఆముదపు ఆకురసము, కర్పూరవల్లి ఆకురసము, దుష్టపు అకురసము, సహదేవిరసము, దేవదారు ఆకురసము, జిల్లేడాకురసము- ఇవి ప్రతిదీ యొక్కొక్కదానితో ఐదుదినములు మొత్తము 30 దినములు క్రమముగనూరి బిళ్ళచేసి ఎండించి ప్రమిదలలో బెట్టిచీలచేసి తగుపుటములు పెట్టితీసిన సింధూరమగును.

32. తులసిరసముతో ఈ క్రింది తాళకభస్మమును సేవించిన కఫసంబంధమైన దగ్గు, శ్వాసకాస, పలువిధములైన జన్నిరోగములు, పలువిధములైన జ్వరములు హరించును.

**తాళకభస్మము:-** తాటికల్లుతో శుద్ధిచేయబడిన తాళకము ఒక పలమును ఆకాశగరుడగడ్డరసము 4 పలములలో ముంచిపెట్టి ఒక రాత్రియంతయు మంచులో బెట్టి మరుదినము ఉదయమునుండి సాయంత్రమువరకు అదేప్రమాణము గడ్డరసముపోసి నూరి [illegible] ఆబిళ్ళను 4 పలములు గెడ్డరసములో ముంచిబెట్టి రాత్రియంతయు మంచులో బెట్టి మరుదినము మరల అదేక్రమముగ గడ్డరసముతో నూరి [illegible] ముగనే నాలుగు [illegible] నాలుగుదినములు చేసి ఐదవదినము బిళ్ళచేసి ఒక [illegible] మునీడన ఆరబెట్టి [illegible] ఎండినతరువాత చీలమన్నుచేసి ఎండలో ఎండబెట్టి (30) ముప్పై పిడకలతో పుటముబెట్టిన భస్మమగును. ఈ భస్మమును పదెనిమిది నెలలు తరువాతనే వ్యాధులకు వాడవలయును.

33. తులసి సమూలము, వాకుడు సమూలము- ఈరెంటిని గ్రహించి ఎండలో ఎండబెట్టి వేరువేరుగ గుంతతైలము దించుకునేది. ఈ రెండు తైలములను సమభాగము ఎత్తుకుని కలిపి అందుపూట ఒకటికి 1/4 పలమువంతున గ్రహించి ఈ దిగువచెప్పబడు గంధకభస్మమును సేవించవలయును. ఉదయము, సాయంత్రము సేవించిన వాత సంబంధమైన సౌద్య నల్లకుష్ఠు హరించును.

గంధకభస్మము:- బాగుగా శద్ధిచేయబడి ఏదో ఒకవిధముగ కట్టిన గంధకము $2^1/_2$ పలము- ఇప్పపువ్వురసము. గుంటగలగరరసము, గరికవేరురసము, తెల్లగురిగింజ సమూలరసము, నేలతాటిగడ్డరసము, పొడుగుకాకర ఆకురసము, పురుగుడురసము-ఇవిప్రతిదీ 4 జాములు నూరుటకు కావలసినంతరసము సేకరించి పెట్టుకునేది. గంధకమును ఖల్వములో పెట్టి మొదట పొడుగుకాకర ఆకురసము, కొంచెము, కొంచెముగపోసి నాలుగు (4) జాములు మెత్తగనూరి బిళ్ళచేసి ఎండలో ఎండించి ప్రమిదలోపెట్టి పైన ప్రమిదమూసి 3 చీలమన్నుచేసి తడిలేకుండా ఆరబెట్టి 20 పలముల పిడకలతో పుటము పెట్టేది. సాంగశీతలమున తీసి మరల ఇప్పపువ్వురసముతో నాలుగు జాములు నూరి ముందుచేసిన విధముగనే సిద్ధపరచి 30 పలముల పిడకలతో పుటముపెట్టేది. ఈ విధముగనే గుంటగలగరరసముతో 4 జాములు నూరిబిళ్ళచేసి ఆరబెట్టి ప్రమిదలలో పెట్టి చీలచేసి ఆరబెట్టి 40 పలముల పిడకలతో పుటమువేసి తీసి మరల గరికరసముతో (4)నాలుగు జాములు నూరిబిళ్ళచేసి ఆరబెట్టి ప్రమిదలలో పెట్టి సంధిబంధనముచేసి 3 చీలలుచేసి ఎండబెట్టి (50) ఏబది పలవములు పిడకలతో పూటవుపెట్టి తీసి, తెల్లగురిగింజ సములరసముతో 4 జాములు నూరి బిళ్ళచేసి ఆరబెట్టి ప్రమిదలలో పెట్టి సంధిబంధనముచేసి మూడు చీలమన్నుచేసి ఆరబెట్టి 60 పిడకలతో పుటము బెట్టి తీసి నేలతాటి గడ్డరసముతో 4 జాములునూరి బిళ్ళచేసి ఎండబెట్టి ప్రమిదలలోబెట్టి సంధిబంధనము చేసి మూడు చీలమన్నుచేసి తడిలేకుండా ఆరబెట్టి (70) డెబ్బై పలముల పిడకలతో పుటముబెట్టి తీసి పురుగుడురసముతో 4 జాములు నూరి బిళ్ళచేసి ఆరబెట్టి ప్రమిదలలో పెట్టి సంధి బంధనము చేసి మూడు చీలమన్నుచేసి ఆరబెట్టి (80) ఎనభైపలవముల పిడకలతోపుటవుపెట్టి తీసి ఖల్వములోపెట్టి కడపటిసారిగ మఱ్ఱివూడలరసము లేక మఱ్ఱిచిగుర్ల రసముతో పైవిధముగనే (4) నాలుగుజాములు నూరి బిళ్ళచేసి ఆరబెట్టి ప్రమిదలలోబెట్టి సంధిబంధనము చేసి మూడుచీలమన్నుచేసి ఆరబెట్టి (90) తొంబయిపలముల పిడకలతో పుటముపెట్టి తీసి సాంగశీతలమున తీసిచూసిన తెల్లని దివ్యమైన భస్మమైయుండును. కొన్నిసమయములందు ఎర్రగకూడ సిందూరించి యుండును. అదృష్టవశాత్తు సిందూరించి యుండిన మిగుల శ్రేష్ఠము. ఎట్లైననూ అగ్నిపరీక్షలకు నిలచును. దీనిని తీసినూరి శుభ్రమైనగాజు బుడ్డిలో భద్రపరచి పూజచేసి వాడుకునేది. పైతెలిపిన రోగములకు వాడుకోవలయును.

ఇంకయూ వైద్యశేఖరులు అనుపానభేదములతో అనేకవ్యాధులకు వాడుకునేది. మరియూ తులసిరసము, జీలకఱ్ఱకషాయము, తాటికల్లు-ఈ మూడింటిని సమభాగములు కలిపి అందు 1/4 పలము గ్రహించి అందు పై గంధకభస్మమును. తగుప్రమాణము చేర్చి సేవించవలెను. పైతులసి రసకలియికను శిరస్సుపైననూ, శరీరమునందును పూయవలయును. ఈ విధముగ పైకి, లోనికి 18 దినములు వాడి 19వ-దినము మందు నిలిపి పచ్చిపెసలు నూరి పూయవలయును. తరువాత స్నానముచేయవలెను. పచ్చిపెసలు పదార్థముగచేసి సేవించుచుండవలెను. దీనివలన పిత్తభ్రమరోగము హరించును.

35. కృష్ణ తులసిస్వరసమునందు, ఎరమట్టినేలలోయుండు, ఎఱ్ఱని భూనాగములను సేకరించి శుద్ధిచేసినదానిని మెత్తగానూరి తగుపుటములు ఐదు (5)వేసినసిందూరించును. ఒకవేళ నల్లగయుండిన పెట్లుప్పుద్రావకము(Nitric Acid-కాదు. మనవైద్యరీత్యాచేసినది) తోనూరి తగుపుటము ఒకటివేసిన సిందూరించును. ఈ సిందూరము ఒకటి లేక రెండు బియ్యపుగింజలఎత్తు తేనెలోకలిపి ఉదయము సాయంత్రము రెండు పూటలు వంతున ఒకవారము రోజులు యిచ్చిన చిన్నబిడ్డలకు వచ్చు చచ్చువాతము (Polio Disease) గుణమగును. ఇది ఒక భయంకరవ్యాధి. ఇందు శిశువులకు ఉధృతముగ జ్వరము వచ్చి చేతులు, కాళ్ళు చచ్చుపడి పోవును. ఆ అవయవములు సన్నగించును. బిడ్డలకు ఈ జ్వరము వచ్చినవెంటనే మిరియాల కషాయము రెండుపూటలు యిచ్చిన జ్వరము తగ్గును. పైసిందూరము ఒక వారము దినములు వాడిన కాళ్ళుకునడచుటకు శక్తివచ్చును. ఇంకొకవారము వాడిన బాగుగానడచును. ఈ వ్యాధియందు సూదిమందులు పొడిచినకూడాగుణమగుట లేదు. మనదేశమునందు ఈ వ్యాధిచే అనేకశిశువులు అంగవిహీనులై పోవుచున్నారు. అట్టి అంగవిహీనులను చూడ లేక వారిపైప్రేమతో ఈ యోగమును వైద్యశేఖరులకు అందించిన మనసిద్ధపురుషులకు వందనములు.

ఇది ఒక అనుభవసిద్ధమైన గొప్పరహస్యయోగము.

36. బాగుగా శుద్ధిచేసిన చీనారసకర్పూరమును మూడుదినములు చనుపాలలో భావనచేయవలెను. ప్రతిదినముకొత్తచనుపాలు పోయవలెను. ఒక చట్టిలో తులసి స్వరసము పోసి అందు పైరసకర్పూరమును పెట్టి పొయ్యిపైపెట్టి రసము ఇగురువరకు సన్ననిమంటతో కాచవలయును. ఇట్లురెండు మూడుసార్లు

షురుకిచ్చిన కట్టును. ఈ కట్టును తగిన అనుపానములతో ఇచ్చిన తెలుపు, ప్రదరము, అండవృద్ధి, యోనిపుట్టు, లింగపుట్టు, పుండ్లు యింకనూ అనుపానభేదములచే అనేకరోగములు హరించును.

37. కృష్ణ తులసి రసము, బాగుగా శుద్ధిచేసిన పీరము ఒకవరహాఎత్తు, పొగచూరు చూర్ణము ఒక వరహాఎత్తు-ఈరెండిటిని ఖల్వముబెట్టి పొడిచేసి పై తులసిరసము కొంచెము కొంచెముగ పోసి ఒక జాము నూరి మిరియాలంత మాత్రలుగ చేసి నీడన అరబెట్టి బుడ్డీలో భద్రపరిచేది. ఇందు 1/2 నుండి ఒక మాత్రవంతున తాటిబెల్లము, బూరాచక్కెర, వెన్న మున్నగు వానితో సేవించిన 13విధములైన సన్నిపాతములు, శైత్యములు, దోషములు, వాతరోగములు, వాయురోగములు- మున్నగునవి తీరును. రోగముయొక్క బలమునునుసరించి పథ్యము పెట్టవలెను.

38. తులసి స్వరసముతో ఈ క్రింది అగస్త్యరాజబేది మాత్రలు ఒకటి లేక రెండును సేవించిన ఒక ప్రక్కవచ్చు జ్వరము హరించును. అల్లపురసముతో సేవించిన రెండుప్రక్కల వచ్చుజ్వరముతీరును. బేదికి శుంఠి కషాయముతో సేవించేది. కడుపు నొప్పి కూడా హరించును.

**అగస్త్యులరాజ బేదిమాత్ర:-** బాగుగ శుద్ధిచేసిన పాదరసము $1^1/_4$ వరహాఎత్తు, శుద్ధిచేసిన గంధకము $1^1/_4$ వరహాఎత్తు, పొంగించిన వెలిగారము $1^1/_4$ వరహాఎతు. పెన్నేరుగడ్డ $1^1/_4$ వరహాఎత్తు, గట్టిమిరియాలు $1^1/_4$ వరహాఎత్తు- వీటినిగ్రహించి మొదట ఖల్వములోరస, గంధకములను పెట్టి మెత్తగానూరి కజ్జలిచేసి, ఆతరువాత యితర సరకులనువేసి శుద్ధోదకముతో మెత్తగనూరి శెనగల ప్రమాణము మాత్రలు చేసి నీడన ఆరబెట్టి భద్రపరచి వాడుకునేది.

39. ఈ దిగువచెప్పబడు తాళకసిందూరమును శివతులసి స్వరసముతో సేవించిన- శ్వాస, కాస, క్షయ, శ్లేష్మక్షయ హరించును. తులసిరసముతో యిచ్చిన చాతుర్థిక జ్వరము హరించును. మరియూ ఏనుగపల్లేరు రసముతో-రక్తక్షయం, కరక్కాయ చూర్ణముతో-శ్వాసక్షయం, పిప్పలి చూర్ణముతో-కాసక్షయ, నల్లవావిలి ఆకుచూర్ణముతో-శ్లేష్మ జ్వరము, వెన్నతో-ఎక్కిళ్ళు, వాంతులు, మదిచెక్కచూర్ణముతో-శుక్లమేహము, ప్రత్తివిత్తుల చూర్ణములో- బహుమూత్రము, ఉమ్మెత్తరసముతో-కృమి, కుష్ఠు,

తేలుమణి ఆకురసముతో-మూత్రకృచ్ఛ్రము, మేహరోగము, అగరుగంధపు చెక్క చూర్ణముతో-గ్రహణి- అనువ్యాధులు హరించును. ఇంకయూతగిన అనుపానభేదములచే అనేకరోగములు హరించును. క్షయరోగమునందిది శ్రేష్ఠమైన ఔషధము .

**తాళకసిందూరము:-** బాగుగ శుద్ధిచేసి ఒక విధముగకట్టినటువంటి తాళకము ఒకభాగము అందుకుసమము సున్నము గ్రహించి ఖల్వములో పెట్టి పైడిప్రత్తిపువ్వులరసముతో మూడుదినములు మర్దించి వుంటగచేసి వజ్రమూసలో పెట్టి మూతమూసి 3 చీలమన్నులేపనముచేసి లఘుపుటము వేయవలెను. ఇట్లు ఎనిమిది పుటములు వేసిన ఎర్రగ సిందూరించును. ఈ సిందూరమును సర్వరోగములందు పైచెప్పినరీతిగా వాడుకునేది.

**40.** తులసీదళములు, గానుగపిండి, మారేడువేరు పట్ట- ఇవిప్రతిదీ ఒక కర్షము తెచ్చి ఉముకనీటితో పిసికి ఒక అళాకురసముతీసి ఆ రసముతో ఈ క్రింద చెప్పబడిన చూర్ణమును 4గు.గి. ప్రమాణము సేవించిన మూత్రకృచ్ఛ్రము హరించును.

బాగుగా శుద్ధిచేసి భస్మముచేయుబడిన రసభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసిన వైలుతుత్తము, పొంగించినవెలిగారము- ఇవిసమభాగములు గ్రహించి ఖల్వములో పెట్టి పిల్లిపీచరవేళ్ళరసముతో 8 జాములు మెత్తగానూరి ముద్దచేసి ఆవనూనెతో ఒకజాముబండి దించి చూర్ణము చేసి భద్రపరచేది. ఈ చూర్ణమును తేనెతో గాని పై చెప్పిన రసముతో సేవించు చుండిన మూత్రకృచ్ఛ్రము హరించును.

**41.** తులసీదళముల స్వరసము కావలసినంత సేకరించి పెట్టుకునేది. బాగుగా శుద్ధిచేయబడినరసము, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసిన ఇంగ్లీకము, శుద్ధిచేసిన మణిశిల- ఇవిప్రతిదీ ఒక్కొక్క భాగము, శుద్ధిచేసిన మృద్దారుశింగు, శుద్ధిచేసినసీమరాతినార- ఇవిప్రతిదీ రెండు భాగములు గ్రహించి ఖల్వములో పెట్టి పై తులసిరసమును కొంచెము కొంచెముగ పోసి కాటుకవలెనూరి పిదప ఆరబెట్టి మరల వుమ్మెత్తాకు రసముతో కాటుకవలె నూరి మర్దించి కణికలు చేసి ఆరబెట్టి భద్రపరచేది. ఈ కణికలను అన్నపుతేటతో [illegible] సేవించిన ఉపదంశము హరించును. ప్రమాణము [illegible]

42. తులసి ఆకురసముతో ఒక పలము బాగుగా శుద్ధిచేసిన గంధకమును ఖల్వములో పెట్టి మూడు దినములు మర్దించి వుంటగ చేసి ఎండించి గట్టి గుడ్డలో మూటగట్టి డోలాయంత్రములో గోమూత్రముతో వండితీసి ఆగంధక మునకు సమము శుద్ధిచేసిన రసమును చేర్చి ఖల్వములో పెట్టి తులసి రసముతో ఒకదినము మర్దించి తరువాత అల్లమురసముతో (2) రెండు దినములు మర్దించి తీసి ఎండించి చూర్ణించుకుని అందుకు ఎనిమిదింట ఒకభాగము శుద్ధిచేసిన నేపాళవిత్తులను కలిపి అల్లపురసముతో (3) మూడుదినములు మర్దించి తీసి ఎండించి చూర్ణించి భద్రపరచుకునేది. ఈఔషధమును (4)నాలుగు వల్లముల ఎత్తును గ్రహించి బోడతరము లేక బ్రహ్మదండి రసముల అనుపానముతో వాడిన తిమిరముతో కూడిన ఉన్మాదములు, వాతశ్లేష్మము వలన కల్గినరోగములు నిస్సంశయముగ హరించును. శీతకరద్రవ్యములు, బఱ్ఱెపాలు, నెయ్యి, బోడతరపుకూర వీటిని సేవించవలయును. బ్రహ్మీఘృతము, పంచగవ్యఘృతము, విజయఘృతము, కళ్యాణఘృతము, దశమూలకషాయము, అల్లపురసము, పిప్పలి- వీటితో కూడ సేవించిన సర్వోన్మాదములు హరించును.

43. తులసి స్వరసముతో దిగువచెప్పబడిన గంధకతైలమును తగుమాత్రము సేవించిన తీట, గజ్జి, పుండ్లు, వ్రణములు మరియు పలురోగవములు తీరుటయేగాక వన్నెఎక్కించుటకు మిక్కిలి ప్రయోజనపడును.

**గంధకతైలము:-** నల్లకోడి గ్రుడ్లను-50తెచ్చి వుడుకబెట్టి తెల్లజనను తీసివేసి, పచ్చజననుమాత్రము గ్రహించి ఇనుప చట్టిలో పెట్టి వేపుడు పెట్టినతైలము వచ్చును. పక్వముగ ఆతైలమును సేకరించి భద్రపరచేది. పాలయందును. నెయ్యినందును, బాగుగశుద్ధిచేసి ఒకవిధముగ కట్టినగంధకమును పొడిచేసుకుని ఒక తెల్లని గుడ్డపై సమముగాపరచి వర్తివలె చుట్టి దానిపై తెల్లనిదారముతోనే కట్టి పైకోడిగుడ్లుతైలములో ముంచి ఒక రాత్రి వూరబెట్టి తీసి ఒక కొరడాతో పట్టి యుంచి ఒకకొసకు నిప్పుంటించి క్రింద పింగాణీ గిన్నెనుపెట్టి యుంచిన అందు తైలము పడును. ఆ తైలమునంతయూ సేకరించి బుడ్డీలో భద్రపరచుకుని పై వ్యాధులు యున్నగు వాటికి ఉపయోగించుకునేది.

44. **అయవీరసిందూరము:-** తులసిరసము, కూతురుబుడమరసము, అల్లపురసము- ఇవిప్రతిదీ అర్ధపడి వంతునగ్రహించి అన్నిటిని ఒకటిగకలిపి యుంచుకునేది. 3మూడుపలములు బాగుగా శుద్ధిచేసిన అయురాపొడిని

ఖల్వములో పెట్టి అందు $1^{1}/_{2}$ పలము నెల్లికాయగంధకము శుద్ధిచేసినదానిని చేర్చి సున్నపునీరుపోసి మూడుదినములునూరి చిన్నబిళ్ళలుగ చేసి ఆరబెట్టి ప్రమిదలోపెట్టి పైన ప్రమిదమూసి సంధి బంధనముచేసి చీలమన్నులేపనము చేసి (30) ముప్పదిపిడికలతో పుటము బెట్టి తీసిన మంచి సింధూర మైయుండును

| | |
|---|---|
| పైచెప్పిన అయః సిందూరము | $2^{1}/_{2}$ పలము |
| మంచిరససిందూరము | $2^{1}/_{2}$ పలము |
| బాగుగశుద్ధిచేసిన వీరము | $1^{1}/_{4}$ పలము |
| శుద్ధిచేసిన నాభి | $1^{1}/_{4}$ పలము- వీటినన్నింటిని |

ఖల్వములో పెట్టి పైచెప్పినతులస్యాదిరసములకలియికతో ఒకరోజుకు 2 లేక 3 జాములవంతున మెత్తగానూరేది. మొత్తము $1^{1}/_{2}$ పడి మూలికలరసముతో పైవిదముగ ఎన్నిదినములగునో అన్నిదినములు నూరవలయును. బాగుగనూరిన తరువాత తీసి ఆరబెట్టి మరల మెత్తగనూరి శుభ్రమైన సీసాలో జాగ్రత్తపరచేది. ఈ సిందూరములో కొంచెముతీసి నీళ్ళలోవేసిన అదిపైన తేలవలయును. అట్లు తెలిననే సరియైన సిందూరము లేనియెడల మరలపై విధముగ పైమూడుమూలికలరసముతో కొన్ని దినములు నూరవలయును. లేక సిందూరము నీళ్ళలో తేలునంతవరకు నూరవలయును. దానిని తీసి భద్రపరచేది.

ఈ సిందూరములో కందిపప్పంతసిందూరమును ప్రుదయము సాయంత్రము తగిన అనుపానముతో సేవించవలయును. దీని వలన ప్రసవజ్వరము, జన్ని, ప్రసవమైల వలన కల్గుసూతకజన్ని, కాస మున్నగు శీతలరోగములు గుణమగును.

45. తులసి స్వరసము లేక కుక్కతులసి స్వరసముతో ఈ దిగువ చెప్పబడుకస్తూరి మాత్రలను సేవించిన బిడ్డలకు కలుగు ఎటువంటి జ్వరమైననూ తీరును.

**కస్తూరిమాత్రలు:-** కస్తూరి-3గు. గి.ఎత్తు, గోరోజనము 1 / 4 వరహాఎత్తు, పచ్చకర్పూరము 1 / 2 వరహాఎత్తు, కుంకుమపువ్వు 1 / 2 వరహాఎత్తు, సాంబ్రాణి పతంగం 1 / 2 వరహాఎత్తు, తాళిసపత్రి 1 / 4 వరహాఎత్తు, పిప్పళ్ళు 1 / 4 వరహాఎత్తు, అక్కలకర్ర 1 / 4 వరహాఎత్తు, జాజికాయ 1 / 4

వరహాఎత్తు, లవంగపట్ట 3 / 4 వరహాఎత్తు, జటామాంసి, 1 / 4 వరహాఎత్తు, జున్ను 4 వరహాఎత్తు, బాగుగాశుద్ధిచేసిన రససిందూరము 8 వరహాఎత్తు, వీటిలో చూర్ణించవలసిన వాటిని మెత్తగాచూర్ణించి మిగిలినవాటిని ఈశ్వరివేరు కషాయముతో నూరి అన్నిటిని ఒకటిగ కలిపి కృష్ణతులసివేరు, ఈశ్వరివేరు సమభాగము కషాయముతో మరలనూరి మాత్రాపక్వమున పచ్చిపెసలు, ఉద్దులు ప్రమాణము మాత్రలుచేసి నీడన ఆరబెట్టి భద్రపరచేది.

**ప్రమాణము:**- పుట్టిన నాటినుండి ఆరుమాసముల వరకు పూటకు 1 / 2 మాత్ర, ఆరునెలల నుండి ఒక సంవత్సరము వరకు 3 / 4 మాత్ర, ఒక సంవత్సరమునకుపైన 5 సం॥లోపు ఒక మాత్ర అంతకుపైబడినవారికి 2 లేక 3 మాత్రలు సమయానుకూల ముగ యిచ్చేది. పెద్దవారికి ఉద్దులంతమాత్రలు 2 లేక 3 యిచ్చేది. దీనిసేవనవలన కఠిన జలదోషము, జ్వరము, తలనొప్పి, చేతులు, కాళ్ళు నీరసము, శైత్యము మున్నగునవి హరించును.

**ఇతరప్రయోగములు:**- (1) బాగుగా శుద్ధిచేసిచేసిన ఇంగ్లీకసిందూరము 1 / 2 గు. గి. ఎత్తుతో ఒక మాత్రచేర్చి తులసి రసము, తేనెతో మర్దించి దినమునకు 2, 3 పూటలు వంతున 3 దినములు సేవించిన అసాధ్యజ్వరములు హరించును. (2) కూతురుబుడమ ఆకురసములో ఇనుపశలాకును కాల్చివుంచి వడియకట్టిన రసముతో ఈ మాత్రను నూరియిచ్చిన బిడ్డలకు రొమ్ములో శ్లేష్మము అధికముగ యున్న దానిని హరింపచేయును. (3) తులసి, తుమ్మిపువ్వు-ఈ రెంటిని పిట్టుబెట్టి తీసిపిండిన రసముతో ఈ మాత్రను సాదియిచ్చిన బిడ్డలకు కలుగు ఈడ్పు, జన్నిసంబంధమైన వ్యాధులు హరించును. (4) తులసి స్వరసము, కాడిలేకబ్రాందితో ఈ మాత్రలు రెండు సాది నెత్తిపై పట్టువేసిన బిడ్డలకు తలపోటుయుండిన హరించును.

**పథ్యము:**- పులుపు, టెంకాయ, మామిడికాయ, పిండిపదార్థములు, గుడ్లు, శెనగలు, అనపగింజలు,-పాతఅన్నము, చేపలు, ఎండుచేపలు, నూగులు, ఉలవలు మున్నగునవి వాడరాదు. తల్లిపాలు తాగుబిడ్డలకు ఈ మాత్రలు యిచ్చునపుడు వ్యాధి హరించు వరకు తల్లి కూడా పైవాటిని వాడరాదు.

46. మరియొకవిధమైన కస్తూరి మాత్రలు:-(1) కస్తూరి 1 / 8 వరహాఎత్తు (2) గోరోజనం 1 / 4 వరహాఎత్తు, (3) కుంకుమపువ్వు 1 / 2 వ.ఎత్తు (4) పచ్చకర్పూరము, అతిమధురము, పిప్పళ్ళు, కోష్టు, అక్కలకర్ర, లవంగములు, పొంగించినవెలిగారము- ఇవిప్రతిదీ 1 / 2 వరహాఎత్తు బాగుగాశుద్ధిచేసిన వళందా ఇంగ్లీకము ఒకవరహాఎత్తు- వీటిని గ్రహించి ఇందు

ఇంగ్లీకమును ఖల్వములో పెట్టి చనుపాలతో మెత్తగనూరి ఆరబెట్టి తీసి అల్లపురసముతో నూరి ఆరబెట్టి తీసి కృష్ణతులసి రసముతో నూరి తరువాత మిగత వాటిని వేసి చనుపాలు, అల్లపురసము, కృష్ణతులసిరసములతో కలియునట్లు నూరి అన్ని కలిసినతరువాత చనుపాలతో రెండు జాములు, విడువకమైనపక్వముగనూరి ఉద్దులు ప్రమాణము మాత్రలు చేసి నీడన ఆరబెట్టి భద్రపరచేది.

**ప్రమాణము:-** 1/2 మాత్ర నుండి 2మాత్రలవరకు వయస్సును అనుసరించి యిచ్చేది.

**ప్రయోగము:-** తులసిరసము లేక కుక్కతులసిరసముతో తగుమాత్రము యిచ్చిన పసిబిడ్డలకు వచ్చు ఎటువంటి జ్వరమైననూ గుణమగును. తులసి, కుక్కతులసి దొరకనికాలములందు తేనె, చనుపాలతో సాదియిచ్చేది.

**పథ్యము:-** బిడ్డలకు వాడునపుడు వ్యాధి హరించువరకు పులుపు చేర్చక తల్లి ఇచ్చు పథ్యముగ యుండుట చాలమంచిది.

**47. తులసిరసముతో చేయబడు తామ్రమైనము:-** (అనుభవసిద్ధయోగము) బాగుగా శుద్ధిచేసిన తామ్రమును సన్నని రాపాడి చేసినది 4తులములు. బాగుగ శుద్ధిచేసినగంధకము 4తులములు చూర్ణము చేసుకొనేది. ఈ రెంటినీ ఒక పింగాణిగిన్నెలో పెట్టి అవిమునుగునట్లు పండురసముపోసి, ఎండలో ఆరబెట్టేది. ఆరినతరువాత తీసి కృష్ణతులసీ దళముల స్వరసముపోసి ఆరబెట్టేది. ఈరెండు రసములచే భావనచేయబడిన పైసరకులు బాగుగా కలియునట్లు కలిపి ఆతరువాత కుప్పింట రసముపోసి ఎండలోపెట్టేది. బాగుగా ఆరిన తరువాత పైరసములతో వూరిన సరకులన్నింటిని భద్రముగ తీసి ఖల్వములో పెట్టి అందు 1/4 తులము పచ్చకర్పూరము పొడిచేసి కలిపి తేనెతో 4 నాలుగుజాములు మెత్తగానూరి మైనపక్వముగ తీసి భద్రపరచేది.

**ప్రయోగము:-** పూటకు కందిగింజప్రమాణము తగు అనుపానములతో రోజుకురెండు పూటలు వంతున 5లేక 7దినములు వాడిన జ్వరము, శూల,పాండు, కీళ్ళవాతము, కుష్టు, పక్కవాతము, బోదకాలు, మెహపాడలు మున్నగునవి హరించును. వ్యాధిననుసరించి పథ్యము పెట్టవలయును.

**48.** తులసిస్వరసము 4తులములు, బాగుగశుద్ధిచేసినరజితరజను ఒక తులము ఖల్వములో పెట్టి పైరసము కొంచము కొంచముగ పోసి మెత్తగనూరి

బిళ్ళుచేసి ప్రమిదలో పెట్టి పైనప్రమిదవమూసి సంధిబంధనవము చేసి 3చీలమన్నులేపనము చేసి 2శేర్లు పిడకలతో పుటమువేసేది. ఇట్లు 6లేక 7పుటములు వేసిన మంచి భస్మమగును.

**ప్రమాణము- అనుపానములు:-** ఒక గురుగింజంత భస్మమును ఆవువెన్నతో గాని, పాలమీగడతోగాని, సేవించిన నరములకు బలమువచ్చును. ఉష్ణముతగ్గును. వీర్య స్తంభనమగును. సెగవ్యాధులు హరించును.

**రజితవటి:-** నాగకేసరములు, చిన్నఏలకులు, తెల్లకాచు, వెదురుప్పు-ఇవి ప్రతిదీ ఒకమాషము, పైరజితభస్మము ఒక గురిగింజంత అన్నిటిని మెత్తగచూర్ణించి యిచ్చుచుండిన, గనేరియాతప్పక హరించును. (ఒకపూటకు యిది ప్రమాణము).

49. తెల్ల తులసిరసము $1^1/_2$వరహాఎత్తు, తేనె అందుకు సమము-ఈరెంటిని చేర్చి దిగువ తెలుపబడిన సంజీవిమాత్రను చేర్చి ఉదయం, సాయంత్రం రెండు పూటలు వంతున 3దినముల నుండి 7దినములవరకు వుపయోగించిన అన్ని విధములైన చలిజ్వరములు, 13సన్నిపాతములు మున్నగునవితీరును.

**సంజీవిమాత్ర:-** బాగుగాశుద్ధిచేసినరసము, శుద్ధిచేసిన నెల్లికాయగంధకము శు॥తెల్ల నాభి, శు॥ నల్లనాభి, లవంగములు, శు॥ అభిని, శు॥ మయిలతుత్తము, శు॥ పాలతుత్థము, శు॥ మణిశిల॥, శు॥ ఇందుప్పు, శు॥ జాతిలింగము, శు॥ తెల్లపాషాణము శు॥ దొడ్డిపాషాణము, శు॥ తాళకము, శు॥ అన్నభేది, పైతోలు తీసిన శుంఠి, మిరియాలు, పిపళ్ళు, కోష్టు, వస, కురసానిఓమము, తాణికాయబెరడు, శు॥ వెలిగారము, శు॥ సీమసౌకారము, చందనము, పచ్చకర్పూరము, శు॥ గౌరీపాషాణము, పీతరోహిణి, అక్కలకర్ర, కటుకరోహిణి, జాజికాయ, ఇంగువ, శు॥ నేపాళపప్పు, చిత్రమూలము వేరు పైపట్ట-ఇవి ప్రతిదీ ఒకవరహా ఎత్తుగ్రహించవలయును. ఈసరకులన్నింటిని ప్రతిదానిని బాగుగా శుద్ధిచేసినవియే గ్రహించవలయును. వీటిని ప్రత్యేకముగ చూర్ణించి అన్నిటిని ఒకటిగ కలిపి ఖల్వములోరెండుగంటలసేపు అన్నికలియునట్లు మెత్తగ నూరిన తరువాత గుంట గలిజేరు రసము (పసుపు గలిజేరురసము (శ్రేష్టము) కొంచెము కొంచెముగ పోయుచు ఒకజామునూరి ఆరబెట్టి తీసి కృష్ణతులసిరసముతో ఒక జామునూరి మరల తెల్లవావిలియాకు స్వరసమును కొంచెము కొంచెముగ పోయుచూ నాలుగు జాములు కాటుకవలెనూరి, చిన్నముడి పెసలప్రమాణము మాత్రలు చేసి నీడన ఆరబెట్టి శుభ్రమైన గాజుబుడ్డీలో భద్రపరచేది.

ప్రమాణము:- 1/2 నుండి 1 మాత్ర

**అనుపానములు- ప్రయోగములు:-** (1) తుత్తి ఆకురసము, తేనె- దీనితో తగుమాత్రము మాత్రను కలిపి 40 దినములు సేవించిన కృశించిన శరీరము బలపడును.

(2) తంగేడు ఆకురసము, తేనె సమము కలిపి తగుప్రమాణము మాత్రను కలిపి ఉదయం, సాయంత్రంవంతున 3 మండలములు సేవించిన ప్రమేహములు హృదయరోగములు, మూత్రపిండముల రోగములు మారియూ వీటికి సంబంధ పడిన అన్ని రోగములు గుణమై శరీరమునకు, మనస్సునకు బలము కల్గును.

(3) తేనె- మంచినీళ్ళు- సమముకలిపి అందుపైమాత్ర తగుమాత్రము కలిపి ఉదయం, సాయంత్రం వంతున రెండు మండలములు సేవించిన అధికముగ లావైన శరీరము సన్నమై మంచి బలముకల్గును.

(4) అల్లమురసము, తేనె- సమముచేర్చి తగుప్రమాణము పైమాత్రనుచేర్చి ఉదయము, సాయంత్రము వంతున 3 నుండి 7 దినములవరకు సమయోచితముగ వుపయోగించిన 64 విదములైన జ్వరములు హరించును.

(5) ఆవుపాలు 1 ఆళాకు, నిమ్మపండురసము 1 ఆళాకు, మంచినూనె 1 ఆళాకు, పైమాత్ర 1/4 వరహాఎత్తు- వీటిని ఒకటిగ కలిపి పొయ్యిపై పెట్టి కాచి తైల పక్వముగ కాచి దించి వడియకట్టి శుభ్రమైన బుడ్డీలో భద్రపరచేది. ఈ తైలము ఒకచుక్క కంటిలో వేయుచుండిన నేత్రదోషములు, అంధత్వము మున్నగునవి హరించును. ఇదేవిదముగ నిమ్మపండురసమునకు బదులు గుంటగలిజేరు రసముతో కలిపి కాచి దించి వడియకట్టి భద్రపరచి ఆతైలములో ఒక చుక్కను ఉదయము, సాయంత్రము కంటిలో వేయుచుండిన వ్రణశుక్రము, నేత్రకాస, చూపుమందము మున్నగునవి హరించును.

(6) తెల్లవావిలి ఆకురసము $1^1/_2$ వరహాఎత్తు, తేనె $1^1/_2$ వరహాఎత్తు- చేర్చిపై మాత్రను తగుప్రమాణము చేర్చి సేవించిన శ్వాస, ఎగశ్వాస. ఆయాసము, శ్వాస అడ్డుపడుట, శ్వాసబయటకు రాకుండుట మున్నగు రోగములు హరించును. వైద్యశేఖరులు దీనిప్రాశస్త్యమును గమనించి తగిన అనుపానములతో వాడిన అనేకరోగములను పొగొట్టును.

# శిశురోగచికిత్స ప్రకరణమున పేర్కొన బడిన ప్రత్యేక వ్యాధులు, మాంద్య వ్యాధుల వివరణ. ప్రత్యేకముగ సిద్ధవైద్యమునందు చెప్పబడినవి.

**1. ఆమజన్నిలక్షణములు:-** శిశువు చనుకుడువదు. కండ్లుతెరవకనే మైకములో నుండును. ముఖము ఒక మాదిరిగ వుండును. పలువిధములైన నొప్పులుండును. గొంతు బొంగురు పోవును. మలబంధముండును. జ్వరము వచ్చును. కడుపువుబ్బును. నెత్తి నొప్పియుండును.

**2. సుళ్ళిమాందలక్షణములు:-** విషజ్వరమువచ్చును. ఉచ్చి (అనగతలపై మాడు) గుంతపడును, ముఖము, రొమ్మునందు వాపుకలుగును. చున్నుకుడువదు. అదిరిపడును. నోటిలో నురుగుకట్టును. వాతికలుగును. కడుపు, గొంతు, నాలుక- వీటియందు వ్రణముకలుగును. ప్రాణాపాయ మేర్పడును. (సుళ్ళి=సుడి).

**3. వరిట్చిమాందలక్షణములు:-** శరీరమంతయూవాడును. శిశువుశ్వాసతో దగ్గును. నాలిక ఎండి పోవును. కడుపులో శబ్దము కల్గును. వుబ్బును. నాలికపై పసుపుగ లేక తెల్లగను ముండ్లుకలిగి మధ్యనమాడు పగుళ్ళుండును. దగ్గు, కఫము అధికముండును. మైకము వుండును. శరీరము కృశించును. ముఖము పసుపు వర్ణముగ వుండును. కాళ్ళుచేతులు వాచుట మున్నగులక్షణములుండును. (వరట్చి=ఎండుట).

**4. సుళ్ళికృశైలక్షణములు:-** ఇందు శ్వాస, దగ్గు కలుగును. రొమ్ముఎండిపోవును. బిడ్డపాలుత్రాగదు. ఎగశ్వాస, కాళ్ళు, చేతులు చల్లగయుండును. కడుపుబ్బరము జ్వరము వుండును. బేదియగును, కండ్లు చుట్టును.



శిశువులమాందరోగములు ఇరవైయొక్క విధములని తమిళగ్రంథములందున్నవి. ఇవిగాకరోగములనుబట్టి వీటి పేర్లు పెట్టబడియున్నవి. మాందరోగమును ఆంగ్లమున "A Disease in children Caused by Fermentation of acids in the stomach due to Fermentation of food. zymotic Diseases." అనిచెప్పవచ్చును. మాందరోగములన్నింటియందును ఈ క్రింది లక్షణములుండును. శరీరముకృశించును. శరీరము, నోరు, ముఖము వీటియందు దుర్గంధము, మైకము, కాళ్ళుచేతులు చల్లబడుట, పాలుత్రాగకుండుట, నోరు, నాలుక ఎండుట, ముఖము, రొమ్ము చేతులు కాళ్ళయందు వాపు కలుగుట, వాంతి కల్గుట, గొంతు బొంగురుపోవుట, దగ్గు, బేదియగుట, ఏడ్చుచుండుట, కండ్లు తిరుగుట, వివిధరంగులతో, శీతముతో, నీళ్ళవలె బేదియగుట, మరియూ ఇంకనూ ఆనేక లక్షణములు యుండును. మాందరోగభేదములు:

| | | | |
|---|---|---|---|
| 1. వాతమాందము | 2. పిత్తమాందము | 3. శ్లేష్మమాందము | 4. విషమాందము |
| 5. పోర్మాందము | 6. జ్వరమాందము | 7. నీర్మాందము | 8.సొరియామాందము |
| 9. కట్టుమాందము | 10. పాల్మాందము | 11. ఎరిమాందము | 12. తులైమాందము |
| 13. తలైమాందము | 14. గణమాందము | 15. వలిప్పుమాందము | 16. సుళ్ళిమాందము |
| 17. ముక్కుమాందము | 18. జన్నిమాందము | 19.ఊదుమాందము | 20. పీక్కుమాందము |
| 21. ఉబ్బుమాందము | 22. అడైమాందము | 23. అట్చు అక్కురమాందము | 24. అల్లుమాందము |
| 25. ఉలైమాందము | 26. బేదిమాందము | 27. గణైమాందము | 28. కళ్ళిమాందము |
| 29. పులిమాందము | 30. పేయ్మాందము | 31. మలడిమాందము3 | 32. వాల్మాందము |
| 33. సన్నిపాతమాందము | 34. ఇళ్ళుప్పుమాందము | 35. సత్తిమాందము | 36. దోషమాందము |
| 37. కల్మాందము | 38. పుబ్బుల్మాందము | 39.వాంతిమాందము | 40.వరట్చిమాందము |
| 41. తిట్టుమాందము | 42. నీర్గణమాందము | 43. గర్భమాందము మునగునవి. | |



శ్లో॥ సర్వేచ సుఖినస్సంతు। సర్వేసంతు నిరామయాః।

సర్వే భద్రాణి పశ్యంతు। మాకశ్చి దుఃఖ భాగ్భవేత్॥

ఓమ్

శ్రీ

అమృత తులసి

సంపూర్ణము



# శ్రీ అమృత తులసి

## ఉదాహృత గ్రంథానుక్రమణిక

పూజ్యులు, గౌరవనీయులు, శ్రీశ్రీ.వి.రా. అచార్య వారి వద్దయుండిన ఈ క్రింది గ్రంథములనుండి సంకలనము చేయబడినవి.

| వ సం. | గ్రంథము పేరు |
|---|---|
| 1. | శ్రీవిష్ణు పురాణము |
| 2. | స్కాంద పురాణము |
| 3. | మహానారాయణోపనిషత్తు |
| 4. | పద్మ పురాణము |
| 5. | అగస్త్య సంహిత |
| 6. | బ్రహ్మవైవర్తపురాణము |
| 7. | గణేశఖండము |
| 8. | గరుడ పురాణము |
| 9. | మత్స్య సూక్తము |
| 10. | రామ రహస్యోపనిషత్తు |
| 11. | దేవీ భాగవతము |
| 12. | బృహత్ స్తోత్రరత్నాకరము |
| 13. | బ్రహ్మవైవర్త పురాణము |
| 14. | తులసి గీత |
| 15. | దత్తాత్రేయ తంత్రము |
| 16. | బ్రహ్మాండ పురాణము |
| 17. | హరిభక్తి విలాసము |
| 18. | విష్ణు యామళము |
| 19. | భవిష్యోత్తర పురాణము; ఇవిగాక వారి వద్ద ఇంకయూ నేక పురాణ, ఉపనిషత్తులనుండి ఉదహరించబడినవి. |

## తెలుగు వైద్య గ్రంథములు (మావద్దయుండునవి)

| | |
|---|---|
| 20. | చరక సంహిత |
| 21. | సుశ్రుత సంహిత |
| 22. | అష్టాంగ హృదయము |
| 23 | అష్టాంగ సంగ్రహము |
| 24. | వస్తుగుణ దీపిక |
| 25. | వస్తుగుణ ప్రకాశిక |
| 26. | సర్వౌషదీ గుణ కల్పము |
| 27 | ధన్వంతరి నిఘంటువు |
| 28. | గుణ పాఠము |
| 29. | ఆనంద కందము |
| 30. | బసవరాజీయము |
| 31. | రసరత్న సముచ్చయము. |

## తమిళ వైద్యగ్రంథములు

| వ సం. | గ్రంథము పేరు |
|---|---|
| 32. | అగస్త్యముని వైద్యగ్రంథములు. 40. |
| 33. | యాకోబు వైద్యగ్రంథములు. 13 |
| 34. | భోగఋషి వైద్యగ్రంథములు.7. |
| 35. | శరభేంద్ర వైద్యమురైగళ్. 17.భా. |
| 36. | అనుభోగ వైద్యనవనీతము. 10. భా |
| 37. | శ్రీ ధన్వంతరి వైద్యము. 4. భా |
| 38. | తేరైయ్యర్ వైద్యగ్రంథములు. 10.భా. |
| 39. | అనుభవ వైద్యము .2.భా |
| 40. | కొంకణ ఋషి వాదకావ్యము. 3.భా. |
| 41. | యూగిముని వైద్యగ్రంథములు. 4.భా. |
| 42. | నోయ్‌గలుక్కు సిద్ధ పరిహారం. 2. భా |
| 43. | శట్టముని నిఘంటు |
| 44. | ఆత్మ రక్షామృతము |
| 45. | సిద్ధ వైద్య ఆగరాధి( టి.వి.ఎస్. పిళ్ళై) . 5.భా. |

## English Medical Books

| | |
|---|---|
| 46. | Compendium of Indian Medicinal Plants.4 Vol. |
| 47. | Medicinal Plants of India(Govt. Edn) 2 Vol |
| 48. | Medicinal Plants of India & Pak., |
| 49. | Boericks Materia Medica |
| 50. | Drugs of Hindustan |
| 51. | Modern Herbal |
| 52. | Herbs that Heal |
| 53. | Glossary of Indian Medicinal Plants . 2 Vol. |

## JOURNALS

| | |
|---|---|
| 54. | శ్రీ ధన్వంతరి (తెలుగు). 10.భా. |
| 55. | నాగార్జున (తెలుగు). 10.భా. |
| 56. | మూలికై మణి(తమిళం). 29.భా. |
| 57. | సిద్ధమరుత్తువం (తమిళం). 12.భా. |
| 58. | సిద్ధర్ శెయల్ (తమిళం). 6.భా. |
| 59. | తిరుఅరుట్పా (తమిళం) |
| 60. | సూర్యారాయ ఆంధ్రనిఘంటువు .8.భా |

ఇంకయూ 200లకు పైబడిన తెలుగు, తమిళ,ఆంగ్ల వైద్య, అధ్యాత్మిక గ్రంథములు.

## Blessings ఆశీర్వచనములు

*Sri Chandramouleesvaraya Namaha*

SANKARA BHAGAVADPADACHARYA PARAMPARAGATHA

*His Holiness*

*Sri Kanchi Kamakoti peetadhipathi*

*Jagadguru* **Sri Sankara Charya Swamigal**

*Srimatam Samsthanam*

*Kancheepuram - 631502*

Date: 31-10-94

Dear Blessed devotee *Dr. T.K. Giridharan*

"***Sri Charanamu***" & Your Letter dated 17-10-94

Was Placed Before His Holiness.

Prasadam blessed by His Holiness is enclosed.

(sd) Manager.

---

## "శ్రీ చరణము" అను గ్రంథముపై ప్రముఖుల మరియూ పత్రికలవారి అభిప్రాయములు

స్వామిరామకృష్ణానంద, తేది: 9-4-1995

శ్రీ రామకృష్ణ సేవాశ్రమము.

స్థాపకులు, అధ్యక్షులు,

పాలకలయ్యల్లంపల్లె, యల్లంపల్లె,

కొత్తూరు పోస్టు, బరాల, చిత్తూరు జిల్లా ఆ. ప్ర.

అనేకమంది మహాత్ములశాస్త్రముల అమూల్య వాక్యముల సేకరించి రచయిత ఆంధ్రలోకమునకు మహోపకృతి చేసి యున్నారు. డాక్టరు టి.కె. గిరిధరన్ గారు శ్రీ చరణము అను గ్రంథములో ప్రథమ భాగము ఆరోగ్యమే మహాభాగ్యమని పెద్దలు చెప్పిన విధముగ అనేక ఆరోగ్యసూత్రములను వ్రాసియున్నారు. సూర్యోదయము మొదలుకొని పరుండబోవు వరకు ప్రతి ఒక్కరు నడువవలసిన విధానములను ఆచరణ యోగ్యమైనవి సులభశైలిలో ఎక్కువప్రయోజనమును కలుగచేయునవి, పురాతనధర్మములను తెలిపి యున్నారు. అవి ఆచరించిన వారు తప్పక ఆరోగ్యముగ వుందురని అనుభవపూర్వకముగాచెప్పుచున్నాము. శ్రీ చరణము అనే గ్రంథములో వేమనయోగి పద్యరత్నములు, పతంజలి యోగ సూత్రములును గురించి ఇంకను అనేక శాస్త్రములోని విషయములు చెప్పబడియున్నది.......... ..........దుర్లభమైనమానవజన్మ ఎత్తి నందులకు దానిని సద్వినియోగము చేసుకోవలెనన్న ఈ గ్రంథమును పఠించి అందలి ధర్మములను అచరించుటద్వారా ఆరోగ్యముగా వుండుటయేగాక అందలి నీతులను గ్రహించి హృదయములను సంస్కరించుకొనుట ద్వారా ఆధ్యాత్మిక క్షేత్రమున గొప్పపురోభివృద్ధిని సాధించగలరని విశ్వసించుచున్నాను.

ఓం తత్ సత్ *Yours at the feet of the Lord*

ఓం శాంతి: శాంతి: శాంతి: (sd) Ramakrishnananda

డా॥ పి. బాలయ్య, ఎం.బి.బి.యస్., డిపిహెచ్., చిత్తూరు.
పురపాలిక ఆరోగ్యాధికారి, తేది: 20-4-1995

# దివ్య సందేశము

ఆయుర్వేద. హోమియోపతి వైద్యులు శ్రీ టి.కె. గిరిధరన్ గారిచే రచించబడిన "శ్రీ చరణము" అను గ్రంథమును చదవడమైనది.

ఈ గ్రంథము సులభశైలిలో, సుభోదమైయున్నది. మానవుడు మరణమునుండి విముక్తి, పొందుటకు తాను ప్రతిదినము ఉదయములేచినది మొదలు రాత్రి పరుండబోవు వఱకుచేయవలసిన కార్యక్రమములు, పాటించవలసిన నియమ నిబంధనలు అనుసరణీయమైనదియేగాక తప్పక పాటించినచో తాను జీవించవలసిన 125 సం॥కాలములో ఏవ్యాధులు దరిచేరవు యనియే చెప్పవచ్చును. రోగములు లేనివాడే యోగాభ్యాసము చేయుటకు అర్హుడగుచున్నాడు. ఆరోగ్యవంతుడైన మానవుడు ఈ గ్రంథము నందలి యోగమార్గ అధ్యాయమునందలి సూచనలను. అష్టాంగ యోగమును ప్రయత్నముచే అనుష్ఠించుటకు ప్రారంభించి విడువక సాధన చేయుచుండిన తప్పక గ్రంథనామమైన "శ్రీ చరణము" ను పొందుదురని మనవి చేయుచున్నాను.

ఆధ్యాత్మిక జీవితమునందు జీవన్ముక్తి పొందుటయే ఈ గ్రంథరాజ సారాంశము. కడపటి అధ్యాయములో చెప్పబడిన రసాయనములు, కల్పములు, సిధూరములన్నియూ సుప్రసిద్ధమైనవి. వాటిని సేవించుటవలన దీర్ఘాయువు కలిగి యొగసాధనకు అనుకూలముగ యుండుననియే చెప్పవచ్చును.

ప్రతి గృహస్థులు. అధ్యాత్మిక జిజ్ఞాసగల పాఠకులందరూ తప్పక చదువవదగిన గ్రంథమిదియని నుడువుచూ, పాఠకులందరికీ ఆయురారోగ్య ఐశ్వర్యములను, భక్తి, జ్ఞానములను సాధించ వలసినదిగా ఆ పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

తేది: 20-4-95 (సం) పి.
బాలయ్య
ఆరోగ్యాధికారి, చిత్తూరు పురపాలిక.

## యథార్థ భారతి

గ్రంథసమీక్ష

శ్రీ యువనామ సం॥జ్యేష్ఠం, జూన్ 1995 సమీక్షకులు. - శ్రీ కె. వెంకటరెడ్డి గారు.

**"శ్రీ చరణము"** రచన, సంకలనము, వ్యాఖ్యాత, శ్రీ డా॥ టి.కె. గిరిధరన్.

మానసిక దైహికారోగ్యములు మానవునకు యిహపర సాధకములు. కావున అవశ్యం వీని రక్షించుకొనుట మానవుని ముఖ్యకర్తవ్యము అందుకే శాస్త్రంగూడ "శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్" అని అంటున్నది. గ్రథంకర్త ఈ విషయాన్ని రూఢిపరుస్తూ మానవుడు శారీరక

మానసిక ఆరోగ్యములను పరిరక్షించు కొనుటకు స్వానుభవమును, శాస్త్రానుభవమును జోడించి పలుఉపాయములను తెలిపియున్నారు. కావున శ్రద్ధతో గ్రంథమును పఠించి గ్రంథకర్త సూచనలను పరిశీలించి ఆరోగ్యవంతులై ఆత్మదర్శనము చేయండి.



జ్యోతిష విజ్ఞాన పత్రిక 10-7-1995

గ్రంథ సమీక్ష

**"శ్రీ చరణము" రచన: డా॥ టి.కె. గిరిధరన్**

***డాక్టర్ టి.కె. గిరిధరన్*** గారు పంపిన శ్రీచరణము అనెడి గ్రంథము అందినది. శ్రీ చరణము అనగా లక్ష్మీదేవిపాదము. దానిని చేరుటకయి ఈ గ్రంథము రచింపబడినదనుభావమును వారు పీఠికలో పేర్కొనిరి. ఇందు మూడుభాగములున్నవి. మొదటి భాగములో ఉదయము మేలుకొనుట నుండి రాత్రినిదురింపబోవు వరకు చేయవలసిన పనులను వివరించుట జరిగినది.

దంతధావనముకు మేలైన పద్ధతులు చెప్పబడినవి. కొంచెము శ్రమ కోర్చి అందులో చెప్పబడిన దంతచూర్ణములను తయారు చేసికొనినచో ఆరోగ్యము కలుగుటయేగాక ఖర్చు కూడాతగ్గును. ఆహార నియమములను వివరించుచు నేటి ప్రజలలో వాడుకలో లేనికొన్ని ఆకుకూరలను పేర్కొని వానిని వాడుట వలన కలుగు ప్రయోజనములు వివరింపబడినవి. అట్లే కూరలకు ఉపయోగపడు కాయల విషయమునగూడ 76,77 పేజీలలో కొన్నిచే యగూడని పనులు పేర్కొనబడినవి. వానిలో కొన్ని ఒకసారి కాచి చల్లార్చిన నీటిని మరల కాచి త్రాగకూడదు. అరటిపండును మజ్జిగపెరుగులతో తినకూడదు. నువ్వుల నూనేతో చేయబడిన గోధుమ వంటకములను తినకూడదు. తిన్నచో కంటిజబ్బులు కలుగును. ఇవి నేటివారు తరచుగా చేయుచున్న కొన్ని కూడనిపనులు. ఈ విధముగా మొదటి భాగములో దినకృత్యములన్నియు వివరింపబడి నవి.

రెండవ భాగములో అష్టాంగ యోగమును గూర్చియు, నిత్యా నిత్యవస్తు వివేకము, వైరాగ్యము మున్నగు వానిని గూర్చి వివరింపబడినది. ఆరోగ్యవంతుడైన మానవుడు ఆరోగ్యముతో తృప్తి నొందక ఆత్మసాక్షాత్కారమునకు ప్రయత్నింపవలయునను భావముతో ఈ భాగము రచింపబడినట్లు తోచుచున్నది.

మూడవ భాగమునందు శరీరమునకు బలముకలిగించు కొన్ని రసాయనములు, ఔషధయోగములు పేర్కొనబడినవి.

ఎడనెడ సంస్కృత శ్లోకములు తమిళ పద్యములు, వేమన పద్యములు, కొన్ని ఆంగ్ల పంక్తులు ఉదాహరింపబడినవి. ఈ గ్రంథము అచ్చుగుటకు తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఆర్థిక సహాయము చేసిరి. ఐహికాముష్మిక ప్రయోజనములను పొందగోరువారు కొన్ని విశేషములు ఈ గ్రంథము వలన తెలిసికొనవచ్చుననుటలో సందేహము లేదు.

డా॥ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ M.A., P.HD.,

## శ్రీ రామకృష్ణ ప్రభ సెప్టెంబర్ 1995

### గ్రంథపరిచయం

"శ్రీ చరణము" రచన, సంకలనము, వ్యాఖ్యాత: Dr. T.K. Giridharan, AMIH., HMDS.,

అన్ని జన్మల్లోకి మానవజన్మ ఉత్తమోత్తమమైంది. అట్టిజన్మను సార్థకం చేసుకోడమే మానవధర్మం. చీటికిమాటికి దేహం ఆదివ్యాధులతో చికాకు పెట్టకుండా, ఆహార విహారాల్లో నియమనిబంధనలు పాటించడం, మానసిక స్వస్థతను కలిగించే ఆధ్యాత్మిక చింతన ఉంటేనే అదిసాధ్యం. ధర్మాచరణకు, యోగసాధనకు శరీరం ముఖ్యపరికరం. కనుక అందరూ ఆరోగ్యవంతులై, జ్ఞానవంతులై, ధర్మతత్పరులై జీవించాలని- భగవత్కృపాపాత్రులు కావాలని ఈ గ్రంథరచనలోని ఉద్దేశం. ఇందులో మానవుడు నిత్యజీవితంలో పాటించాల్సినవిధులు యమ-నియమ-ప్రాణయామ-ధారణ-జ్ఞాన వైరాగ్య యోగాదులు, ఆయుర్వేదపరమైన రసాయనాలూ, లేహ్యాలు- వివిధ ఔషధాలు కాయకల్పసిద్ధి మున్నగు ప్రక్రియలు అనే మూడు భాగాలున్నాయి. ఆధ్యాత్మిక జ్ఞానంతోపాటు- ఆయుర్వేద ఔషధ పరిజ్ఞానాన్ని జతచేసుకున్న ఈ పొత్తం "సూక్ష్మంలో మోక్షమన్నట్లు" అతిసామాన్యుని సైతం తరింప జేసేందుకు సులువైన మార్గాలు చూపించింది. రచయిత శ్లాఘనీయులు.

'మమత'

---

ANDHRA PRADESH Desiya Vaidya Sangham (Regd)

KATHERU-53? 105 తెనాలి

మీ గ్రంథము శ్రీ చరణము అమూలాగ్రము మిక్కిలి శ్రద్ధాసక్తులతో పఠించితిని. విపులమైన విషయసేకరణ రచనావ్యూహము, గ్రంథరచనాశైలి మిక్కిలి బాగున్నది ఆంధ్ర, తమిళ భాషలందుగల వివిధ గ్రంథములనుండియూ వేమన శతకము నుండియూ మీరు మిక్కిలి విపులముగ వివరించిన విషయములు అమూల్యమైనది.

రెండవ భాగము యోగశాస్త్ర సంబంధము, అష్టాంగ ఆయుర్వేదమువలె అష్టాంగ యోగము కూడామిక్కిలి ప్రసిద్ధిచెందినది. ఈ భాగములో మీరు వివరించన ప్రాణాయామ, ధ్యానవిషయములుసామాన్యులకు అందు బాటులో లేనివాటిని వివరించినది ఎల్లరకుపుయోగకారిగా వుండగలదు.

ఆయుర్వేదము, యోగము కవలలవంటివి. ఒకదానిపై నొకటి ఆధారపడియున్నవి. ఇట్టి ఉత్తమగ్రంథమును రచించి ఆంధ్రభాషావేషులకు అలంకారముగానిచ్చిరి. ఇంకనూఇట్టి ప్రయోజనకరమైన గ్రంథములు మీచేగిని ద్వారా రాగలవని ఆశించుచున్నాను. మీకు నాహృదయ, హార్దిక అభినందనలు తెలియజేయుచున్నాను.

ఇట్లు భవదీయ

(సం॥) పిల్లలమర్రి వెంకట్రామయ్య

## అందరికీ ఆయుర్వేదము (మాసపత్రిక)

వైద్యమిత్రులు గిరిధరన్ గారికి,

హృదయపూర్వక అభినందనలతో వ్రాయులేఖాంశము.

మీరురచించిన శ్రీ చరణము అనే గ్రంథము నాకు పోస్టుద్వారా అందగానే, ఏకబిగిన ఆగ్రంథం పఠించటం జరిగింది. మీమనోనైర్మల్యం, సిద్ధాంత నిబద్ధత, సాహితీప్రతిభ, ఇంపైనశైలి, మీహృదయ ఔన్నత్యం, అక్షరాక్షరంలో ప్రతి ఫలించింది. ఆయుర్వేదం పట్ల, భారతీయ సంస్కృతి పట్ల మీకుగల గాఢాను రక్తి తేట తెల్లమైంది.....................................

తేది: 10-4-2000 (సం॥) పండిత ఏల్చూరి వెంకటరావు

హైదరాబాదు. ప్రధాన సంపాదకులు,

## డా॥ టి.కె. గిరిధరన్ గారిచే రచింపబడిన

### "శ్రీ చరణము" అను గ్రంథముపై ప్రముఖుల, పాఠకుల అభిప్రాయములు.

I am in receipt of your book *"Sri Charanamu"* the book writen by you is very exhaustive and covers various aspects of day to day life. It is very Informative, instructive. persons going through the book should greatly be benifited.

I appreciate your good & noble work. please continue the good work and God will reward you.

Dtte: 16-11-98 M. Jayaram. B.E. (Hons)
Superintending Engineer (Nagarjuna Canal.Divn) (Retired) (A.P)

I have great chance to read the book *"Sri Charanamu"* as given by my friend Sri K. Pathabhirama Rao. Executive Engineer, Markapur (A.P.) It is Splendid work. please send me one good copy. Sri. L. Madhava Rao.
Date: 28-12-95, CUMBUM. A.P. Sr. Asst. Investigation (Divn)

I have read your book "Sri Charanamu" and have great pleasure after reading your book
Date: 15-11-98 V.Krishna Rao. (Sr.Asst)
Keshwapur Hubli (P.O)

I had a glance of your book *"Sri Charanamu"* Telugu during course of Journey . It is an excellant work. I request you to send a copy Immediately.
A-96 Rly. Qtrs. Kachiguda, Hyderabad. D. Venkateswara Rao,

Your Book " Sri Charanamu" which I hope is Related to Mythology or any thing concerned ot the great art of Healing & Medical treatment. A must for every body.

Date: 11-3-97 K. Ramana Reddy
Hyderabad - 500062 Assistant Direcor A.H. (Retired)

డా॥ శ్రీ టి.కె. గిరిధరన్ గారిచే రచించబడిన గ్రంథము "శ్రీ చరణము" చదవడము జరిగినది శ్రీ శ్రీ గిరి గారు చిరకాల మిత్రులు, గైడ్‌ఫిలాసఫర్. "శ్రీచరణము" పుస్తకము గూర్చి ఒకమాటలో చెప్పాలంటే వేద ఉపనిషత్తుల సంకలనమేగాక, తమిళదేశపు సిద్ధులు మరియూ మనయోగులలో వేమనరచనలను ఇనుమడింపజేసి మానవాళికి అందించిన గ్రంథమిది. మానవుడు, చావుకు దూరమవ్వాలంటే లేదా జయించాలంటే దానిలో పలుసూచనలు వ్రాయబడ్డాయి. అబ్బో ఒక టేమిటి ఎన్నోగ్రంథాలను ముఖ్యముగ అపార జ్ఞానోధధి తమిళ వాఙ్మయములోని ఎన్నోరహస్యాలను మెలుకువలను మానవప్రవర్తనకు నియమావలులను తెలుగువారికి మొట్టమొదటిసారిగ అందించిన ఘనత ఈరచయితకే దక్కుతుంది. హిందూ మతమునకు మూలములైన వేదాలు, ఉపనిషత్తులు, తమిళ సిద్ధుల ఉవాచలు ఎన్నో రచయిత మనకు చూపెట్టారు. ఇన్నిమాటలేల గనిలోనుండి బంగారాన్ని వెలికితీసి జనానికి అందించి నట్లు రచయిత మనకు ఎన్నోకాంచనమాలలందించారు. మానవుని దినసరి కాలకృత్య ములనుంచి, అమృత పానమువరకు ఎన్నోవిషయాలు, సూక్తులు, నాడులు, వైద్యము, శారీరక శాస్త్రము, యోగము వగైరా, వగైరా, ఎన్నోగొప్పవిషయాలు యిందున్నాయి. పుస్తకము చదువుతున్నాద్యంతము చదువరికి ఎక్కడోపరలోక విహారమవుతుంది. ఆశ్చర్యపరుస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే "It is an Encyclopedia on Hindu Literature Pertaining to Human Behaviour" పఠనవేరు, ఆచరణవేరు. ఈ పుస్తకములోని సూక్తులు ఆచరణ అయితే ఈ లోకము దేవలోకము కాదా! Hope for the Best అనే ముగింపు సవ్యముగ కనిపిస్తుంది.

M.N. Gopal M.A.,
CHITTOOR. Municipal Manager (Retd)

"శ్రీచరణము" అను గ్రంథము ఒక గొప్ప అధ్యాత్మిక, ఆరోగ్య విషయక గ్రంథము, తప్పక అందరు చదివి పాఠించవలసిన గ్రంథరాజము

తేది: 20-8-95 Bhattam, Sri Ramamurthy
No.11-3-8 Dasapalla Hills, Vishakapatnam - 3 Former Minister - A.P.

ఓం "శ్రీ చరణము" అను ఆత్మీయత, అనురాగము, ప్రేమ, వాత్సల్యము, ఆనందము కల్గునట్లు చేయు ఉదాత్త ఉత్తమగ్రంథము కాకతాళీయముగా "భగవత్ ప్రేరణ" కాబోలు ఒకచోటవుంటే, వారి వద్ద అడిగి తీసుకుని చదివినాను, ఆనందము ఆపుకోలేక యీలేఖవ్రాసినాను. నేనురిటైరు అయి 3సం॥ అయినది................మీరు '18' గూర్చి వ్రాసారు చాలబాగుంది. ఇప్పటివరకునాకుతెలియని అనేక విషయాలు చాలచక్కగ హృదయము హత్తుకునేటట్లు పొందుపరచారు. అదిదైవకృప. మాకు శ్రీ చరణము ఒక పుస్తకము పోస్టులో పంపండి.

Date: 11-7-95 P.Venkateswara Rao B.A.,
Jangareddy gudem W.G.Dt. A.P. Panchayath Officer Retired.

శ్రీ చరణము పుస్తకము చదివినాను ఆరోగ్యపరంగా మంచివిషయాలు తెలుసుకున్నాను. ఈ పుస్తకము ప్రతి ఇంటా తప్పక ఉండదగినది.

తేది: 26-8-95 A. Malla Reddy

Karim Nagar A.P. Senior Accountant, Dt. Treasury Office

సుందరవిజ్ఞానగ్రంథాలయము లో మీ శ్రీ చరణము అను గ్రంథమును సభ్యులకు అధ్యాత్మిక జ్ఞానాన్ని పెంచుటకు, మోక్షసాదనకు, ఎంతో సహకరించు చున్నదని తెలియచేయుచున్నాను.

R & D centre, Hindusthan cables Ltd., Y.Sudrsan Reddy

Hydeerabad -A.P. Assisstant manager (D.D)

మీరచన శ్రీ చరణము చదివినవారికి చాలాసంగతులు తెలియగలవు, ఆరోగ్యము ఆత్మానందము పొందుటకు తగిన సూచనలు చేశారు. ఆచరణలో కొన్నైనా ఆచరించ కలిగితే అదృష్టవంతులే, ఆరోగ్య వంతమైన జీవనమునుకోరువారు ఆసక్తితో ఈ నిధిని పొందగలుగుదురు.

Vempalli,cuddapah Dt. A.P. D. Ramakrishna Reddy

Date:26-9-95 School Master (Retired)

మీరువ్రాసిన శ్రీ చరణము చదివిన తర్వాత వేరుగ్రంథములు చదువవలసిన అవసరము లేదు. ఎందులకనగా మీరుప్రతిమనిషికి అవసరమైన రీతిలో నిగూఢమైన, దేహసంబందమైన, అధ్యాత్మిక పరమైన ఔషద పరమైన నిగూఢ రహస్యములు క్లుప్తముగ వివరించివాటిని ఆచరణలోయుంచే పద్దతులను తెలియచేసిన దానికి వందనములు........... మీపుస్తకమును ఒక Guide గా ఉపయోగించడము జరుగుచున్నది. ధ్యానము నిష్ఠగా చేయాలి అనేవారికి శారీరకపరమైన జాగ్రత్తలు, క్రమశిక్షణ ఏరకంగా పాటించవలెనో మొదటి భాగంలో విపులంగా తెలియచేసిన పద్దదతికి సర్వదా అభినందనీయులు,

Date: 26-10-98 C.R. Ramaswamy

Lalaguda North, Secundrabad - 17 Advocote

మీరురచించిన శ్రీ చరణము శ్రీరామమూర్తి గారు (మునిసిపల్ ఆఫీసు) నాకు ప్రెజెంటు చేసినారు Thanks. ఆపుస్తకాన్ని శ్రద్ధతో పూర్తిగ చదివినాను. నిత్యకృత్యాలు, యోగం, ఆయుర్వేదం etc., గురించి చాలా చక్కగా వ్రాసినారు. మీసేవలకు మాఅభినందనలు తెలుపుకుంటున్నాము.

చిన్మయారణ్యం, యెల్లయ్య పల్లి, Sri Swamy Krishnanadha

ఓబుల వారి పల్లి, కడపజిల్లా, ఆ.ప్ర.

మీరు వ్రాసిన శ్రీచరణము అను గ్రంథము చదివియుంటిమి, మాకుతెలియని ఎన్నోవిషయములు మీ గ్రంథము ద్వారా తెలిసికొనియుంటిమి.

Tenali Date: 19-12-95 V. Gangadhara Rao.

శ్రీ చరణము రచన నేడు స్త్రీలు గుర్తుంచకోవలసిన పాయింట్సువున్నది. సమాజానికి ఎంతో అవసరం, నేడు స్పీడుయుగంలో బ్రేక్‌లాంటివి.

సిరిగుప్ప, బళ్ళారిజిల్లా, కర్ణాక రాష్ట్రం. శ్రీ నన్నపనేని శివప్రకాష్

శ్రీచరణము అనే అమృతగుళికను పంపి మాలో మరింత అధ్యాత్మిక చింతనను దైవభక్తిని పెంపొందించారని మనవిచేసుకుంటున్నాము.
Ennazhil house, Kanhiramukku post Thamaraseri Santhosh
Mallapuram Dt., Kerala State- 679 584

శ్రీ చరణము పుస్తకము చదివినాము. అనేక వివరములు తెలియచేయబడియున్నది ఈ గొప్ప గ్రంథమును చదివి చాలా సంతోషము కల్గినది.
భీమునిపట్నం పోస్టు, విశాఖజిల్లా ( ఆ. ప్ర. ) స్వామి శ్రీమాతాత్యాగీశానంద పురివారు
తేది: 11-9-95 స్వామి అనుభవానంద యోగకేంద్రం

మీ శ్రీ చరణము చదివినాను చాలాబాగున్నది. మీరు యిూలాంటి పుస్తకములు యింకా వ్రాయాలని 'తల్లి' మీకు అవకాశము ఇవ్వాలని మనసారా కోరుకుంటున్నాను.
Pathivari Veedhi, Ongole 523 001 V. Malleswara Rao

శ్రీ చరణము గ్రంథము ప్రతి ఒక్కరు చదివిపాఠించ వలసినవిషయములుగలది
Belathur Post, Hosur Tq, G.Vasudevan, School Assistant
Dharmpuri.Dt. T.Nad. Government High School Bagalur,

శ్రీ చరణము అను గ్రంథము చాల అద్భుతముగ యున్నది. అది ప్రతిఇంట ఉండవలసిన గ్రంథము, అధ్యాత్మిక జ్ఞానముకొరకు, ఆరోగ్యముకొరకు వెతుకువారికి ముఖ్యముగ చదువలసిన పుస్తకము, చాల గొప్పగాయున్నది. మానవుడు వినవలసిన, నేర్చుకోవలసిన విషయములుగలవు అనిచెప్పుట అతిశయోక్తి కాదు. మావూరిలో శ్రీ ధూళిపాళ శ్రీ కృష్ణమూర్తి గారి వద్ద చూసి చదివినాను, బాగుంది, కావున ఒక కాపీ పంప ప్రార్థన.
Santhinagaram, Ganapavaram (Post) A.P. T.Balakrishnamuty (Retd) Teacher

మీరు వ్రాసిన శ్రీ చరణము పుస్తకమును చూసాను, చాలబాగున్నది. తమిళ సాహిత్యములో ఉన్న ఎన్నో అధ్యాత్మిక రహస్యాలు ఆయాయోగుల జీవసమాధులు ఆయాదేవాలయాలు, ఆయుర్వేదము యొక్క ఔన్నత్యము చాలచక్కగా వివరించారు . ఈ విషయమై మీకు విశేషమైన జ్ఞానం భగవంతుడు దయచేయాలని మనసారా కోరుకొనుచున్నాను.
.H-86 P.T.S., NPTC. Jyothinagar A.P. M. Raja Rao.

నేను ఎన్నెన్నో వేదాంత గ్రంథములు చదివినప్పటికిని మీచే రచియింపబడిన శ్రీ చరణము అను పుస్తకము చదివినంత సంతృప్తి ఇవ్వలేదు. ఇట్టి గ్రంథము రచించి భక్తకోటికి మేలు [illegible]
[illegible]
[illegible]
[illegible]